EKAVIRA

(Telugu Novel)

by **Viswanadha Satyanarayana**

మొదటి ముద్రణ 1935

పద్నాలుగవ ముద్రణ 1992





ముఖ చిత్రం : Nani

DTP : **PRINTIKA**, Vijayawada-520 002

PRINTING : **INDIA BLOCK MAKERS**, Vijayawada-520 003
(Offset Printers)

Title : Prakhya Art Printers, Hyderabad

ధర రూ 30/

లైబ్రరి ప్రతి : రూ. 50/-

ప్రతులకు :

విశ్వనాథ పబ్లికేషన్స్

విశ్వనాథ పురం, మారుతీ నగర్

విజయవాడ - 520 004.

# ఒక్కమాట

ఏకవీర నవల రచనా కాలం 1929-31 మధ్యలో! ఏ నవలైనా తాను ఆశువుగా చెపుతూ ఎవరిచేతనో వ్రాయించే విశ్వనాథ వారు స్వదస్తూరితో వ్రాసిన ఏకైక నవల ఇది. ఇది ఆయన రెండవ నవల. మొదటిది "అంతరాత్మ".

ఈ సంపుటంలో "స్నేహఫలము" అనే మరొక నవల కూడా ఉంది. పల్లవ రాజ వంశ చరిత్ర ఆధారంగా రచింపబడిన ఈ నవల 1952 ప్రాంతాలలో రచింపబడింది. దీని మొదటి ముద్రణ ఉమా పబ్లిషర్స్ విజయవాడ వారు వేశారు.

విశ్వనాథ పావని శాస్త్రి

# ప్రణాళికా సభ్యత్వ నిబంధనలు

1. ఈ నవలలన్నీ కొనదలచుకొన్నవారు రు. 50/- కట్టి మా "విశ్వనాథ నవలా ప్రణాళిక" సభ్యులుగా చేరవచ్చును.
2. ఈ నవలలన్నీ కంప్యూటర్ ద్వారా అచ్చుకాబోవుచున్నవి. నెలకు రెండు లేక మూడు నవలలు విడుదలగును.
3. పెద్దనవల లయితే ఒకటే వాల్యూమ్‌గాను, చిన్న నవలలైతే రెండు లేక మూడు కలిపి ఒక వాల్యూమ్ గాను విడుదలగును.
4. ఒక్కొక్క వాల్యూమ్ ధర సుమారు రు. 30/- నుంచి రు. 50/- వరకు వుండవచ్చును. (పెరుగుతున్న పేపరు యిత్యాది ధరల దృష్ట్యా వీనిలో కూడా మార్పు వుండవచ్చు.)
5. సభ్యులుగా చేరిన వారికి లాభం ఏమిటంటే విడుదలైన ప్రతి వాల్యూమ్ ధరలో 15% Discount యివ్వబడును. పోస్టుఛార్జిలు ఫ్రీ!
6. ప్రణాళిక చివరి వాల్యూమ్‌లలో సభ్యత్వ రుసుము ఎడ్జస్ట్ చేయబడుతుంది.
7. వాల్యూమ్ విడుదల కాగానే మీ కాపీ మీకు (డిస్కౌంటు పోగా మిగిలిన ధరకు) VPP ద్వారా పంపబడును.
8. ఏ కారణం చేతనైనా మీ VPP మాకు తిరిగి వస్తే, సభ్యత్వ రుసుములోంచి ఆ VPP ఛార్జీలు మినహాయించబడతాయి. లేదా తరువాతి వాల్యూమ్‌లో కలిపి పంపబడతాయి.
9. సభ్యులెవరైనా ప్రణాళిక మధ్యలో విరమించుకుంటే సభ్యత్వ రుసుము మా ప్రణాళిక పూర్తయ్యేదాక వారికి పంపబడదు.
10. సభ్యత్వ రుసుము రు. 50/- M.O.ద్వారాగాని, D.D. ద్వారాగాని పంపవచ్చును. తమ Address స్పష్టంగా వ్రాయాలి.

# క వి స మ్రా ట్

## విశ్వనాథ సత్యనారాయణగారి

### సంపూర్ణ నవలా ప్రణాళిక

1. వేయి పడగలు
2. స్వర్గానికి నిచ్చెనలు
3. తెలుగిరాజు
4. మాబాబు
5. ధర్మచక్రము
6. వల్లభమంత్రి
7. విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు
8. స్నేహఫలము
9. పులుల సత్యాగ్రహము
10. దేవతల యుద్ధము
11. పునర్జన్మ
12. కడిమిచెట్టు
13. పరీక్ష
14. చెలియలికట్ట
15. ఏకవీర
16. జేబుదొంగలు
17. నందిగ్రామరాజ్యం
18. బాణావతి
19. అంతరాత్మ
20. గంగూలీ ప్రేమకథ
21. ఆరునదులు
22. చందవోలు రాణి
23. ప్రళయ నాయుడు
24. హాహా హూహూ
25. వీరపూజ
26. మ్రోయుతుమ్మెద
27. సముద్రపు దిబ్బ
28. కుణాలుని శాపం
29. దమయంతి స్వయంవరము
30. నీలపెండ్లి
31. శార్వరి నుండి శార్వరి దాక
32. బద్దన్న సేనాని
33. వీరవల్లడు
34. కుక్కగొడుగులు

**నేపాళ రాజవంశ నవలలు:**

35. దిండుక్రింది పోకచెక్క
36. చిట్లీ చిట్లని గాజులు
37. సౌదామిని
38. లలితాపట్టణపు రాణి
39. దంతపు దువ్వెన
40. దూతమేఘము

**కాశ్మీర రాజవంశ నవలలు:**

41. కవలలు
42. యశోవతి
43. పాతిపెట్టిన నాణెములు
44. సంజీవకరణి
45. మిహిరకులుడు
46. భ్రమరవాసిని

**పురాణవైర గ్రంథమాల:**

47. భగవంతునిమీద పగ
48. నాస్తిక ధూమము
49. ధూమరేఖ
50. నందోరాజా భవిష్యతి
51. చంద్రగుప్తుని స్వప్నము
52. అశ్వమేధము
53. అమృతవల్లి
54. పులిముగ్గు
55. నాగసేనుడు
56. హెలీనా
57. వేదవతి
58. నివేదిత

## అంకితము

# కీ.శే. ప్రభల రామ బ్రహ్మానందమునకు

నీలోన నవనవల్ నించుకొన్న మనీష పూతావివలె దెసల్ ముంచకుండ
నీయందు వీరత నెగడిన దాతృత యెల్లదిక్కుల ముసురెత్తకుండ
నీమై సహజమై జనించినట్టి రసాత్మ తరమైన లోతులు తడవకుండ
నీ యెడందపసందు నిల్చు శిల్పజ్ఞత కృతి మేడ నిటుకలు నతుకకుండ
నైక గుణ చిహ్నముల సమాహారమైన నీ యెడద వాని నిండు నిండించకుండ
నీ యొడలి తోడి పాటుగ మా యెడంద గూడఁ జిచ్చిడితివి సన్నిగూఢకోపి!

గురువయి మిత్రమై తలంచుకొంటిని నీ రచితంబులౌ కృతి
స్ఫురణల నాకు నంకితము సొంపులు నింపులు నింపునంచు నా
సరసము తారుమారయి విషాదపుటుద్ధృతి పుక్కిలింతయై
విరచిత మస్మదంకితము విన్చెద నీ యెటనున్న కోసమై !

అల ప్రతిపద్యమున్ జదువునంతకుఁ జంపెదు, విందు, దానియం
దలి ప్రతియక్కరంబును కలనంబును దానఁ బొసంగు నర్థ మం
దలి వలనంబు వాని యవినాస్థితి యూరక మెచ్చిమెచ్చి మీ
రలు కవిసార్వభౌము లవురా! యనుచుందువు నేటి కెచ్చటో!

నిను మెచ్చఁబోవు చుంటిని నను మెచ్చుచునుంటి, నీవు నను మెచ్చుట తో
డన జీవితంబు పుచ్చితి నిను మెచ్చఁగ వేఱుత్రోవ నే నెఱుఁగమి కిన్.

నా కయి నిల్వయుండిన దినంబులు నీగతి వెళ్ళబుచ్చి యెం
దో కలియంగ వీలుకలదో నిను నంచని యూహసేతు, నీ
లోకమునందు పూర్వజనిలో స్మృతియుండదు, నీ వసించు పై
లోకపుజీవులందు స్మృతిలో జనిపూర్వత గూడియున్నదో?!

విశ్వనాథ సత్యనారాయణ

# ఏకవీర

## ౧

అది వేసగి. వైగె నది కృశించి ప్రోషితభర్తృక వలె సన్నగిల్లినది. ఈనది పుట్టుటకు కారణముగా మధురా నగరమున సేవించియున్న శ్రీమీనాక్షి సుందరేశ్వరుల వివాహమునకు సంబంధించిన యొకకథ యున్నది. మీనాక్షి దేవి పాండ్యరాజుకొమరిత, పార్వతీదేవి యవతారము. ఆమె పుట్టిననాటి నుండి లోకనాయకుడును, ఆదిభిక్షువు నగు శ్రీ సుందరేశ్వరునే వరించి యున్నది. ఆమెబుద్ధి మరలించుటకు శక్యముగాక రాజుకూడ నామెను సుందరేశ్వరున కిచ్చుటకు సమ్మతించెను. ఆమె యన్నగారి కిష్టములేదు. వివాహమునకు శ్రీ సుందరేశ్వరులు తరలివచ్చినారు పరివారములేదు, బందుగులు లేరు, ఆదిభిక్షువు తా నొక్కడే వచ్చినాడు. తనకు తగినట్లుగా నెంతయో పెద్దగా వివాహ ప్రయత్నములు చేసిన పాండ్యరాజు నిస్సారపడి పోయెను. చేసిన ప్రయత్నములు చూపి, తెచ్చిన పదార్థములు చూపి యివన్నియు నేమికావలెనని యల్లుని నిందించెను. పరమేశ్వరుడు నవ్వి తనవెంట గొనివచ్చిన యొక కుఱ్ఱవానిని జూపి యీ పదార్థములన్నియు నా కుఱ్ఱడు భుజించునన్నాడు అతడొక రాక్షసుడు. అతని పేరు కుండోదరుడు అతనిలో భగవంతుడు క్షుధాగ్ని సహస్ర ముఖంబులుగ ప్రజ్వలింపజేసినాడు. కుండోదరుడు సకల పదార్థముల నారగించి దాహ మని యరచ, మధురలోని బావులు, చెఱువులు చాలలేదు. కుండోదరుని, చేయి పట్టుమని పరమేశ్వరుడు తన శిరోభాగమున భాగీరథీ మహాప్రవాహము నడ్డగించు జటాసమూహములో నొక జట సడలించెను. ఆ రీతిగా పరమేశ్వర జటావివరాగ్రవి నిస్సృత యగు గంగానది మధురాసమీపమున వైగె నదియై ప్రవహించినది. పర్వతాగ్రములనుండి ప్రవహించు సెలయేటివలె వైగె మిగుల తొందరకత్తె. వైగె యనగా ద్రావిడ భాషలో "చేయి పట్టుము" అని యర్థము.

ఆనాడు కుండోదరుని దాహము కొన్ని బిందువులతో మాత్రము తీర్చిన యీ పుణ్యనది నేడు వేసగి కాకలకు సగమై పోయినది. వైగె మధురాపురి కొక దిక్కున కందకమువలె నైనది. తక్కినమూడువైపుల కోటగోడయు కందకము నున్నవి నది నిండుగా ప్రవహించునపుడు చిన్న యోడలు నదిలో తిరుగుచునే యుండును. కొంతవఱకు నది పైని వర్తకము కూడ జరుగుచుండును ఇప్పుడు నది క్షీణించి యుండుటచేత చిన్న చిన్న పడవలు నది యిసుక తిన్నెలమీద నందందు వదలి పెట్టబడియున్నవి

వైగె చిన్నపాయ కొబ్బరినీళ్ళవలె, తళతళ లాడుచు ప్రవహించుచున్నది నదికి దిగువభాగమున నొక పెద్ద గుండమున్నది అది వేసగిలో గూడ మిక్కిలి లోతుగనే యుండును. ఆ గుండములోననే యేనుగులను కడుగుదురు ఆ గుండమునకుపైగా నొకచోట నదిలోననే యొక చిన్న చెఱువువలె నొక గుంట యేర్పడియున్నది.

రాజాంతఃపురమునకు నిత్యమును మంచినీర మీ గుంటనుండి మహిషరాజములమీద తోలుతిత్తులతో తీసుకొనిపోవుచుందురు. ఇంకను నెగువ వర్షర్తువులో పడవలు నిలుచుచోటు అంతకు పైని పట్టణమునకు చివరభాగమున నిసుకతిన్నెలు, మొగలిపుప్పొళ్ళు చల్లి సిద్ధముచేసిన విశ్రాంతిస్థలమువలె నుండును. అచ్చటికి సాయంకాలముల యందు పట్టణమునుండి విద్యార్థులు, రాజ కుమారులు, పండితులు వచ్చి విశ్రమింతురు. సాంధ్యకాలములయందు విద్యార్థులు సంధ్యావందనము చేసి శాస్త్రప్రసంగములు చేయుచుందురు. రాచకొడుకులు, వయసుపోకిళ్ళ బిరుదు మగలు తమ యశ్వారోహణవిద్యా వైశద్యము చూపుచుందురు కొంచెము ప్రొద్దు పోయినంతనే యందఱును పురప్రవేశము చేయవలయును. నిశాభాగమెల్లను ఆ చోట రక్షకభటులు కృపాణపాణులై తిరుగుచుందురు. జాము ప్రొద్దు పోయిన వెంటనే కోటతలుపులు మూసెదరు. తరువాత నొక్కప్రాణి గూడ లోనుంచి బయటకుగాని, బయటనుంచి లోనికిగాని పోవుటకు వీలులేదు.

ఆనాడు కృష్ణచతుర్థి సందెచీకటి. కొంచెము చీకటి పడువఱకు వైగెనదీ సికతాతలము లన్నియు నిశ్శబ్దములు, నిర్మానుష్యములు నయ్యెను. కాని దూరమున విశ్రాంతిస్థలములైన యిసుకతిన్నెలమీద నిద్దఱుమాత్రము కూర్చుండి మాటలాడుచుండిరి.

"వీరా! నా కేమియు సుఖములేదు ఆ కార్యము మూన్నాళ్ళు ఆ పిల్ల తలుపు దగ్గర నిలుచుండి, నిలుచుండి చివరకు కొంగుపఱచుకొని యందే పండుకొన్నది నే నామె వంకనైన చూడలేదు. ఆమెవంకచూచుటకు నాకు బుద్ధిపుట్టలేదు, ఆమెకై చూడవలెనని యెప్పుడేని సంకల్పించితినా నా యెదుట నేను ప్రేమించిన యా దివ్యసుందరి సాక్షాత్కరించెడిది ఇప్పుడు కూడ నదిగో నాయెదుట నాప్రణయ మూర్తి! ఆహాహా!" అని కుట్టాన్ కనుల వెంట నీరు పెట్టుకొని యేదో మనోమూర్తిని చూచునట్లుగా శూన్య దృక్కులను జూచెను

వీరభూపతి హృదయము మిక్కిలి చలించినట్లుగా నతనిదేహ మొకవింత కదలిక వెల్గ్రక్కెను. కొంతసేపైన తరువాత మఱల కుట్టాన్ "వీరా! ఆమె యెంత యందకత్తె! అంత సౌందర్యము భూలోకదుర్లభము. ఆమె దేహాంచల రేఖలెంత విస్పష్టముగా నున్నవి! దినదిన మేదో పనిపెట్టుకొని వారి యింటికి వెళ్ళుచుంటిని ఆ నెలనాళ్ళు, నెంతలొందరగా గడచిపోయినవి! ఇంతలో మా తండ్రి నన్ను రమ్మని కబురంపినాడు నేను వెళ్ళకతప్పదు. నే నే సామాన్య సంసారములోనో పుట్టినచో నా కామె యింత దూరమయ్యెడిది కాదు" అని మఱల కన్నీరు కార్చజొచ్చినాడు.

"ఇప్పుడు నీవు మఱల నచ్చటికి పోరాదా?" అని ప్రశ్నించినాడు వీరభూపతి. తన యెడమచేయి యెడమచెక్కిలికాన్చి, మోచేయి తొడమీద నుంచుకొని కుట్టాన్---

"నే నెందున్నానో, యెచ్చట నున్నానో, యే రోజున నేమి చేయుచున్నానో నిత్యము నా తండ్రికి తెలియజేయుచుండ వలెనుగదా! ఈ రాజధానిలో నేను లేకున్నచో నది నిమేషములో 'రామనాదు'కు తెలియును", అని యొక్క నిట్టూర్పు పుచ్చి, "వారియిల్లు మా మేనమామల యింటికి మిక్కిలి సమీపములో నున్నది"- అను

నర్థోక్తిలో వీరభూపతి "అది యేయూరు?" అని ప్రశ్నించెను కుట్టాన్ ఆ మాట వినిపించుకొనకుండ, "నేను మొదట వారియింటికి వెళ్ళుచుండుట వారు నా మంచితన మనుకొనిరి. క్రమక్రమముగా తెలిసినకొలది వారికి భయమైనది. నా మేనమామ, యాయనభార్య యీ విషయము తెలిసికొన్నారు మా తండ్రి కదురు వచ్చినది" అని, "ఛీ! ఛీ! ఈ జన్మ యెందుకు? నాకోర్కె యింత యలభ్యమైనదని తెలిసికూడ నేను బ్రతికియున్నాను. చూడు!" అని కుట్టాన్ పొంగివచ్చుచున్న దుఃఖమును గొంతులో స్తంభింపజేసెను. ఆ పొంగణగనిచ్చి వీరభూపతి "ఆమె నిన్ను ప్రేమించుచున్నట్లు నీ కేమైన తెలిసినదా?" అని ప్రశ్నించినాడు. కుట్టాన్ "అయ్యో!" అని కొంచెమాగి, మఱల నిట్లు చెప్ప మొదలుపెట్టెను ; "తంబిచ్చి నాయకు డెదురు తిరిగినపుడు మొదట కృష్ణప్పనాయకుల వారికి సాహాయ్యముచేసిన చిన్న కేశవనాయకునకు మా తాత కుడిభుజము వంటివాడు. అప్పుడాయన చాల పెద్దయాస్తి సంపాదించినాడు. మా మేనమామకు చాల దొడ్లు, తోటలు నున్నవి. వారియింటికి ముందుగానే మా మామ పెద్ద దేవాలయము కట్టించినాడు. కాశీనుండి మా తాత విశ్వేశ్వరాభిలింగము తెచ్చి ప్రతిష్ఠ చేయించకుండగనే చనిపోయినాడు. మామామ యా లింగమునే ప్రతిష్ఠించినాడు ప్రక్కనే స్వామికి పుష్పతోట యున్నది. ఆ పిల్లనదివఱకు నేను రెండు మూడుసార్లు చూచితిని గాని యామె నన్ను జూడలేదు. వారు పెద్ద ధనవంతులు కాకపోయినను గౌరవ కుటుంబము. ఆమె యొకనాడు 'పుష్పతోట'లో పూలు కోసికొని దండగా చుట్టివచ్చుచున్నది. నే నామెతోనెట్లా మాట్లాడునది యని యెదురు చూచుచుంటిని కాన, తొందరగా నామెకెదురుపోయి శివద్రవ్యము తీసుకొని పోరాదంటిని ఆమె నన్ను పూర్వము నిదానించి చూడలేదుగాని, నే నెవరో యెఱుగును నేనీమాట యనినంతనే నావంక నిదానించిచూచి భయపడినట్లు కనబడినది. నేను చిఱునవ్వు నవ్వితిని ఆమె మఱలనొక యర్ధనిమేషములో పెదవులపైకి చిఱునవ్వు తెచ్చుకొని యా పూలదండ నా కాళ్ళపై విసరి యచ్చటినుండి పరుగెత్తుకొనిపోయినది నేను నీకీమాటలు చెప్పుచున్నానేగాని యీ ప్రతివాక్యము నా హృదయమున శూలములవలె దిగబడుచున్నది వీరా! ఎంత నిర్భాగ్యుడను ఆ పూలదండ"!- కుట్టాన్ మాట్లాడలేకపోయెను వెక్కి వెక్కి యేడ్వ మొదలిడెను. వీరభూపతి యతనిని కౌగిటిలోనికి తీసికొని "సేతూ! ధైర్యము పురుష లక్షణము. మన భాగధేయములకు మనమా యధికారులము? అయ్యో! ఏడువకుము" అని యోదార్చెను

**కుట్టాన్**- "ఆ పూలదండ తీసికొనిపోదమని నాకు బుద్ధి పొడమెను. కాని వంగి తీసికొనబోగా శివద్రవ్యమనిపించినది. ఊరకే యింటికి పోయితిని. నా ప్రియురాలి హస్తస్పర్శ పొందిన యా దండయే కృతార్థము ఇంటికి పోయితిని గాని మఱల నా పాదములు నన్నచ్చటకే లాగినవి. ఎంత సేపు? అరగడియే కూడ కాలేదు. ఆ పూలదండ యచ్చటలేదు. నా హృదయము వినిర్భిన్నమైనది. వీరా! ఆ దండబదు లచ్చటనొక త్రాచైన పండు కొని యున్నది కాదు. ఆ త్రాచును మెడలో వేసికొనిన నేమై యుండును?" కుట్టాన్ కుడిచేయి వీరభూపతి కుడిచేతిని పట్టుకొని యున్నది

కుట్టాన్ వీరభూపతి చేయి నొక్కినాడు. కుట్టాన్ దేహమంతయు వణకిపోయినది. ఆ చీకటిలో వీరభూపతి కుట్టాను దుఃఖావస్థను కనులార చూచుచుండెను

వీర- "సేతూ! నీవిప్పుడిట్లు దిగులు పొందరాదు, నీవు మఱల వివాహము చేసికొంటివి. ఆమె నీ ప్రాణముల కుస్సురనును. నీ విప్పుడు నీ భార్యను ప్రేమించవలసియున్నది. ఈ ప్రేమయంతయు నీ భార్యపై మఱల్పరాదా?" వీరభూపతి యీ మాటలు మనసా అనలేదు. కుట్టాన్ స్థితి యతనికి దుర్భర మనిపించినది! అతని హృదయోద్వేగమున కేదో యొక యడ్డు చెప్పినగాని కుట్టాన్ మంచిస్థితికి రాడని యతనికి తోచి యట్లన్నాడు. కుట్టాన్ వీరభూపతి యన్న యీ మాట వినినతోడనే, "వీరా! వీరా! ఏమన్నావు? ఆ ప్రేమ యీామెమీది కెట్లు మరల్పవచ్చును? ఈ వైగై నది మా రామనాథ తటాకములో పోయి పడుచున్నది ఏదీ, యీ నదీవేణి నిట్లు త్రిప్పి యింకొక ముఖముగా ప్రవర్తింపజేయుము. నా ప్రేమ నీ కింత సులభసాధ్యమైనదిగా కనబడుచున్నదా! కాదు కాదు" అని వంగియున్న తన దేహమును నిలువుగా జేసి దీర్ఘనిశ్వాసమును విడిచెను. అతని ముఖము గంభీరమైనది. వీరభూపతి కుట్టానంత వీరుడు కాకపోలేదు. కాని యిప్పటి కుట్టాన్ మొగముజూచి వీర భూపతి చలించిపోయెను. వీరభూపతి యతనినిజూచి "ఇతడు దేనికి సమర్థుడు కాడు? ఇతడు తలచుకొనినచో పడిపోయిన విజయనగర సామ్రాజ్యము మఱల సాధించి మధురనాయకులచే నేలించునేమో" యనుకొనెను

అప్పుడు వైగై యిసుకతిన్నెమీద దూరమున నొక సుడిగాలి రేగి, వారి దగ్గఱగా నీలవేయుచు పడవలు నిలుచుచోటునకు దాటిపోయినది

కొంతసేపటిలో కుట్టాన్ వదనము మఱల విషాదపూరితమయ్యెను వీరభూపతి యింక నుండగూడ దని "పోదమా?" అనెను. కుట్టాన్-"వీరా! ఈ దుఃఖము నాహృదయశోణితమును త్రాగుచున్నది ఈ ప్రేమ నన్ను లోపల లోపలనే తినివేయుచున్నది నే నింక చాలనాళ్ళు బ్రతుకను" వీరభూపతి- "అశ్లీలములు పలుకకుము! సేతూ! ఇది యేమి, నేడింత మనసుపేదవైనావు? నీ శౌర్యము, నీ పౌరుషము నేమైనవి?" అన్నాడు. దూరము నుండి 'ఎవరక్కడ' యని కేక వినబడినది వీరభూపతి, "కుట్టాన్ సేతుపతిమహారాజు!" అని యఱచినాడు. దూరమున రక్షకభటుడు మఱల మాటాడలేదు. వీరభూపతియు, కుట్టాన్‌ను లేచి పురములోనికి బోవుచున్నారు. వీరభూపతి నెమ్మదిగా చెవిలో, "సేతూ! ఇంత ధైర్యము వదలెదరా? ఎవరికి తగిన కష్టము వారికి నున్నది. నా హృదయములో నెంత మహాగ్ని రవులు కొనుచున్నది? అది నీకు తరువాత జెప్పెదను" అనెను.

కొంతదూరము పోయిన తరువాత నిరువురును విడివిడిగా నడచిరి. పట్టణపు కోటతలుపుల వద్ద అశ్వశకటము వేచియున్నది. ఇరువురు ఆ శకటములో నెక్కి పట్టణములోనికి పోయిరి. రాజసౌధమునకు సమీపమున నొక పెద్ద తోట ముందు కుట్టాన్ దిగి వీరభూపతిని వారి యింటివద్ద దింపి రమ్మని బండివానితో చెప్పి తా నింటిలోనికి పోయెను.

## ౨

కుట్టాన్ ఇఱువంకల వివిధములైన పుష్ప ఫలవృక్షములున్న బాటవెంట తన సౌధములోనికి పోయెను. ఆ సౌధము తనతండ్రిది. రాజ్యములోనున్న పెద్ద పెద్ద సరదారులందఱకు మధురలో ప్రత్యేకముగా అంతఃపురము లున్నవి. కుట్టాన్ తండ్రి శతెకదేవ ఉదయన్ సేతుపతి. ముత్తుకృష్ణప్ప నాయక మహారాజులుంగారి ప్రధానమంత్రులలో నొక్కడు. ఉదయన్ సేతుపతి దీ సౌధము. మధురలో నున్న గొప్ప కట్టడములలో నొకటి. మీనాక్షి దేవాలయములో నెంత శిల్పమున్నదో యీ సౌధమునను నంతశిల్ప మున్నది చీకటిలో శిల్పపరీక్ష సాగదు.

కుట్టాన్ లోనికి పోయినంతనే సేవకు డరుదెంచి, "ప్రభూ! స్నానమునకు నీరు సిద్ధముగా నున్నది" అనెను, కుట్టాన్ తనగదిలోనికి పోయెను. అందు తాను ప్రవేశించుటతోడనే యెదురుగానున్న నిలువు టద్దములో తన మూర్తి తనకు గోచరించెను. మొగమంతయు బాష్ప కలుషితమై యుండెను, గది యంతయు దీపముల వెలుతురుచేత ధగద్ధగాయ మానముగ నుండెను. కుట్టాన్ పైయుత్తరీయముదీసి తనకెడమవైపుననున్న గోడపై చిలుకకొయ్యకు తగిలించెను. ఆ చిలుకకొయ్య యొక గొప్ప మరకతోపలముతో చేయబడినది, దాని చిలుకతనము కన్నులుగాను, ముక్కుగాను ఏర్పఱుపబడిన మూడు మాణిక్యములతో సంపూర్ణమయ్యెను. ఇట్టి చిలుక కొయ్యలు గదిగోడలకు నాల్గువైపులను గలసి యెనిమి దేర్పఱుపబడి యున్నవి. గోడలయందు ద్రావిడ శిల్పమునకు ప్రధాన చిహ్నములయిన గోష్ఠపంజరములున్నవి; ఒక గోష్ఠపంజరములో ద్రావిడభాషలో శ్రీరామచంద్రుని చరితామృతము ప్రవహింపజేసిన కంబన్న విగ్రహము రాతితో జెక్కిన దమర్చబడియున్నది దాని కెదురుగా పశ్చిమదిక్కుడ్యమునం దమర్చబడిన మరొక గోష్ఠపంజరములో శ్రీకృష్ణదేవరాయలువారు శ్రీవిశ్వనాథనాయకుల వారికి మధుర నిచ్చుచున్నట్లుగా చెక్కబడిన రెండు చిన్న విగ్రహము లమర్చబడి యున్నవి. దక్షిణమువైపున శిల్పపుటరుగు రాతితో జెక్కబడియున్నది దానిపైని మెత్తని రత్నకంబళము లమర్చబడి యున్నవి. ఆ యరుగున కెదురుగా నొక చిన్న చిత్తరువు గోడ కానించబడి యున్నది, ఆ చిత్రము పెద్దన్నగారిది వీరభూపతి యీ చిత్రమును వ్రాసి కుట్టాన్‌కు బహుమతిగా నిచ్చెను. కుట్టాన్ అంగీ యూడదీసి యింకొక చిలుకకొయ్యకు తగిలించి యా వితర్దిపై గూర్చుండి పెద్దనగారి చిత్రమువైపు చూచుచుండెను. కొంచెముసేపుండి లేచి తన పుస్తకములున్నచోటికి పోయెను. కంబమహాకవి విగ్రహమున కిరుప్రక్కల నొకవైపున తమిళభాషా గ్రంథములును నొకవైపున నాంధ్రసంస్కృత గ్రంథములును మెఱుగెక్కించి, నగిషీచేయబడిన, సన్నని యెత్తైన బల్లలపై నమర్చబడి యుండెను. అన్నియు తాటాకులమీద వ్రాసిన గ్రంథములే.

కుట్టాన్ తా నెందుల కా పుస్తకము లున్నచోటికి వచ్చెనో తెలిసి కొనలేక పోయెను. ద్వారమునుండి "ప్రభూ! స్నానముచేయండి" యని ధ్వని వచ్చెను. కుట్టాన్ గదివదలిపెట్టి స్నానమునకుపోయెను

ఆ మహాసౌధమునకు పశ్చాద్భాగమున నాల్గు పోకబోదుల నడుమ కొంచెమెత్తయిన చంద్రకాంతపు రాతిపై కుట్టా నాసీనుడాయెను ఇరువురు సేవకులు రెండు పెద్దబిందెలలో నొక దానినిండ వేడినీరును, మరొక దానినిండ చన్నీళ్ళును తెచ్చియతనికి నీరుపోసిరి స్నానముచేసి కుట్టాన్ దేహము తుడుచుకొనుచుండెను. (అతడు తుడుచుకొనుట లేదు. సేవకులే తుడుచుచుండిరి. ఇది రాజాచారము) అప్పుడే చంద్రుడుదయించు చున్నాడు. మంచిగంధపు పొడిచే సమ్మిశ్రితమైన సున్నిపిండిచేత రుద్దిన యతని దేహము కమ్మని వాసన లతనికే చాల యానందము కలిగించెను. ఇంకొక సేవకుడు కస్తూరి కలిపిన యొక కమ్మనినూనె చేతులకురాచుకొని యతని తల వెండ్రుకలకు రాచెను. ఈ కమ్మని వాసనల చేతను, ఉచిత చంద్రకిరణశైత్యముచేతను కుట్టాన్ మనస్సు కలకదేరినట్లయ్యెను.

భోజనముచేసి కుట్టాన్ సౌధ పురోభాగమున నున్న మంటపములో కూర్చుండెను దాక్షిణాత్యశిల్పము పల్లవుల నాటికన్న చోళులనాటికి, చోళులనాటికన్న విజయనగర రాజులనాటికి నంతకంత కభివృద్ధిపొందుచు వచ్చినది. తంజావూరు, మధురాపురముల శిల్పమును దాక్షిణాత్య శిల్ప చరిత్రలో విజయనగర శిల్పమునుండి విడదీయుదురు. తంజావూరు మధురల శిల్పము విజయనగర శిల్పముకన్న నెక్కువ వృద్ధి పొందినదని చెప్పవచ్చును. మన కథాకాలమునాటికి అనగా ముద్దుకృష్ణప్ప నాయకుని కాలమునాటికి అది యాధునిక శిల్పముగా మారబోవు పరివర్తనమున నున్నదని చెప్పవచ్చును. పల్లవులనాడు రథములును, చోళులనాడు గోపురములును, విజయనగర రాజులనాడు మంటపములును దాక్షిణాత్య శిల్పమునందు ముఖ్యములు. ఆయా రోజులలో నవి వృద్ధి పొందినవి ఉదయన్ సేతుపతి తన యీ దివ్య సౌధములందు గొప్ప మంటపములు కట్టించి తనకు శిల్పవిద్యయందున్న యభిమానమును వెల్లడించుకొనెను

ఆ మంటపములో పఱచియున్న రత్నకంబళముపై కుట్టాన్ ఆసీనుడయ్యెను. ఆ పలుచబడుచున్న వెన్నెలపొరలో నామంటపమునం దాసీనుడైయున్న యీ రాచకొడుకును చూచిన, అమరావతిలో జయంతుడు మన్మథమంటపమునం దున్నట్లు చూపట్టకమానదు.

దూరమునుండి వీరభద్రభట్టరు కుట్టానును జూచియతడు సంతుష్టుడైయున్నా డనుకొని వినయముతో సమీపించి, "ప్రభూ! పండుకొనుటకు వేళయైనది" యన్నాడు. కుట్టాను కొంచెము కోపదృష్టితో నాతనివంక జూచెను గాని పోకచెట్ల మొవ్వల వెనుకనున్న వెన్నెలనీడలో వీరభద్రభట్టరది చూడలేదు. వీరభద్రభట్టరు, కుట్టాన్ సత్ప్రవర్తన కలిగి యుండునట్లు చూచుట కేర్పడిన యధికారి. కుట్టాన్ ఇతనికి తెలియకుండ నే పనియు చేయరాదు. కుట్టాన్ లేచి లోనికి బోయెను. రాచ దివాణములో జాము గంటలు కొట్టిరి. అందఱకు నిద్రావేళ యయినది.

కుట్టాన్ పడకగదిలోనికి బోయెను పడకగది విశాలమయినది. ముందున్న మంటపమంత యున్నది. పైకప్పు మిక్కిలి యెత్తుగానున్నది. ఇది సౌధములో రెండవయంతస్థు నందున్నది. గోడలనిండ గచ్చుపని చేసియున్నది. చిత్రవిచిత్ర

వర్ణములతో లతలు, చిలుకలు, చెట్లు గీయబడి యున్నవి. గోడల నిండ నొకవరుసగా అనేక చిత్రములు వ్రేలాడుచున్నవి. ఆ చిత్రము లన్నిటిలో మొగలుల చిత్రవిద్యా చిహ్నములు స్పష్టపడుచున్నవి. పురాణకథ లనేక విధములుగా కుడ్యములనిండ చెక్కబడియున్నవి. తూర్పు గోడయందు నొక చిన్న గూడుగా నేర్పఱుపబడి యందొక రత్న ముంచబడినది. ఆ రత్న కాంతులు గదినంతయు తెల్లని వెలుగులో ముంచియెత్తినవి. గోడలవెంట చంద్రకాంత శిలావితర్దికలు, గొప్ప పని గలిగిన బల్లలు నుంచబడి యున్నవి. ఆ గదికి వెనుకవైపున పెద్ద గవాక్షమున్నది. ఆ గవాక్షమునుండి దొడ్డిలో నెత్తుగా వేయబడిన మల్లెజాజి పందిరులమీద సువాసనాభరితమైన చల్లని గాలి యుండియుండి లోనికి వచ్చుచున్నది. ఆ గవాక్షము వద్దనే పెద్దమంచ మున్నది. ఆ మంచము పందిరిస్తంభములు మహా శిల్పమును సూచించు చున్నవి ఉపానము, పద్మము, కుముదము, వేదిక, నాగబంధము, కలశము, "పుష్పబోదిగ" యన్నియు కొద్దిలో కలిగి యా నాల్గుకంబములు సర్వ సుందరముగా నున్నవి. పందిరి నుండి యనేకరత్నములు వ్రేలాడుచున్నవి. మంచము మిక్కిలి యెత్తుగానుండి పైని వేయబడిన యైదు పఱుపులవలన మానిసి యెత్తున్నది. మంచము పైకిపోవుటకు మెట్లున్నవి. మంచము తల వైపున కాళ్ళవైపున ప్రక్కగా రెండు స్తంభములున్నవి. ఆ రెండును మంచమెత్తుననే యున్నవి తలవద్ద కంబముపైని నొక బంగరు పళ్ళెరమున తాంబూల ద్రవ్యములు, సువాసనాద్రవ్యములు నుంచబడినవి. పందిరికంబమున నున్న నాగబంధము నందు రెండు సుదీర్ఘములు మందార కుసుమగుంఫితములు, సంగత లవలీ కిసాలములు నగు మల్లెపూవులదండలు వ్రేలాడుచున్నవి. సెజ్జనిండుగ మల్లెలు, జాజులు దట్టముగ చల్లబడి యున్నవి. ఆ మంచము ప్రక్కగా నింకొక మంచ మంతయెత్తు లేకున్నను, సమానమైన సౌందర్యముకలది యున్నది. అందు మల్లికాసుమంబులు వెదజల్లి లేవు.

కుట్టాన్ పాముకుబుసమువంటి పంచెనొకటి కట్టుకొని, యొకటి పైన వేసికొన్నాడు. యథాప్రకారముగా తన పెద్దమంచముపై పండుకొనుటకు బోయి మెట్లెక్కినాడు. ఒత్తుగాపఱచిన మల్లెపూవులలో ఏకవీర గోధుమవన్నె త్రాచువలె ముడుచుకొని పండుకొన్నది. కుట్టాన్ నిర్ఘాంతపోయినాడు.ఏకవీర యెప్పుడును తన మంచముమీద పండుకొని యెఱుగదు. ఆమె కాపురమునకు వచ్చి మూడు నెలలైనది. ఆమెను పతి పలుకరించలేదు. పతి నామె పలుకరించలేదు. పెద్దమంచముమీద కుట్టాన్, చిన్నమంచముమీద నేకవీర! ఇట్లు మూడు నెలలు గడచినవి. నేడిది ఏమి? ఏకవీర కుట్టాన్ శయనించు మంచముమీద పండుకొని నిదురపోవుట కెట్లు సాహసించినది? ఏకవీర నిత్యమును ఆకుపచ్చ వారణాసి చీర ధరించును పైని బంగరుటంచు కాశ్మీరపుసేలువ పైముసుం గిడుకొనును. ఒడలినిండ వెలలేని నగలు ధరించును. నేడిదేమి? తెల్లని పెట్టుకోక కట్టి పరిమితభూషణములు ధరించినది. మేన కంచుకము లేదు. అభ్యంగము చేసినది కావలయును. శిరోజములు పొడిపొడిగా నుండి చల్లగాలి కల్లలనాడు చుండెను. తలంటిపోసి కొన్నది. ఒడలు తెలియక నిద్రపోయినది

కుట్టాన్ మిక్కిలి కోపము పొందెను. "ఈ దౌర్భాగ్యురాలు నాశయ్య నలంకరించగలదా? ఇన్నాళ్ళనుండి లేనియాశ దీనికి నేడేల పుట్ట వలయును? ఏ మహాసౌందర్యరాశి నా శయ్య విభాగించు కొనవలయునో, యామెకు నాకు ఈ జన్మమున కలయికయే లేదు. నన్నీపిశాచ మావేశించినది. అయ్యో! ఈ దయ్యము నన్నెట్లు వదలును?" కుట్టానుకు గొంచెము కోపము తగ్గినది. "అయ్యో! నా కీమె సహధర్మచారిణి కదా! ఈమె నన్నువదలి యెచ్చటికిపోవును? ఇన్నాళ్ళుగా నేను మాటాడకుండనుండిన నెంత కోషిల్లినదో! నాతో నొక్కనాడు పలుక లేదే! స్త్రీకి తూష్ణీంభావమే ప్రధానము". ఇంతలో కుట్టాన్ నేత్రములు మూతలు పడినవి. ఎట్టయెదుట అతని హృదయ మాకర్షించిన లతాంగిరూపము సాక్షాత్కరించినది. కుట్టాన్ ఆ జగన్మోహన విగ్రహమును చూడలేకపోయినాడు. తటాలున కనులు తెఱచినాడు. కనులలో ఇందుపగింజలంత బాష్పములు నిలచినవి.

ఏకవీర కదలినది. మూతబడిన యామె ఱెప్పలమీద గ్రుడ్లుపోసినట్లు చిన్నచిన్న స్వేదబిందువులు నిలిచినవి. ఆహా! ఏమా వదన సౌందర్యము! కొండపైనుండి దూకు సెలయేఱు ప్రాతస్సూర్య కిరణములలో ధగద్ధగిత మయి యున్నట్లున్నది. కుట్టాన్ సమ్మోహితుడైనాడు.

ఇదివఱకు కుట్టాన్ ఏకవీరను పరిశీలించి చూడలేదు. ఆమె సౌందర్యవతి యనియే యనుకొనలేదు. అప్పుడప్పుడు "ఆమె సౌందర్యవతియే యనుకొందుము. అయినమాత్రము నా కేమి? నా హృదయ మామెది కానేరదు" అనుకొనుచుండును. ఏకవీరపయ్యెద తొలగినది. కుట్టాన్ కనులు మూసికొన్నాడు. తన ప్రణయిని యెదురైనది. శోకములో కోపము తఱుముకొనివచ్చినది కుట్టాన్ మహారాజునకు. అన్యాయముగ తనశయ్య నాక్రమించుకొన్న ఏకవీర దొంగనిద్ర పోవుచున్నదని భావించినాడు. కోపములో నతడామె చెక్కిలిపై శత్రుమారణసమర్థమయిన హస్తమును తీవ్రముగా విసరబోయినాడు అతనికి తెలియకుండగనే మహాబుద్ధిమంతుడగు కుట్టాన్ కరపద్మము పువ్వులదండవలె ఏకవీర చెక్కిలి కంటినది ఏకవీర యులికిపడి లేచినది. ఇద్దరు నిశ్శబ్దులై యున్నారు.

ఏకవీర మనసులో ననుకొన్నది."నా తండ్రి నాకీ సంబంధముచేసి నాల్గునెలలైనది. ఈయన యింతవఱకు నా మొగము చూడలేదు. కార్యమునాడు కొంగుపఱచుకొని తలుపుదగ్గరనే పండుకొంటిని. నా గారాబ మంతయు నిట్లయినది. ఈ క్రొత్తప్రదేశమునకు నేను లాగుకొని రాబడితిని నాకు దిక్కులేదు. మాటాడువారు లేరు. దాసులతో నా రహస్యము నేమని చెప్పను? దినదినము మా గదిలోని అనుపయుక్తపదార్థములను చూచి దాసులు నవ్వుకొనుచున్నారు. నన్నడుగుచున్నారు. ఏమియు చెప్పలే కుంటిని. ఈ వివాహమునకు పూర్వము నా హృదయ మింకొకనియందు లగ్నమయినది. అతడెవ్వరో, యే యూరివాడో తెలియదు. మానిసి సాధారణ కుటుంబములోనివాడుగా నున్నాడు. అతనిని వెదకి లాభములేదు. నా పుణ్యమువలననే నా కి కుట్టాన్ సేనాపతి లభించినాడు. అతనికన్న ముందే యితనిని చూచిననెంత బాగుండెడిది? ఇప్పుడైన నేమి? ఇతనినైన అకల్మషహృదయముతో

సేవించగలను. ఇతనికి నాయందు ప్రేమలేదు. ఇతని ప్రేమకోసము కృశించి కృశించి యీనాడు సాహసించి యీ శయ్యపైని పండుకొన్నాను. విదురపట్టినది. నా యీ సాహసమున కితఁ డేమను కొన్నాఁడో?-" ఈ భావములన్నియు ఏకవీర మనస్సులో నొకసారి మెఱుపువలె మెఱసినవి. కుట్టాన్ అనుకొన్నాఁడు- "ఈమె యెంత అందగత్తె! నన్నుజూచి యెంత లజ్జపడుచున్నది! ఇప్పు డేమి చేయను? ఇన్నాళ్ళనుండి నాతప్పు మన్నించు మందునా? ఛీ! ఛీ!ఆ నా ప్రియురాలియెడ నే నంత తప్పుగా ప్రవర్తింతునా! ఈ హృదయమామె కిదివరకే యర్పితమైనది. ఇంక నొరుల కిది ఈయజాలను!".

ఏకవీర నెమ్మదిగా మోకాళ్ళమీదలేచి పందిరికంబమున నాగబంధమునకు తగిలించబడిన మల్లెపూదండ యొకటి తీసి యొక యర్ధనిమేషమున లజ్జావనత వదనయై కుట్టాన్ మెడలో వేసినది. ఆ పూలమాల మెడలో పడినదో లేదో, కుట్టాన్ రుద్రమూర్తియైనాడు. తాటకను జంపుటకు రామచంద్రుడు ధనుస్సు నంతవడిగా లాగెనోలేదో, ఆ పూలదండను కుట్టాన్ అంత వడిగా రెండుగా త్రెంచి నేలమీద విసరినాడు. ఏకవీర మంచముపైని విరుచుకొని పడిపోయినది. ఇంక గొంచెమైనచో నిలువెత్తునుండి క్రిందబడెడిది. తల పగిలిపోయియుండును. కుట్టాన్ కన్నుల నీళ్ళు గిఱ్ఱున తిరిగినవి. కుట్టాన్ మెట్లుదిగి చిన్న మంచముపైని పోయి పండుకొన్నాడు వెక్కివెక్కి యేడ్చుచున్నాడు.

ఏకవీరకు నిమేషములో నొడలు తెలిసినది. పతిపజ్జలేడు. తన చిన్న మంచముపై పండుకొన్నాడు. తాను మంచము తొందరగా దిగి, కంచుకము ధరించి, సాధారణముగా తాను ధరించుచీర దాల్చి యొడల నన్ని భూషణములను బెట్టుకొని, కాశ్మీరపుసేలువ ముసుగిడి కన్నుల నీరు క్రమ్మగా తన చిన్న మంచమువద్దకు పోయి రుద్ధమైనకంఠమునుండి మాట పెగుల్చుకొని 'ప్రభూ! మీరు తమ మంచము పైననే పండుకొనుడు. నే నిందు పండుకొనెదను" అన్నది. ఆమె వంక తిరిగి కుట్టాన్ చూచుసరికి నతనికన్నులు గిర్రునతిరిగిపోయినవి. హృదయము సహస్రథా విశీర్ణమైనది. కుట్టాన్ తాను చేసినపనికి చాలనొచ్చుకొన్నాడు. ఏకవీరను కౌగిలించుకొని యామె శిరస్సున బాష్పాభిషేకము చేయవలె ననుకొన్నాడు. ధైర్యము చాలలేదు. కుట్టాన్ నెమ్మదిగా లేచిపోయి తనమంచముపై నిదురించినాడు.

ఏకవీర కన్నీళ్ళతో, చిన్నమంచముపై నున్న నాలుగు పరుపులు అడుగుదాక చివికిపోయినవి. ఏ రాత్రివేళనో యామెకు నిద్రవచ్చినది. తెల్లవారుకడ కుట్టానుకు మెలకువవచ్చినది. ఏకవీర యున్నదో, లేదోయని యామెమంచము వంక చూచినాడు. ఆమె యందే వాడిపోయిన మందారము వలె మంచమున కంటుకొనిపోయి యున్నది. మఱునాడు దాసీలు నేలమీది పూలదండలు చూచి సభయనేత్ర లైరి.

## 3

మఱునాడు కుట్టాన్ నిదురలేచి కాల్యకృత్యములు తీర్చుకొని, రతనాలజీనువేసి సిద్ధముగానుంచబడిన అశ్వముపై నెక్కి కోటవెలుపలిభాగమునకు పోయెను. అచ్చట నదివఱకే సమావేశమై నానామండలాధిపుల కుమారులు బారులుదీర్చి నిలుచుండిరి.

మొదట తిరుచునాపల్లి మండలాధిపుని కుమారుడు. అతడు తెల్లనిగుఱ్ఱముపై నధిరోహించియుండెను. వయ సిరువదియేండ్లుండవచ్చును. తెల్లని యంగీ, తలపై పచ్చలసరము చుట్టుననున్న యుష్ణీషము అతనిపజ్జ తిన్నెల్వేలి మండలాధిపుని కుమారుడు. అతని పజ్జ సత్యమంగళమండలాధిపుని తనయుడు. వీరిరువురు సమానవయస్కులు. చూచుటకు నన్నదమ్ముల వలెగూడ నుండిరి. అనంతరము మానామధుర మండలాధిపతియొక్కయు, శేందమంగళమండలాధిపుని యొక్కయు కుమారులు జోడుకోడెలవలె నిలుచుండిరి. వారిరువురును మేనత్తమేనమామబిడ్డలు. పోలికలు. రేఖలునొకటిగా నున్నవి. ఇరువురకును పదునెనిమిదేండ్లు దాటలేదు. వారి గుఱ్ఱములు భూమి మీద నిలుచుటలేదు. వారు బాలకులయ్యు నెంతయో పరిశ్రమగలవారి వోలె తామెక్కిన యుత్తమ జాత్యశ్వములను; తమ దేహములను కదలించుచు పాదములను జాచుచు నడుపుపెట్టుచుండిరి. ధారాపుర, కుమారమంగళ, శేల, కణ్ణివీడు పాలెగాండ్ల కుమారులు తరువాత వరుసగా నిలువబడియుండిరి ఇంక ననేకమంది రాచకుమారు లుండిరి. అందఱెక్కినవియు నుత్తమజాతి గుఱ్ఱములు అందఱ దేహముల యందును వెలలేని భూషణములు. ప్రతివాని మొగమునందునను శౌర్యలక్ష్మి. కుట్టాన్ పోయి వీరందఱకును మొట్టమొదట తన గుఱ్ఱమును నిలువబెట్టెను తరువాత ప్రధాని కుమారుడును, రాయసం కుమారుడును వరుసగా వచ్చి వారి యుచిత స్థానములయందు నిలువబడిరి. రాజసైన్యముబారులు తీర్చి వీరికి దూరముగా నిలువబడియుండెను.

ఈ రాజకుమారులు తీర్చిన బారున కెదురుగా నొక ముసలి యుద్ధవీరుడు తెల్లని గడ్డమును, మీసములను భీష్మాచార్య భ్రాంతి గల్పింప, మహోన్నతమైన శ్వేతాశ్వముపై నెక్కి నిలువబడియుండెను ఆయన వీరందఱకు శిక్షా గురువు మధురనాయకుల రాజ్యములో దళవాయి ప్రధాన సేనాపతి. ఉదయన్ సేతుపతి-కుట్టాన్ తండ్రి-దళవాయి. మొదటముప్పుర నాయకుల కాలములలో మహామేధాశాలియగు ఆర్యనాథుడీ పదవియం దుండెను ఈ పాండ్యపార్థివముద్దుకృష్ణ నృపతికి ఉదయన్ సేతుపతి దళవాయి యైనాడు ఉదయన్ సేతుపతి మహాసమర్థుడు. గొప్పసేనాని రాజకార్యనిపుణుడు సేతుపతులు నాయకులతరమువారు కాదు. పాండ్య రాజులనాటి నుండియు మధురరాజులకు మండలాధిపులుగ నున్నారు. రామనాథ ప్రాంతమున నున్న దేశమంతయు వీరి వశమున నున్నది రామేశ్వరమునకు పోవు మార్గములో చోరభయ మెక్కువై తెర్థికులకు మిగుల కష్టములుగా నుండుటచేత ఉదయన్ సేతుపతి యెక్కువకాల మా ప్రాంతముననే యుండవలసివచ్చినది ఆయన లేనికాలములో సైన్యమంతయు ఈ వృద్ధసింహము చేతిలో నుండును. ఈయన పేరు కస్తూరి రంగప్ప నాయకుడు. విశ్వనాథ నాయకుని మునుమడైన వీరప్పనాయకునకు ముప్పురు కుమారులు. రెండవ కృష్ణప్ప నాయకుడు, విశ్వప్ప, కస్తూరి రంగప్ప ప్రస్తుతమురాజైన ముద్దుకృష్ణప్ప నాయకుడు విశ్వప్పకుమారుడు కస్తూరి రంగప్ప ముద్దు కృష్ణప్ప రాజ్యమునకు రాకపూర్వము రాజ్యాపహరణము చేసినందువలన అతనిని ప్రజలు సంధ్యామంటపములో మడియించిరి. ఈ వృద్ధసింహ మా కస్తూరి

రంగప్పనాయకునకు బావమఱది ఈయన పేరును కస్తూరి రంగప్పయే! ఈయన ప్రస్తుత రాజానెడం నభిమాని.

ఆవృద్ధు కంటిచాయనుండి రాజకుమారు లొకరొక్కరే ముందుకు వచ్చి బాకువేయుటలో, తీయుటలో, కత్తిఝుళిపించుటలో తమ ప్రావీణ్యమును చూపిరి. తరువాత నీ రాజకుమారు లందరును సైన్యమువద్దకు తీసికొనిపోబడిరి. కస్తూరి రంగప్పనాయకుడు కుట్టానును పిలిచి సైన్యముచేత సర్వతోభద్రవ్యూహము పన్నించుమన్నాడు. కామందకుడు సర్వతోభద్ర వ్యూహము శత్రుహృదయనిర్భేదక మన్నాడు. కుట్టాన్ తత్క్షణమే వ్యూహమున కురమును, కక్షలును, కోటియు, జఘనమును సంపాదించి యచలాకృతి నిలువ జేసినాడు. పాదలవలె బెళికిగిన ముసలి రంగప్పనాయకుని తెల్లని కనుబొమలలో సంతోషపుకదలిక కలిగినది. వృద్ధవీరుడు గుట్టానుతో 'నాయనా! సైన్యముయొక్క జఘన మాపత్తులోనున్న యెడల నే వ్యూహము పన్నెదవు?' అనిఅడిగెను. కుట్టాన్ సమాధానము చెప్పకుండగనే సర్వతోభద్రవ్యూహమును మకరవ్యూహముగా మార్చి వృద్ధపండితుని సంతోషింప జేసెను. అనంతరము తక్కినరాజకుమారులందరును క్రమముగా శ్యేన, సూచి, శకట, వజ్రవ్యూహాదులను పన్ని రంగప్పనాయకున కానందము కలిగించిరి. కుట్టాన్ కక్షలులేకుండ నొకవ్యూహము పన్ని రంగప్పనాయకుని వంక జూచెను. రంగప్ప 'పహ్వరే' యని మెచ్చుకొనెను. అనంతరము జాముప్రొద్దెక్కగా రాజకుమారు లెవరితావునకు వారు పోయిరి. సైన్యము కస్తూరిరంగప్ప యధీనమున కొంత సేపు మెలగి, నియమితస్థలమునకు పోయినది. కుట్టాన్ గృహమునకుపోయి మఱల స్నానమాడి భోజనాదికములు నిర్వర్తించుటకు సాధాంతర్భాగమునకు పోయెను. ఎఱ్ఱనికాశ్మీరపుసేలువ ముసుగులో ప్రక్కగాపోవుచున్న ఏకవీరను చూచెను. కుట్టాన్ వచ్చుచున్నాడని తెలిసి యామె తొందరగా పోవాడంగెను. కాని మంజీరము కాలికి నొక్కుకొనగా కొంచెము నిలుచుండి వంగి సర్దుకొనక తప్పినదికాదు. కుట్టాన్ ఆమె లేదమలపాకువంటి చేతులు, కాళ్ళు పరీక్షగా జూచెను. అవియంత సుకుమారములా? కుట్టాన్ అనుకొననే లేదు!

భోజనానంతరము కుట్టాన్ తాను చదువుకొను గదిలోనికి పోయెను. కుట్టాన్‌చేయి అప్రయత్నముగా కౌటిల్యుని యర్థశాస్త్రముమీదికి పోయెను. తీయగనే యంతఃపుర రక్షణము గుఱించిన వాక్యములు వచ్చెను. కామందకుడును, కౌటిల్యుడును ఈవిషయములో నొక్కటే యభిప్రాయులై యున్నారు. కౌటిల్యు డంతఃపురరక్షణమును గుఱించియు, అంతఃపురమునుండి రాజునకువచ్చు ఆపదలను గుఱించియు తెలియజేయుట కెట్టి యుదాహరణల నిచ్చెనో, కామందకుడు కూడ నవియే యిచ్చెను. తనభార్య గదిలో దాగియుండి యతని తమ్ముడు భద్రసేనుని చంపెను. తల్లిశయ్యక్రింద నడగియుండి కరూశనృపతి నతనికొడుకు సంహరించెను. కాశీరాజును, వైరాంత్యుని, సావీరుని- వారిభార్యలే చంపిరి. ఇది చదువవలసి కనవసరముగా కుట్టానునకు భయము కలిగెను. కుట్టాన్ మఱల ధైర్యము తెచ్చుకొనెను. కుట్టాన్ హృదయములో కలిగిన కొంచె మావేగము తగ్గించుకొనుటకు

కంబరామాయణము తీసి యొకపద్యము చదువుకొనెను. కుట్టానునకు సంగీత మెక్కువగా రాదుగాని, రాగచ్ఛాయగా పద్యము చదువుకొనగలడు.

ఇంతలో వీరభద్రభట్టరు ద్వారముకడకు చనుదెంచి యశ్వశకటము సిద్ధముగా నున్నదని చెప్పెను. కుట్టాన్ దుస్తులు వేసికొని వీరభద్రభట్టరుతో కలిసిపోయెను. శకటము రాజసౌధము లున్నయెడకు పోయెను. అదొక మహాసౌధము. ప్రత్యేకముగా రాజపురుషులకు రాజనీతి నేర్పుట కేర్పఱుపబడినది. కుట్టానును, వీరభద్రభట్టరును లోనికి ప్రవేశించిరి. లోపలిభాగ మతివిశాలముగా నున్నది. నేలయంతయు విలువగల తివాసీలు పఱుపబడి యున్నవి. వానిపై పండితు లాసీనులై యుండిరి. రాజకుమారు లనేకులు వచ్చిరి. ఒకచోట 'భోజుని యుక్తికల్పతరువు,' మరొకచోట జీమూతవాహనుని 'దాయభాగము,' ఇంకొక చోట చండేశ్వరుని 'వివాదరత్నాకరము' పాఠములు చెప్పబడుచుండెను. ఇంకొకచోట నొక ద్రావిడ భాషాపండితుడు తమిళభాషలో వ్రాయబడియున్న'విజ్ఞానేశ్వర వ్యాఖ్య'బోధించుచుండెను. మరొకచోట వేరొక పండితుడు సంస్కృతభారతమును, రామాయణమును, నానాటిరాజనీతిని కొందఱు విద్యార్థుల కుపన్యసించుచుండెను. కుట్టాన్ భారతరామాయణము లుపన్యసింప బడుచోట కూరుచుండి శ్రద్ధగా వినెను. కొంచెము ప్రొద్దుగ్రుంకువేళకు రాజు మొగసాలలో గంటకొట్టబడెను అది విని విద్యార్థు లెవరిదారిని వారు పోయిరి వీరభూపతి యీ పాఠశాలకు వచ్చెను. ఇంటికి పోవునప్పుడు కుట్టానును కలిసికొనెను. ఇరువురును సంతోషపడుచు సేతుపతి గృహమునకు పోయిరి. వీరభద్రభట్టరు పనియుండి రాజసౌధమువద్దనే దిగబడెను

మార్గములో వీరభూపతి కుట్టాన్‌తో నిట్లు మాటాడెను-"సేతూ! నీతో నొక పనియున్నది".

కుట్టాన్ "ఏమి" యని యడిగెను. వీర- "తిరుమలనాయకుడు నీకు స్నేహితుడుగదా! నాకేదైన నుద్యోగ మిప్పించవలెను. నేను నీతిశాస్త్రమంతయు జదివితిని. విజ్ఞానేశ్వరము, వైశంపాయనుని నీతిప్రకాశిక పూర్తి చేసితిని. కౌటిల్యుని యర్థశాస్త్రము, కామందకుని నీతిసారములలో చాల బాగుగ పరీక్షనిచ్చితిని నే నుద్యోగము చేయవలసిన యవసర మంత కంత కెక్కువగుచున్నది."

**కుట్టాన్** - తిరుమల నాయకుడు నేడు విద్యాసౌధమునకు రాలేదే! ఈసారి నేవాయనను కలిసికొన్నప్పుడు చెప్పెదను వారు నిన్నుగూడ బాగుగ నెఱుగుదురుకద! వీర - ఎఱుగ కేమి?

తరువాత నేదియో మాటలాడుచు వా రింటికి జేరిరి వారిరువురు కుట్టాన్ గదిలోనికి పోవునప్పటికందు ఫలాహారములు సిద్ధముగా నుంచబడెను ఇరువురు ఫలాహారముచేసి, తాంబూలము సేవించి కూర్చుండగా కుట్టాన్, వీరభూపతిని కొంచెము సంగీతము పాడుమని యడిగెను. వీరభూపతి మధురమీనాక్షిపై నొక యరవకీర్తన గొంతెత్తిపాడెను. ఆ ధ్వనితో సౌధమంతయు నిండిపోయినది. పారిజాతపు పూవులు కొఱుకుచున్న లేడిపిల్ల మెడయాడించుకొనుచు లోనికివచ్చి వీరభూపతి వంక తొంగిచూచి పోయినది.



ప్రొద్దుగ్రుంకినది. చల్లబడినది. రాజసౌధములముందు మొగసాలలో మ్రోగింపబడుచున్న భేరీరావము మేఘధ్వానమని భ్రాంతిజెందిన పెంపుడు నెమళ్ళు నృత్యము చేయుచున్నవి. సాయంకాల వాహ్యాళికై కుట్టాన్ వీరభూపతు లశ్వశకటా రోహముచేసి వైగనదీ సైకతతలములకు పోయినారు.

కుట్టాన్ సేతుపతి కొంచెము పొట్టివాడు. నల్లనివాడు. విశాలమైన నేత్రములు. దైనందిన వ్యాయామముచేత నతని యొడలు గట్టిబాఱినది. సంస్కృత ద్రావిడములలో నున్న రాజనీతి గ్రంథములన్నియు నతడు చదివెను. అతనివయస్సు సుమా రిరువదియైదుండవచ్చు. మీసములు నల్లగా తుమ్మెదఱెక్కలవలె అంత గుబురుకాకుండ, అంత పలుచనకాకుండ వచ్చియుండెను. అతని మొగము చూచుటతోడనే ప్రధానముగ కనబడునది యతని నాసిక. అది మిక్కిలి యెత్తు. ఆ ముక్కు, ఆ విశాలపద్మపలాశ నేత్రములు అతని మొగమున కమితమైన యందము తెచ్చినవి. ఆ విశాలమైన నేత్రములే యతని సత్కులీనతను చెప్పుచుండును. కుట్టాన్ మిగుల గంభీరమైన వాడు. అనవసరముగ నెవ్వరితోడను మాటాడడు. అతని కిష్టములేని పని నెవరైనను జేసిరేని వారి వంక తీక్ష్ణమైన దృష్టి పఱపుటయే యతడు తనయిష్టములేమి చూపించుట. ఆ దృష్టిపాతము చాలకొలదిమంది యోర్చుకొనగలరు. అతడు ప్రసన్నుడైనప్పుడతని నవ్వు మిగులనానందము గలిగించును. అతని సర్వము ఉదయన్ సేతుపతి తరువాత యంతవా డనిపించుచుండును.

ఇంక వీరభూపతి యెఱ్ఱనివాడు. పొడుగరి. శరీరవ్యాయామము మిక్కిలిగా జేయనివా డగుటచేత నితని యెదురు రొమ్ము కుట్టాన్ రొమ్మువలె తిర్యక్ప్రసారితమైన గండశిలవలె నుండదు. అతని నేత్రములు కుట్టాన్ నేత్రములంత విశాలమైనవి కావు. కాని మఱియు చిన్నవికావు. నాసిక సామాన్యమైనది. అతని మొగము చూచినంతనే ప్రతివారు నతడు సుందరు డనుకొనక మానరు. కుట్టాను మొగములో ఆనుపూర్వికముగా యుద్ధముచేసి రాజ్యము నేలుచువచ్చిన పితరులచిన్నెలు ద్యోతక మగుచుండును. వీరభూపతి వదనము శాంతమై చాలతరములనుండి వ్యవసాయము, చదువు వీనియందలవాటుపడిన పితరులచిన్నెలు కనబఱచు చుండును వీరభూపతి మీసములు చివరలు మెలికలు తిరిగి తామరపూవు మీద వ్రాలినభృంగముల ననుకరించుచుండును. మొత్తము మీద కుట్టాన్వదనము పురుషు లెక్కువ మెచ్చుకొందురు. వీరభూపతివదనము స్త్రీ లెక్కువ మెచ్చుకొందురు. వీర భూపతిమొగము క్రోధముచే నెఱ్ఱబడినను నవ్వుచున్నట్లే యుండును. అతడు నవ్వుచున్నప్పుడు కన్నులుచిన్నవై చూచువారిని సూదులవలె గ్రుచ్చుచుండును. కుట్టాన్ నడచునపుడు మిక్కిలి తొందరగా నడచును వీరభూపతి నెమ్మదిగా నడచును.

కుట్టాన్ ఉదయన్ సేతుపతి కొక్కడే కుమారుడు. ఉదయన్ సేతుపతి "తేవై" పురాధిపతి. సేతువుల రక్షించుట కేర్పడిన యధికారి రాజ్యములో ప్రవహించు నదులకు సేతువులుగట్టి వాని క్రింద భూములను సాగుచేయుచుండిరి. ఈ సేతువుల

కన్నింటిపైని నత డధికారి. అతడు చాల శివభక్తుడు. అరియరాయని సైన్యములను నిర్మూలించినాడు. ముద్దుకృష్ణప్ప నాయకునికి ప్రధానమంత్రి. అతని కుమారుడైన కుట్టానునకు ఏ లోపమును లేదు. కుట్టాన్ తన తండ్రితరువాత నతనిస్థాన మాక్రమించుకొనుటకు తగిన శిక్షణ మధురలో పొందుచున్నాడు

వీరభూపతి జన్మస్థానము రాజవల్లిపురము అతని తల్లిదండ్రులు కొంచెముబీదవారు విశ్వనాథనాయకునకు శ్రీకృష్ణదేవరాయలుంగారు పాండ్య రాజ్యమిచ్చినపుడు తెలుగు దేశమునుండి విశ్వనాథనాయకునివారితో అనేకులు సరదారులు మధుర ప్రాంతమునకు పోయిరి. వీరభూపతిపూర్వు లటుల తెలుగు దేశమునుండి మధురకుపోయిరి కాని యచ్చటికి పోయిన తర్వాత విశ్వనాథనాయకుడిచ్చినభూమి నాధారము చేసికొని, వ్యవసాయము చేసికొని జీవించుట మొదలు పెట్టిరి వీరభూపతి రాజోద్యోగవాంఛచేత రాజవల్లిపురము నుండి మధురకు వచ్చి రాజనీతి చదివెను

మధురలో నా కాలమునందు విద్యావ్యాప్తి ఎక్కువగానుండెను మధురలో ఆ రోజులలో ఎప్పుడును పదివేలమంది విద్యార్థులకు తక్కువలేకుండ నుండెడి [illegible] విద్యార్థుల భోజనాదికములకు ఉపాధ్యాయుల జీతములకు విజయనగరరాజులును, మధురనాయకులు నిచ్చిన భూమి అనేకము లున్నవి ఆ భూముల మీద వచ్చు నాదాయము మిగిలిపోవుచుండెను సంస్కృతము అరవము, తెలుగు ఈ మూడుభాషలు నభ్యసింప బడుచుండెను [illegible] నుపయోగింపబడుచుండెను సమస్తమైన [illegible] విద్యార్థులచే పఠింపబడుచుండెడి [illegible] తెలుగు చెప్పబడుచుండెను. మధుర నాయకుల [illegible] తెలుగు [illegible] పోషింపబడెను రాజకుమారులకు [illegible] అందు ప్రధానమైనది రాజసౌధములోనే [illegible] సకలకళాశాలల లోనను విద్యార్థులు [illegible] రాజు బిరుదములు, బహుమానములు నిచ్చుచుండెను

రాజనీతితరగతి యనేక భాగములుగా విభజింపబడి యుండెను! గ్రామపాలనము, దాయవిభాగము, శిక్షా విధానము, సైన్యభాగము! రాజకుమారులు సైన్యవిభాగశిక్ష పొందుచుందురు తక్కినవారు తక్కిన తరగతులలో చదివి తగిన యుద్యోగములు పొందుచుందురు

మధురనాయకులు వేద రక్షకులు, సనాతన ధర్మములను పరిరక్షించినవారు బ్రాహ్మణులయందు భక్తి దేశమున సంపూర్ణముగా నుండెను అయినను మధుర రాజులు తక్కిన మతములయందు వైషమ్యముకలవారు కారు. దక్షిణ హిందూస్థానమున ప్రథమమున క్రైస్తవమత మడుగుపెట్టినది, మధుర రాజుల రాజ్యసీమలలోననే

మధురనాయకులు రాజ్యమును పాళ్యము పద్ధతిగా విభజించిరి రాజ్యమనేక మండలములుగా విభజించి ప్రతిమండలమును ఒక్కొక్క యధికారి క్రింద నుంచిరి ఆ యధికారి తన మండలమునకు రాజు వంటివాడు అతడు మధురనాయకునకు కప్పము కట్టుచు తన మండలముమీద తాను సర్వాధికారము చేసికొనవచ్చును అతడు

కొంత సైన్యమును పోషించుచు మధురనాయకునకు అవసరము వచ్చినపుడు సహాయము చేయుచుండవలెను. మధురలో మాత్రము రాజు తాను కొందరు మంత్రుల సాహాయ్యముతో రాజ్యము చేయుచుండును.

రాజ్యములో ప్రధానోద్యోగి దళవాయి అతడే రాజ్య పాలనాధికారియు, సైన్యాధికారియు. పూర్వభారతదేశ పాలకులయందువలె ఈ రెండధికారములు నొకటి మంత్రి క్రిందను, నొకటి సేనాపతిక్రిందను ఉంచక మధురరాజులు దళవాయి యొక్కని క్రిందనే యుంచిరి రాజ్యము యొక్క శాంతి, సాంఘిక వ్యవస్థ, ఇతర రాజ్యములతో సంబంధము ఇవి దళవాయి చూచెడిపనులు తక్కిన యంద రధికారులమీద నితడు పైయధికారి. దళవాయి తరువాతి యధికారి ప్రధాని ఇతడు రాజ్యాదాయముమీద యధికారి పన్నులు, తక్కిన రాబడులు, రాజ్యములో నగుచున్న ఖర్చు నివియన్నియు నితని పనులు దళవాయి యుద్ధకాలములో రాజధానినుండి వెళ్లి పోయినచో నితడు దళవాయి పనులన్నియు చేయుచుండును. మంత్రులలో మూడవవాడు రాయసము ఇతడు పరిపాలనలో ప్రధానపురుషుడు. రాజ్యముయొక్క సుస్థిరత యీ ముగ్గురిమీద నాధారపడియున్నది వీరి ముగ్గురి తరువాత ప్రధానాధికారులు కణక్కు (గణకుడు), స్థానాపతియును కణక్కు లెక్కలన్నియు సరిచూచువాడు స్థానాపతి యితర రాజుల కానుకలు, కప్పములు, వానికి సంబంధించిన యన్ని వ్యవహారములు చూచు నధికారి

కొన్ని గ్రామములు కలిసి నాడనియు, పల్లెకొన్ని మాగాణములు గలిసి యొక నాడనియు వ్యవహరింపబడుచుండెను ఈ నాడునకే దేశము, రాష్ట్రము, రాజ్యము, మండలము పేరులు ప్రతిగ్రామమునకు అధికారులుండెడివారు గ్రామములలో న్యాయము గ్రామాధికారుల చేతనే తీర్చబడుచుండెడిది రాజ్యమంతటలో అన్ని విషయములైన న్యాయములయొక్కయు తీర్పు ప్రధాని గ్రామములలో తీర్చబడని యన్నివ్యాజ్యములను సభలో తీర్చుచుండెను. మధుర యతిసుందరముగా నిర్మింపబడి యుండెను. పట్టణమునకు సరిగా మధ్యప్రదేశమందు మీనాక్షి సుందరేశ్వరుల దేవళము కట్టబడి యుండెను ఆ దేవాలయము నాలుగు వైపుల నాలుగు పెద్ద గోపురములు నిర్మింపబడియుండెను ప్రతిదిశయందును నీ గోపురముద్వారమునుండి యూరిచివరకు నొక్కటియే వీధి శ్రీమీనాక్షి సుందరేశ్వరుల దేవాలయమునకు చుట్టును చతురముగా గృహములు కట్టబడియున్నవి. పట్టణమం దెచ్చట జూచినను దేవాలయములే అన్ని దేవాలయములకు రాజులిచ్చిన మాన్యములున్నవి ఏ స్వామికిని భోగము లోపములేదు అన్ని దేవాలయములలోను విద్యార్థులకు వేదశాస్త్రము లుపదేశింపబడు చుండెను పట్టణము సర్వసమృద్ధమై యే విషయమునందును కొఱతపడకుండ నుండెను.

కుట్టాన్, వీరభూపతులు ప్రొద్దు గ్రుంకకముందే వైగెనదికి పోయి నిన్న గూర్చున్న చోటనే కూర్చుండిరి కొంచెము చీకటిపడుచుండెను అస్తమయ సూర్యుని యెఱ్ఱకాంతులింకను ధాత్రిని పూర్తిగా వదలిపోలేదు వైగెనదీ పరిశీన్న జలతరంగములపైని కొంచెముగా శైత్యమును సేకరించుకొన్న వాయువు మందముగా

వీచుచుండెను. పలుచగా పారవలె నిసుకతిన్నెపై ప్రవహించుచున్న వైగనది నీటిపాయలో చిన్ని చేప కదలిక కనిపెట్టి పైనుండి తీతువుపిట్ట కూయుచు హఠాత్తుగ గాలిలోనుండి దిగి దానిని కాళ్ల పాడుచుకొని పోయెను. దూరమున పడమటి దిక్కునందు సూర్యభగవానుడు తన రక్తాంశువు లుపసంహరించుకొని కరడు గట్టిన నెత్తురు మన్నువలె తొంగిపోయెనుపో! యెదరువేచి యెదలినిండ మసి పూసుకొన్న దొంగవలె సంజచీకటివంగి తొంగిచూచెను. చీకటిలో తళుక్కున మెఱసిన గగనభాగమందలి నక్షత్రములు వైగ పలుచని నీటిపారలో ప్రతిఫలించి లోని వెండిమేను మీనుల యందముల క్రామ్రేడితములు కల్పించెను. సన్నని నీటిపాయలోని చిఱుకెరటములు త్రాచుపాముపిల్లలవలె ఒడ్డునకు కొట్టుకొనుచు వచ్చుచుండెను.

౫

కుట్టాన్ వీరభూపతి భుజముపై చేయివైచి, "వీరా! సరే! నాహృదయము మండుచున్నది. నిన్న సాయంతనమున నీవుగూడ నీకేదో మహాభార మున్నట్లు చెప్పితివి. అది నాతో చెప్పవా?" అని యడిగెను. వీరభూపతి కొంచెమాగి "మఱల ఆ కథ నాకేల స్మృతికి దెచ్చెదవు? ఈ జన్మకింతియే! అవివాహితుడనుగా ఈ జీవితాంత ముండవలసినస్థితి యున్నను, నాశరీరము మీద నాకే యధికారము లేకున్నది. వివాహమేమో, చేసికొనక తప్పునట్లులేదు" అని సాలోచనాక్షుడై చీకటు లుమియుచున్న పడమటి దిక్కువంక నదేవిధముగ చూడ మొదలిడెను. కుట్టాన్ లేచి నీటిపాయ వద్దకు పోయి పాదప్రక్షాళన మాచరించి, బొడ్డులో నున్న కత్తి తీసి పదును సరిగా జూచి మఱల నొరలో నమర్చి, నీరు పుక్కిలించి యుమిసి వీరభూపతి యొద్ద కూర్చుండెను. వీరభూపతి, "సేతూ! నీవు మహారాజుల బిడ్డవు, నేను మిక్కిలి బీదవాడను. మనమిరువుర మొక్క తరగతి చదువుకొనుచుండుట మాత్రము చేత మనకిట్టి స్నేహ మెట్లొదగూడినది! ప్రాణప్రదములైన రహస్యములు నీవేమో నాకు చెప్పితివి, నేను నీకెట్లు చెప్పకుండగలను?" అని తన చేతితో ఇరుపాయలుగా తీయబడియున్న సేతుపతి తలవెంట్రుకలను నిమురుచు, స్నిగ్ధములైన తన చూపు అతని మొగమున నిలిపి "సేతూ! నీవు నీ భార్యతో నివసించుచుంటివి. మీయిరువురికి సుఖములేదని నాతో చెప్పితివి. పాప మా పిల్లను చక్కగా ప్రేమించుము. మహారాజు నింటిబిడ్డ పేదగుడిసెలో నివసించు పిల్ల కన్న నందకత్తె కాకపోదు కాదుపో! అంత సౌకుమార్యము పేదవారి కెక్కడినుండి వచ్చును? నా మనః పూర్తిగా నిన్ను నీ భార్యను ప్రేమించుమని యడుగుచున్నాను. నీభార్యను నీవు 'ప్రేమించెద' నని గట్టిగా నాతో జెప్పిన గాని నాకానందము లేదు ఱేపు నేను వివాహము చేసికొనబోవు చున్నాను నేను ప్రేమించిన స్త్రీ యేమో నాకు దుర్లభ. వివాహము చేసికొనక తప్పదు. ఏమి చేయమందువు? ప్రాణముపోయినను వివాహము చేసికోనని పట్టుబట్టనా? ఇట్టని నాపైననే యాశలన్నియు పెంచుకొన్న తల్లిదండ్రుల యాత్మలకు ముసలితనములో నెంత యావేదన తీసికొని రమ్మందువు? వివాహము చేసికొందును. అనంతరము వచ్చిన భార్యతో విముఖుకుడనై యుండి యేమి సంపాదించుకొందును? ఇహమా? పరమా? ఈ జన్మమెత్తినది సుఖము ననుభవించుటకు కాదు. కావున సేతూ! నీ

భార్యను నీవు 'ప్రేమింతునని' వాగ్దానమిమ్ము. అట్లొసంగినచో నాకథ నేను జెప్పెదను." వీరభూపతి యిట్లు చెప్పుచుండగా కుట్టాన్ కనులవెంట నీరుకార్చుచుండెను. వీరభూపతి కొంచెమాగి "తమ్ముడా! నిన్ను నే నిటుల సంబోధించుటకు నీవే యింత చనవిచ్చితివి. కన్నులవెంట నీరుతేకుము నేను నీకన్న ఏ విషయములోను పెద్దవాడను కాకపోయినను, వయసులో పెద్దవాడను. అయ్యో ఇట్లేడ్చెదరా?" అని వీరభూపతి తన యుత్తరీయపు కొంగుతో కుట్టాన్ కన్నీళ్ళు తుడిచెను. వీరభూపతి మఱల "ఏమి? వాగ్దానము చేసెదవా? అది నీమేలుకోసమే చెప్పుచున్నాను. నీ యందు నాకుగల స్నేహము నీవలన నీ వాగ్దానము తప్పక పుచ్చుకొమ్మని నన్ను వేధించుచున్నది. ఇకముందు నీభార్యతో నీవు సరిగా నుందునని నా చేతిలో చేయి వేయుము," అని కుట్టాన్‌ను బలవంత పెట్టెను.

కుట్టాన్ మాటలాడలేదు. వీరభూపతి మఱల "నీ భార్య యందకత్తెయేనా?" యని యడిగెను. కుట్టాన్ మాఱుపలుక లేదు. వీరభూపతి "సేతూ! ఈ ప్రశ్న వేయగూడదని నేనెఱుగుదును నీ యంతఃపురమును గుఱించిన నాయీ ప్రశ్న నాయందు నీకింత నెయ్యము లేనియెడ నాశిరస్సును మొండెమునుండి విడిగా చూచి యుండును. నీవామె "సౌందర్యవతి"యని యనుకొంటివేని ఆమెకు కూడ నీ ప్రేమలో కొంత పంచిపెట్టుము" కుట్టాను మాటాడలేదు. **వీరభూపతి**- "సౌందర్యవతి కాదయేని కాదని చెప్పుము." కుట్టాన్ పెదవులు కదలినవి. **వీరభూపతి**-"సేతూ! బిగ్గరగా చెప్పుము నా గొంతుకలో ప్రాణమున్నంత వఱకు నీ రహస్యమును బయటకు పోనిచ్చువాడనుగాను. నీకు నాయందంత నమ్మకము లేదా?"- కుట్టాన్ నెమ్మదిగా, "ఇదివరకు నేనామెను పరిశీలించి చూడలేదుగాని, గడచిన రాత్రి చూచితిని. ఆమె యందగత్తెయే యగును" అన్నాడు. **వీరభూపతి** "అయిన నింకనేమి? నీ వసుందరమైన వస్తువును ప్రేమించుటలేదు కద! ఇది గృహస్థధర్మము. ప్రతివాడును చేయదగిన విధి. నేను నిన్ను ప్రార్థించుచున్నాను." వీరభూపతి కన్నుల నీళ్ళు క్రమ్మినవి మరల వీరభూపతి యిట్లన్నాడు, "నాకు వచ్చుచున్న దుఃఖమును ప్రయత్నముచే ఆపుకొనుచుంటిని. నాయనా! నాకీ వాగ్దానమిమ్ము. కలకంఠి కంట కన్నీరొలుక రాదట! శ్రీ యింట నుండ నొల్లదట నాకీ వాగ్దాన మిచ్చినగాని నే నిందుండి లేవను," అని వీరభూపతి కుట్టాన్ పాదములపై పడుటకు సంసిద్ధుడైనాడు. కుట్టాన్ త్రొటుపాటునంది "వీరా! ఎంత మంచివాడవు! ఇన్నాళ్ళనుండి యేమో వట్టిస్నేహితుడ వనుకొంటినిగాని, నేను నీవుగా నూహించుకొను నంతటి ప్రేమ నాయందు నీకున్నదని తెలిసికొన లేకపోతిని. నిజముగా ఇంత ప్రేమకు నే ననర్హుడను, నేనా స్త్రీని ప్రేమించ లేకున్నాను. నీకోసమని ప్రేమించుమందువా? ప్రేమించెదను; ప్రేమించెదను.వీరా! యత్నము చేసెదను. కాలముపట్టునట్లున్నది. క్షమింపుము" అని కుట్టావ్ వెక్కివెక్కి యేడ్వ మొదలు పెట్టినాడు. వీరభూపతి యతనిని గాఢముగా కౌగలించుకొని యతని శిరస్సును మూర్కొని, 'కాలము పట్టినంతమాత్రము చేత ఏమియు తొందరలేదు సుష్ఠుగా విచారించి చేయుము! పదిసారులు నేను చెప్పవలసిన దేమున్నది? వాగ్దాన మిచ్చితివి, జ్ఞాపకముంచు కొమ్ము; "ఆ ఇచ్చితి" నని

నర్తకంఠస్వరములో కుట్టాన్ శిరస్సు అంగీకారార్థచలనము కనబఱచినది తరువాత నర్ధఘటికసే పెవ్వరును మాటాడలేదు. కుట్టాన్ తలయెత్తి వీరభూపతివంక చూచెను. ఆచూపు వీరభూపతి నతనిగాధ చెప్పు మని యడుగునట్లున్నది. వీరభూపతి కనులలో మెఱపు మెఱసి నట్లయినది. అతడు తలవంచి, కుడిచేతిలో వెగ యిసుక గుప్పిళ్ళుగా దీసికొనుచు వదలి పెట్టుచు, "సేతూ! ఈ రహస్యము నెవ్వరికిని చెప్పదలంచుకొన లేదు. ఎవ్వరికిని జెప్పనని యొట్టు పెట్టుకొంటిని ఆ యొట్టును గూడ నిర్లక్ష్యముచేసి నీకు చెప్పించుచున్న యీ శక్తి యెందున్నదో నాకు తెలియుట లేదు. నీవు నీ రహస్యములు నాకంతగా చెప్పుటచేత నాహృదయము నీయెడల కరగి నీరైనది నీవంటివాడు నాతో నంతచనవు, నంత ప్రేమచూపించుటచేత నాహృదయమునకు లేనిమార్దవము వచ్చినది, ఉన్నపట్టుదల సడలినది కాని సేతూ! నా కథ చెప్పెదననుకొనుము చెప్పి ఫలితము లేదు నాజన్మలో నాకోరిక సఫలము కాదు అగుటకు వీలులేదు. అది నాకు తెలియును అయినను దానివలన నా హృదయము బాధపడుచునే యున్నది. ఆ విషయము నా మనస్సు మఱువ లేకున్నది నిజముగా నీ సంగతి చెప్పదగిన వారెవ్వరైన నున్నారా యనినచో నీవుతక్క నింకెవ్వరును లేరు కాని నాదొక ప్రార్థన నేనా కథ చెప్పుచుండగా నీవు నన్నేమియు నడుగవద్దు. ఎంత చెప్ప వలయునో యంతయు చెప్పెదను ముఖ్యముగా ఊరుపేరులు మాత్రము దాచెదను అవి చెప్పుట నా కిష్టము లేదు అవి తెలిపినంత మాత్రమున నీకు లాభమును లేదు. అయినను చెప్పెదను మాది రాజపట్టిపురము తెలుగు దేశము మా తాత తండ్రి విశ్వనాథనాయకునివారి వెంట ఈ దేశమునకు వచ్చినాడు యుద్ధసమయములయందు మాపూర్వులు కత్తులు గూడ బట్టిరి కాని వారెక్కువ భాగము వ్యవసాయ దారులు మా తాతలు ముగ్గురన్నదమ్ములు. మాతండ్రులు నల్గురు మాతాతండ్రికే మా ముగ్గురము విశ్వనాథనాయకుడుగా ఇచ్చిన భూమియంతయు మా వంశము క్రింద పంపిణీయై పోయినది నేటికి నే [illegible] చేయవలసివచ్చినది [illegible] యెనిమిదేండ్లు. మాయన్నదమ్ములు, [illegible] వంశమైనది మావారు పూర్తిగా వ్యవసాయము చేసికొనుచున్నారు, యుద్ధవార్త మాయింట పూర్తిగా చావలేదు అవసరము వచ్చినచో యిప్పుడైనను దేశక్షేమమునకై రక్తమోడ్చుటకు మాయింట పసిపిల్లకూడ వెనుదీయదు. నా యిరువది నాల్గవ యేట, నేటికి నాలుగేండ్లక్రింద నే నొక కారణాంతరముచేత నాయూరు పోతిని ఆయూరుపేరుగాని, యా పనిగాని నన్నడిగి నామనస్సు కలత పెట్టకుము ఒకనాడు నేను స్నానముచేసి తెల్లని యుడుపులు ధరించి యాయూరివెంట నాహ్యాళిపోయితిని ఆత్మస్తుతి యనుకొనకుము అప్పుడు నేను చాల యందముగా నుండెడివాడను; గృహసంబంధమైనవియు, నా మనోజనిత మయినవియు ననేక కష్టముల చేత నా యందమంతయు పోయినది ఇప్పుడు నాకనులలో దూరాలోచన యేర్పడినది. అప్పుడు నా నేత్రములు దుఃఖమెఱుగని జీవి నేత్రముల వలె, సాయంవికసిత నీల కైరవమ్ముల వలె నుండెడివి నాకా యూరు క్రొత్త. పోవుచుండగా ఊరిబయట నొక వీధియందు పెద్దసౌధ మున్నది ఆసౌధ గవాక్షమునుండి యొక జగన్మోహనాకృతి

లోనుండి యొక వస్తువు విసరి వైచి లోనికి పోయెను. గవాక్షము చీకటి యై పోయినది. నేను చీకటిలో వెదకి కొంటిని. వీధియంతయు గుమ్మున పరిమళించుచుండెను వెదకుచున్న వస్తువు దొరికినది. అది పెద్దజాజులు మల్లెలు కూర్చికట్టిన చెండు. ఆ సువాసన నేను పట్టలేక పోయినాను. బసకు పోయి ఈ పూలచెండు నెదురు ఱొమ్ముపై నుంచుకొని కనులు మూసుకొని పండుకొంటిని. మనసు నిలువలేదు. నిద్ర యెక్కడి నుండి వచ్చును? అది పూల చెండు మాత్రమే కాదనుకొంటిని. మనసులో దేవతలుకూడ వాంఛించని కోరికలు నిర్మించుకొంటిని. అందఱు నిద్రపోవుచుంటిరి గాన దీపము దగ్గరకు బోయి చెండును ముద్దుపెట్టుకొంటిని. ఎదుఱొమ్మున నాన్చుకొని యా ప్రియురాలి హస్తము తాకినట్లు సంతసించుచుంటిని, నాయొడలు గుగుర్పొడిచినది. నవ్వుకొనియెదవా? ఏమిచేయను? అన్నియు నీతో చెప్పుచుంటిని. ఏదో బుద్ధిపుట్టి పూలచెండు విదిమి వేసితిని ఆశ్చర్యమైనది లోన నొక యుత్తరమున్నది భూర్జపత్రమునిండ అక్షరములు విస్పష్టముగా కనుబడుటకు కస్తూరియు, పునుగును అలందబడియున్నవి ఆ వాసన యిల్లంతయు గ్రమ్మివేసినవి ఆవాసనల చేత దీపము పోవునేమో యనుకొంటిని ఇంటిలోని వారందఱు మేల్కొందురేమో యనుకొంటిని ఉత్తరము చదువుకొనకముందే దాచుకొనవలయు ననిపించినది. ఎచ్చట దాతును? హృదయము చించి లోన దాతునా? హృదయము చించుకొనుటకు వజ్ర కత్తి లేక పోయినది. ఆ వారముదినముల నుండి నా బాకు బొడ్డులో లేకుండగనే నేను తిరుగుచుంటిని మఱల నావేశము నాపుకొని యుత్తరమును జదువ మొదలు పెట్టితిని ప్రత్యక్షరము నందును సూత్న్వర్గములు నిర్మింపబడియున్న యా యుత్తరము పూర్తిగా చదువుట నా చేత కాలేదు తక్కినవి ఱేపు చదువవచ్చునులే యని పోయి పండుకొందును ఎట్లు పండుకొనగలను? మఱల దీపము సర్దుకు పోదును; కొంచెము చదువుదును. ఎవ్వరైన లేచెదరేమో యని భయము. ఆ రాత్రి నాజీవితములో పరమమైన కాలము అంత యానంద మారాత్రి యనుభవించితిని కాన, తరువాత నీ నాటివఱకు దుఃఖము వారడి యనుభవించవలెనని వ్రాసినాడు కాబోలు విధాత! నేను నిద్రపోవు వఱకు కోడికూసినది- నిద్రపోవువఱకు కాదు, మఱల శయ్యపై పండుకొనబోవు వఱకు తెల్లవారు సరికి నేను వెళ్ళినకార్య మాలస్యమయిన దని నాతండ్రిగారు వచ్చిరి. నేను వెళ్ళిన కార్యము చాల తొందరయైనది నేనా పనిచేయక పోవుటలోనాదెంతయేనియు తప్పే! కాని నేనేమి చేయగలను! మఱునాడు పనియైనది. ఇంటికి పోవలెను నే నాయూరు వదిలిపెట్టలేను మాతండ్రితో వెళ్ళి తీరవలెను. దారిలో బండినెక్కి మాయూరు పోవుచున్నాము. మాతండ్రి వాకట్టను మాయూరికి చేరవేయుచున్నాడు. నన్ను సహస్ర నాగములు తోకలతో మెలివేసి వెనుకకు లాగుచున్నవి. ఆ యుత్తమమైన కస్తూరితావులు మా నాయనను సమాకర్షించినవి నన్నడిగినాడు. నేను చెప్పలేదు. ఇంటికి పోవుసరికి రహస్యమంతయు మాతండ్రికి తెలిసినది. మాయమ్మగారికి నాయనగారు చెప్పినారు, ఉత్తరములో నామె యెవరో, నే నెట్లామెను కలిసికొనవలయునో సర్వము వ్రాయబడి యున్నది. ఇంక ఎన్ని విషయములున్నవి!

అవి నేనుదక్క నింకనెవ్వరు చూడరాదు. వినరాదు. అవి మాతల్లియు తండ్రియు నెఱింగినపుడు నా మనోవ్యధ యెట్లున్నది? త్రాచును పై నుండి పక్షులు పడగమీద తన్నుచు పొడుచుచు నుండిన దాని కెంత వ్యధయో యంత నరకబాధ యనుభవించితిని. కాని వారు నా తల్లిదండ్రులేగదా! ఆ రహస్యము నాల్గవ నోటబడలేదు. తక్కిన నా సహోదరులు నెఱుగరు. నా జననీ జనకులు నన్ను గడ్డము పుచ్చుకొని బతిమాలిరి; ప్రార్థించిరి; మహాపద నెత్తిపైకి తెచ్చుకోవద్దనిరి. జొన్న చేనులో మంచెయేకాని సౌధము కూడదనిరి అనేకవారములు కన్నీరు పెట్టుకొనిరి. సేతూ! ఇటు మనస్సులోని కోరిక చంపుకొననా ఫలోన్ముఖమైనది? ఎదుట స్వర్గములు స్పష్టముగా గన్పించుచున్నవే! కనులు మూసికొన్న నామె తక్క నింక ఏ యాకృతియు లేదు. అటుల తల్లిదండ్రుల మనస్సున కానందము కలిగించనా! ఆరోజులలో నాకు భోజనము లేదు, నిద్రలేదు. పిచ్చివాని వలె చూచుచుంటిని. నాతల్లియు తండ్రియు నొక్క నిముషముగూడ నన్ను వదలియుండలేదు. రెండు నెలలైన తరువాత నాతల తిరిగినది ప్రపంచములో పడినాను. ఆరోజులలో నాస్వప్నములు, కన్నులుమూసిన గనంబడు ఘోరదర్శనములు నేనేమని చెప్పుదును! చివరకు తల్లిదండ్రులమీది ప్రేమయే జయించినది. తరువాత సంవత్సరము వఱకు కనులు మూసినచో నా ప్రేయసి కనంబడుచుండెడిది. ఇప్పుడామె నా కలలోనికిగూడ వచ్చుట మానివేసినది. నే నదిమొదల లాయూరు పోవుటకు వీలులేకుండ చేసినారు నాతల్లిదండ్రులు నేనా యూరు వెళ్ళినచో నా తల్లిదండ్రులు చనిపోవుదురని నాకు భయము.వారట్లన్నారు! నేనా గ్రామమువంక చూడనని నా తల్లికి తండ్రికి వాగ్దానము చేసితిని ఈ రీతిగా నా ప్రేమ యెడారిలో తనంత తా నదృశ్యమైన నదివోలె మాయమైనది."

తరువాత నిశ్శబ్దత; అంధకారము!

## ౬

దినములు యధాస్థితిగ జరుగుచున్నవి కుట్టాన్ మనస్సులోని కల్లోలము వీరభద్రభట్టరునకు గొంచెము తెలిసినది కారణము తెలియలేదు రామనాదమున కుత్తరము పోయెను ఒకరోజు కుట్టాన్ వీరభద్రభట్టరులు రాజనీతి పాఠశాలకు బోయిరి. మధ్యాహ్నమున సూర్యుడు తీక్ష్ణాంశువులను చిమ్ముచుండెను.

ఏకవీర భోజనము క్రమముగా తగ్గిపోవుచుండెను ఆమె శారీరకముగా రోజు రోజుకు క్షీణించి పోవుచుండెను. మాంసలములైన యామె నేత్రములు గుంటలు పడినవి. కపోలములయందు రక్తమాంసములు క్షీణించి, పావురాయిపెట్టవలె మృదువై తళతళలాడు నామెవదనము తేనెపట్టూడిపోయిన వృక్షశాఖవలె శోభాహీనమైనది చిక్కిపోయినది. దినదినము సంస్కారములేక యామె కేశములు సంస్కృతములైనపుడు స్నిగ్ధములయ్యు తక్కిన వేళల అరమ్యముగా నుండెను వచ్చిన క్రొత్తలో తల మాయనీయక, వలువ మాయనీయని యా యెలనాగ శ్రద్ధ క్రమముగా వానిపై నుండి యెట్లు తప్పించుకొనగలదు? ఏకవీర మిగుల ధైర్యముకలది. దిటవైన గుండెకలది

ఏకవీర నిలుచుండి చీరకొంగులు చేతితో పిండినది. నీళ్ళు నేల మీద కాలువ గట్టినవి. ఏకవీర యాచీరవిప్పి తలయునొడలు శుభ్రముగా తుడుచుకొని పెట్టె తీసెను. పెట్టెలోనున్న యన్నివస్తువులు తీసి క్రిందబఱచెను. పెండ్లినాడు తన మేనమామ తన కొకచీర పెట్టెను. ఆచీరమీద ఏకవీరకు మిక్కిలి యిష్టము. అది తీసి కట్టుకొన్నది. భూషణములన్నియు నమర్చికొన్నది. నిలువుటద్దము వద్ద నిలుచున్నది తనసౌందర్యమునకు దానే వగచినది? ఏదో భావ మంతలో ఏకవీర మనసులో మెఱుపువలె మెఱసినది. ఏకవీర ప్రక్కనున్న సెజ్జపై బడిపోయినది; ఏడ్చి యేడ్చి నిదురపోయినది.

## ౭

రుద్రమూర్తియై కుట్టాన్ పూలదండ విసరి త్రెంచిన నాటినుండియు నతడు తేల నేకవీరతో నిదురించుటకు పోవుటలేదు. దేహ మస్వస్థతగా నున్నదని చెప్పి, తన గదిలోననే నిద్రించుచున్నాడు.సరిగ పాఠశాలకే పోవుటలేదు వీరభద్రభట్టరునకు కారణము తెలియదు.

వెనుకటి ప్రకరణములో చెప్పినవిషయములు జరిగిన మఱురోజున కుట్టాన్ పగలెల్ల నేమియు తోచక తిరుగులాడి, సాయంకాలమున స్నానముచేసి శుభ్రవస్త్రధారియై సాయంవాహ్యాళిపోయి యింటికి పెందలకడ తిరిగి వచ్చెను. పొద్దు క్రుంకబోవు చున్నది.

చదువుకొనుగదిలో కుట్టాన్ తన సెజ్జపై పండుకొనెను. అతని కన్ను లెఱ్ఱగా నుండెను. కుట్టాన్ కన్ను మూతపడెను మూతపడిన వెంటనే యతని ప్రేయసిమొగము కనంబడి మఱల గానరాకుండెను. కుట్టాన్ కనులు తెరచి మఱల మూసి కొనెను. వీరభూపతి దీనములైన కనులతో తన్ను తన భార్యను ప్రేమించుమని బతిమాలుచున్నట్లే కనబడెను కుట్టాన్ లేచి కూర్చుండెను అతడిట్లాలోచించెను "వీరభూపతి నన్నేల నాభార్యను ప్రేమించు మని యడుగ వలెను? అతనికి నా భార్యకు నేమి సంబంధమున్నది? నేను నాభార్యను ప్రేమించిన నతనికేమి? ప్రేమించకున్న నతనికేమి? నేను నా గృహవిషయము లతని కేల చెప్పితిని? అయ్యో! అంతఃపుర విషయము లతనితో చెప్పునంతటి బుద్ధిహీనుడనైతినే!" కొంచెము సేపు నిశ్చలమైన చూపుతో గవాక్షమునుండి బయటనున్న పోకచెట్ల పంక కుట్టా నొకటేరీతిగా చూచెను అంతలో మఱల శయ్యపై పండుకొనెను. మఱల నతని మనస్సాలోచన చేయ మొదలు పెట్టెను, "వీరభూపతి నాకు మిక్కిలి నెచ్చెలికాడు. చెలికానితో చెప్పగూడని రహస్యము లేముండును? వీరభూపతి కి రహస్యములు చెప్పినందున తప్పేమియు లేదు, అతడు మాత్రమతని రహస్యములు నాతో చెప్పలేదా? అయ్యో! ఎంత దుస్థితిలో నుంటిని? నానీడను చూచుకొని నేనే బెదరు చుంటిని నేను మిత్రుడను గనుక నా క్షేమముగోరినాకు హితము చెప్పెను ఇంతమాత్రమునకు నాభార్యకు, ఆతనికి సంబంధమేల యుండవలెను? మనస్సు మిక్కిలి చెడ్డది దీనికి భావము రావచ్చును, ఈ భావము రారాదు అని లేదు. ఆస్త్రీ మొగము చూడలేకున్నాను. ఆమెతో మాటలాడు టెట్లు? ప్రేమించుటెట్లు?

కుట్టాన్ లేచి వ్రాతబల్లవద్దకు పోయెను. బల్లసొరుగులోనుండి యొక భూర్జపత్రము తీసి కలము, సిరా బుడ్డియు దగ్గర నుంచుకొనెను. ఎవరికో యుత్తరము వ్రాయవలెనని సంకల్పించినాడు ఉత్తరము వ్రాయుట మఱల నంతలో సంక్షేపించి శయ్యపై పోయి పండుకొన్నాడు. కనులు మూసికొన్నాడు అసందర్భములైన భావములు లక్షలు వచ్చెను; ఈపాటున నేను చనిపోయినచో నే మగును? ప్రొద్దుపోవువఱకు నెవరికిని తెలియదు. భోజనము వేళకు వీరభద్రభట్టరు వచ్చును. నన్నుజూచును, కేకలు వేయును. అందఱువత్తురు. రాజుకూడ నన్ను చూచుటకు వచ్చును. రాజుగారి రెండవకుమారుడు తిరుమలనాయకుడు నాకుపరమమిత్రుడు నేను చనిపోయితినని వినినచో నతడేమగునో? ఈ వార్తవిని మాతండ్రియు తల్లియు వత్తురు. మా తల్లి బ్రతుకదు అయ్యో! నేను చనిపోవుటకు కారణమిదియని యెవరికి తెలియగలదు! నాప్రేయసి నేను చనిపోతి ననువార్త వినినచో నేమనుకొనును? ఇప్పటి నాభార్యయేమి చేయును? ఏడ్చునా? ఏడ్వదు. నాకు నామెకు నేమి సంబంధము? అయిన నేమి? జీవితాంతము విధవాత్వ మనుభవించవలదా? కొంత ప్రేమ యుండకపోదు. లేకున్న ఆరాత్రి పూదండ నామెడలో ఏల వేయును?

కుట్టాన్ భావవాహిని యాగలేదు. ఆప్రవాహము ప్రవహించి ప్రవహించి కొంతదూరము పోయి యాగినది కుట్టాన్ లేచి కూర్చుండెను కుట్టాను ప్రాణము నెమ్మది పడినట్లుండెను. వ్రాతబల్లవద్దకు పోయెను ఇట్లు వ్రాయ మొదలిడెను "ప్రాణేశ్వరీ" యని సంబోధించెను. అతని మనస్సభ్యంతర పెట్టెను. అది కొట్టివేసి "కులకామినీ!" అని సంబోధించినాడు. ఆ పత్రము చింపివేసి వేఱొక క్రొత్తపత్రముదీసి దానిపై 'కులకామినీ' సంబోధము వ్రాసినాడు తరువాత తన పూర్వ ప్రేమవిషయము వ్రాసినాడు ఇది యంతయు నెందుకనుకొని పత్రము మఱల చించి వేసెను ఇంటిలో నున్న దానికి లేఖవ్రాయుట యెందులకు అని తోచినది వెళ్లి ఏకవీరతో మాట్లాడుదమనుకున్నాడు మఱల 'ఏమని'యని ప్రశ్నవచ్చినది. ఆలోచన తెగలేదు ఇంతలో తలుపు చప్పుడైనది. అటు చూచినాడు వీరభద్రభట్టరు తలుపు తెరచుకొని లోనికి వచ్చి యొకలేఖ యందించినాడు

**కుట్టాన్**- ఏమిటది? **భట్టర్**- తమునాయనగారి వద్ద నుండి వచ్చినది లేఖ **కుట్టాన్**- ఏమని? **భట్టర్**- చిత్తగించుడు **కుట్టాన్**- మీరు చెప్పుడు **భట్టర్**- తమకు మనస్స్వాస్థ్యము లేకున్నదని వ్రాసితిని. **కుట్టాన్**- ఏలలేదు? **భట్టర్** - కొంచెము జబ్బుగా నున్న దనుచుంటిరిగా, నాల్గునాళ్ళనుండి? **కుట్టాన్** - అవును; లేనిది దేహస్వాస్థ్యము **భట్టర్**- వైద్యులు నాడిలో నే దోషము లేదన్నారు గదా? **కుట్టాన్** - తరువాత! **భట్టర్** - అమ్మగారు "పరమేశ్వర సముద్రము" లో తమ మేనమామగారి యూరిలో నున్నారట మిమ్మచ్చటి కేగి నాల్గురోజు లుండి విశ్రాంతి తీసుకొనిరమ్మన్నారు **కుట్టాన్** - (ఆలోచించినట్లు నటించి) మఱివెళ్ళవలసినచో నెప్పుడు? **భట్టర్**- ఇప్పుడే భోజనము చేసి బండి కట్టించుకొని బయలు దేరినచో ఎల్లుండి తెల్లవారు వఱకు జేరవచ్చును! **కుట్టాన్** - మీరు ప్రయాణమునకు సిద్ధము చేయుడు.

౬

ఆ రోజులలో నెద్దుబండ్లకు నాల్గు చక్రము లుండెడివి రాజశకటము అయినచో, వానిపైని కొపిరెలు కూడనుండును శకటమునికాని, రథమునికాని వానిని వ్యవహరింతురు. రాజశకటములు చూడముచ్చటగా రంగులతోడను, గంటల తోడను వెసంగుచుండును మార్గములు చక్కగా నేర్పడి యుండెను. ప్రధానములైన పెద్దపట్టణములకు మార్గములు శిలానిర్మితము లుండెను. తక్కినచోట్లకు రథ చక్రముల యరవడులచేత కలిగినవే మార్గములు. మార్గములయందు దొంగల భయ మెక్కువగా నుండెను తిరువత్తూరు మధుర కెళ్ళనుముగా నున్నది. పరమేశ్వరసముద్రము తిరువత్తూరు మధురలకు మధ్యనున్నది ఆ రోజులలో ఊరిపేరులకు చివర 'నాడు', 'సముద్రము' 'మంగళము' మొదలగునవి యుండెడివి మధురకు పరమేశ్వరసముద్రమునకు పదునేనామడ యున్నది పదియామడలు దాటిన తరువాత దొంగల భయమున్నది మధుర సమీపములో దొంగలభయము లేదు

మధురలోనుండి యొకప్రొద్దు బయలుదేరి పోవుచున్నాము క్రొత్తవారు పట్టణములోనికి వచ్చినను అధికారులకు తెలియ జేయవలెను దానికి వేఱే యధికారి యేర్పడియుండెను. ఆ సాయంతనముననే వీరభద్రభట్టు అదధికారి సమీపమున కుట్టాన్‌సేతుపతిమహారాజు పరమేశ్వరసముద్రమునకు వెళ్ళుచున్నాడని తెలియజేసెను

ఏకవీర వచ్చిన తరువాత కుట్టాన్ ఎప్పుడెక్కడ పోవలె కిదియే మొదటిసారి ఆమెను గూడ వెంట దీసికొనిపోవుటా, పోకుండుటా యను ప్రశ్న వచ్చినది భట్టు వినయముతో "ప్రభూ ! తీసికొనిపోవుటయే మంచిది" అని చెప్పినాడు. కుట్టాన్ "దారిలో దొంగలు రెండురోజులు ప్రయాణము ఆమెను గూడ తీసికొనివెళ్ళినచో పరివారము, దాసీలు చాలమంది బయలుదేరవలసి వచ్చును నాల్గురోజులకే కింత యెందుకు?" అన్నాడు భట్టు తల యూపినాడు

రాత్రి జామున్నర పొద్దుపోయిన తరువాత ప్రయాణమైనారు అయిదు శకటములు మధ్యశకటములో మెత్తని పడకగా పరుపులు వేసినారు; అందులో కుట్టాన్ ఒక్కడు విశ్రమించినాడు ఈ బండి వెనుక రెండు బండ్లు, ముందు రెండు బండ్లు ఈ నాలుగుబండ్లలోను పండ్రెండుగురు యోధులు కూర్చున్నారు ఈ పదునాలుగురు కాక యిరువదిగురు సైనికులు అశ్వము నెక్కి సాయుధులైనారు అందరికీ తల కుట్టాన్ కుట్టాన్ కుఱ్ఱవాడయ్యు నతని బాహుబలము, వివేకము మధుర రాజ్యములో ప్రఖ్యాతిగాంచినవి ఇట్లు బయలు దేరగనే వీరభద్రభట్టు తక్కిన సేవకులతో అంతఃపురరక్షణార్థ మధురలోనే యున్నాడు బండ్లు కోటతలుపుల వద్దకు పోయినవి కోటతలుపులు మూయబడినవి తలుపులు తెఱువ లేదు దళవాయి యూరలేదుగాన ప్రధాని యాజ్ఞనివ్వవలసి యుండెను ప్రధానియాజ్ఞ లేనిదే కోటతలుపులు బ్రహ్మ వచ్చినను తెఱువరు రాజకుమారుడయినను తీయుట కాజ్ఞలేదు ఒక సేవకుని వీరభద్రభట్టువద్దకు పంపించిరి భట్టురా రాత్రి పోయి ప్రధానినుండి యాజ్ఞ తెచ్చినాడు. కోటతలుపులవద్ద రక్షకసైన్యము మిగుల జాగరూకతతో నిలిచియున్నారు తలుపులు తెఱచిరి అయిదు బండ్లను ఒక్క

నిమిషములో బయటకు పోయెను. వీరభద్రభట్టరుని 'అయ్యా! సెలవు' అన్నమాటలు గభాలున మూయబడిన కోటతలుపుల ధ్వనిలో మునిగిపోయెను. చీకటిలో బండ్లు పోజొచ్చెను.

మెత్తని దూదిపరుపుమీద కుట్టాన్ పండుకొన్నాడు దారి మెత్తగా నున్నది. కుట్టాన్‌కు నిదురపట్టలేదు కుట్టాన్ భావనాశక్తి విజృంభించెను "నేను ప్రేమించిన యువతి యున్న చోటికి మాతండ్రి నేను వెళ్ళుట కిప్పుడెట్లనుమతించినాడు? ఆమె యిప్పు డచ్చట లేదా? లేక యేమగును? భార్యతో సంసారము చేయుచున్నప్పుడు మఱల నట్టిభావము లేల తలపెట్టు ననుకొన్నాడా?.. ఏకవీర యీ మూడు నెలలనుండి యింట నొంటరిగా లేదుకదా? నేను వచ్చి వేసినతరువాత నెట్లుండునో? నేను లేనని యామె యేడ్చునా?. నేను పరమేశ్వర సముద్రమునకు పోయిన తరువాత నా ప్రేయసి కన్పించునా? నాకు కన్పించనీయరేమో? ఆమెకు వివాహమై యామె భర్తయింటికి పోయెనేమో? ఆమెనన్ను వదలిపెట్టి యింకొకని పెండ్లిచేసికొనునా? ఏల చేసికొనదు? నేను చేసికొనలేదా? నే నస్వతంత్రుడనుగదా! ఆమె స్వతంత్రయా?'"
మొదలు తుది లేని యీ యాలోచన తెగ లేదు.

**కుట్టాన్** - ఎంతదూరము వచ్చితిమి ?

**సారథి** - ఒక క్రోశము వచ్చితిమి

**కుట్టాన్** - క్రోశము వచ్చితిమా? నిద్దుర పట్టుటలేదు ఆళ్వారును పిలువుము, కథ యేమైన జెప్పునేమో?

వెనుక బండిలో నున్న యాళ్వారు వచ్చెను బండి వెంటనే నడచుచు చిన్నతనములో తనకు తన నాయనమ్మ చెప్పిన కథలన్నియు చెప్పెను కొంతదూరము పోయిన తరువాత ఆళ్వారునకు తెలియకుండగనే కుట్టాన్ నిదురపోయెను కొంత సేపయిన పిదప ఆళ్వారు తన బండిలోనికి పోయి పండుకొనెను వంతులుగా సేవకులు మేల్కొనియుండిరి తెల్లవారువఱకు శోళాపురము చేరిరి శోళాపురపు చెఱువు కలువల చేతను, తామరల చేతను శోభాయమానముగా నున్నది అందఱును బండ్లుదిగి కాలకృత్యములు తీర్చుకొని మఱల పయనమైరి బండ్లు జాము పొద్దెక్కువఱకు తిరువెంగడపల్లూరు చేరినవి ఆ యూరిలో పాండ్యరాజులు కట్టించిన పెద్ద సత్రములున్నవి మధురనాయకులు - పాండ్యరాజులు చేసిన ధర్మసంస్థలన్నియు జరుపుచుండిరి బండ్లు సత్రము ముందాపిరి సత్రములో నొకగదిలో కుట్టాన్ సామానంతయు చేర్చి యాగదిలో పఱుపులు వేసి సిద్ధముచేసిరి తక్కిన వారు భోజనాదికములు సమకూర్చు పనులమీద నున్నారు

కుట్టాన్ గదిలో తలుపు వేసికొని కూర్చుండి తనపెట్టె దీసి యందుండి యొక చిన్న గంధపుకొయ్యతో చేసిన చిన్నచందుకాయు పెట్టెను తీసెను ఆ పెట్టెలో నాలుగర లున్నవి ఒక యరలో వాడివత్తలైపోయిన మల్లెపూవు లున్నవి రెండవయరలో మన్నున్నది తక్కిన రెండరలలోను కస్తూరి యున్నది వెనుక కుట్టాన్ తన ప్రేయసిని కలిసి కొన్నప్పుడొక రోజున ఉదయమున ఆమెను వెంబడించి వారి యింటివఱకు వెళ్ళెను దారిలో తొందరగా వెళ్ళుచుండుటచేత ఆమె

తలలోని మల్లెపూవులచెండు జారిపడిపోయినది. ఆ చెండు కుట్టాన్ బహు భద్రముగా దాచుకున్నాడు. అవే యా మొదటి యరలోని వాడివత్తలైన మల్లెపూలు! మరొకనాడు సాయంకాలము కుట్టాన్ప్రేయసి దేవాలయములో ముందు పూల తోటలో కూర్చున్నది. ఆమె లేచిపోయిన తరువాత కుట్టాన్ అచ్చోటి దుమ్ము కొంచెము తెచ్చుకొని దాచుకొన్నాడు. అందులో మఱికొంచెము మంచిగంధపుపొడి కలిపి యది రెండవయరలో నుంచినాడు. (ఇట్టి రహస్యములను బయలుపెట్టినందులకు మమ్ములను కుట్టానును, పాఠకులునుకూడ క్షమింతురు గాక!) మూడవది కస్తూరి. కుట్టాన్ తనప్రేయసి కొకనాడు కొంత కస్తూరి పంపించెను. ఆమె యందులో సగముంచుకొని సగము మఱల నతనికి పంపించెను. అది యిది.

కుట్టాన్ పెట్టె కన్నులకద్దుకొని దుమ్ము కొంచెము నొసట నుంచుకొని కస్తూరి పెదవుల కంటించుకొన్నాడు. అతని కనులవెంట నీరుగారి యందులోపడెను.

కుట్టానునకు భోజనము సయించలేదు. కొంచెము పొద్దువాటారిన తోడనే బండ్లుకట్టిరి. ఎండలో పోయిపోయి బండ్లు పొద్దుగ్రుంకు వఱకు తిరుత్తణి చేరినవి. అచట మఱల భోజనములు చేసిరి. ఇంతవఱకు బండ్లు పదియామడ వచ్చినవి. ఇక ముందు దొంగల భయము. రాత్రి పెందలకడనే బండ్లు కట్టిరి. అందఱును జాగరూకతలో నుండిరి.

ఆంధ్రభృత్యవంశము రోజులలోను, చాళుక్యుల కాలములోను దక్షిణ దేశపురాజులు సముద్రపురేవులు, వర్తకము, ఇతర ద్వీపములతోడను దేశములతోడను సంబంధము వదులుకొనలేదు. చాళుక్యులనాడు కూడ తూర్పుసముద్రమును తెలుగులు సముద్రము మీద పోయి యుత్తర ద్వీపములను జయించుచు కూడ వచ్చిరి. తరువాత కాకతీయులనాడు, వారి రాజధాని సముద్రమునకు దూరమై, సముద్రమునకు సంబంధములేని చోట కట్టబడి తత్పూర్వ నౌకాజీవనము బాగుగా కుంటుపడినది. కొండవీటి రెడ్డి కాలమున మఱల వర్తకము విజృంభించినది. శ్రీకృష్ణదేవరాయలవారు కూడ నౌకాజీవనమును గురించి యెక్కువ శ్రద్ధ తీసికొనలేదు. మన శాస్త్రములలోను చతురంగబలములో నౌకలను గలుపలేదు. అందుచేత భారతరాజులు సముద్ర విషయము లెక్కచేయలేదు. వచ్చిన యాపదయు నచ్చటనుండియే వచ్చినది.

మధుర రాజులును సముద్రవర్తకమును గురించి యాలోచించలేదు. రేవులన్నియు పోర్చుగీసువారికిని, ఇతరదేశీయులకును వదలిపెట్టిరి. అందుకని యితర దేశీయులుకూడ మనవారిని తక్కువగా చూచుచుండిరి. ముఖ్యముగా మన రాజు లితర దేశీయులు వచ్చిన తోడనే వారి నతిథి ధర్మ ప్రకారము గౌరవము చేసి వారికి కావలసిన పనులు చేసి పెట్టుట-వారు తిన్నయింటి వాసములు లెక్కపెట్టుట-తటస్థించినది.

ఇతర దేశములనుండి నానాజాతివారును వచ్చి దేశములో అన్ని విధములైన అశాంతి నెలకొల్పుచుండిరి. రేవుపట్టణము లన్నియు మధుర రాజుల చేతిలో లేవు. దొంగలు దేశము మీద దోచుకొని రేవుపట్టణములలో తలదాచుకొందురు. దొంగలెక్కువ భాగము విదేశీయులే. యూరపులో బ్రతుకలేని జనులంతయు వచ్చి

యితర దేశీయుల మీద పడుచుండిరి. అది సరియే! సాహసించి భారతదేశమున తమ మతవ్యాప్తి మొదలు పెట్టిరి. ఇన్ని సంవత్సరములైన తరువాత నైనను దమమతము లెట్టివో, భారతదేశ మతము లెట్టివో తెలిసికొనలేని యితర దేశీయుల యజ్ఞత విచార్యము!

రాత్రి రెండుజాముల పొద్దుపోవు వఱకు బండ్లు పెద్దయడవిగుండ పోవు చుండెను. అందఱును శ్రద్ధగానుండిరి. ఒక పెద్దతటాకము. దానిచుట్టు దట్టముగాచెట్లు అచటి కేగు వఱకు దొంగల గుంపొకటి బండ్లపై పడెను. అందఱును కత్తులు దూసి నిలబడిరి. కుట్టాన్ బండిలో నుండి సింగపు కొదమువలె దూకి దొంగలను నరకెను దొంగలందఱును పాఱిపోయిరి. కత్తిదెబ్బతగిలి యొకడుమాత్రము నేలనుండి లేవలేకయుండెను. "కరదివ్వె" వెలిగించి యాతని జూచిరి సేవకులందఱు 'ఫరంగి', 'ఫరంగి' యని కేకలు వేసిరి అతని కాలుసేతులుకట్టి వెనుక బండిలో నెక్కించిరి ఈ యాలస్యము వలన మఱునాడు పరమేశ్వర సముద్రము చేరువఱకు బండ్లకు పొద్దెక్కినది

౯

తెల్లమనిసి కనబడుటతోడనే పరమేశ్వరప్రజ లొరిగిపోయిరి పరమేశ్వర సముద్రము పల్లెటూరు తిరుపత్తూరుకు పోవు మార్గములో లేకపోయిన, ఈ యూరికి శిలానిర్మితమార్గముండెడిది కాదు తిరుపత్తూరునుండి మధురకో, మధురనుండి తిరుపత్తూరుకో పోవు గుఱ్ఱముల, ఏనుగులనే గుంపులుగుంపులై వచ్చి చూచు పరమేశ్వరసముద్రముజనులు తెల్లవానిని వింతగా చూతు రనుటలో నచ్చెరువులేదు. మూడువందల సంవత్సరములైన తరువాత, ముప్పతిప్పలు పడ్డ తరువాత నిప్పటికే తెల్లమనిసి మొగము క్రొత్త వదలలేదే దేశమునకు! అప్పటికెట్లు వదలును? అందఱు భోజనమున కేగిరి పల్లెలు మాత్రము బండిచుట్టును మూగియే యుండిరి

కుట్టాన్ మేనమామకుమారుడు అతివీరవర్మ అతనికి పాతిక యేండ్లుండును మొగమున రాజకళ తఱుముకొనివచ్చుచున్నది అత మహోత్సాహపురుషుడు తన యింట చావడిలో కూర్చుండి "ప్రొద్దువాటారినది ఫరంగిని దీసి కొనిరం" డన్నాడు తెచ్చిరి ఫరంగి వినయముతో లోనికి వచ్చెను అతివీరవర్మ "యతనికి భోజనము పెట్టించినారా?" యని యడిగెను 'పెట్టించితి' మనిరి "గాయమునకు కట్టుకట్టించిరా" యనెను సేవకులు 'కట్టించితి' మనిరి కూడియుండగనే వెలివెంద కుట్టాన్ మామ యతని గాయము కట్టించెను

అతివీరవర్మ అతనిని "ద్రావిడభాష వచ్చునా" యనియడిగెను అతడు వచ్చునని చెప్పెను. వీరవర్మ- బాధ తగ్గినదా? ఫరంగి- తగ్గినది వీరవర్మ- మీదేశములో నిట్టి వైద్యులున్నారా? ఫరంగి లేరు వీరవర్మ - మీదే దేశము? ఫరంగి - ఇటలీ వీరవర్మ - నీకీ దొంగవృత్తి యందుకు? ఫరంగి మేము క్రైస్తవులము మాపాదిరీ-దక్షిణ హిందూదేశములో దోచుకొనవచ్చును, హిందువులు చాలధనవంతులు, దోచుకొన్నచో దప్పులే దన్నాడు

**వీరవర్మ** - అబద్ధము చెప్పకుము. మీ క్రైస్తవమతము చాలా మంచిదట కదా? మీ మతమును గురించి నీకేమైన దెలియునా? **ఫరంగి** - ఏసు క్రీస్తు రక్షకుడు.

**వీరవర్మ** - మీమతమును గురించి నీకెక్కువ తెలియదు. **ఫరంగి** - తెలియదు. **వీరవర్మ** - ప్రతిమాటకు తలయూపెదవేమి? **ఫరంగి** - తెలియకేమి? తెలియును ఏసుక్రీస్తును నమ్ముకొన్నచో మోక్షము వచ్చును. ఇంక నేమి తెలియ వలెను?

**వీరవర్మ** - మీదేశములో మీ మతమును గురించి నీవలెనే తెలిసినవా రెందరుందురు? **ఫరంగి** - చాలమంది యున్నారు. **వీరవర్మ** - ఈ దేశీయులకు బోధచేయుదు మని వచ్చు వారందరు మీ యందఱకు జెప్పరాదా? ఇక్కడికేల వచ్చెదరు? **ఫరంగి** - తిండికోసము

అందఱును పకాలున నవ్విరి సేవకులు ప్రజలను వెనుకకు త్రోయలేక చచ్చిపోవుచుండిరి వారికి ఫరంగి చేయు నభినయములు, మాటలు నన్నియు చాల చిత్రములుగా నుండెను అతివీరవర్మ యాళ్వారును పిలిచెను ఆళ్వారు వచ్చెను **వీరవర్మ** - ఇతనినేమి చేసెదరు?

**ఆళ్వారు** - మధురకు తీసికొనిపోయి రాజపురుషుల కప్పగించెదను **వీరవర్మ**- పాపము! వదలి పెట్టరాదా?

ఆళ్వారు మాటాడలేదు. మఱునాడు ప్రొద్దుటికి ఫరంగిని వదలి పెట్టిరి అతనికా యూళ్లన్నియు పరిచితములే ఊరి బయటకుబోయి తన వెంటవచ్చిన జనములో "మాదేశము పోయి సైన్యముతోవచ్చి మీ దేశము కొల్లగొట్టెదను జూడు" అన్నాడు పిల్లలు నవ్విరి ఒక పెద్దవాడు 'అవును, దుర్జాతి లక్షణము' అనెను

## ౧౦

కుట్టాన్ తల్లి పేరు మంగమ్మాళ్ ఆమె మొగములో సౌందర్యము, పాతివ్రత్యము, మౌగ్ధ్యము పెనవేసికొన్నవి ఆమె యమిత శాంత మూర్తి

నా డేకాదశి మంగమ్మాళ్ రోజంతయు నుపవాసము చేసినది రాత్రి పిష్టాహారము తిని దొడ్డిలో చాపవేసికొని పండుకొన్నది కాళ్ళవద్ద కుట్టాన్ కూర్చున్నాడు. ఆకు నాకు కదలుట లేదు

**మంగ** - నాయనా! ఏకవీర సురక్షితముగా నున్నదా?

**కుట్టాన్** - ఊ.

ఇది తల్లి తనను వేసిన మొదటి ప్రశ్న ప్రొద్దుటినుండి యతడు తల్లిని చూడలేదు. ఆమె దొడ్డిలో చాప వేసి పండుకొని పుత్రునికై కబురుపంపినది అతడు వచ్చి కూర్చున్నాడు **మంగ**- తల్లిదండ్రులు లెడముగా నున్నారు. ఆమె భారమంతయు మనదే సుమా! చాల సుకుమారి. చదువు కొన్నదట! నీకు తెలిసియే యుండును ఆమెను ప్రేమగా చూతువు గదా! భార్యాభర్తలు, మీకు నేను చెప్పవలయునా! నీవన్న నామెకు ప్రేమయే కదా! కుట్టాన్ లజ్జావనతుడై "ప్రేమయే" అన్నాడు ఈ మాట కుట్టాన్ నోటినుండి యతనికి తెలియకుండ వచ్చినది. కుట్టాన్ తనలో "ఆమెకు నేనన్న ప్రేమయున్నదా!" అనుకున్నాడు పూలదండసంగతి జ్ఞాపకము వచ్చినది

కుట్టాన్ ప్రసంగము మార్పదలచుకొని "అమ్మగారూ! మీరిచ్చటికి వచ్చి యెన్నాళ్ళయినది? రామనాథములో నాయనగారెట్లున్నది తెలియుట లేదు. వీరభద్ర భట్టరుగా రుత్తరములు నాకు చూపించక కబురులు మాత్రము చెప్పుదురు" రన్నాడు.

**మంగ**- నీవు మాకొక్కడవే బిడ్డవు తండ్రీ! నీకు చెప్పకూడని రహస్యములేముండును నీ తండ్రికి? నీ వట్లనుకొన్నచో నడుగుము. భట్టరుగారు నీకుత్తరములు చూపించెద రనుకొందును

**కుట్టాన్**- అమ్మా! అదికాదు నా ఉద్దేశ్యము మీ క్షేమము తెలియుట లేదనియే నిన్ను చూడకుండ నేనుండలేను.

అకారణముగ మహావీరుడైన కుట్టాన్ కనులవెంట నీరు కారెను. ఒక బొట్టు మంగమ్మాళ్ పాదములపై బడెను. మంగమ్మాళ్ గ్రహించెను. లేచి కూర్చుని కుమారుని కౌగిలించికొని చెక్కిలిపై ముద్దిడుకొనెను. కుట్టాన్ హృదయ మతని తల్లి యెడ అతికోమలమే కాని, యిప్పటి యతని యీ బాష్పములు పూర్తిగా తనతల్లి యెడలగల ప్రేమచేతనే వచ్చిన వనుటకు వీలులేదు. కుట్టాన్ తన వంచితప్రేమ తలంచుకొని తలంచుకొని దీనుడై పోయినాడు. ఆ దీనతయే యీ మాటలలోను వ్యాపించినది. మంగమ్మాళ్ కౌగిలి విడలేదు.

**కుట్టాన్**- అమ్మా! గాలి లేదు; విసరుదునా?

**మంగ** - తండ్రీ! పుట్టి ఏకవీరను గూడ తీసికొనిరాక పోయితివా? పిల్లను గూడ చూచెడిదానను. ఏమైన చిక్కినదా?

**కుట్టాన్** - ప్రయాణము కష్టమని తీసికొని రాలేదు

కోడలిని గూర్చి కుమారు డుత్సాహముగా మాటలాడుట లేదని మంగమ్మాళ్ గ్రహించినది. యథార్థము పుత్రుని నుండి లాగవలయునని తలచినది.

**మంగ** - నాయనా! ఏకవీర నీ మాటలకు సమాధానము చెప్పునా? నీవు పలుకరించిన మాటాడునా!

సమాధానమేమి చెప్పవలయునో కుట్టాన్‌కు తెలియలేదు.

**మంగ**- నాయనా! మీరిద్దరును సుఖముగా నుండిన చూచుటకన్న మాకేమి కావలయును! నాకు నలువది దాటినవి ఇంకెన్నాళ్ళు బ్రతుకుదును! నీకిద్దరున నొకనాయు దానితో మాని పోయెదను- కుట్టాన్ కంఠములో ఆపరాని శోకముండ గట్టి గిరగిర తిరిగినది.

**మంగ** - నాతో చెప్పవచ్చును తండ్రీ! చెప్పుము. మీరు సుఖముగా నున్నారా, చెప్పుము

కుట్టాన్ గొంతుకనుండి మాట పెకల్చుకొని, "సుఖముగానే యున్నాము అమ్మా! అట్లడుగుట ఏల" యన్నాడు.

తల్లిని విడిచి పెట్టిన తరువాత కుట్టాన్ మేడమీదికి పోయి పండుకొన్నాడు. పండుకొన్నప్పటినుండియు నాతని యాలోచనాలంబనము ఏకవీరను ప్రేమించు మనుచున్నారు. వీరభూపతి యదేమాట! ఇచ్చటకు వచ్చిన తల్లియు నదేమాట. ఇందులో నేదో రహస్యమున్నది. నేను ప్రేమించిన స్త్రీని విడిచిపెట్టి బలవంతముగా నా

మెడకు కట్టిన స్త్రీనా ప్రేమించవలెె? నాకర్థమగుట లేదు. ప్రేమించుట ప్రేమించకపోవుట యనునది నా స్వాధీనములో నున్నదా? ఎవరి స్వాధీనములో నున్నది? భగవంతుని స్వాధీనములోనున్నది. ఏ భగవంతుడి స్వాధీనములో నిది యున్నదో యా భగవంతుడు నాకీ స్త్రీని తెచ్చి పెండ్లి చేసెను గదా! భగవంతుడు కాదు. నా తండ్రి చేసినాడు. భగవంతుని యిచ్ఛ లేనిదే నాతండ్రి యెవరు చేయుటకు? ఈ స్త్రీకిని, నాకును సంబంధ మేమున్నది? ఏమియు లేకున్న మేమిరువురము భార్యాభర్తలుగా చేయబడుట యెట్లు? పూర్వజన్మలలో నేసంబంధమున్నదో? . . .

భావనాసోపానములలో నే సోపానముమీదనో కుట్టాన్ నిదురించినాడు తెల్లవారినది. ప్రాకృతి యనంతకాలమునుండి ప్రతి యుదయమున నెట్లు ప్రకాశించుచున్నదో యట్లే నేడును, బాలసూర్యుని యరుణబింబము మొగమున కుంకుమ బొట్టుగా దిద్దికొని ముసలి ముత్తైదువ వలె ప్రకాశించినది ఆమె మంజీర ధ్వనుల వలెనే పక్షుల కలకలధ్వనులును తోచినవి. నిదుర మేల్కాంచి కాలకృత్యములను తీర్చుకొని పుణ్యస్త్రీలు గోమయంబులకై పొరుగింటి గోస్వామి గృహములకు పోవుచుండిరి నాగళ్ళుకట్టి కాపు లాకుమళ్ళు దున్నుటకై పోవుచున్నారు ఆబాలలో సాబాలునకై బుడుతలు చిన్ని చెంబులు పూని పాలుతీయు తండ్రులకు దగ్గరగా నిలుచున్నారు కొందఱు పిఱుతుక, ఓంటిముంగిటుల రంగవల్లులు తీర్చు తల్లుల పయ్యెద కొంగులు పూని యేడ్చుచుండగా తల్లులు వారిని వీపులపై పండుకొనబెట్టుకొని రంగవల్లులు తీర్చుచున్నారు పాలుపితుకు చుండగా గృహస్వామి దూరముగా కట్టివేసిన యాదూడలు పలుపులు మెడ నొరసికొనగా తల్లిపొదుగుల దగ్గరకు మెడలు చాచగా పెనగులాడుచుండెను పరమేశ్వర సముద్రము వల్లెటూరుగాన ప్రాతఃకాలమున ఇంత యందముగా నుండెను కుట్టాన్ నిద్రలేచుట తోడనే పుణ్యస్త్రీల ముఖారవిందములు తోచినవి కుట్టాన్ కాలకృత్యములు నిర్వర్తించు కొనెను వచ్చినప్పటినుండియు కుట్టాను తన ప్రియురాలిని చూడవలయుననియే ప్రయత్నము చేయుచున్నాడు నేడు పొద్దున లేచిన తోడనే యతనికాభావ మంతపడిగా నున్నట్టులేదు అతని భావించుచున్నట్టు ఏకవీర యేమి చేయుచున్నదోయని పోయినది తనకు తెలియకుండ నేకవీర తన హృదయములో నింతదూరమెట్లువచ్చిన దని యచ్చెరువైనది కుట్టానునకు కుట్టాను తన ప్రేయసి యింటికి పోద మనుకొన్నాడు. బాగుండదేమో యని సందేహించినాడు ఊరకే చూచినచో నేమి తప్పేమున్నదని నిశ్చయించుకొన్నాడు అప్పటికి కొంచెము పొద్దెక్కినది

కుట్టాన్ వారియింటికి వెళ్ళుసరికి మీనాక్షి నిన్న సాయంతనము బద్ధకముచేత దండగ్రుచ్చకుండ నిదురపోయిన మల్లెపూలు, బాగుగా విడిపోయినవి. చావడిలో గూర్చుండి దండ గ్రుచ్చుచున్నది. కుట్టాన్ నేడు మఱల ఆమె యందము చూచి గుండె చెదరిపోయినాడు మీనాక్షి తన ప్రియుని చూచినది. చేతిలోనున్న దండవదలి పెట్టి సబాహ్యమైయై యింటిలోనికి పోయినది. మీనాక్షి తల్లి వచ్చి, 'ఓహో సేతుపతీ! నాయనా! ఎప్పుడు వచ్చితివి?' అని చాప తెచ్చి వఱచినది కుట్టాన్

అవనతవదనుడై యాసీనుడైనాడు. మీనాక్షి తల్లి 'నీభార్య క్షేమముగనున్నదా? నీ పెండ్లికి మమ్ము పిలిచితివెనగాదు పేదవారము మమ్మెందుకు పిలిచెదవులే యన్నది. ఆ భాగ్యశాలినికి ఈ మాటలు కుట్టాన్ హృదయములో పరశుఘాతము లగునని యేమి తెలియును? ఆమె మరల, "మా మీనాక్షికి మంచి సంబంధమెక్కడైనను చూచి పెట్టుము తండ్రీ! నీవు తలచుకున్నచో నది యెంత సేపు? వెదకి వెదకి వారిపని యగుచున్నది. వారూరిలో లేరు సంబంధము కొఱకే వెళ్ళినారు రాజపల్లిపురము కావలయును పోయినది" అన్నది కుట్టాన్ బుద్ధి పరిభ్రమించుచున్నది చివరి మాట లతనికి వినబడుటలేదు... "రేపు మాఘమాసములో నెట్లయినను పెండ్లి చేసితీరవలెను. ఇప్పటికే చాల కాలము దాటిపోయినది నీవే మాకల్లుండవు కావలసినది మే మంత నోము నోచుకొనవలదా? అందని మ్రానిపండ్ల కఱ్ఱులు చాచు టని" యన్న దామె మరల. కుట్టాన్ వంచిన తల యెత్తలేదు. మీనాక్షి తల్లి యమాయిక హృదయ! భారత దేశములో నిట్టి పిచ్చితల్లులెంతమంది ! కొంత సేపయినతరువాత కుట్టాన్ లేచి నిలబడెను నాల్గు వంకల చూచెను. మీనాక్షి తన కెక్కడను కన్పించలేదు. అడుగులు లెక్కపెట్టుచు కుట్టాన్ బయటికి వచ్చెను ఆ నాడు సాయంతనమే తన తల్లివద్ద సెలవుతీసుకొని కుట్టాన్ మదురకు ప్రయాణమై పోయినాడు

౧౧

మదురకు కుట్టాన్ చతుర్దశి యుదయమునకు చేరెను ఆ నాడు చతుర్దశి [illegible] అప్పుడే సూర్యోదయ [illegible]

కుట్టాన్ బండి దిగిన వెంటనే యంతఃపురమునకు పోయెను ఏకవీర పడకగదిలో కుట్టాన్ మంచముపై శయనించి యేదో యాలోచించుకొను చుండెను కుట్టాన్ వచ్చిన వెంటనే మంచము దిగి, పట్టు [illegible]తో [illegible] కుట్టాన్ పాదములకు [illegible] తడితడిగా తన చీరకొంగు పెట్టి యాపాదములు తుడిచెను. కుట్టానికి యింతకు పూర్వమైన, ఆమెను విసరి కొట్టెడు వాడే కాని యిప్పుడేమియు [illegible] ఏకవీర [illegible] అవనత వదన కాని యామె చెక్కిళ్ళ నుండి యెంత సేపటినుండియో సంతతధారగా బాష్పములు ప్రవహించుచున్నవని కుట్టానునకు ఆమె పాదము చూచిన వెంటనే తెలిసినది

కుట్టాన్ కొంచెము సేపాగి "ఏకవీరా" యని సంబోధించినాడు వివాహమైన తరువాత నాల్గునెలలలో కుట్టాన్ ఆమెను సంబోధించుట యిదియే మొదటిసారి ఆ మాట వినిన తోడనే, యామె మేఘగర్జనము విన్న రాజహంసవలె వణకి నేలపై పడిపోయినది ఆమె యొడలు [illegible] మైనది [illegible] కదలిన కదలికవలె యామె నిలువెల్ల వణకిపోయినది ఆజానుదీర్ఘములై పారిజాతశాఖల [illegible] స్కంధములకు కులస్తంభములైన తనచేతులతో కుట్టాన్ ఏకవీరను నేలపై నుండి లేవదీసి తన యెదుటకొమ్మున కదుముకొనెను

ఏకవీర మహానంద సముద్రములో తేలిపోయినది కౌగిలి సడలి పెట్టి కుట్టాన్ నిశ్చలముగ నిలుచుండి ఏకవీర మోముపై దృష్టినిలిపి యిట్లు మొదలు పెట్టినాడు–

"ఏకవీరా! ఇన్నిట్లు నేను సంబోధించిననే నీవు మహానంద మనుభవించితివని నేను గ్రహించితిని. నిన్ను నేను కౌగిలించుకొనిన నీవు చెందిన పారవశ్యమును చూచితిని. నీవు నన్నింత ప్రేమించుచుంటి వని యిదివఱకు నాకు తెలియదు. ఏదో లోక సహజముగా ప్రేమించుచుంటి వనుకొంటిని గాని, యింతగానని తెలియదు. ఇంతకు నీ వెంత మంచిదానవో నేనంత మంచివాడను కాను. నీవు నాయెడ చూపించుచున్న ప్రేమలో వేయగు భాగమైన నీయెడ నేను ప్రేమ చూపించుట లేదు. నేను చూపించలేకున్నాను! నిన్ను నేను ఏకవీరా యని పిలిచినది ప్రేమచేత కాదు. మనమిరువురమును ఈజన్మలో ఇట్లొకయెడకు త్రోయబడినాము. నీయెడ నాకెట్టి భావమును లేదు. కాని యొకమాట! ఈజన్మకు మనమిర్వురమును భార్యాభర్తలమైనాము; నేను కష్టపడి నిన్ను ప్రేమించుటకు ప్రయత్నించెదను ఆ ప్రయత్న మెన్నాళ్లు పట్టునో నేను చెప్పలేకున్నాను. నెల యయిన దాటక మునుపే నిన్ను ప్రేమించ వచ్చును. కాదా, పది సంవత్సరములు పట్టవచ్చును. నేను నిన్ను ప్రేమించక పోయినను, ప్రేమించినను నీవే నాకు భార్యవు ఈ గొంతులో ప్రాణమున్నంత వఱ కీ శరీరమన్యాదత్తము చేయను. నీకు వాగ్దానము చేయుచున్నాను. ఈ మాటల వలన నీకు ప్రయోజనము లేదు కాని నీకు నాప్రేమను గుఱించి యనుమానముండ వచ్చును గాని, నాధర్మ వర్తనమును గూర్చి యనుమానపడవద్దని చెప్పుచున్నాను. నీప్రేమ నాయెడ లేనపుడు నీధర్మమును గుఱించి నా కేల యందువా? అది కాదు. నీయెడ నేను ప్రేమ సాధించెదనని చెప్పుచున్నాను నాయందు దయయు, నమ్మకము నుంచుము.

"ఇంతకు కారణము చెప్పెద వినుము. మా మేనమామల యూరు పరమేశ్వర సముద్రమని యెఱుగుదువు గదా మన వివాహమునకు పూర్వ మా యూరిలో మామామగారి యింటి దగ్గరగా నొక యిల్లున్నది వారు పేదవారు మీయంతగాని మాయంతగాని ధనవంతులు కానేకారు వారి కొక కుమార్తె యున్నది ఆమె పేరు మీనాక్షి ఆమెను నేనును, నన్నామెయును ప్రేమించితిమి నాయిష్టమునకు వ్యతిరేకముగానే నాకు నిన్ను వివాహము చేసిరి నేను మొన్న వెళ్ళినది పరమేశ్వరసముద్రమునకే! ఆమెకు వివాహము కాబోవు చున్నది దైవ చిత్రము! మనమేమి చేయగల్గుదుము? ఆమె మీద నాకున్న ప్రేమను పూర్తిగా నాశనము చేసెదను అప్పుడు నీమీద ప్రేమ పెంచెదను నీవేమియు ననుకొనకుము ఈ రహస్యములు నీకు చెప్పకుండరాదనిపించినది. చెప్పితిని ఎవరి యెడల నెవరికి ప్రేమ యున్నదో యెట్లు తెలియును? నీవు నన్నింతగా ప్రేమించుటచేత ననుకొనుచున్నాను- నీవు నన్నే ప్రేమించితివని. ఇదివర కెవ్వని యెడనైన నీ ప్రేమ ప్రవహించెన యేని యీ మన వివాహము నీ కెంత కష్టముగా నుండును? నాస్థితి యట్లే యనుకొనుము."

ఏకవీర కన్నులలో పిచ్చిచూపు లేర్పడినవి ఏకవీర నిలుచుండ లేకపోయినది. కుట్టానిది గ్రహించి యామెను నెమ్మదిగా మంచముపైని పరుండబెట్టి చెంబులోని నీర యామె మోమున చిలుకరించి పై యుత్తరీయముతో విసరినాడు ఆమె శిరస్సు తన తొడపై నిడుకొన్నాడు. ఇదంతయు కుట్టాన్ నిర్వ్యాజముగ చేసినపని. ఏకవీరకు

తెలివి వచ్చినది. కన్నులు తెఱచి చూచుసరికి తన తల కుట్టాన్ తొడపై నున్నది తొందరగా లేచి ఏకవీర మంచము దిగబోయినది కుట్టాన్ ఆమెను కూర్చుండబెట్టినాడు. మరల నిట్లన్నాడు- "నాకొక మిత్రుడున్నాడు. అతని పేరు వీరభూపతి అతడు మనయింటికి తఱచుగా వచ్చుచుండును అంతఃపురములో నున్న నీవతనిని చూచుటకు వీలులేదు. అతడు చాల మంచివాడు. నాయీ సంగతి యంతయు నతనికి తెలియును. అతడు చెప్పినాడు-నాకు మీనాక్షిపైగల ప్రేమయంతయు నీపైకి త్రిప్పుమని-నాకీ భావము కలిగించినది యతడే. అతని యెడ నే నెంతయు కృతజ్ఞుడను"

ఏకవీరకు వీరభూపతి యెవరో యెట్లు తెలియును? కుట్టాన్ తన స్నేహితుడని చెప్పుచున్నాడు కుట్టాన్ ఆగి మఱల చెప్పుచున్నాడు; "ఏకవీరా! నే చెప్పవలసినదంతయు చెప్పితిని ఇంకేమి చెప్పు మనెదవు? నీ యెడల నాకు కోపముగాని, ద్వేషముగాని లేదు నీతో నాకు మాటలాడుటకును సందేహము లేదు ఇంటిలో నందఱితోడను నెట్లు మాట్లాడుదునో యట్లే నీతోడను మాటలాడెదను నాదొకటే ప్రార్థన. నాయందు నీకిప్పుడెంత ప్రేమయున్నదో యా ప్రేమ తగ్గనీయకుము ఏకవీరా! నామాటలు చాల కఠినములుగా నున్న వనుకొనియెదను. ఏమందువు?"

ఏకవీర తన రెండు చేతులు కుట్టాను మెడచుట్టు వేసి తల యతని భుజముల మీద వాల్చి "యిప్పుడే ప్రేమించుము-ఇప్పుడే ప్రేమించుము" అని యేడ్చినది ఏకవీర యా మాట లెందుకన్నదో యామెకే తెలియదు ఊరుకున్న బాగుండెడిది యని తరువాత మనస్సులో ననుకొన్నది కుట్టాన్- నా చేత నగుట లేదు ఏమి చేయమందువు? క్షమింపుము అయినను నీ కేమి లోపమున్నది? నీతో మాటాడుదును ఎవరికిని మననిజస్థితి తెలియుటకు వీలులేదు

కుట్టాన్ అంతకంతకు నిశ్చలుడై పోయినాడు అతని కనులలో నుండి బాష్పములు పోయినవి పలుకులంతకంతకు కఠినములాయెను అతడు లేచి ద్వారము వఱకు వెడలినాడు ఏకవీరపోవుచున్న యతని యడుగుల నైశ్చల్యము చూచినది మాటాడలేదు అతడు ద్వారము వఱకు పోయి, తలుపు తెఱచి బయటికి పో బోయినాడు కాలాడలేదు వెనుక తిరిగి చూచినాడు ఏకవీర పోయి యతని రెండుచేతులను పట్టుకొన్నది ఏకవీర కన్నుల వెంట బాష్పము లోడుగట్టెను అతడు "ఏకా! చెప్పితిని గదా! నీవద్దకు వచ్చినపుడు పరిశుద్ధమైన హృదయముతో వచ్చెదను అచ్ఛమైన ప్రేమ కోరదగినదానవు వ్యామోహమునకై వాంఛించెద వెందుకు?" అని గడపదాటి పోయినాడు

ఏకవీర మంచముపై పడిపోయినది ఆమె హృదయములో "అరంజే విరుంబు-అరంజేవిరుంబు" అను ధ్వని మ్రోగు చున్నది

౧౨

కుట్టాన్ భోజనము చేసి తన గదిలోనికి పోయి యొక భూర్జపత్రము తీసి దానిపై పరాభవనామసంవత్సర వైశాఖ బ ౧౪ అని వ్రాసినాడు ఆ యాకు మంచి

గంధపు చందుకాయ పెట్టెలో పూర్వము తాను మీనాక్షి ప్రేమచిహ్నములు దాచిన దానిలో దాచినాడు.

నాడమావాస్య యగుటవలన పాఠశాలకు సెలవు. ఏమియు తోచలేదు. బండి కట్టించుకొని వీరభూపతి యింటికి వెళ్ళినాడు. వీరభూపతి ఇంటివద్దలేడు. రాజపల్లిపురమేగినాడట! వీరభూపతి, ప్రక్కనున్న యింటిలో నొక యుత్తర మిచ్చి పోయినాడు. అందులో వీరభూపతి, తనతండ్రి యుత్తరము వ్రాసెనని యు, వివాహమునకువలె తోచుచున్న దనియు, ఎట్లయినను ఐదారు నెలలవఱకు మఱలవచ్చుటకు వీలులేదనియు, జ్ఞాపకముంచుకొనవలెననియు వ్రాసియున్నాడు. మిత్రవియోగము సేతుపతికి దుర్భర మనిపించినది. కుట్టాన్ ఇంటికి పోయినాడు తన గదిలో పుస్తకములన్నియు సర్దినాడు. ఎంత సేపటికి పొద్దుపోలేదు పండుకొని నిదురకై ప్రయత్నించినాడు నిదురరాలేదు కొంత కాలమైన తరువాత లేచి స్నానము చేసి యల్పాహారమును తీసికొన్నాడు. పొద్దు వాటారినది

కుట్టాన్ పూలతోటలో తిరుగబోయి నిత్యపరిపోషణము చేత నిండుగా వికసించి యున్న పూదోటలోకూడ ఆనందము కన్పించక, తిరుమలనాయకుని చూచి వత్తునని పోయెను.

పొద్దుక్రుంకవచ్చినది. ఏకవీర పైదోటలోనికి పోయినది పెంపుడు లేడి వెంటవచ్చినది ఎఱ్ఱగన్నేరు మొగ్గలు త్రుంచి యేకవీర లేడిపిల్ల కందించెను అది రెండు కొఱికి తలయాడించికొనుచు దూరము పోయినది. ఏకవీర దోసిలిలోనున్న తక్కిన మొగ్గలు నేలపై పోసినది ఏకవీర మంచి పనినేరుపరి పూమాలలు నిర్మించుటలో ఆమెశక్తి యనన్యసాధ్యము గన్నేరులు, మందారులు, మల్లెలు, జాజులు కోసి యామె యొక దండ గుచ్చినది ఆ దండచిత్ర మేకవీరకే తెలియును దండ యిటు లాగినచో చిన్నది, యటు లాగినచో పెద్దది యగును చిన్నదైనప్పుడు జాజులు, మల్లెలు ఎడమై మందారలను, గన్నేరులను మూసివేయును పెద్దదిగా నున్నప్పుడన్ని పూలు కనబడును దండ సన్నగా నుండును ఈ దండ నెవ్వరికి చూపించకుండ ఏకవీర తీసికొనిపోయి తన గదిలో దాచుకొనెను ఆనాడు ఏకవీర చిత్రముగా నున్నది మొగము తొల్లిటివలె మిక్కిలి ప్రకాశించను లేదు, శోకము చేత కలుషితముగాను లేదు. ఆమె పుష్యమాసపు నదివలె పుష్టయుకాక, కృశయుకాక-యొండు చేత గోధుమపన్నె గలదియుకాక, కొబ్బరిసీళ్ళవలె సతిశబలయుకాక, యప్పుడే వికసించి సంపూర్ణ శోభతో జెలువారని, పూర్తిగా వడిలిపోయి శోభాహీనము కాని నవమల్లికవలె ప్రకాశించినది. ఆమె నిటాలమున కస్తూరిబొట్టు సెగకన్నుగా, తలపై రావిరేక చంద్రవంకగా, నిటాల స్వేదబిందువు శిరస్థగాంగయిరమ్మొ చెమ్మగా ఆమె పార్వతివలె ప్రకాశించినది

పొద్దుగ్రుంకినది. వైగై పులినముల నుండి తిరిగి వచ్చిన కుట్టాన్ భోజనము చేసి రాత్రి చాల పొద్దుపోవువఱకు నేదియో చదువుకొను చుండెను రాత్రి జామున్నర యైనది. ఏకవీర యొకదాసిని పిలిచి మహారాజును నేను పిలుచుచుంటినని చెప్పుము అన్నది అది బయటకు వచ్చి యందఱు దాసిలలో కలవరము కలిగించినది పొద్దున

స్వామి పరమేశ్వరసముద్రము నుండి వచ్చిన వెంటనే యంతఃపురములోనికి పోయెను. ఇప్పుడే వర్తమానము! అందఱు నాశ్చర్యపోయిరి. ఇదివఱకు వారనుకొనినవన్నియు అయదార్థములా యేమి? భార్యాభర్తలకు చాల అన్యోన్యమున్నదివలె నున్నది! మొన్న దండ చీలికలై నేలపై నుంట యేమి! దానికి ప్రణయ కోపార్థములు కల్పింపబడినవి.

పనికత్తె కుట్టాన్ గది వద్దకు పోయి నిలబడినది. కుట్టాన్ తలుపు కదలికవిని 'ఎవరువారు?' అన్నాడు. దాసి "బాబూ! అమ్మగారు- రమ్మనుచున్నారు" అన్నది. కుట్టాన్ మఱుమాటాడలేదు. పుస్తకము మూసి యంతఃపురములోనికి పోయినాడు. అతడు పోయినదారి యంతయు ప్రశస్తమైన కస్తూరికావాసనలు గుమగుమలాడినవి. అంతఃపురసేవకురాండ్రు నిస్తబ్ధలు, ఆశ్చర్యలైపోయినారు. రాతిరి రెండుజాము లయినది. గదిముందు పండుకొన్న బాలసారంగి కనులు మూసికొని నడుమనడుమ నెమరు వేయుచు నిదుర పోవుచున్నది.

కుట్టాన్ పోయి గదిలో మంచముపై కూర్చున్నాడు. ఏకవీర నిలుచుండి తలవంచుకొని పూలదండ తీసి దీర్ఘమును సన్నదియు నైన మాల నొక సూత్రాకర్షణము చేత హ్రస్వమును చిక్కనయు చేసి మఱల దీర్ఘీకరించి యతనివంక తలయెత్తి భావాభిరామముగ చూచెను.

కుట్టాన్- ఇది యెవరు కూర్చిరి?

ఏకవీర కనులలో ఆమెయే యది కూర్చినదని స్పష్టమైనది. ఏకవీర మాలను హ్రస్వీకరించి కుట్టాన్ మెడలో వేసెను. కుట్టాన్ బాగున్నదని కుడి చేతితో దానిని మెడలో సర్దుకొనెను. వ్యతిరేకసూత్ర మజ్ఞాతముగా చేతికి తగిలి సూత్రము పొడుగైపోయెను. జాజులు, మల్లెలు, గన్నేరులు మందారలు విడివిడిగా నయిపోయినవి. ఇరువురు వేఱవేఱ శయ్యపై నిదురించినారు. రాతిరి చాల పొద్దుపోవు నటకు నిదుర లేమి ఆరక్తమంజులములైన విశాల నేత్రములతో, దీర్ఘ నవీన పుష్పమాలికాలంకృత వక్షఃస్థలముతో బయటికివచ్చిన కుట్టాన్ ప్రభువును చూచి యందఱు పనికత్తెలు చకితనేత్రలు, సస్మితాస్యలు, లజ్జా పరిహాసావరలు, సంభ్రమచిత్తమూర్తులు నైనారు. ఉద్దేశపూర్వకకృత కృతక మందహాసానాంచల ఏకవీర, వారిని మఱింత కలవర పెట్టినది. అసంస్కృతభావులు వా రామెయొగమును నిగూఢవిచారముద్ర తెలియజాలరైరి. రోజులు గడచుచున్నవి. నెలలు దాటిపోవుచున్నవి. ఋతువులు వెనుదిరుగుచున్నవి. కుట్టానులో మార్పులేదు. రోజులు గడచిన కొలది ఏకవీర యొడలినుండి యొక్కొక్క నగ యుత్సర్జించుచున్నది. కొన్నాళ్ళకామె మెడలో మంగళ సూత్రము, నల్లపూసలు తక్క నేమియు మిగులవేమో! ఏకవీర యంతంతకు కృశించు దేహ యగుచున్నది. పాలిపోయి యామె దేహము తెల్లబడుచున్నది. కనులు సగము మూతలుపడి క్రొత్తయందము విరజిమ్ముచున్నది. కుట్టాన్ దినదినము మంచి గంధపుచందురకాయ పెట్టె తీయును. దాని వంక నూరకే చూచును. ఆ భూర్జపత్రము మీద తాను వ్రాసినది చదువును. రోజులు లెక్కవేసికొనును. తన హృదయమును పరీక్షించుకొనును. మార్పేమియు లేదు. తన పెట్టెలో నుంచి యేదైన పుస్తకము తీసి చదువును. పాఠశాలకు పోవును. సాయంతనముల యందు వైగై యిసుక తిన్నెలమీద నొంటిగా

కూర్చుండును. పొద్దుగ్రుంకిన వెంటనే యింటికి వచ్చును. మనస్సు పరమేశ్వరపముద్రములో, దేహము మధురలో. ఏకవీర కనంబడినపు డేదియో పలుకరించును. అది యూరకే పలుకరించవలెనని పలుకరించినట్లు, కనంబడుచునే యుండును.

౧౩

తిరుమలనాయకు డెంతమిత్రుడైనను రాజకుమారుడు స్నేహితుడైన నేమి కుట్టాన్ కన్న గొప్పవాడు అతనితో మైత్రి యుండవచ్చును గాని పరస్పర హృదయావేదనలు బయల్పఱచుకొనుటకు వీలులేదు. పగలెల్ల అతనితో కాలము గడపుటకును వీలులేదు ఏకవీర యిట్లున్నది అతనికి నామెకు నేమి సంబంధము? స్నేహితునివలె మాటలాడునా? హృదయప్రేమ పంచుకొనునా? అందుచేత కుట్టానునకు రోజులు గడువలేదు తెల్లవారినది మొదలు పొద్దు గ్రుంకుట యెట్లు? దినము లంతంతకు దుర్భరము లైపోయినవి.

కుట్టాన్ మఱల వీరభూపతి మధురకు వచ్చినచో బాగుండుననుకొన్నాడు తనకేమి? దళవాయికుమారుడు తిరుమలనాయకుని మిత్రుడు సంపూర్ణ ప్రయత్నము చేసినాడు స్థానాపతి మాఘమాసములో చనిపోయినాడు స్థానాపతియు, కణక్కమును పారంపర్యముగా వచ్చు ఉద్యోగములు కావు అందుచేత ఆ స్థానమునకు వీరభూపతికై కుట్టాన్ ప్రయత్నించి సాధించినాడు క్రొత్తలెక్కలు చైత్రమాసములో ప్రారంభమగును వీరభూపతి యప్పటికి వచ్చి యుద్యోగములో ప్రవేశింపవలెను కుట్టాన్ వీరభూపతికి తెలియజేసినాడు. మాఘమాసములో వీరభూపతికి వివాహమయినది వివాహములోననే యీ యుద్యోగ వార్తయు చేరినది అందుచేత వీరభూపతికి మంచి రోజులు వచ్చినవన్నారు వివాహము మహోత్సవముగా జరిగినది స్థానాపతియధికారము రాజ్యములో ప్రధానోద్యోగములలో నొకటి దానికి వేతనము సంవత్సరమునకు పదివేల పన్నులు "పన్ను" అనునది మధురనాయకుల కాలములో వాడబడు బంగారునాణెము పేరు. చైత్రము దరిసిన కొలది కుట్టానునకు ప్రాణములు చేరుకున్నవి. వీరభూపతి వచ్చును

వీరభూపతి వచ్చినాడు ఉద్యోగములో ప్రవేశించినాడు వీరభూపతికి పెద్ద సౌధమొక టొసంగబడినది అతడందులో ప్రవేశించినాడు చైత్రములో మీనాక్షీదేవి కళ్యాణమైనది వైశాఖము శుక్లపక్ష మైపోయినది వీరభూపతి భార్యను మధురకు తీసికొని వచ్చిరి. కృష్ణపాడ్యమి ప్రయాణమునకు మంచిది అరోజున బయలుదేరదీసి స్థానాపతి భార్యను తదియ నాటికి మధురకు తీసికొని వచ్చిరి ఆమె మధురలోననే యున్నది పూర్వపు స్థానాపతి మాఘములో పోయినాడు మాఘ ఫాల్గుణముల లెక్కలు పేరుకొన్నవి వీరభూపతికి చైత్రవైశాఖముల పని బరువైపోయినది వైశాఖాంతమునకు పని కొంచెము తెలిపి యిచ్చినది వీరభూపతి వచ్చిన క్రొత్తలోననే యింత శ్రద్ధగా పనిచేసినందులకు తిరుమల నాయకుడు సంతోషించినాడు

యువరాజైన ముత్తువీరప్ప నాయకునితో చెప్పినాడు. రాజుగారికి చెప్పినాడు. కుట్టాన్ సంతోషించినాడు. వీరభూపతికి ఉత్సాహముగానే యున్నది

ఒకరోజున కుట్టాన్ నిదురలేచి కాలకృత్యములు తీర్చికొని, సౌధ పురోభాగమున నున్న మంటపములో పారిజాత వాయువులు చల్లగా వీచుచుండగా వచ్చి కూర్చున్నాడు. పురోహితుడు వచ్చి నిలుచుండి "ప్లవంగనామ సంవత్సర వైశాఖ బహుళ అమావాస్య" అన్నాడు పంచాంగము చంకను బెట్టుకొని, విభూతిరేఖలు మొగమున మెఱయగా శుక్రునివలె నిలుచున్న యా పురోహితుని నిలువున చూచి కుట్టాన్ భగవంతు డారూపమునవచ్చి తనకేదో జ్ఞాపకము చేయుచున్నాడనుకొన్నాడు ఆ దిగ్భ్రమలో కుట్టానునకు పురోహితుడు చెప్పిన వారమును వినిపించలేదు కుట్టాన్ లేచి లోనికిబోయి తన పేటికలోని మంచిగంధపు చందుకాయ పెట్టెను తీసి యా భూర్జపత్రమును తీసినాడు దానివంక చూచి, చూచుచుండగనే యాయాకుపైనొక కన్నీటిబొట్టు రాల్చినాడు. పెట్టెలో నున్న వాడిన పూలచెండు విసరి పారవేయ నుద్దేశించినాడు మనసొప్పలేదు మఱల నవి యన్నియు భద్రముగా పెట్టెలో దాచినాడు. తొందరగా నంతఃపురములోనికి చనినాడు ఏకవీర నిరాభరణ సుందరమైన యొడలితో తెల్లనిచీరతో గది తలుపునానుకొని నిలుచున్నది కుట్టాన్ యెదురుగా పోయి నిలుచున్నాడు ఏకవీర కర్థము తెలియలేదు. లోనికిబోయి మంచపుకోడు నానుకొని నిలుచున్నది

**ఏక–** సేతుపతు లెందుకో వచ్చినారు?

**కుట్టాన్** - ఏకా! నేడు వైశాఖ బహుళ అమావాస్య

**ఏక** - సంవత్సరము ప్లవంగ వారము శని

**కుట్టాన్** - నేటికి సంవత్సరమైనది

**ఏక** - పండ్రెండు నెలలు–అని గోడవైపునకు చేయి చూపినది ఆ గోడమీద నల్లనిబొట్లు పండ్రెండున్నవి కుట్టాన్ లజ్జావనత శిరస్కుడై నెమ్మదిగా ద్వారబంధము కడకు పోయినాడు ఏకవీర యొకపాట పాడుచున్నది ఆపాట ద్రావిడదేశములో ఆరోజులలో జనులందఱు సామాన్యముగా పాడుచుండెడివే! జనాపవాదభీతుడైన రాముడు సీతను వనములో విడిచిన తరువాత సీతాదేవి దుఃఖించుచున్న మాటలే యాపాటలోని మాటలు కుట్టాన్ మంత్రరుద్ధ భుజంగమువలె కదలలేకపోయెను వెనుకకు పోయి యామెను కౌగిలించుకొనవలె ననిపించినది ఒకదాసి యేదో కనుగొనుటకు నేకవీర కడకు పోయినది కుట్టాను తనగదిలోనికి పోయినాడు మంచముపై పండుకొని మొగము శయ్యపై నాన్చి తా నిన్నాళ్ళెల బ్రదుకవలె ననుకొన్నాడు మీనాక్షి యేమైనదో? ఆమెనెవరి కిచ్చి పెండ్లి చేసినారో? ఆమె మీద ఇంకను ఆస యెందులకు? సేవకుని పిలిచి, 'స్థానాపతిగారి యింటికి భోజనమునకు వచ్చెదనని చెప్పు' మన్నాడు సేవకుడు పోయినాడు

పెట్టె తెఱచి సేతుపతి మంచిగంధపు చందుకాయ పెట్టెలోనుంచి వాడుపూలు, గంధపుదుమ్ము, కస్తూరి తీసి ఇంకొకచోట నుంచినాడు ఒక భూర్జపత్రము మాత్రమే యందుంచినాడు ఆ దుమ్ము రెండుచేతులకును రాచుకొని మొగమున

పూసుకొన్నాడు. అద్దములో చూచుకొన్నాడు. దాక్షాయణీ శోకతప్తుండైన శివునివలె నున్నాననుకొన్నాడు. వసనాంచలముతో మొగము పరిగా తుడుచుకొని మిగిలిన ప్రేయసి చిహ్నములు వేఱొకచోట దాచినాడు.

వంటబ్రాహ్మణుడు వడ్డించగా కుట్టాన్, వీరభూపతులు వీరభూపతి యింటిలో భోజనము చేసినారు. కుట్టాన్ మనస్సు విషాదచ్ఛన్నమయ్యెను. వీరభూపతితో కలిసి యున్నప్పుడతనికి సంతోషమే! భోజనము చేయుచున్నప్పుడు రెండుమూడుసార్లు వీరభూపతి నతని భార్యగూర్చి యేమో యడుగుద మనుకున్నాడు. కాని మనస్సు పరిగ లేక యూరుకొన్నాడు. ఇంతవఱకు కుట్టాన్ వీరభూపతి వివాహవిషయమై యతనితో ప్రస్తావించలేదు. అత డంతకుముందే మాటలాడలేదు. దీనికి కారణములున్నవి. కుట్టాన్ తన దుఃఖములో మునిగి యా విషయము సంప్రదించలేదు. వీరభూపతి తనభార్య విషయము కుట్టాన్‌తో చెప్పుటకు దనకు సరియైన యుత్సాహము లేకపోయినది.

భోజనానంతర మిరువురును రాజసౌధమునకు పోయిరి. కుట్టానున కెట్లో పొద్దుగ్రుంకవలయును. పగలు గడువవలయును. మొగసాలలో ననేకులు గూర్చుండి తాటాకులమీద గంటములతో గ్రంథములు వ్రాయుచుండిరి. వీరందఱకును జీతములు, బత్తెములు రాజిచ్చును. ఆ గ్రంథములు పుస్తక భాండాగారములకు, రాజ్యములోని యితర పాఠశాలలకు పంపించబడును.

వారిరువురు అచ్చటినుండి కదలిపోయిరి. ఎదురుగా సంధ్యామంటపము కనబడినది. కుట్టాన్ మనస్సులో కస్తూరిరంగనాయకుని మోహమూర్తి మెఱపువలె మెఱసినది. అనంతరము దళవాయి కుమారుడు, స్థానాపతియు తిరుమలనాయకుని యొద్దకు పోయినారు. తిరుమల నాయకుడు ముద్దుకృష్ణప్పనాయకుని రెండవ కుమారుడు. అతని నేత్రములు దీర్ఘములై రక్తరేఖలతో విరాజిల్లుచుండెను. అతని వక్షఃస్థలము విశాలమై కోట యినుపతలుపు వలె నొప్పుచుండెను. అతని బాహువులు దీర్ఘములై, యాజానులంబమానములై యాయసస్తంభములవలె కఠోరములై యుండెను. అతని మొగము చూచినవా డితడే భావి మధుర రాజ్యమునకు రాజగునేమో యని యనుకొనునుగాని, యతని యన్నగారు ముద్దువీరప్పనాయకుడు యువరాజున్నాడని సందియము కలుగును. తిరుమల నాయకుని వదనము ప్రసన్న గంభీరమై యతడొక నిశ్చయము చేసికొన్నచో దాని త్రిప్ప నెవ్వరికిని సాధ్యముగాదని తెలియజేయు చుండెను. తిరుమల నాయకుని కప్పటి కిరువది రెండేండ్లు దాటలేదు. కాని యతని తండ్రిగాని యన్నగారు గాని యతనికి చెప్పకుండ నేపని చేయరు. అతని సర్వావయవములందును మహాదృష్ట రేఖలున్నవి. అతని కాలములో మధురరాజ్యము పరమోత్కృష్టమైన మహాదశ పొందునని కార్తాంతికులు చెప్పిరి. ముద్దువీరప్ప నాయకుడును, అసూయారహితముగ తమ్ముని యభ్యుదయమునే వాంఛించినాడు. తిరుమలనాయకుడు కుట్టాన్ స్థానాపతులతో కొంచెముసేపు మాటలాడి, కుట్టాన్‌తో "దళవాయీ! నీతో నొకమాట!" యని వానిని తీసికొనిపోయినాడు. అచ్చట నేదో రాచకార్య విషయము మాటలాడిన తరువాత, పొద్దుక్రుంకు వేళకు కుట్టాన్

వీరభూపతులు వైగై యిసుకలకు పోయినారు. నాటికి నేటికి మఱల వేసంగిలో వైగై పరిక్షీణ్ణ స్రవంతి పలుచని నీటిపొరలో స్నేహితు లిద్దరు నొకరి భుజములపై నొకరు చేతులు వైచుకొని చీలమండలు తడుపుకొని నీరు పుక్కిలించి యుమిసినారు. నేలపై నుండి గాలి వెచ్చగా వచ్చినది. ఇద్దఱు స్నేహితులును నీళ్ళతో మొగములు కడుగుకొన్నారు.

౧౪

వీరభూపతి వైగై నుండి వచ్చి, కుట్టానును వదలిపెట్టి యింటికి పోయి, స్నానము చేసి, భోజనము చేసి మేడపై చల్లగాలికి పండుకొనెను. రాతిరి పొద్దుపోవు వేళకు అతని భార్యయు వచ్చెను. ఆమె యతనికి కొంచెె మెడముగా కూర్చుండి తములపాకులు చుట్టి యిచ్చు చుండెను. అతడు తాంబూలమును సేవించుచుండెను గాని యతడుత్సాహముగా నున్నట్లు లేదు. వీరభూపతి లేచి కూర్చుండి "ఇంకనక్కఱలేదు" అనెను. ఆమె యాకుమడుపు లిచ్చుట మానివేసెను.

వీర- కాళ్ళు నొప్పిగా నున్నవి. సేవకుని పిలిచెదవా?

భార్య- నేను పిసికెదను.

వీర - నన్ను నీవు ముట్టుకొనెదవా?

భార్య- సేవక భావములో దోషములేదు. మీరు మాటిమాటికట్లే మాటాడెదరు. ప్రభూ! నాకు దానిపై నిచ్చలేదు. భార్యాభర్తృత్వ సంబంధమున కదియే ప్రధానమా? నా మనస్సున కట్లు తోచుటలేదు. నే నేమి చేయుదును?

వీర - సనాతనమునుండి మత మది 'ప్రజాయై గృహ మేధినాం" అన్నాడు సంతానార్థికావుననే వివాహము చేసికొనుట! నా తల్లిదండ్రులు వృద్ధులు. నా జీవితమంతయు వారిని సంతోష పెట్టుటకే వ్యయపఱచుచున్నాను నీతో చెప్పితిని గదా! నిన్ను వివాహము చేసికొనుట గూడ వారిని సంతోష పెట్టుటకే. నాల్గు నెలలు గడచి పోయినవి. నీ విట్టి యథాప్రకారముగా నా యెడల విముఖవై యున్నావు. నీ యీ విముఖత్వమునకు కారణము నాకు తెలియుట లేదు. ఎన్ని సారులు ప్రశ్నించినను చెప్పవు.

భార్య - స్వామీ! మీ యెడల నాకేమియు విముఖతయే లేదు. అట్లను కొనెద రేల? మీరన్న నాకు ప్రేమయే గలదు. మీతో భార్యవలె మాటలాడెదను. నేను చేయవలసిన పరిచర్యలన్నియు చేసెదను. ఏలనో యీ కార్యమునెడల వైముఖ్య మేర్పడినది. నాకు సంతాన మక్కర లేదు. ఎందులకు సంతానము? ఈ జన్మయే దుఃఖభూయిష్ఠము. ఇంకను సంతానముగని వారలను గూడ నెందుకు దుఃఖముల పాలు చేయవలె?

వీర- నీయీ సిద్ధాంతము సర్వజన సమాదరణీయ మగునయేని నేటితో సృష్టి యంతమగును. పరమేశ్వరుని లీలయెట్లు నడచెడివి.

భార్య - క్షణభంగురమైన యీ సౌఖ్యమునకై యింత యాయాస మెందులకు? నిత్యానందావిర్భావమేల కారాదు? ఈ దుర్మోహములోబడి నశింతుమని యెప్పుడు మనకు సరిగా తెలియుట?

వీర - అటులైన వివాహమేల చేసికొంటివి? నీ తలిదండ్రులతో ఈ మాటలే చెప్పకపోతివా? నిన్ను పెండ్లి చేసికొన్నవాడు లోకసామాన్యముగా నిన్ననుభవించుట కిచ్ఛగింపడా? అతని కేల నీవపకారివైనావు? తొలుతనే యోగినివి కాకపోతివా?

భార్య - నా తల్లిదండ్రులు నామాట వినుట లేదు; పతి మీరైన నా మాట వినరాదా? నిజముగా మీరు నన్ను ప్రేమింతురేని నా యీ కోర్కె కనుగుణముగ వర్తించుటకన్న వెక్కువ యిష్ట మేమి కూర్తురు?

వీర - నీకు నాకన్న వెక్కువవాడెవడైన పతి కావలయునని కోర్కెయున్నది కావలయును. లేకున్న నింత యలజడి యేల కలిగించెదవు?

భార్య - నాకిది గొప్ప సంబంధముకాదా! నేను స్థానాపతి భార్య నగుదునని యెవరనుకొన్నారు? నా తల్లిదండ్రుల పేదతనమునకు మీరు నాకు లభించుట మహాభాగ్యము! మీరు గనుక మా సంబంధమొప్పుకొన్నారు?

వీర - దానిలో మా సద్భావ మేమియు లేదు. వివాహానంతరమున దెలిసినది నాకీ యుద్యోగ మైనదని. తత్పూర్వము మేమును మీ వంటి వారమేగా! నా కీ యుద్యోగ మైనను మా మిత్రునివలన నైనది.

భార్య - ఎవరా మిత్రులు?

వీర - నీ వెఱుగవా? నేడు మనయింటికి భోజనమునకు గూడ వచ్చెను గదా?

భార్య - ఎవరో స్నేహితులు వచ్చిరని వింటిని. వారెవరో తెలియదు.

వీర - అతని పేరు కుట్టాన్. ఉదయన్ సేతుపతి దళవాయి కుమారుడు.

అతని భార్య యచటినుండి మెఱుపువలె లేచిపోయినది. వీరభూపతి యే పని మీదనో వెళ్ళిన దనుకొన్నాడు.

చాలపొద్దుపోయినది. రాతిరి రెండుజాములు తిరిగినది. వీరభూపతి లేచి లోనికి పోయినాడు. దీపము చందమామవలె వెలుతురు కాయుచున్నది. వీరభూపతిభార్య మంచముపై పండుకొన్నది ఆమె బంగరు దేహము నందు నగలు కలిసి పోవుచుండెను. మొగము కలకల నవ్వుచుండెను వీరభూపతి యామె నిదుర పోవుచున్న దనుకొన్నాడు. దగ్గరకు వెళ్ళి చూచినాడు ఆమె చెక్కిళ్ళ వెంట నీరు కారుచున్నది. వీరభూపతికి కారణము తెలియలేదు. పుట్టి నిల్లు వదలి చాలరోజులైనది-అందుకనియేమో యనుకొన్నాడు. నాలుగైదు రోజులలో పరమేశ్వర సముద్రమున కొకసారి పంపించెద ననుకొన్నాడు. ఆ దివ్య సుందర విగ్రహమును చూచిన వీరభూపతికి మనసాగలేదు. ఒక్కసారి ముద్దిడు కొనవలెనని పించినది ఇదివఱ కాతడామెను తాకి కూడ వెఱుగడు. ఆమె యతనితో చక్కగా మాటలాడును. అవసరము వచ్చెనేని కొంచెము నవ్వును. అంతియ! అతడామెను ముట్టుకొనెనా యామె రౌద్రమూర్తియగును అందుచేత వీరభూపతి వివాహము నాటినుండియు యామె యిష్టప్రకారమే నడచు చుండెను. ఇప్పుడు ముద్దిడుకొన్న నామె లేచునేమో? వీరభూపతి గుండె చలించినది. అతని పని యెట్లున్నది? పెరటిలో ధననిక్షేపము మూల్గుచున్నది. ముట్టుకొన్నచో త్రాచై కరవ వచ్చును. తదేక దృష్టితో ఆమెవంకనే

చూచుచున్న వీరభూపతికి పూర్వపు నిగ్రహము సడలినది. అనవ్యస్పృష్టములైన యామె గులాబిపూరేకుల వంటి పెదవులమీద నతని నల్లనిమీసములు తుమ్మెదల వలె ఆడినవి. వీరభూపతి కొడలు తెలియలేదు

అతని భార్య నిదుర పోవుచుండుట లేదు. వీరభూపతి తన్ను ముద్దిడు కొన్నాడని యామె గ్రహించినది అతనికి తనపై నింత ప్రేమ యున్నందులకు, మఱల నతని తాను ప్రేమింపజాల నందులకు తన్ను దాను నిందించుకొన్నది అపుడు కనులు తెఱచుట కామె కిష్టములేదు నిదురలోనే తన్నాయన ముద్దిడుకొన్నాడని వీరభూపతి ననుకోని మ్మనుకొన్నది.

వీరభూపతి మెమ్మదిగా తనగదిలోనికి పోయినాడు తలుపు లోపల మూసికొన్నాడు. పెట్టె తెఱచి యందులోని తన పూర్వ ప్రణయినీ లేఖ తీసి చదువుకొన్నాడు. ఆమె యెవ్వరో మఱల కనుపడలేదు. తెలియలేదు తన మనసునుండి గ్రహించి యామెరూపము నతడు చిత్రించినాడు ఆ చిత్రముగూడ నందులో నున్నది దానివంక నదేప్రకారముగా అరగడియసేపు చూచిచూచి, మఱల నవి పెట్టెలో నుంచినాడు వీరభూపతి ఫాల్గుణ మాసములో తన భార్య చిత్రము కూడ గీసినాడు అది తీసి దానివంక కొంత సేపు చూచి, యా చిత్రము వా చిత్రము నొకచోట నుంచినాడు అవి యట్లుంచి తన భార్య నిదురపోవుచున్న గదిలోనికి పోయి యామెను పిలిచినాడు ఆమెమేలుకొనియే యున్నది. పలుకలేదు. మంచము దగ్గరకు పోయి వీరభూపతి 'ప్రియా!' అని పిలిచినాడు ఆమె పలుకలేదు ఎడమ చేతితో నామె పాదము పట్టుకొని కదల్చినాడు ఆమె లేచి కూర్చున్నది

**భార్య** - నన్నేందులకు వృథా వేధించెదరు? మీరు మఱల వివాహము చేసికొనుటకు నే నొప్పుకొన్నాను స్వామీ! ఆ వివాహమునకు నేను గూడ వచ్చెదను. నన్ను క్షమించుడు

**వీర** - ఆమాట నిన్నెవరడిగినారు? నేను మరల వివాహము చేసికొందునని నీతో చెప్పితినా? అనవసరముగా మాటలాడు చున్నావు

వీరభూపతికి కోపము వచ్చిన దనుకొన్నదామె

**భార్య** - క్షమించుడు ఇప్పు డెందులకు నన్ను మేల్కొల్పితిరి?

వీరభూపతికి "నీతో పనియున్నది ఇటుల రమ్ము" అని పోవుచుండెను ఆమెయు నతని ననుసరించినది ఆ గదిలోనికి పోయిరి వీరభూపతి యామెకు రెండు చిత్రములను చూపి, "ఈ యిద్దరిలో నెవరందముగా నున్నారు?" అన్నాడు ఆమె తనదికాని చిత్రము చూపించి "ఇది యెవరిది?" అని యడిగెను వీరభూపతి యామె చిత్రమును చూపించి, "యిది యెవరిదో యెఱుగుదువా?" అని యడిగెను ఆమె "తెలియదు. ఎవరిదో చెప్పుడు" అన్నది. వీరభూపతి "ఆమెనే యడుగుము" అన్నాడు ఆమె గ్రహించినది తనదే అని తెలిసికొన్నది తలవంచుకొని "ఇది యెవరు వ్రాసినారు?" అన్నది వీరభూపతి "నీ యీ దాసుడు" అన్నాడు అతనిపాదములనేల మీద మోకాళ్ళూది "క్షమించు"డన్నది దోసిలి పూని వీరభూపతి యామెను లేపదీయుటకు చేతులు పుచ్చుకొనబోయినాడు ఆమె చేతులు వెనుకకు లాగుకొన్నది

ఆమె "రెండవ చిత్తరు వెవరిది?"అన్నది. వీరభూపతి యా కథయంతయు చెప్పినాడు. అతని భార్య సాశ్చర్యయైనది. వీరభూపతి యా లేఖ నామె కిచ్చినాడు. ఆమె చదువు కొన్నది.

భార్య- "ఆమె పేరేమి?" ఉత్తరము క్రింద నామె పేరు చూపినాడు వీరభూపతి. అతని భార్య ఆపేరు పదిసార్లు చదువుకొన్నది. గడియసేపా చిత్రము వంక చూచినది.

భార్య - మీరు మఱల నాయూరే పోలేదా?

వీర - నీ తోడు.

తొలి కోడి కూసినది.

౧౫

ప్లవంగ పోయినది. కీలక వచ్చినది. అది వైశాఖము. తెల్లవారినచో నమావాస్య. తెల్లవారులు కుట్టానునకు నిదుర పట్టలేదు. అతనికి హృదయములో నేమో భయము వేసినది. రాతిరి రెండుజాములప్పుడు లేచి యొక్కడును పాదచారియై స్థానాపతియింటికి ప్రయాణమైనాడు. ద్వారము వద్ద నిద్రపోవుచున్న సేవకుడు లేచి "ప్రభూ! ఎచ్చటకు?"-కుట్టాన్ మాటాడకుండ పోవుచున్నాడు. సేవకుడు కత్తిదూసి స్వామి వెంట నడచినాడు. స్థానాపతియింటికి పోయిన తరువాత సేవకుడు ఖడ్గము వొరలోనుంచి "ప్రభూ! తలుపు తట్టుదునా?" యన్నాడు. లోనుండి తలుపు తెరువబడినది. వీరభూపతిని మేల్కొల్పిరి. వీరభూపతి లేచి వచ్చి సేవకుని, కుట్టానునుచూచి 'నాయనా! ఇప్పుడు వచ్చితివేమి?' యని కుట్టానును కౌగిలించుకొన్నాడు. ఇరువురును సౌధాగ్రమునకు పోయినారు. కుట్టానుసేవకుడు మఱలిపోయినాడు. స్థానాపతి యింటితలుపులు గడియ వేయబడినవి.

సౌధాగ్రభాగమున స్నేహితులిరువురు కూర్చుండిరి. కుట్టాన్ కములవెంట నీరు కార్చదొడంగెను. వీరభూపతి కుట్టాన్ నోదార్చుచు "బాబూ!నేనుండగా నీకింత దుఃఖమెందుకు? నేను నాదుఃఖమంతయు భరించగలుగుదును, నీ దుఃఖమును పంచుకొనగల్గుదును. నాతో జెప్పు" మన్నాడు. కుట్టాన్ "ఈపటికి రెండుసంవత్సరము" లన్నాడు. వీరభూపతి "నాకు దెలియుటలే" దనెను.

కుట్టాన్ - ఈ రహస్యము నీనుండి యిన్నాళ్ళుగా దాచితిని నీకు చెప్పగూడ దనికాదు కానీ, యేమో చెప్పలేదు. పరాభవ నామ సంవత్సర వైశాఖ బహుళ అమావాస్యనాడు నా భార్యతో చెప్పితిని- నే నిదివఱకు ప్రేమించిన స్త్రీనుండి నామనస్సు మఱల్చుకొని నిన్ను ప్రేమించెదనని, నాకీ సద్బుద్ధి నుపదేశించినది, వీరభూపతి యను నా మిత్రుడున్నాడు, అత డని చెప్పితిని. అన్నా! ప్రయత్నము చేసెద నని చెప్పి ఈపటికి రెండుసంవత్సరములు! చేసిన ప్రయత్నమేమియు లేదు. ఇప్పటికిని నా హృదయమంతటి మీదను నాపూర్వ ప్రణయినియే సామ్రాజ్యము చేయు చున్నది. సూర్యోదయ మెట్లుచూతునాయని భయము వేయుచున్న"దని కనులకు చేతులడ్డము పెట్టుకొని కుట్టాన్‌ప్రభువు విలపించినాడు. వీరభూపతికిని కనుకొనలనుండి రెండు బిందువులు పడెను. వీరభూపతి "కుట్టాన్! ఓదారు

మోదారుము. నీవంటి విద్యాధికులును, వీరులే యోర్వలే రనిన, జగత్తులో దుఃఖము లోర్వగలవా రెవ్వ"రన్నాడు.

**కుట్టాన్** - అన్నా! యీ యంతఃపుర రహస్యము లెవ్వరికి చెప్పునవి కావు, అందులో మనము గొప్పయిండ్ల పుట్టినందున మన స్త్రీలకు రాణివాసములు. ఏ విషయము నెవ్వరితోను చెప్పుటకు వీలులేదు. నీతోగాక యింకెవ్వరితో చెప్పుదును! నాకు స్వాతంత్ర్యమున్నచో, నేను నాభార్యను ప్రేమించినచో నిన్ను నాయంతఃపురములోనికి తీసికొనిపోయి యుందును. నిన్ను నేనంత ప్రేమించుచున్నాను.

వీరభూపతి కుట్టాన్ చేయి పట్టుకొని గద్గదస్వరముతో "నాకు దెలియును. నాకుదెలియు" నన్నాడు. కుట్టాన్ మఱల, "నేనీ దుఃఖాగ్ని నెట్లు చల్లార్చుకొందును? నాభార్య అంతఃపురములో పడిలిపోవుచున్నది. ఈ యప్రతిష్ఠ యెన్నాళ్ళని భరింతును?" కుట్టాన్ నోటినుండి రోదన ధ్వని బిగ్గరగా వచ్చెను. వీరభూపతి యతని శిరస్సును కౌగిలించుకొని యెదురొమ్మున కానుచుకొని చేతులతో నతని శిరస్సును నిమిరెను. వీరభూపతి "కుట్టాన్! ఇంతమాత్రమునకే యింత దుఃఖించెద వెందుకు? నాలో నెంత మహాగ్ని నే నిముడ్చుకొన్నాను! ఆ రోజున నీతో చెప్పిన కథ యంతయు జ్ఞాపకమం దున్నదా? అదిగాక నాశిరస్సుపై నొక క్రొత్త బెడద వచ్చిపడినది ఇది నీతో చెప్పలేదు. నీదుఃఖమునకు నాదుఃఖము జోడించు టెందులకని. దినదినము నీ విషణ్ణవదనము చూచుటకు చాలదా యని. కాని నీ యీ దుఃఖముచూచి నాహృదయములో నా రహస్యము దాగుట లేదు. చెప్పుచున్నాను వినుము. నేను వెనుక నీయూరినుండి పోయినది నా తండ్రియొద్దనుండి వచ్చి యని తెలియునుగదా! యింటికి పోయిన వెంటనే మా తండ్రి సంబంధము స్థిరపఱచినాడు ఈపిల్లనే నేను వద్దని చెప్పినాను జీవితాంతము బ్రహ్మచారిగనుందు నన్నాను. నా తండ్రి యొప్పుకొనడని నాకు తెలియును. అయినను నా భావములు చెప్పవలయుననియే చెప్పితిని. వివాహము జరిగినది ఆ పిల్ల యత్యంత సౌందర్యవతి. వెనుక నీతో నేను చెప్పిన యామె కన్న నీమెయే యెక్కువ యందకత్తె యేమో యని సందేహము కలుగు చున్నది. అయినను నామె నన్ను ప్రేమించినది నేనీమెను ప్రేమించినాను. అదియే భేదము. వివాహములో నామె తల యెత్తి నావంక చూడలేదు ఐదవనాడు గదిలో తలుపు దగ్గరగా నిలుచున్నది. ఆమెను జూచిన నా కే యప్సరః స్త్రీయో యనిపించినది ఆ తెల్లవారులు నా దగ్గరకు రాలేదు. ఆమూడు రేలు నాతోమాటాడలేదు. నేను పలుకరించిన పలుకలేదు. తాకబోయినచో నాపై క్రోధదృష్టి పఱపును. కుట్టాన్! నీవు నన్నెఱుగుదువు కదా! నేనేమి పశువును కాను పశుమార్గ మవలంబించలేదు. ఆమెను సానునయముగా 'ప్రియా! ఏల నాయెడల నీకింత వైముఖ్యము? నేనేమి తప్పు చేసితిని? విరాగిణివో? అనవసరముగ నన్నేల వివాహములోనికి దించితివి? దగొన్న నా పితరుల కేల మృగతృష్ణికలు చూపించితివి?' అని యేమో చెప్పితిని. వారి యూరిలో మూన్నాళ్ళు గడచినది. మాయూరు వచ్చితిమి. క్రమక్రముగా నాతో మాటలాడుట మొదలు పెట్టినది. కాని నన్ను

ముట్టుకోనీయలేదు. ఇంతవఱకు నే నామె నెఱుగను. ఈ రహస్యము లెవరితో నైన జెప్పునవేనా? ప్రాణబంధువవు కనుక నీతో చెప్పుచుంటిని. తలంచుకొనిన నాహృదయము వ్రయ్యలగు చున్నది. ఆపోయిన దుఃఖము చాలక భగవంతుడు నాకీ క్రొత్త దుఃఖము సంపాదించి పెట్టినాడు. మాటలాడుట మొదలు పెట్టిన తరువాత కొన్నాళ్ళ కామె నెమ్మదిగా తనకు ---"

ఇక్కడ వీరభూపతి యాగినాడు. కుట్టానునకు చెప్పుటకు సంశయించు చున్నటుల కనబడినది. కుట్టాన్ వీరభూపతి చేతిలో చేయి వైచి యతని యైదు వ్రేళ్ళ సందున తన యైదువ్రేళ్ళు దూర్చి "వీరా! నాతో చెప్పుటకు సంశయపడవలెనా? నీకు తెలిసిన నొకటియు, నాకు తెలిసిన నొకటియునా? ఈ శిరస్సు పడిపోక ముందు నీ రహస్యము లీ నోటినుండి బయటకు బోవునా?" యన్నాడు వీరభూపతి నిట్టూర్పు విడిచి "కుట్టాన్! నీవన్న నాకా భయము లేదు. ఈప్రపంచములో నీకన్న నాకు పరమాప్తు డెవ్వడు? నోటివెంట ఆ మాటలు చెప్పలేకున్నాను. చెప్పలేకేమి? చెప్పెదను వినుము. తనకు సంసారవాంఛ లేదన్నది లోకముతో తనకు సంబంధము లేదట! మఱి నన్నెందులకు వివాహము చేసికొనవలె నన్నాను. తన తలిదండ్రులు చేసినా రన్నది ఈ పరమయోగిని నా పాలబడినది. నాకేమియు దుఃఖము లేదనుకొనుము. నా తలిదండ్రులయొక్క కోరిక యీరీతిగా ఫలించినది ఇట్లని నీతో జెప్పితిని. నేనిది చెప్పుట యేల ననగా నా దుఃఖము నీవు పంచుకొనుటకుకాదు, నీ దుఃఖము నీవు మఱచిపోవుదువని ఆమె యింతవఱ కట్లే యున్నది గృహములో సరిగానే ప్రవర్తించును. పనికత్తె లుండియు కూడ నా కనేక పరిచర్యలు తానే చేయుచుండును. తములపాకు మడుపు లందించును ఈ బాధ నాహృదయములో శల్యము వలె నాటుకొన్నది ఆమె వదనము చూచినప్పుడు ప్రయత్నించి చేసిన మందహాసములో లోపలి తత్త్వము గోచరించుచున్నది! ఆమెను నేను తాకరాదు తాకినచో ఆమె గోధుమవన్నె త్రాచువలె చుఱచుఱ జూచును! పురుషుడనై కూడ కుట్టాన్! ఆమెవద్ద స్త్రీనై పోతిని. కాదని యామెను తిరస్కరించి మఱల వివాహము చేసికొందునా? ఇప్పటికి రెండు ప్రణయయాత్ర లిట్లయినవి. మూడవ దానిని గుఱించి గగనసౌధ నిర్మాణములు చేయుదునా? చూచితివా నాదుస్థితి! ఇంచుమించుగా ఆమె యాజ్ఞాబద్ధుడనై పోయినాను ఆమె మందహాసములకే సంతోషించుచున్నాను" అని వీరభూపతి సహజమైన ధైర్యము విడి వలవలయేడ్చినాడు కుట్టానునకు దుఃఖమాగలేదు ఇరువురు నిశ్శబ్దముగ చాలసేపు కూర్చుండిరి కొంతసేపైన తరువాత కుట్టాన్ నెమ్మదిగా "నీయత్తవారేయూ"రన్నాడు వీరభూపతి కొంచెము సేపూరకుండి "పరమేశ్వర సముద్ర" మన్నాడు. కుట్టానున కేమో యెదఱంతయు తేళ్ళుప్రాకినట్లయ్యెను కుట్టాన్ లేచి నిలుచుండెను, "వీరా! మీ మామగారి పేరు?" -వీరభూపతి "దొడ్డదేవరాజు" అని సమాధానమిచ్చినాడు.

**కుట్టాన్** - నీ భార్య పేరేమి? వీరభూపతి, "మీనాక్షి' యన్నాడు కుట్టాన్ "అయ్యో"యని క్రిందపడిపోవుటకు సిద్ధమైనాడు వీరభూపతిలేచి యతనిని సందిటబూని పరుండబెట్టినాడు. కొంతసేపటికి కుట్టానునకు మెలకువ వచ్చినది

కుట్టాను లేచి తొందరగా బయలుదేరిపోవుచు, 'నేనుపోవుచున్నాను' అనెను. వీరభూపతి "ఏమట్లయితివి?" అని యడిగెను. కుట్టాన్ కంఠమునుండి యేడ్పుతో కలిపిన గద్గదధ్వని "ఏమియులేదు, యేమియు లేదు" అని బయటికి వచ్చెను. అనుచునే కుట్టానాగ లేదు. తొందరగా పోయినాడు.

ఎదురుగా కమ్మరవాని కొలిమిలో పండ్రాగిన ఇనుపగుండువలె సూర్యోదయమైనది. కుట్టా నరగడియలో తన సౌధమునకు పోయెను. పోవుచునే యంతఃపురములోనికి పోయెను. గదిలో గోడమీద ఎఱ్ఱని బొట్లు రెండు నెత్తురులు చిమ్మినవి. అప్పుడే రెండవ సంవత్సరము గుర్తు పెట్టిన ఏకవీర చేతికెన నూనె కలిపిన కుంకుమవర్ణ మతనిహృదయమునుండి యామె నెత్తురు తీసినట్లతనికి తోచెను.

౧౬

రాజునకు గొప్పవ్యాధి సంక్రమించినది. రాజు బ్రదుకునట్లు లేదు. దళవాయికి రమ్మని యుత్తరము వ్రాసినారు. రాజ్యములో లెక్కలన్నియు సరిగా చూచుచున్నారు. స్థానాపతి తెల్లవారకముందే రాజాస్థానమునకు పోయెను. రాతిరి ప్రొద్దుపోవు వరకు నింటికి వచ్చుటకు వీలులేకపోయెను. ప్రొద్దున కుట్టాను చాల దుఃఖముతో నింటికి వెళ్ళినాడు. ఆతడట్లున్నది వీరభూపతికి తెలియలేదు.

కుట్టాన్ యంత దుఃఖించుటకు కారణము వీరభూపతికి తెలియలేదు. తన భార్యపైని ప్రేమాధిక్యముచేత నట్లుగా నయ్యెననుభావ మతనికి పోలేదు. కుట్టాన్ తన మరదళ్ళతో తగాదాపడి యిట్లయ్యెనని యనుకొన్నాడు. వీరభూపతి రాతిరి ప్రొద్దుపోయి యింటికివచ్చి, భోజనము చేయక కుట్టాన్ వద్దకు పోయినాడు. కుట్టాన్ నిదురపోవుచున్నాడు. వీరభూపతి యొక సేవకుని పిలిచి, "మీస్వామి నే డెట్లున్నాడు?" అని యడిగెను.

"అవి– బాబూ! పొద్దటినుండియు భోజనము చేయలేదు. స్నానమాడలేదు. వారియొద్దకు పోవుటకు మాకు భయమువేసినది. కనులు చింతనిప్పులవలె నున్నవి. ఏమో ఆలోచించుచున్నారు. ఒకతెల్లి నిల్లంతయు తోటయంతయు నేదో పని యున్నట్లుగా తిరుగుచున్నారు. జాము ప్రొద్దున్నదనగా ఈ నిద్దురకు పడినారు. ఇప్పుడు జాము ప్రొద్దుపోయినది. నిద్రలేవలేదు. ప్రాణము కొంచ మెచ్చినదేమో? లేపనైన లేపుదు."

వీరభూపతి కుట్టాన్ను కదల్పవద్దని చెప్పి యింటికి పోయినాడు. ఆ రాత్రి యంతయు నిశ్శబ్దముగ ప్రశాంత గంభీరముగ గడచిపోయినది.

తెల్లవారినది. ఆణిమాసము వచ్చినది. పలుచని సంజమొగిలి తెరచాటున నుదయించిన సూర్యబింబము కొంచెము పైకి వచ్చిన తరువాత స్వచ్ఛకిరణ సమూహములతో లోకమున కంతయు వెలుగు విరజిమ్మెను.

రాజున కానాడు కొంచెము నెమ్మదిగా నున్నది. స్థానాపతి రానక్కఱలేదని కబురు వచ్చినది. కొంచెము నెమ్మదిగనే యున్నదని దళవాయికి వర్తమానము చేసిరి. కుట్టానుకు జాము పొద్దెక్కిన తరువాత మెలకువ వచ్చినది. లేచి మంచము పైని కొంతసేపటికు శాంతముగా కూర్చుండి స్నానాదికములు చేసినాడు. వీరభద్రభట్టరును

పిలిచి "యంగడకిబోయి రెండువందల పన్నుల వెలగల యొక చీరయు పసుపు కుంకుమ తక్షణము తేవలయు"నని చెప్పినాడు.

అవి వచ్చెను. మంచిగందపు చందుకాయ పెట్టెలో నుండి భూర్జపత్రము తీసి యా యరలలో వాడిన పూలును, కస్తూరియు మటల నుంచి యాపెట్టియు, చీరయు, పసుపు కుంకుమలును వూని వీరభూపతి యింటికి పోయినాడు. నిన్న నెల్ల భోజనము లేకపోవుట చేత నడువలేకపోయెను. బండి వద్దనెను. వీరభూపతి పసుపు, కుంకుమ, చీరయు చూచి యివి యేమిటని యడిగెను.

**కుట్టాన్**- నెమ్మదిగా జెప్పెదను, తొందరపడకుము. (కొంతయాగి) నేసీ రోజున నిచ్చటనే భోజనము చేసెదను.

వీరభూపతి సరే యనెను.

**కుట్టాన్**- మనమిరువురమే కూర్చుందము. మనకు నీ భార్య వడ్డన చేయవలయును.

**వీర**- ఆమె నడిగెదను. ఆమె యొప్పుకొనవలెనుగదా! నీవు దళవాయి కొడుకువు. నీ యెదుటకు వచ్చునో రాదో?

**కుట్టాన్** - నేనడిగెదను. అన్నగారి వద్దకు రాగూడదా? ఎంత తెరచాటయినను అంతఃపుర స్త్రీలయినను అన్నలకు, బంధువులకు కనబడరాదా?

ఇరువురును మేడపై పడకగదిలోనికి బోయిరి మీనాక్షి లేచి నిలుచున్నది. కుట్టానును గుర్తుపట్టినది. లోతైన కనులతో అతనివంక చూచినది కుట్టాన్ కనులు, క్రొత్తగా కాపురమునకు పోయిన చెల్లెలిని చూచిన యన్నగారి కనులవలె సోదర స్నేహసూచిత మందహాసములు వెలిగ్రక్కినవి. అతని విశాలమైన నేత్రముల కొనలయందు బాష్పములు నిండినవి

**వీర** - మీనా! మీ అన్నగారికి నేడు నీవు భోజనము పెట్టవలెనట! ఈయన నెఱుగవు కాబోలు! ఈయనే కుట్టాన్‌సేతుపతి! నీకుచెప్పితిని గదా, నాకు పరమాప్తుడని! నేను తినుచున్న ప్రతిమెతుకును నితనిదే.

మీనాక్షి స్తబ్ధయై పోయెను ఆమె నేత్రముల వెంట రెండు బాష్పబిందువులు రాలెను. వారివంకచూడలేక తల వంచుకొన్నది. **కుట్టాన్** - అమ్మా! ఎందుల కట్లు నిస్తబ్ధవయ్యెదవు? ఇది కోరరాని కోరిక యనియా? నీ భర్తకు నాకు నున్న స్నేహ మట్టిది. నీవు నాకు సహోదరివి. సందియమెందులకు? నీవు వడ్డించగా భోజనము చేయవలె ననిపించినది.అందుచేత వచ్చినాను. నీవిష్టపడవేని పోయెదను.

మీనాక్షి పెద్ద నిట్టూర్పు పుచ్చి-"అన్నా! వడ్డించెదను. నేను నిస్తబ్ధనైనది యందుకు కాదు తరువాత చెప్పెదను' అన్నది

ఆ మూడు నెలల నుండి మీనాక్షి నంత యుత్సాహముగా నెవ్వరు నెప్పుడును చూడలేదు. భోజనానంతరము పఱకు ఆమె మహోత్సాహములో నున్నది. మీనాక్షి కూడ భోజనము చేసి వచ్చినది. మేడపై గదిలో తివాచి పఱచి కూర్చున్నారు. మీనాక్షిని గూడ గూర్చుండు మని కుట్టాన్ బలవంతము చేసినాడు ఆమెయు కూర్చున్నది. కుట్టాన్ వీరభూపతితో నిట్లు మొదలు పెట్టినాడు. 'అన్నా! నీకు నే

నిప్పుడు కొన్ని సంగతులు చెప్పబోవుచున్నాను. అవి విచారకరమైనవో, ఆనందకరములైనవో నాకుతెలియదు. చెప్పవచ్చునో, చెప్పరానివో కూడ తెలియకున్నది. అవి యన్నియు చెప్పుటకు నా చెల్లెలు మీనాక్షి యనుజ్ఞకూడ తీసికొనవలసియున్నది' -అని యామెవంక చూచినాడు. ఆమె తలవంచుకొని తన యభిమతమును శిరశ్చాలనము వలన దెలిపినది.

కుట్టాన్ - వీరా ! నీవంటి ధైర్యవంతుడు, బుద్ధిమంతుడు నివియన్నియు విన్న తరువాత యథాప్రకారముగనే ప్రవర్తింపగల డను ఉద్దేశ్యముతో చెప్పుచున్నాను. భయపడకుము. నిగ్రహము పూనుము. చెప్పుదునా? -వీరభూపతి తలయూపినాడు.

కుట్టాన్ - నీతో నేనిది వఱకు ప్రేమించితినని చెప్పితినే-చాల జాగ్రతగా నుండుము -ఆమెయీామె!

వీరభూపతికి తల తిరిగిపోయినది అతడు 'ఆ!' అని బిగ్గరగా అఱచినాడు మీనాక్షి యేకధారగా కన్నీళ్ళు కార్చుచున్నది.

కుట్టాన్- వీరా! ఇదియేనా ధైర్యము? ఓర్చుకొనుము. మించి వచ్చిన దేమియు లేదు ఇదియంతయు భగవంతుని లీల. మనమేమి చేయగల్గుదుము? నేను నీకు పరమాప్తుడను. నాకన్న నిన్ను ప్రేమించువారు జగత్తులో నీకింకనెవరు? అధైర్యమెందుకు? శోక మెందుకు? అన్నా! నీకు అశుభముకల్గుటకు పూర్వము నాగొంతుక తెఱుగుకొనిపోనిమ్ము"

వీరభూపతి కొంచెము యథాస్థితికి వచ్చినాడు

కుట్టాన్ - మొన్నరాత్రి నీవు నీసంగతి యంతయు నాతో చెప్పినావు నేను పాతాళమునకు త్రొక్కబడితి ననుకొన్నాను హఠాత్తుగా విన్న యీ వార్త నా తల బ్రద్దలు కొట్టినది. ఇది వినుటకు నీకిప్పుడెట్లున్నదో నాకు విన్నప్పుడట్లున్నది. అప్పుడింటికి పోయి యేమి చేయుదును? ఏమియు తోచలేదు ఏమో, నేను నూరు బ్రహ్మహత్యలు చేసినట్లనిపించినది వీరా! నాకు పిచ్చి యెత్తుననుకొన్నాను అపుడు పిచ్చియే యెత్తినది కాని శ్రీ సుందరేశ్వరుడు నాయందున్నాడు ఈ మహాకల్లోలము నిన్న పగలు రెండుజాములు దాటువఱకు దాటినాను నీవు నాకు పరమాప్తుడవు. నీకన్న నాకు ప్రపంచములో ప్రేమింపగలవారులేరు అట్టి నీ భార్యనా నేను ప్రేమించుట? నాహృదయము కణకణలాడు నిప్పులలో పడవేసి కాచినట్లైనది విషసంలిప్తాగ్రములైన వెయ్యిబాకు లొక్కమారుగా నా హృదయములో దిగవేసినను నంత బాధయుండదు చివరికి ప్రవాహములో పడి నశించిపోకుండ నొడ్డుకు జేరుకొన్నాను ఈమె యెడ నిదివఱకు నాకుగల ప్రేమయంతయు సోదరీ ప్రేమగా మార్చుకొన్నాను వీరా! నాకు అక్కయుగాని, చెల్లెండ్రుగాని లేరు. భగవంతుడు నా కా లోప మీప్రకారముగ తీర్చినాడు. నిజముగా మీరిర్వురు సుఖముగా సంసారము చేయుచున్న చూచుటయే నేను కోరునది. ఇంక నాపూర్వ విషయము నాకు జ్ఞప్తికి రాదు. ఏలనన, నిన్న దానికంతకు తగినంత నరకబాధ మానసికముగా ననుభవించితిని ఆభావము నాలో నుండి పోయినది. ఇప్పుడీమెను నేను సోదరివలె చూచుచున్నాను. అట్లు చూడగలను. వీరా! ఏ దురూహయు లేకుండ నీమె నిపుడు

కౌగిలించుకొనగలను. నాచెల్లెలనుచు నెవరైన నున్నచో నామె నెట్లు కౌగిలించుకొందునో యీమె నట్లు కౌగిలించుకొనగలను. నిన్న నేను పొందిన మహాబాధవలన, నాతపస్సువలన నాకీ శక్తి వచ్చినది. వీరా! ఈ జీవితములో నన్ను నీ యెడనెంత కృతజ్ఞునిగా జేసికొంటివి! నన్ను ఘోరపాపము నుండి రక్షించితివి. నాధర్మపత్నిని ప్రేమించుటకు మార్గము చూపితివి. ఇంకేమి చేయవలయును? నీవు నాకు గురువువంటివాడవు -" అని కుట్టాన్ ఏడ్చుచు వీరభూపతిపాదములు కన్నుల కద్దుకొనెను. వీరభూపతి యతని చేతులు తీసి, "కుట్టాన్! నాపూర్వసుకృతము వలన నీవు నాకు స్నేహితుడవైనావు. నీకు నాకు పోలిక యెక్కడ? నీవు ఋషివి. నేనింకను మనుష్యుడనే! శ్రీ సుందరేశ్వరుడ విట్లవతరించినావు" అని కన్నీళ్ళు పెట్టుకొన్నాడు.

కుట్టాన్ చీరయు, పసుపు కుంకుమలును చందుకాయ పెట్టెయు మీనాక్షి కిచ్చి "అమ్మా! బుద్ధిమంతురాలవు. విద్యాధికురాలవు నీకు నేచెప్పవలసిన దేమున్నది! ఈ చీర కట్టుకొనుము"అనెను ఆమె కన్నీళ్ళు తుడుచుకొని యాచీర ధరించి వచ్చి కుట్టానునకు, భర్తకును నమస్కారము చేసెను నమస్కృతిలో మీనాక్షి వీరభూపతి పాదములను చేతులతో చక్కగా నిమిరెను

౧౨

మీనాక్షి "అన్నా! ఇంక రెండురోజులుండు"మన్నది వీరభూపతి పోనిచ్చినాడు కాదు కుట్టాన్ పంచమిపజకు వీరభూపతి యిల్లు వదలిపెట్టుటకు వీలులేకపోయినది కుట్టాను కేకవీరను చూడవలెనని యున్నది ఆమెతో నిదియంతయు చెప్పవలె ననిపించినది. మీనాక్షిమాట తీసివేయలేక యున్నాడు రాజునకు తదియ నాటికే యెక్కువయయినది దళవాయిని తొందరగా రమ్మని మఱల వర్తమానము చేసినారు దళవాయి వచ్చుటకు వీలులేకపోయినది. మారవదేశము ముద్దుకృష్ణప్పనాయకుడు రాజ్యమునకు రాక పూర్వము పొంగలచే నిండియుండెను రామనాథము మధురకును రామేశ్వరమునకును మధ్యనున్నది రామనాథమువద్ద పెద్ద చెఱువున్నది. దానికి "పాండ్యకమ్మై" అనిపేరు అది పూర్వ మెప్పుడో పాండ్యులు త్రవ్వించిన చెఱువట! ఆ తటాకమువద్ద చోరులు మూగి రామేశ్వరమునకు పోవు మార్గములో యాత్రికులను దోచుకొను చుండెడివారు ఈ మార్గములో విశ్వనాథనాయకుని కాలము నుండియు నిట్లేయున్నది కాని ముద్దుకృష్ణప్ప నాయకుడు దాని విషయమై శ్రద్ధ తీసుకొని దళవాయి నచ్చటికి పంపించి యా మారవదేశమును స్వాధీనము చేసికొనెను మధుర నాయకులకు రామనాథదేశము స్వాధీనము చేసికొనవలసిన యగత్యమున్నది సముద్రపుటొడ్డంతయు పోర్చుగీసువారి యధీనములో నుండిపోయెను. పోర్చుగీసు రాజప్రతినిధుల చేత నియమింపబడిన యధికారులు సముద్రపుటొడ్డున నున్న పల్లెలలో పట్టణములలో వర్తకముచేత వచ్చుచున్న రాబడులు,పన్నులును వసూలు చేసికొనుచుండిరి ఆ యా స్థలములయందు నేరములు శిక్షలు మొదలగు సర్వాధికారములు పోర్చుగీసు వారే చూచుచుండిరి. స్వదేశరాజులనుండి యట్టి యధికారమును పోర్చుగీసువారు పొందలేదు పారవులు (పల్లెవారు) తూర్పు సముద్ర

తీరములం దున్నవారందఱు పోర్చుగీసు రాజునకే ప్రజయట! అక్షరజ్ఞానములేని యా సముద్రతీర ప్రజను పోర్చుగీసువారు మతబోధకుల వలనను, స్వల్ప పారితోషికముల వలనను నాకర్షించి వారిని క్రైస్తవ మతములోనికి మార్చి, వారి యండగొని యిట్టి యక్రమములను దేశములో చేయజొచ్చిరి. ఈ రాజకీయ దౌర్జన్యములను, ధన నష్టమును నివారించుటకు మదురరాజులు మారవదేశమును చక్కగా నుంచుట యవసర మైనది. రామేశ్వరమునకు పోవు యాత్రికులను దోచుకొనుట కూడ ఆ రోజులలో క్రైస్తవ మతాభివృద్ధి చేయుటగా భావింపబడెను కాబోలు! మొదట ఉదయన్ సేతుపతి యా పనిమీద నియమింపబడినది విశ్వావసు నామ సంవత్సరమున.

సేతుపతిదళవాయి యచ్చటకు జేరిన తోడనే మొట్టమొదట రామేశ్వరమునకు పోవుమార్గము బాగుపఱచుటకై రామనాథమునకును, పోగలూరునకును కోటలుకట్టి యచ్చోట సైన్యముంచెను. యాత్రికులను గుంపులు గుంపులుగా చేసి ప్రతిగుంపు వెంటను కొందరు సైనికులను పంపించుచుండెను. రామనాథమునుండి యిట్టి యాత్రికులు ప్రొద్దున నొక గుంపు, సాయంతన మొకగుంపును బయలు దేరుదురు వారి వెంట ఏబది సైనికులు, వీరి వెంట ఏబది సైనికులు పోవుచుందురు. ఈ రెండు సైనికుల జట్టులును మఱునాడు రామేశ్వరమునుండి వచ్చు యాత్రికులతో వత్తురు. ఇచ్చటినుండి మఱునాడు మఱి రెండు యాత్రికుల గుంపులు బయలుదేరును. ఇట్లు మొదట యాత్రికులకు సౌలభ్యము చేసి, యనంతరమున ఆ చుట్టుపట్ల నిరంకుశముగా ప్రవర్తించుచున్న చిన్న చిన్న పాలెగాండ్ర నాయకులను క్రమక్రమముగా సాధించి కాళయ్యార్కోవెల, పట్టమంగళము మొదలగు స్థానములలో తగిన యధికారులనుంచి కట్టుదిట్టములు చేసెను. తరువాత సేతుపతి రామనాథము చుట్టుపట్లనున్న యరణ్యములను ఛేదించి పాండ్యకమ్మ జలముతో భూమియంతయు సాగుచేయించెను. దేశము చోరభయము లేక త్వరిత జల క్షామ సమృద్ధి కలిగి సేతుపతి పరిపాలనమున శాంతి కలిగియుండెను. పరదేశీయుల యిబ్బందులు తాత్కాలికముగా తగ్గెను. కాని మతవిషయమైన యేపనులు సేతుపతి చేయలేదు.

రాజునకు జాల జబ్బుగానున్నది, రమ్మని కబురు వచ్చుటచే దళవాయికి భయము వేసినది. రాజున కేమగునో! ఒకవేళ రాజు మృతినొందెనా, తాని రామనాథప్రాంతములలో చేసిన ప్రయత్నములన్నియు నిష్ఫలములగును. సామాన్యముగా రాజు మాఱినపుడు సామంతులును, శత్రువులును తమ స్వాతంత్ర్యమునకును, పోయిన భూములు మఱల సంపాదించుకొనుటకును ప్రయత్నింతురు. కనుక నిదియే సమయమని-దళవాయి రాజధానిలో ననేక కార్యములు చూచుచుండును. వచ్చుటకు వీలులేదని తెలిసి- యణగద్రొక్కబడిన చిన్న చిన్న నాయకులు మఱల తమ స్వాతంత్ర్యమును వహించిరా, ఈసారి వారిని గెలుచుటకూడ కష్టమై పోవును. అందుకని తాను రాజధానికి పోకమున్నె తన కుమారుని రమ్మని దళవాయి కబురు పంపినాడు. తన కుమారుని తన యధికారములోనుంచి తాను రాజధానికి పోవలె కుట్టాన్ తత్క్షణము రామనాథమునకు రావలయును

జ్యేష్ఠశుక్ల పంచమినాడే కుట్టాన్ బయలుదేరవలసి వచ్చెను. ఏకవీరను చూచుటకు కూడ వీలులేక పోయినది. దళవాయి మధురకు దశమికి చేరుకొనెను. రాజా ముద్దుకృష్ణప్పనాయకుడు మంచములో పరుండియే తన యిద్దరు కొడుకులను, దళవాయిని, ప్రధానిని, రాయసమును కూర్చుండబెట్టుకొని రాజ్యమంతయు తనకొడుకుల కప్పగించెను. పెద్దకుమారుడైన వీరప్పనాయకుని రాజును చేయ వలసినదని నిర్ణయించెను. రెండవ కుమారుడును, మహాసమర్థుడును నైన తిరుమల నాయకునితో, అన్నగారికి చేదోడు వాదోడుగా నుండుమనియు, కస్తూరి రంగప్పవలె ప్రవర్తింపరాదనియు, అట్లయిన రాజ్యము బహుధా పంచుకొనిపోయి శత్రువులకు సాధ్యమగుననియు చెప్పెను. తిరుమల నాయకుడు తండ్రిపాదములవద్ద గూర్చున్నవాడు- సాలప్రాంశువు - లేచి, కత్తిపూని తనయన్నగారినే సేవించెదననియు, అన్నగారికి సంతానము కలిగెనేని యతని తరువాత తనయన్న సంతానమునే రాజా చేసెదనని ప్రమాణము చేసెను తరువాత రాజు, దళవాయి, ప్రధాని, రాయసములతో తనను వలెనే తనకుమారుని గూడ సేవించవలెననియు, వారి రాజభక్తి వలననే రాజ్యము సాగుచున్నదనియు చెప్పి, సేతుపతి చేసిన మహత్కార్యములను, అతడు చూపించిన రాజభక్తిని కొనియాడెను వారందఱును రాజ్యమును పూర్వమువలెనే కాపాడెదమని ప్రమాణములు చేసిరి. తరువాత రాజు చాలసేపు శాంతముగా నుండెను అదివఱకే పాళెగాండ్రందఱు అనేక కార్యముల మిషమీద మధురకు పిలిపింపబడిరి రాజు సాయంతనమున ఒకరొక్కకరినే పిలిచి వారివద్దనుండి గూడ వాగ్దానములు తీసికొని, యానాడే వీరప్ప నాయకుని కభిషేకము చేయించెను. క్రొత్తరాజున కందఱును జోహారులు చేసిరి మఱునాడేకాదశి. ఆనాడు చంద్రోదయ సమయమునకు శ్రీ ముద్దుకృష్ణప్ప నాయకుడు పరమపదించెను.

రాజసౌధమంతయు రోదనధ్వనులతో నిండిపోయెను. దళవాయియు తిరుమల నాయకుడును పోయి యూరడించిరి మంచిగంధపు చెక్కలమీద నేతిగిండ్లు క్రుమ్మరించి వృద్ధరాజుశవమును నాహుతి చేసిరి వీరప్పనాయక మహారాజులుంగారు సహస్ర గోదానములను, శతాగ్రహార దానములను చేసెను

సామంత రాజులయు ప్రధానాధికారులయు రాజభక్తి వలన రాజ్యము మఱల శాంతముగా జరుగుచుండెను. క్రొత్తరాజునకు పాళెగాండ్రిచ్చిన కానుకలతో రాజసౌధము నిండిపోయెను. వృద్ధరాజు పోయినాడన్న దుఃఖ మే యంతఃపురమునందు దాగియున్నదో గాని మధుర రాజ్యమంతయు నూతన భూపతి పట్టాభిషేకోత్సవము నందలి యానంద చిహ్నముల తోడనే కలకలలాడు చుండెను.

వీరభూపతి యుదయన్ సేతుపతి నొకనాడు భోజనమునకు పిలిచెను. వీరభూపతి చిన్నవాడు. చనిపోయిన వృద్ధవరపతికూడ వీరభూపతికి స్థానాపతి యధికారము వచ్చి మూడు నెలలయినను మిక్కిలి సమర్థతతో వర్తించినాడని చెప్పెను వీరభూపతి నిదివఱకు వృద్ధ సేతుపతి చూడలేదు. ఈతని కీయుద్యోగము కుట్టాన్ తిరుమల నాయకునితో చెప్పి యిప్పించెనని యతనికి తెలియును వీరభూపతిని చూచిన ఉదయన్ సేతుపతికి ముద్దయినది-కుఱ్ఱవాడు, తెలివితేటలు కలవాడని!

భోజనవేళ మీనాక్షి వడ్డించినది. దళవాయి మీనాక్షి నెఱుగును. ఆశ్చర్యపోయినాడు. వీరభూపతి నడిగినాడు. స్థానాపతి కథయంతయు సంక్షిప్తముగా దళవాయికి దెలియజేసెను. మీనాక్షి "కక్కా! అన్నకు నా యెడల నెంత ప్రేమ యనుకొంటిరి' యన్నది. తన కుమారుని సంసారమునకు మంచి రోజులు వచ్చినవని దళవాయి సంతసించినాడు. ఇప్పుడు కొడుకును, కోడలిని విడిగా నుంచరాదు. దళవాయి నాటి తిథి యడిగెను. 'ఆషాఢ బహుళ చతుర్దశి!'

౧౮

మీనాక్షి సేతుపతుల సౌధమునకు పోవుచు వచ్చుచుండెను. ఏకవీరకు నామెకు మిక్కిలి చెలిమియైనది. ఏకవీర కూడ రెండు మూడుసారులు, స్థానాపతి యింటికి వచ్చినది. ఆమె వచ్చిన రెండు మూడుసారులును స్థానాపతి యింటివద్ద లేడు రాజకార్యము లంతయొత్తిడిగా నున్నవి. వీరభూపతి యింటికేవచ్చుట లేదు వరుసగా వారము దినము, లీపూటవచ్చుటకు వీలులేదు, యాపూట వచ్చుటకు వీలు లేదని యతడింటికి వర్తమానము లంపెను మీనాక్షి - సేతుపతుల ప్రణయమును గూర్చి వీరభూపతికి తెలిసిన తరువాత కుట్టాన్ మూడుదినములు వీరభూపతియింటనే యుండెను అనంతర మతడు రామనాథమునకు వెడలిపోయెను. ఆ తరువాత మీనాక్షి వీరభూపతుల చర్యలలో చాల మార్పులు కలిగెను. వీరభూపతిపై ప్రేమ నానాటికి మీనాక్షి కభివృద్ధి నొందుచుండెను మీనాక్షి నిత్యము వీరభూపతి యున్న చోట గాని యుండదు. అతనితో మాటాడునపుడామె మొగములో అవ్యక్తములైన స్వర్గవాంఛలు తలచూపుచుండెను ఆ నాలుగైదు రోజులలో మీనాక్షి తనంతట తాను వీరభూపతిని రెండుసార్లు కౌగిలించుకొన్నది. కాని వీరభూపతిలో కదలిక లేదు. తనవద్దనే కూర్చున్న మీనాక్షి నచట నుండి లేచి పొమ్మనును ఆమె తనవద్దకు వచ్చిన వెంటనే తనకేదో పనియున్నట్లు లేచిపోవును మీనాక్షి యతనిని కౌగిలించుకొన్నపుడు రంభాపరిష్వంగమున నిశ్చలుడు, నియంతేంద్రియుడునైన శుకుని వలె కూర్చుండును ఇతని యీ తూష్ణీంభావము మీనాక్షికి దుఃఖము కలిగించలేదు అంతకంత కామెప్రేమ వృద్ధియగుచునే యుండెను పొంగివచ్చు ఆ ప్రేమప్రవాహమును వీరభూపతి తాళుకొనలేక పోయినాడు ఆమె చేయు ప్రేమచేష్టిత కార్యముల నోర్చుకొనలేక పోయినాడు అతని మనస్సు కదలిపోయినది

సేతుపతి, మీనాక్షి- వీరిరువురి ప్రేమయు నతని మనస్సు నావరించెను ఇప్పుడు వారి ప్రేమ సోదరీ సోదర ప్రేమ కదా! శారీరకమైన సంయోగము లేకపోయినను వారిరువురే భార్యాభర్తలు వారి యీ ప్రేమ యూరకేపోవునది కాదు! వారి జీవితము లున్నంతవఱకు నది తుడిచివేయబడునది కాదు ఇప్పటి వారియునికి యథార్థమైనను ప్రథమ ప్రేమ, మీనాక్షి హృదయపు మొగ్గ, కుట్టాన్ సేతుపతియే వాసన చూచినాడు ఇప్పుడది యనన్యభోగ్యము. వీరభూపతికి నిద్రలేదు ఆహారము లేదు నిరంతరము మీనాక్షి సాహచర్య మోర్చుకొనలేక రాజసౌధమునకు పోయి యందే నివసించుచుండెను

వీరభూపతి యింటికి వచ్చి వారముదినము లయినది. మీనాక్షి యతని కొఱకు రాజసౌధమునకు పోదమనుకొన్నది. కాని యట్లు చేయరాదను కొన్నది. ఉన్నన్ని నాళ్ళుండవచ్చెనా, యిక తొందఱలో రావచ్చు ననుకొన్నది. తొందరపడి సంఘమర్యాద నుల్లంఘించుట యేలననుకొన్నది. వీరభూపతిని గూర్చి యామె యూహించినపుడెల్ల నామెమొగముచివరలు రేఖాసౌష్ఠవసీమలును, కనులు జ్యోతిరాస్థానములు నగుచుండెను. ఆమె యొడలంతయు పులకరించి నట్లుండెను.

ఈ మహాప్రేమలో నామెకు, వీరభూపతికితనయెడ నెట్టిభావమున్నదో తెలియలేదు. తన పూర్వనైర్మల్య మంతయు కుట్టాన్ తపస్సుచే పరిక్షాళితమై పోయిన దనుకొన్నది. వీరభూపతి వంటి బుద్ధిశాలి కందలి నమున్నతార్థము గోచరింపకుండుట దుర్లభ మనుకొన్నది. వీరభూపతి యీ యంతఃపురాశ్రయము పని యొత్తిడి వలననే కలిగె ననుకొన్నది. రాజు పోయిన క్రొత్తరిక మా యూహకు బలమిచ్చినది

నాడు శ్రావణశుద్ధదశమి. ఆకసమున మొగిళ్ళు కృష్ణసారమృగములవలె, అగురు ధూపముల వలె, ఎలుగుబంట్ల వలె, ఏనుగుగున్నల వలె- దుముకుచుండెను, వ్యాపించుచుండెను, కదలకుండెను, ఘీంకరించుచుండెను తూరుపున పట్టిన మబ్బు చుట్టుపట్లనున్న పదిమబ్బులు కలుపుకొని వాన యొలుకబోసినదే యనిపించినది కాని యింతలో నొక పెద్ద గాలివచ్చి దానిని పునరేకా దశగా విడబఱిచెను సూర్యుడు మాత్ర మప్పుడప్పుడు పలుచని మబ్బులలో నుండి మందరశ్ములు వెలయించునేగాని యింతలో మరల నొకనల్ల కానుగుల గుమ్మువంటి మేఘముద్గమించి యతని లోకమును వేరుపఱచును.

ఒంటరిగా నున్న మీనాక్షి కేమియు తోచలేదు. ఆమెకు వీరభూపతి దగ్గరలేమి వియోగభారము కనిపించలేదు ప్రతిక్షణ మతని రాక నెదురుచూచు నామెదేహమునకు మాటికి క్రొత్తక్రొత్త పులకలచే గరికలు దాల్చుచుండెను ఆమె కింతలో ఏకవీర వద్దకు పోవలెననిపించినది ఇదివఱకామె యేకవీర యింటికి పదిసార్లదాక పోయి యుండవచ్చును ఏకవీరయనిన మీనాక్షికి చెప్పరానంత ప్రేమ యున్నది ఆ ప్రేమకు కారణమున్నది ఆమెను చూచినంతనే మీనాక్షికి తన జీవితమంతయు జ్ఞప్తికి వచ్చును తన జీవిత రహస్యమంతయు నొక గుళికవలె నామెలో నున్నట్లనిపించును కాని యేకవీరకు మీనాక్షి మీద నేటి ప్రేమ? మీనాక్షి యేకవీరకు స్థానాపతి భార్య స్థానాపతికి తనభర్తకు స్నేహము. స్థానాపతి కుద్యోగ మిప్పించినది తన భర్త అందుచేత కూడ తన యందు మీనాక్షికి ప్రేమ కలుగ వచ్చును అయినను అంత ప్రేమ చూపుచున్న మీనాక్షిని హృదయములో తాను ప్రేమించలేక పోయినను, లోక మర్యాద యెంతవఱ కభిలషించునో అంతవఱ కామెను ప్రేమించునట్లు వ్యక్తపఱచు చుండెను అందుకనియే యింతవర కిల్లుకదలని యేకవీర రెండుమూడుసార్లు స్థానాపతి యింటికి వెళ్ళినది వెళ్ళినది, కొంచెముసేపు మాత్రమే యుండి తిరిగియు వచ్చినది మీనాక్షి యామెకు తమ యిల్లంతయు చూపించ నెంచినది ఏకవీర యామెకెడ మీయక వెళ్ళినట్లే వెళ్ళి తిరిగి వచ్చినది మీనాక్షి సహజముగ వివేకవతి లోకుల భావములు వారి ప్రవర్తనల వలన తెలిసికొను నేర్పు కలదియు కాని, యిప్పటి యామె స్థితియొక

తన్మయత్వముగా నున్నది. తన తొల్లిటి ప్రేమ, దాని పరిణామము, తన యిచ్ఛలేని తల్లిదండ్రుల బలవంతపు వలన పెండ్లి, ఆ వచ్చిన భర్త తనయిచ్ఛనడిపినవాడు, దైవాద్వా కుట్టాన్ కలయిక, అతని మహత్తర త్యాగము ఈ విచిత్ర సంఘటన మెల్ల నామె యెడందలో దేనిని గూర్చియు నాలోచించుట కెడమియ్యలేదు. తన వివాహమైన నాటినుండి తనపతి యెడల తనదోష మామెను వేధించుచుండెను ఇతరమైన యేసంగతిని గూర్చి యూహించుటకు తావియ్యని యామె మనస్సు తన శక్తినంతయు నీ వైపునకు త్రోసినది. దివారాత్రము లామె వీరభూపతిని గూర్చియే యూహించుట! ఏకవీర తనయెడల నెట్లు ప్రవర్తించినది ఆమెకు గుర్తు లేదు నాడు మఱల నేకవీరను జూడబో వెంచి శకట వాహకుని పిలిచి బండి యాయత్త పఱుపుమనెను

తాను దలదువ్వుకొని, క్రొత్తచీర దాల్చి, నగలు ధరించి ముంగిట నిలిచి శకట మారోహించి బయటికి వచ్చెను ఆమె పొద్దున నొక సేవకుని వీరభూపతిని నాటి రాత్రికి రమ్మని కబురంపినది. వాడు వచ్చి స్థానాపతి రాత్రికి వత్తునని చెప్పిరని వార్త తెచ్చినాడు వానిని పంపించి మీనాక్షి బండిలో కూర్చున్నది

బండిలోకూర్చున్న మీనాక్షి కన్నులలో వీరభూపతి యాడినాడు ఎట్టి మానిసి! శాంతమైన వదనము! ఎట్టి మొగమున నల్లని మీసముల చివరలు మెలికలు తిరిగి తామర మీద తుమ్మెద లాడి నట్లునికి! ఆజానుబాహువు! చక్కని కన్నులు! ఎప్పుడునవ్వుచున్న మొగము. మీనాక్షి తా గప్పుకొన్న బంగారుపూవుల గల తెల్లని పట్టుసేలువ లోపల రెండుచేతుల ప్రక్కలకదుముకొని, కన్నులు మూసికొని, బండిలో నొకవైపున కొదిగి కూర్చున్నది వీయుచున్న చల్లని గాలి, తెరల సందుగా లోనికి దూరినది మీనాక్షి కన్నులు మఱింత మూసికొని, నక్కినక్కి మూలమూల కొదిగియొదిగి కూర్చున్నది

ఆ శకటము రాజదత్తము ప్రధానాధికారులకు ప్రతివారికి రాజుగారి శకట మొకటి కాదు. అది యిది బండికి నాల్గుచక్రములు క్రొత్తరంగు నందీశ్వరుని వంటి రెండువృషభములు బండికి కట్టబడెను బండివాడు, బహుప్రయత్నమున వృషభముల నంకెకు తెచ్చుచున్నాడు బండికి నొగవద్ద స్థానాపతి పేరున్నది ఎద్దుల వీపులమీద కప్పబడిన యెఱ్ఱని పట్టు సెల్లాల మీద స్థానాపతి పేరు వ్రాయబడినది ఎడ్ల కొమ్ములు కొనదేరి చివరల పొన్నుపొన్ను లమర్చబడి యున్నవి అద్దాలు, మువ్వలు, చిరుగంటల నమర్చిన వెండ్రుకలత్రాళ్ళ పికమూరులు, మెడలకు గంటలపట్టెడలు, నాలుగుకాళ్ళకు వెండ్రుకల త్రాళ్ళు ప్రకాశించు రెండువృషభములు దక్షయజ్ఞధ్వంసవేళ వీరభద్రుని వెన్నాడిన నందీశ్వరభృంగీశ్వరుల వలె నురుసులు క్రక్కుచుండెను. పార్వతీదేవికి హిమవద్రాజు పంపించిన సారెవలె, మీనాక్షి దేవికి ప్రతిసంవత్సరారంభవేళాకృత కళ్యాణార్థపరిగుంఫిత మంటపమువలె ఆ బండి వీధివెంట జరజర దొరలిపోయినది.

బండి సేతుపతి సౌధము ముందాగినది ఆగి నెమ్మదిగా అంతఃపుర ప్రదేశముకడకు పోయినది ఏకవీర గవాక్షము నుండి మీనాక్షిని చూచి మేడ దిగివచ్చి యామెను కలిసికొన్నది మీనాక్షి యేకవీరను చూచినది.

ఏకవీర యానాడు తెల్లని పట్టుచీర ధరించినది. శిరోజము లభ్యంజన మాచరించినట్లు పొడిపొడిగా నున్నవి. ఆమెకనులలో నొక లౌల్యమున్నది. అది లౌల్య మనుట కన్న మోహనత్వ మనిన బాగుండును. కంచుకముకూడ బంగరు పూవులు గల తెలిపట్టుది. అపుడామె తెలిమొగిలుపారవలె నున్నది. ఆనాడామెను మీనాక్షి చూచినంతనే పూర్వమామె నెప్పుడో చూచితి ననిపించినది. ఉలికిపడి మరలచూచినది. ఇంతలో పరిచారిక తెచ్చిన యెఱ్ఱసేలువ నేకవీర కప్పుకొన్నది. మీనాక్షికి మఱల తనపరిచితురాలే కనిపించెను. ఏకవీర వివాహమైనది మొదలు ఆకుపచ్చ చీరలు ధరించును. సర్వావయవముల యందు ఏడు వారముల సొమ్ములు తాల్చును. వివాహాత్పూర్వము తెల్లని పట్టుచీరలు తాల్చెడిది. తలయెప్పుడు పొడిపొడిగా నుంచుకొనెడిది. వివాహానంతరమున తెల్లచీర తాల్చినది, కుట్టాన్ తనశయ్యమీద నామె నిద్రించినది చూచిన రాత్రియే మొదటిసారి. అది మొదలు కుట్టాన్ పెట్టిన గడువు మొదలు నెల నెల కమావాస్యనాడు తాల్చుచు వచ్చినది. గడువు రెండేండ్లు గడచినది. ఏకవీరకు కుట్టాన్ మాటల యందు నమ్మకము పోయినది. మనసు క్రమక్రమముగా తాను తొల్లి ప్రేమించిన యతని మీదికి తిరుగుచు వచ్చినది. అతనినిగూర్చియూహలు వచ్చినప్పుడెల్ల ఏకవీర తెలియుడుపులు ధరించు చుండెను.

ఏకవీర కతని యూరుతెలియదు. అతని పేరు తెలియదు. మఱి యేమి తెలియును? చంద్రసుకుమార మైన యతని మొగ మెఱుగును. అతని దీర్ఘాకృతి తెలియును. అతని సూదుల వంటి కనులు తెలియును అతని తుమ్మెద ఱెక్కల వంటి మీసములు తెలియును. ముందు పాయలుగా తీసి వెనుక ముడికొదిగిన యతని కేశ పించము తెలియును. తమ యిద్దరినడుమ త్రెంచరానిదిగానున్న స్వచ్ఛ ప్రేమ బంధము తెలియును. తన మొగములోని సౌందర్యమంతయు తాను తెల్లచీర ధరించి తల పొడిపొడిగా నుంచినప్పుడు పట్టరానిదిగా నుండునని కూడ నామెకు తెలియును వివాహమైన రెండు సంవత్సరములుగా ఏకవీర యాతనిని మఱచిపోయినది అతని స్థానమున కుట్టానునకు వసతి నిర్మించినది కుట్టా నావసతిలో నిలిచినాడుకాడు తాను నిర్మించిన ప్రేమసౌధమునకు కుట్టాను తీసిన నిర్దయాద్వారమునుండి తన తొల్లిటివలపుకాడు ప్రవేశించినమాట యేకవీర కవగతము కాలేదు తన కిప్పుడు పెరిగిన తెల్లపట్టుచీరల మీద మక్కువ వెదకి చూచుకొనలేదు. తన తొల్లింటి ప్రేమమూర్తి యామెకనులకు కట్టినట్లుండెను ఆమె యతని ప్రత్యక్షమైన మూర్తినిగూర్చి, దాని విలుకడను గూర్చి వితర్కించుకొనలేదు. అది యామెకు సర్వలోకములనుండి తాను గుప్తపఱచుకొన్న ధనము. ఆ ధనమునకు సాధనము యాదార్థ్యమునకు దవ్వైనది. అందుచేత నామె ధర్మబుద్ధియై యా ధనము మాట మఱచిపోయినది ధర్మములోఁడి ధనము నభిలషించినది. ఈ క్రొత్తధన మామెకు స్పర్శదూర మధిగమించినది. ఈ రెండుధనము లామె కయథార్థములైనవి మొదలిధనము మధురప్రేమమయమైనది రెండవ ధనము ధర్మ ప్రేమ మయమైనది. తనకు దూరములైన యీ రెంటిలో నేది మనస్సున నిల్పుటకు యోగ్యమైనదో ఆమెకు తెలియలేదు. తెలివికొలది

రెండవదానిని మనస్సున నామె నిలుపును. తనకు తెలియకుండ మొదటిది తాను వచ్చి తన మనసాపహరించును. ఆ యావృతి యామెకు తెలిపీ తెలియ నట్లుండును.

తన్ను చూచినంతనే మీనాక్షి యులికిపడిన దెందుకా యనుకొన్నది ఏకవీర! మఱల, తన సౌందర్యమునకు ముగ్ధురాలయిన దని సమాధానము చెప్పుకొన్నది. ఇంతలో నిద్దరు తొల్లింటి పరిచితలవలె మాటలాడుకొనిరి. ఆ యులికిపాటు మీనాక్షి మఱచి పోయినది. ఏకవీరకు మఱపురాలేదు.

ఇరువురును జాజిపందిరిక్రిందుగా ఏకవీర గదికి పోవుచుండిరి. ఒక పసరు మొగ్గ యేకవీరపై పడినది. ఒక పచ్చియాకు మీనాక్షిపై పడినది. పందిరి యంతయు వర్షము కొఱకు నెదురు చూచుచున్నట్లు చెదరుపూలు విరిసినవి. వర్షమును రమ్మన్నట్లు చిన్నగాలికి ఆకులు కదలు చున్నవి. పందిరిలో చీకట్లు క్రమ్మినవి.

ఆకసమున పడమటదిక్కున బురదవలె వ్యాపించిన నల్లని పెద్దమేఘము నుద్వృతిచూచి, బండివాడువర్షాశంకి, శకటమును దూరానవున్న శకటములు నిల్పు చావడికి కొంచుబోయి యెద్ల తల్రతాళ్ళు చక్రములకు బిగించికట్టి సేతుపతుల శకటసారథుల పసిపిల్లలలో ఎనిమిదేండ్ల బాలికతో ప్రసంగములోనికి దిగెను. దానిపేరు అమృతము

**పిల్ల** - ఎవరు వచ్చినది?

**బండివాడు** - స్థానాపతిగారి అమ్మవారు.

పిల్ల పరికిణీ తొడపైకి లాగి జనపనార త్రాడు పేనుచుండెను. ఆపిల్ల తలవెంట్రుకలు సంస్కారహీనములైన రాగిబొచ్చువలె దాని మొగముమీద వ్రాలుచుండెను. త్రాడు పేనుచుండగా ఆ పిల్లకు తొడ మంటపెట్టి యుమ్మితీసి తొడకు రాచుకొని బండివానివంక చూచి యతడు తనవంక చూచుట లేదని మఱల తన త్రాడు పేనుకొనుచుండెను చల్లని యాదురు గాలి యొకటి వచ్చి యా పిల్ల తలమీద నెండుతుంగ గుబురు మీదవలె యథేచ్ఛముగా విజృంభించెను. దాని కనులలో చల్లగాలి చొఱబడి చిన్నకన్నీటి బొట్లు తెచ్చెను

**బండివాడు**- కుట్టాన్ సేతుపతి మహారాజులుంగా రెప్పుడు వత్తురు?

**పిల్ల** - ఎవరు?

**బండివాడు** - బాబుగారు

**పిల్ల** - బాబుగారా! (అని ఆగి) నాకు తెలియదు

చిన్నతుప్పర మొదలుపెట్టెను. అది పెద్దవర్షమునకు మొదలని బండివాడనుకొనెను. పిల్లలేచి చూరుదాక పోయి తన చేతులు వానలో చాచి చేతులు తడిసిన తరువాత రెండు చేతులు మొగమున రాచుకొనెను. బండివానిని చూచి నవ్వెను. అంగడినుండి యేవో సరుకులు కొనితెచ్చు సేవకుడు, తడిసి పోదునని తొందరగా నడచుచుండెను. తుప్పర పెద్దదయ్యెను గుఱ్ఱపుసాలలో కట్టివేయబడిన గుఱ్ఱములు, పెద్ద చినుకులు నేలపై ఆకులపై బడి చేయు సవ్వడికి కనులు పెద్దవిచేసి వెనుతిరిగి చూచెను. ఒక గుఱ్ఱము సకిలించెను ఆ సకిలింపు నందిపుచ్చుకొని గుఱ్ఱము

లన్నియు పకిలించెను. ఆరుబయట నున్న తడియారని వస్తువులను పరిచారికలు లోనికి తీసికొనిపోవుచుండిరి.

ఇరువురు కలసి లోనికి పోవులోపుగా ఏకవీర సేలువంచు తడిసినది. ఇరువును గదిలో పట్టుపరుపులపై కూర్చుండిరి ఒక పరిచారిక వచ్చి యేకవీరపై సేలువ తీసి దులిపి దూరమున గాలి కారబెట్టెను ఇంకొక దాసి మఱల నింకొక సేలువ తెచ్చులోపల మీనాక్షి చకితయయ్యెను. ఎక్కడనా యీమెను జూచితి నని ఆమె పోల్చుకొనలేక పోయెను. మీనాక్షి యాకదలిక యేకవీరకు తెలియక పోలేదు. ఆ కదలికకు ఏకవీర చెప్పుకొన్న యర్థము వేరు.

మీనాక్షి గార్హస్థ్య వృత్తాంతము ఏకవీరకు తెలియదు. ఏకవీర సంగతి మీనాక్షికి తెలియును. మీనాక్షికి తెలియునని యేకవీరకు తెలియదు. ఏకవీర యూహలో తమ ప్రేమల గూర్చినంతవఱకు ఒకరిసంగతి నొకరు తెలియరాని గూఢత చేసి గౌరవమునందు సమానప్రతిపత్తి కలదని విశ్వాసము. మీనాక్షికి స్థానాపతికి గాఢప్రేమము కాబోలును. లేకున్న మీనాక్షి కింతయుత్సాహ మెక్కడిదని యేకవీర! మీనాక్షి యూహలో ఏకవీర రహస్యము తనకు తెలిసియునికి అసమాన ప్రతిపత్తి' ఆమెరహస్యము తనకు తెలిసియుంటజేసి యేకవీరయనిన నొక విధమైన లోకువ - ఆ లోకువతనములో అగౌరవ మీషత్తును లేదు ఆరహస్యము తెలిసిన మీనాక్షికి ఏకవీరతో చనవు సహజముగా పుట్టినది. ఈ సంగతి తెలియని యేకవీర కా చనవుభాగ మవగతము కాలేదు

స్త్రీలు సామాన్యముగా కలిసికొన్నప్పుడు తమ భోగములను గూర్చి ఎదుటివారికి తెలియజేయుట యలవాటు దొడ్లు, త్రోవలు, పడకగది, జవాహిరీ యితర స్త్రీలకు చూపించి వారి దృష్టిలో తాము గౌరవము సంపాదించుకొనుట స్త్రీలకు సహజము. ఇన్నిసార్లేకవీరామీనాక్షులు కలిసికొనినను మీనాక్షి యా ప్రసంగము తెచ్చినది కాదు. ఏకవీర కనుమానము తమ వైముఖ్యము స్థానాపతికి తెలియునని కుట్టాన్ తనకు చెప్పినాడు స్థానాపతి భార్యతో చెప్పియుండవచ్చును ఇది యేకవీరకు మనస్సులో నొక కష్టశల్యము

ఆ నాడేకవీర మీనాక్షిని తీసికొనిపోయి ఇల్లంతయు చూపించెను ఆ మహాసౌధమున నున్న శిల్పమునకు, వైశాల్యమునకు, భాగ్యమునకు మీనాక్షి తల తిరిగిపోయెను చివరకు పడకగది చూపించెను ఆ యెత్తయిన మంచము, ఆ మంచమునందలి పసితనము, గోడలలోనున్న దేవతావిగ్రహములు మీనాక్షి కది యొక స్వర్గమనిపించినది ఇరువురును మెల్ల మీదుగా పెద్దమంచముపై కెక్కి దానిమీద కూర్చున్నారు బయట జాజిపందిరిమీద చినుకులు పటపటధ్వనులు చేయుచుండెను. చల్లని గాలి గవాక్షము గుండ గదిలోనికి "జొంయి" మని పోసి కొన్నది ఇద్దఱ సేలువలు తొలగిపోయినవి వారు మఱల సర్దుకొనలేదు మీనాక్షి మనస్సులో నొక వర్షాకాల గాఢనీలాపిలశర్వరీ మధ్యవేళా గగనభాగ పరివ్యాప్త కాలమేఘగర్భ భేదియైన సౌదామిని మెఱసి మఱల గాఢాంధకారములు క్రమ్మివైచెను పరిక్షాళితమైన యొక పాపవాంఛాస్మృతి యామె మనసు లోతులలో సంగతమయ్యెను లోని మాధుర్యానుభవము ధర్మభీతి నంకురించనీయలేదు ఏకవీరపయ్యెద తొలగెను

నేత్రము లర్ధనిమీలితములయ్యెను. వాన జోరు మని కురియుచున్నది. వంతెన క్రింది తూములనుండి నిండుకాలువ నీరు పడబోసికొన్నట్లు మరల నీదురుగాలి గదిలోనికి పొసుకున్నది. మంచముపైన దుప్పటి లేచి వారియిరువురిపై పడ్డది. ఆ గాలిచలి కాగలేక యేకవీర తన సేలువ తీసి కప్పుకొని లోని తన దేహము ముడుచుకొన్నది. ఆ గాలిచలి కొడలు పులకించి మీనాక్షి కంచెలముడి సడలనిచ్చి యెదుఱొమ్మున వానచినుకులు పడి రెండు చేతులుచాచి చల్లని గాలిని కౌగిలించుకొన్నట్లు చేతులెద నదుముకొన్నది.

కొంత సేపటికి వాన వెలసినది. బండివాడు శకటము తెచ్చినాడు. మీనాక్షి వచ్చి శకట మధిరోహించెను. బండి తరలిపోయెను. బండిలో పోవుచున్న మీనాక్షి కన్నులు ఏకవీరకన్నులు కలిసినవి. అదే వీడుకోలు! వచ్చినది మొదలు వెళ్ళువరకు మీనాక్షికి ఏకవీరకు నొకమాటయైన జరుగలేదు. ఏకవీరకు విచిత్రమైనది సేతుపతుల సౌధము దాటిపోవుచున్న మీనాక్షికి చెరసాలనుండి బయటపడ్డట్లయినది. ఆమె పెద్ద యూపిరి తీసికొన్నది. వానచేత రాచబాటంతయు తడిసినది. దారిప్రక్క నీళ్ళు నిలిచినవి. ఇంతవాన కురిసిన దని మీనాక్షికి తెలియనేలేదు.

వర్షర్తువు సకలముఖముల విజృంభించినది. గగనకూటపు టెల్లలయందు గుంపులు గుంపులై మవ్వపుశంపల వంపులు సాగుచాళ్ళు హరించినవి. మొగిళ్ళుఱంపిలి నల్లైపల మెరసినవి. ఆకాశమునందు దూరమునుండి రివ్వుమన్నసవ్వడి వరుసకట్టిన బలాకముల టెక్కలదో, పరుగెత్తుకొనివచ్చు వానజల్లుదో తెలియుటలేదు భూతమాంత్రికుని చేత బలాత్సమాహూతయైన యొకశక్తి, వాయుపీఠికల వేదించుకొని వచ్చినట్లు; వాయువులు పెల్లురేగి, మహోద్యానములో విజృంభించినట్లు; నిశ్శబ్ద నిశావేళ తుఫాను రేగిన సముద్రపుహోరు వినవచ్చినట్లు దూరమునుండి వానజల్లుల స్రోత వినవచ్చి జనులు వెనుదిరిగి చూచుచుండిరి. వడగళ్ళకై వెదకులాడి యొక చప్పని వడగల్లు నోట వైచుకొని పిల్లలు తమకు తగిలిన దెబ్బలు మఱచిపోవుచుండిరి అందందు చిన్న పడెలుపడెలుగానైన వాననీళ్ళలో గోరంకలు దంపతియుక్తముగా కీచుకీచుమని టెక్కలు తడుపుకొనుచుండెను. శిశిర చంద్ర జ్యోత్స్న, కలహాంతరితవోలె జలదాంతర్నిగూఢబాష్పయై విముఖ కా, మొగలిపొట్టలలో నీరు నిలిచి ఖండిత సజల దీర్ఘ సితాపాంగ భ్రాంతి కల్పింప, రాజహంసి భీతయై ప్రోషిత భర్తృకవలె తామర తీగ గొడుగాకు క్రింద తలదాచుకోగా, నెమ్మి పురివిప్పి స్వాధీనపతికవలె నృత్యాభిరామమూర్తి కా, మందార పూవును వదలి రాలేక రాలేక వచ్చిన తుమ్మెదయెడ నెఱ్ఱ గన్నేరు ఈర్ష్యాకషాయిత కా, వాసకసజ్జికవోలె నలంకరించుకొని కడిమి మేఘనాథునకు స్వాగతము పూన, బలాకాపాంగ మేఘనీలపట పరివృత యాకాశలక్ష్మి కాలపురుషుని అభిసరించ, విప్రలబ్ధా కృశీభూత దేహయష్టివలె పోకమ్రాను పై మొవ్వులోని యాకులవెంట కన్నీరుగార్చ, వర్షాశ్రీ సర్వరసాకృతివలె మోహనాతిమోహన యయ్యెను. నాగలికట్టున లాగుచున్న పాలముకాపు టెద్దుండియుండి తన మొగమున నిలిచిన వాననీరు తల కదల్చి విదల్చుకొనుచుండెను. పెద్దచినుకు, రాయిపెట్టి కొట్టినట్టు పడగమీద విసురుకొనగా బుస్సుమని యెగిరి కోడెత్రాచులు గాలికబళము ప్రక్కవాటుగా కొరికి, దున్నిన మెట్టచాలుల వెంట పొలము కోరడివెంట కంచెలలోని

పుట్టలకు పరువులెత్తెను. ప్రాచిపట్టిన పెద్దపొలము బావుల నీటియగ్గపు కొండరాళ్ళు వెలికివచ్చి ప్రక్కదారులబడియున్నట్లు, బావురు కప్పలు వర్షాలక్ష్మి లంబాడియువతి వేషము వేసి కాల ధరించిన నత్తగుల్లల గొలుసుల బొణుగురు రవములవలె రాత్రిందినము లొకటేయఱపు లఱచినవి. వానవెలిసి క్రింద బురద, పైని తూనీగలాడుట, గాలిలేమి సాయంసమయములందు పొలము కాపులకు కిచాటై పోయినది.

౦౯

ఆ సంవత్సరమున శ్రావణశుద్ధమునందే వర్షములు విజృంభించినవి కాళయ్యార్ కోవెలలో ఉదయన్ సేతుపతి కోటకట్టి కొంతసైన్య ముచట కాపుంచెను హఠాత్తుగా నుదయన్ సేతుపతి వెళ్ళిపోవుటయు, కుట్టాన్ సేతుపతి వచ్చుటయు, సూచనగా రాజువ్యాధి, యాయనమృతి-రామనాథమున వార్తగా పొక్కి వ్యాపించెను కుట్టాన్ కుఱ్ఱవాడు. అతని ప్రతాపమెఱుగని కాళయ్యార్ కోవెలలోని దోపిడి గుంపులకు అతడన్న భయము లేకపోయినది చెదరిపోయిన గుంపులను చేరదీసికొని యొకనాటి రాత్రి హఠాత్తుగ పోర్చుగీసువాడొకడు నాయకుడుగా కాళయ్యార్ కోవెలదుర్గము ముట్టడింపబడెను. లోన రెండువందల సైన్యముమాత్రమే యున్నది. వారే కోట తలుపులు మూసి యుద్ధమిచ్చిరి. రెండువందల మంది మధుర రాజసైనికులు నిరాయుధులై బయట నుండి పోయిరి

ఈవార్త కుట్టానునకు మఱునాడు ప్రొద్దున తెలిసెను అపరికే దుర్గము శత్రువులకు స్వాధీనమైయుండునని వార్తాహరులు చెప్పిరి కుట్టాన్ మాటాడలేదు మఱల మఱల రాయబారులచేత నడుగబడి కుట్టాన్ తానిప్పుడు రామనాథము వదిలి వచ్చుటకు వీలులేదనియు, తాను వచ్చినచో రామనాథములో అల్లరులు పేటురేగ వచ్చుననియు చెప్పి వారిని పంపించెను రాయబారులు విషణ్ణవదనులై వెడలిపోయిరి ఈ వార్త రామనాథమున వ్యాపించెను కాళయ్యార్ కోవెలకును వ్యాపించెను కాని రామనాథమున, పట్టమంగళమున దుర్గములు యుద్ధమునకు సిద్ధము చేయబడుచుండెను. రాజసైనికు లాయుధములు పదును పెట్టుకొనుచు కోటలోనికి సాధన సామాగ్రి సింపుకొనుచు ముట్టడి కెదురు చూచుచున్నట్లు తోచిరి అందఱును కాళయ్యార్ కోవెల శత్రుహస్తగతమైన దనుకొనిరి లోని సైనికులు నిరాశులైరి వారిలో కొందరు కోట శత్రువులకు స్వాధీనము చేయుదమని, మరికొందఱు వద్దని వాదాడిరి కోట వెలుపల నాలుగువందల మంది ప్రజలు-కత్తులు, కటారులు, తుపాకులు నున్నవిగాని వారికి గుఱ్ఱములు, నేనుగులు, ఫిరంగులు లేవు మూడవనాటి సాయంతనమున ముట్టడి. ప్రజలు కోట తలుపులవద్ద ద్వారభేదన ప్రయత్నములు చేయజొచ్చిరి. వారందఱిలో నొక యువకుడు మిగుల నుత్సాహము చూపుచుండెను అతడు సుళువుగా తక్కినవారి హృదయ మాకర్షించెను గడ్డపలుగులతో భేదించి పెద్దదూలములను ద్వారముల కానించి రెండువందలమందిపూని నెట్టి తలుపులు భేదించవీలులేక చివరకు నొక యుపాయ మా యువకునికి తట్టెను- తలుపు క్రింద చిన్న గొయ్యిగా త్రవ్వి తమవద్దనున్న తుపాకి మందు దానిలోకి కూరి యగ్ని ముట్టించవలెనని అందరును సంతోషించిరి గుంపులోనున్న పోర్చుగీసువారు కూడ

శ్లాఘించిరి. ఈ ప్రయత్నములు లోపలివారికి తెలిసెను. వారిలో వారు క్రిందమీద పడి తలుపులు తెఱచుటకు నిశ్చయించుకొనిరి. ఆ వార్త బయటనున్నవారికి తెలియజేసిరి. జయజయధ్వానములు పిక్కటిల్లిపోయెను. కాని తలుపులు తెఱవబడక పూర్వము కొన్ని షరతులకు వారంగీకరించవలెను. కోట కధికారి హిందువుడే యై యుండవలెను. లోపలనున్న సైనికులు కూడ కలిసెదరు. వారిని గూడ ముట్టడివారిలో చేర్చుకోవలెను. కొంత విచార ణయైన తరువాత ఈ షరతుకు ముట్టడి వారిలోని పోర్చుగీసులు కూడ నొప్పుకొనిరి. సంధ్యారాగము కృశించి చీకట్లలముకొనువేళ కోట తలుపులు తెఱచిరి. లోని వెలి సైనికులు మొదట బెరుకుతో, తరువాత చిరునవ్వుతో మఱి కొంతసేపటికి కొంత చనవుతో కలిసికొనిరి. ఇరుపక్షముల వారును పెద్ద కాగడాలవెలుతురున పథచేసిరి. కోట యెవరి యొద్దికలో నుండవలయును? మఱల రాజసైన్యము వచ్చి ముట్టడివేసినచో కోట నెట్లు రక్షించవలెననియు ప్రశ్నలు బయలుదేరెను. కోట ముట్టడివేళ ఉత్సాహము నెఱపిన యువకుడు కోట నాయకుడని తీర్మానించినచో అతడే తక్కిన సంగతులు విచారించుకొనునని చెప్పగా అందఱును సంతసించిరి పోర్చుగీసుల ప్రాముఖ్యము మనస్కరించలేదు. కాని వారి సంఖ్య ముప్పదికి మించిలేదు. అందుచే వారు నంగీకరింపక తప్పినది కాదు. సర్వజనీనముగా ఆ యువకుడే కోట కధికారిగా ఎన్నుకొనబడెను.

అతడు మఱునాడు కందకము బాగుచేయించెను. క్రొత్తగా నీరు పెట్టించెను. కోటగోడ సడలిన చోట బాగుచేయించెను ముట్టడివేళ బయట మిగిలిపోయిన రాజసైనికులకు కబురంపి వారిని గూడ రప్పించి యందఱిని కలియనిచ్చెను. ఊరిలో నున్నవారిలో ఎవరైన దండులో చేరెడి వారుండిరేమో యని వెదకింపగా ఉత్సాహము కొంది రెండువందలమంది వచ్చి చేరిరి సైన్యము వెయ్యిమంది యయినది. వెయ్యిమంది సైన్యమును పది భాగములుగా చేసి కోటలోనున్న రాజసైన్యములోని వారిని ఆరితేరిన వృద్ధులను తొమ్మండుగురను తానును పది భాగముల కధికారులనుగా స్థిరయించెను, పోర్చుగీసువారిని ముప్పది మంది నొక భాగములో నుంచి, తక్కిన సైన్యమునుండి యీ భాగములోనుండుట గౌరవ మనుకొన్న వారి నందఱను తెప్పించి యీ భాగములో చేర్చెను ఈ భాగమునకు తానేనాయకుడు. తాను వారిని మిక్కిలి పొగడి కోట యెద్దడివేళ వారే సహాయపడవలెనని యుద్బోధించి తక్కిన తొమ్మిదివందల మందిని కోటకు నాల్గువైపుల నాల్గు రెండువందల నునిచి వందమందిని తనకు ననుచరులుగా నేర్పఱచుకొని యీ పోర్చుగీసు భాగమునకు పని నేయపఱుపక వదలెను, కోటకు మిక్కిలి యపాయము వేళగాని వారిని కదల్చరాదని చెప్పెను. వారును ప్రమత్తులై యథేచ్ఛముగా ఊరివెంట తిరుగుచు కోటకు వచ్చుచు పోవుచుండిరి రెండుమూన్నాళ్ళయిన తరువాత నాయకుడు వారిని గ్రామములోనికి పోవునపు డాయుధములను కోటలోననే వదలిపోవలెనని యాజ్ఞయిచ్చెను వారు ప్రమత్తులై త్రాగి యీ రెండునాళ్ళు గ్రామములో చేసిన యల్లరుల మూలముగా ఈ యాజ్ఞ సైన్యమంతకు సమంజసముగానే కనబడెను ఆనాటి రాత్రి పోర్చుగీసు సైన్యభాగము కోటలోనికి రాలేదు. రాతిరి కోట తలుపులువేయబడెను. వారు

వెళ్ళిపోవునపుడు వారాయుధములు కోటలో వదలియే పోయిరి. ఆ రాత్రి నాయకుడు సభచేసి వారారాత్రి కోటకు రాకపోవుట దోషమని నిరూపించి నెమ్మదినెమ్మదిగా-వారు గర్వముగలవారని, పోర్చుగీసువారిని నమ్మరాదని, వారిని తాను పొగడిన పొగడ్త యబద్ధమని, వారెవ్వరునుగాని తక్కిన వారికన్న పెద్ద నిపుణులేమియు కాదని, సైన్యము మనస్సు వారి యెడల విముఖతగా చేసెను. రాజసైన్యము మీద తిరుగుబాటు చేసిన ముట్టడికి నాయకులనందఱను నాయకు డా భాగములోనికి తీసెను. నాయకుడు వారిని గూర్చి చెప్పుచు వారే ముట్టడికి ప్రధానులని, మొన్న రాజసైన్యము మీద తిరుగబడిరి, రేపు తమమీద తిరుగబడెదరని చెప్పెను. సైన్యములో ఎక్కువ భాగము వారి యెడల విముఖత దాల్చెను. ఆ పెద్ద సభను వదలి నాయకుడు సైన్యభాగముల నాయకులను పిల్చి ప్రత్యేక సభ చేసెను. వారు తొమ్మండుగురు రాజ సైన్యములోని నమ్మిక బంట్లని నాయకునకు తెలియును. అందుచేత నాయకుడు వారితో నిట్లనెను: "రేపు ఉదయమే సేతుపతి ఫిరంగులను తెచ్చును. పదివేల సైన్యమైనను తెచ్చును. రాజసైన్యము ముందు మనము నిలువలేము. మనము పోర్చుగీసులను సహాయము పిలువవలెను. లేదా రాజునకు లొంగవలెను. ఇందు మీకేది యిష్టము."

పదిమందియు నొకరి మొగములొకరు చూచుకొన్నారు. నాయకుడు మఱల నన్నాడు - "మీరీ సంగతిపోయి మీ సైన్యములతో సంప్రదించి ఱేపు నాకు సలహానిండు. నేను ఱేపుదయమున పోర్చుగీసు సైన్య భాగముతో నొక సాహసకార్యమునకు పోవుచున్నాను. ఎల్లుండి సాయంకాలమున కిందుండెదను. ఈ లోపుగా కోట వీరయ్యప్పనాయకుని క్రింద నుండును."

వీరయ్యప్పనాయకుడు తెలుగుకాపు. మధుర రాజుల క్రింద పేరు మ్రోసినజోదు. ఏబది యేండ్లు దాటినవాడు. కోట యిట్లు దోపిడిగాండ్రి వశమగుటకు దుఃఖించుచున్నవాడు.

మఱునాడు పోర్చుగీసుసైన్యభాగము పొద్దుననే కోటలోనికి వచ్చెను వచ్చిన దాలస్యముగ అశ్వమీద సాయుధమై నాయకుడు ముందుగా గుఱ్ఱముల మీద కోటనుండి వెడలి పోయెను. వెనుక తలుపులు కిఱ్ఱుమను ధ్వనితో మూయబడెను.

నాయకునకు ముప్పది యేండ్లలోపు. నల్లనివాడు. కొంచెము పొట్టివాడు. విశాలమైన నేత్రములు, మీసములు నల్లగా తుమ్మెద ఱెక్కలవలె నుండును శరీర మాయసస్తంభము వలె నున్నది. అతని సేనానాయక లక్షణములను, గుఱ్ఱము మీద పోవు నతని లాఘవమును చూచి వెనుక నుండి సైన్యము- కోట గోడలమీదిది, అతని వెనుకవేవచ్చుచున్నది-యతని యెడల భయభక్తులు పెంచుకొన్నది. వింటవిడిచిన శరమువలె సైన్యము రెండుజాముల వఱకు స్వారీ చేసెను. నాయకుని యాజ్ఞ నొక చోట దిగివారు గడియసేపు విశ్రాంతితీసుకొనిరి. వెంట తెచ్చుకొనిన యాహారమును భుజించిరి. మఱల గుఱ్ఱము లెక్క యెక్కువ వేగముతో పోయిరి. సైన్యభాగమున నున్న దేశీయుల కందఱకు వారు రామనాథమును సమీపించుచున్నారని తెలియును. వారు తమనాయకుని యెడల నాశ్చర్యము పొందుచుండిరి అతని సాహసమునకు నివ్వెరపోవుచుండిరి. ఆనందపడుచుండిరి. ఆయానందములో నాయకుడు తమ

యెడం వెంలో యాన పెట్టుకున్నాడన్నందువలన కలిగిన గర్వము నున్నది. పొద్దు క్రుంక బోవు వేళకు రామనాథము చేరిరి. నాయకుడూరిబయట సైన్యభాగము నాపి యిట్లు చెప్పెను. "ఇది రామనాథము. రామనాథదుర్గవృత్తాంత మంతయు నాకు తెలియును. ఇప్పుడొక మహాసాహసము చేయుచున్నాను. ఇప్పుడు మీరందఱు రామనాథసైన్యపు దుస్తులలో నున్నారు. మీకేమియు గుర్తు పడిపోవుదుమన్న భయములేదు. ఈకార్యము నెగ్గినా మీయశస్సు దిక్కుల నిండగలదు" అని పోర్చుగీసు సైనికుల ముప్పదిమందిని ఒక భాగముగా, తక్కిన డెబ్బది మందిని ఏడు పదులుగా చేసి, మూడు పదులు తనతో రమ్మని తక్కిన నాలుగు పదులు కోట నాలుగు దిక్కుల నున్న ద్వారముల కడకు పోయి రాతిరి రెండు జాములవఱకు వేచి యుండుడనెను. ఆ నాల్గు పదులును విడివడి పోయెను. రివ్వున నలువది మంది సైనికులతో నాయకుడు కోటవద్దకు పోయెను. దుర్గద్వారము తీసియున్నది. నిరభ్యంతరముగ లోన ప్రవేశించెను. ప్రవేశించినంతనే కోట తలుపులు మూయబడెను. నాయకుడు రాజసౌధము వద్దకు శరవేగమున పోయెను. రాజసౌధము ముందు విశాలమైన ప్రదేశమున వేయిమంది యశ్వ సైనికులు కవాతు చేయుచుండిరి. నాయకుని చూచిన వెంటనే సైన్యమంతయు జోహారు చేసెను సేనానాయకుడు గుఱ్ఱమును నాయకుని వద్దకు తెచ్చి వంగి నమస్కారము చేసి "స్వామీ! ఏమి ఆజ్ఞ?" అనెను. నాయకుడు నవ్వి "సుందరేశ్వర నాయకుడా! మీకు పోర్చుగీసు బలంబులు కావలయునేని యీ ముప్పదిమందిని మీరు సైన్యమున చేర్చుకొనవచ్చును. తక్కిన ముప్పదిమంది కాల్బలము! వారికి శిక్ష చాలదు. గోవిందనాథుడు గారికి జెప్పి వారిని పదాతులలో చేర్చుకొనుడని చెప్పుడు" అనెను. వెంటవచ్చిన యరువదిమంది మొగములు వెలవెల బోయినవి అందఱును గుఱ్ఱములు దిగుటకు వెంటనే యాజ్ఞాపింప బడిరి. వెయ్యిమంది యాశ్వికదళము నెదురుగా చూచుచు వారేమి చేయుదురు? గుఱ్ఱములు దిగిరి. కొత్వాలు వారి పేరులు నమోదు చేసికొనెను. ఆ రాత్రి నాల్గుద్వారముల వద్ద కాచిన నలుబదుమంద్రు సౌజన్యముగా నాయకుని ప్రత్యేక దర్శనము పొంది రామనాథ సైన్యదళములో చేరిరి. ఆ నూరుగురు నీ విచిత్రమైన వంచనకే ముగ్ధులైపోయిరి, పరవశులైరి, బిత్తఱపోయిరి, కొందఱు కోపగించిరి. వారి కోపములు, చుట్టునున్న వేలకొలది సైన్యమును చూచినంతనే రంగువేసిన గుడ్డలతో చేసిన గులాబిపూల రంగువలె జారిపోయినవి. వారిలో కొందఱకు నాయకుడెవరో తెలిసినది కాదు. అందులో నొకనికి రాజసైన్యమున ఎఱిగినవాడొకడుండెను. వానిలో రహస్యముగ "ఆయన యెవరు?" అని యడిగెను ఆతడాశ్చర్యపోయి "నీవెఱుగవా? కుట్టాన్ సేతుపతి మహారాజాగారు. ఉదయన్ సేతుపతి మహారాజాగారి కుమారుడు!" అనెను. వానికి చేయి గుండెలోపలకు పోనిచ్చి గ్రుద్దినట్లయ్యెను. రాతిరి తెల్లవారు లా నూరుగురకు నిద్దుర పట్టలేదు వారిలో పాటు మఱినూఱుగురకు పట్టలేదు.

కడచిన మూడునాల్గు దినములుగా మబ్బు పట్టిన యాకాశము మఱునా డెండకాచినది. కాళయ్యార్ కోవెలలోనున్న నాల్గువందల రాజసైన్యము వారికి, బంధువులు స్నేహితులు రామనాథసైన్యమునుండి రెండువందల మంది యేరుపడిరి.

వారిలో కుట్టాన్ సేతుపతి కాళయ్యార్ కోవెలకు నాటి సాయంకాలము ప్రయాణమై యా మఱునాడు సాయంకాలమునకున నెమ్మదిగా కాళయ్యార్ కోవెల చేరెను. నాయకు డిబ్బడిసైనికులతో వచ్చుటచూచి కోట తలుపులు సంతోషముగా తెఱువబడెను.

స్నేహితులు స్నేహితులు కౌగలించుకొనిరి. బంధువులు బంధువులు చనవు కొలది యోగక్షేమము లడుగుకొనిరి. వచ్చిన వారందఱు రామనాథసైనికులని క్రొత్తవారిలో నాలుగు వందలమందికిపైగా తెలియును ఈ విచిత్ర సంయోగము నిగూఢార్థవంతమై పోయెను. అంతలో సైన్యమంతయు సమావేశము కావలె నన్న పిలుపు హజారపుగంటలు పిలచెను. పదునొకండువందల సైన్య మా చిన్నకోటలోని బయలున క్రిక్కిరిసిపోయెను. నాయకుడు సైన్యము నిట్లు సంబోధించెను. "నావెంట రామనాథ సైన్యమువచ్చుటకు మీరాశ్చర్యపోవుచుండిరి ఇచ్చటినుండి పోయిన నూర్గురు సైనికులు రామనాథసైన్యములో చేరి నిన్ననే మొదటి నెల జీతము ముందుగా పుచ్చుకొనిరని మీకు తెలిసినచో మీరు మఱియు నాశ్చర్యపడెదరు మీసంశయము తీరుట కొక కథ చెప్పెదను ఉదయన్ సేతుపతిగారికి కుట్టాన్ సేతుపతి యని కుమారుడు. శ్రీ ముద్దుకృష్ణప్పనాయక మహారాజుగారికి మరణ సమయము ప్రాప్తించి యుదయన్ సేతుపతిగారు మధురకు వెళ్ళి కుట్టాన్ సేతుపతిని రామనాథమునకు పంపించిరి. కాళయ్యార్ కోవెల తిరుగబడెను కుట్టాన్ ముట్టడివాండ్రలో చేరి తాను వారికి నాయకుడయ్యెను ముట్టడివాండ్రకు కుట్టానునకు, వారికి భక్తి-వీనికి ప్రేమ కుదిరెను. ఈ విచిత్ర సంఘటనము వలన ముట్టడివారందఱు కుట్టాన్ ద్వారా మధురరాజుసైనికు లెరి ఒక వందమంది ముట్టడివారులలో నాయకులా రాజసైన్యమున ముందుగా చేరిరి తక్కిన వారు నేడు చేరనున్నారు " అని నాయకుడాగెను

రామనాథసైన్యమున కొంతమంది "మహారాజుకుట్టాన్ సేతుపతిగారికి జయజయ జయ" మని ఘోషించిరి నాయకుడు మఱల "నిక్కడనున్న ప్రాతసైన్యము నాలుగువందల మందికిని వీరప్పనాయకులుగారు జీతమిప్పుడే యిచ్చెదరు" అనెను ఆరువందల కంఠములు జయజయధ్వానములతో నాకాశమంటెను వీరప్పనాయకుల చేయి పైకెత్తగా సవ్వడి యాగినది. నాయకుడు మఱల "తక్కిన యయిదువందల మందిని నేటినుండి మహారాజు సైన్యములో చేర్చుకొన్నాము ఇప్పుడు వారికిగూడ నెలజీతములు ముందుగా నిచ్చుచున్నారు వారికి బహుమానములు మధురనుండి కొద్ది దినములలో రాగలవు" అనెను. అప్రయత్నముగా పదునొకండువందల మంది జయఘోషము చేసి వాయు వీధుల సహజ శబ్దగుణ సామర్థ్యమును బ్రద్దలు కొట్టిరి సైన్యము శాంతిపడిన తరువాత కుట్టాన్ మహారాజు వెలరాళ్ళు పొదిగిన పిడులతోడి తొమ్మిది ఖడ్గములు తొమ్మండుగురు సేనానాయకులకు బహుమతి చేసెను వీరయ్యప్ప నాయకుని మొగ మానందబాష్పముల చేత చల్లని చెఱువునీటి కెరటాలు చిందిన తామరపూవు వలె నుండెను. తక్కిన యెనమండుగురు నాయకులును కన్నులలో నాశ్చర్యము, పెదవులలో కదలిక, గుండెలలో భీతి, శరీరము లందు

వినయము, శిరస్సులయందు కృతజ్ఞతా నమ్రత్వముల దాల్చిరి. సైన్యమంతయు కూర్చున్నది కూర్చుండగనే డబ్బు పంచిపెట్టబడెను. సైన్యమున కంతకు తెల్లవారువఱకు నిద్రలేదు. తరువాత కొంచెము నిద్ర. అందులో సుఖస్వప్నము. ఆనాడు వాన ఘోరముగ కురిసెను. అగడ్త సముద్రమువలె తెపకలు కొట్టుకొను చుండెను.

నాలుగురోజు లయిన తరువాత కుట్టాన్ రామనాథమునకు పోయెను. వెంటనే తాను రామనాథము నుండి తెచ్చిన రెండువందల సైనికులలో ఏబదిమందిని, ముట్టడివేళ ప్రమాదిల్లిన రెండువందలమందిని, క్రొత్తసైనికులలో మూడువందల మందిని, కోట ముట్టడివాండ్రకు స్వాధీనము చేయుదమన్న నూటయేబదిమందిని కలిపి మొత్తము యేడువందలమందిని ఏనమండ్రు నాయకులను రామనాథమునకు తీసికొనిపోయెను కాళయ్యార్ కోవెలలో నాల్గువందలమంది సైనికులు వీరయ్యప్పనాయకుని సంపూర్ణాధికారము క్రింద నుండిరి కోట వదలిపోవు కుట్టానును వీరయ్యప్ప "నాయకుడా! సెలవు" అనెను. కుట్టాన్ నవ్వి "ఇక మీరు నాయకులు" అనెను.

౨౦

ఉదయన్ సేతుపతి మదురలో పట్టాభిషేకోత్సవములు పూర్తియైన తరువాత భాద్రపద శుక్ల పాడ్యమినాడు ఐయలువేరి పంచమినాటికి రామనాథము వచ్చెదనని తన కొడుకునకు కబురంపెను. కాళయ్యార్ కోవెల తిరుగుబాటును గూర్చి కుట్టాన్ తండ్రికి వర్తమానమంపెను. సేతుపతి కోవెలతిరుగుబాటు రాజుతో చెప్పెను రాజు సేతుపతిని పొమ్మని తొందరపెట్టెను తిరుమలనాయకుడు, "కుట్టానున్నాడు పరవాలే దని, పట్టాభిషేకోత్సవములైన తరువాతనే సేతుపతి పోవచ్చునన్నాడు ఉదయన్ సేతుపతికి తొందర యెక్కువైనది చిత్రముగా, తాను పూర్వము రాజుమాట తీసివేయజాలనట్లు తిరుమలనాయకుని మాట కాదనజాలమి నెఱుంగికొని యుదయన్ సేతుపతి యాశ్చర్యపోయెను అది మొదలు తిరుమలనాయకుని తాను కలిసికొనినప్పుడెల్ల నతనిని పైనుండి క్రిందకు దిగజూచెడివాడు

నాడు శ్రావణ బహుళ దశమి వర్షము జోరుమని కురియుచున్నది కుట్టాన్ రామనాథమున రాజసౌధముపై కూర్చున్నాడు కాళయ్యార్ కోవెల గెలుపువలన అతని మనస్సు మహానందమున మునిగియుండెను కాని యతని మనస్సులో నొక శంకకూడ నుండెను క్రొత్తగా నేడువందలమంది సైన్యమును చేర్చుటకు తన కేమి యధికారమున్నది తండ్రి కోపగించును. అట్లు చేర్చుకొనకపోయినచో మరల తాను అల్లరుల కవకాశ మేర్పఱచినవాడ నగుదునని కుట్టాను తలంచెను. తృప్తిలేని యేడునూరువందల మందిని వదలినచో ఒక పెద్ద శత్రుసైన్యమును రేపి వదలిపెట్టి నట్లగును. అట్లు వదలినచో తాను చేసిన వంచనకు వారిలో ప్రత్యపకృతి బీజము నాటినవాడగును. అందుచేత వారిని సైన్యములోనికి తీసికొనక తప్పినది కాదు.

జరిగిన వ్యవహారమంతయు కుట్టాను లేఖ వ్రాసి రాజుగారికిని, తండ్రికిని పంపించెను. ఒకవేళ రాజు క్రొత్తసైన్యము నంగీకరించని యెడల దానేమి చేయవలెను? దూరమున ఆకసములో ఒకమెఱుపు మెఱసెను. కుట్టానున కేకవీర కన్నులకు కట్టినట్లు కనిపించెను. కట్టత్రెంచిన బోదెనీరు పొలములోనికి పోసికొన్నట్లు వాని మనస్సు జలజల ప్రవహించి; యేకవీర, తన- యిన్నాళ్ళ పొందికలేని జీవనము, మీనాక్షి వీరభూపతులు వివాహము, తన మనఃపరివర్తనము, ఆమెను తాను చూడరాని రాచకార్యముల యభ్యంతరము ఊహపై నూహగా నలువిని క్రమ్ముకొనెను .......

రెండు సంవత్సరముల నుండియు తన మామగారు రాలేదు. కూతురును చూడలేదు. తనకు తనమామగారికి పూర్వమేమియు సంబంధములేదు. మామగారు సైన్యమును తాను తీసికొనునేమో! ఆయన మంచి సరదారు ....

ఏకవీర మొదటిసారి తలంటిపోసికొని తన మంచము మీద తెల్లని చీర దాల్చి నిదురవోయిన-పెండ్లియయిన తరువాత మూడు నెలలనాటి కథ స్మృతికి వచ్చెను. మెఱుపు తటాలున మెఱసెను. కుట్టానునకు తెల్లచీర దాల్చిన ఏకవీరను చూచినట్లయ్యెను. ఏకవీర తనకు భార్యయగుటచేత తన సుముఖతయే యభ్యంతర మగుటచేత, నిరభ్యంతరముగా మనసులో కుట్టాను ఏకవీరను కౌగిలించు కొనెను. ఆమె భుజములు, కంఠము, నేత్రములు ముద్దులతో నింపెను. ఆమె రహా విస్రబ్ధయై యతని యెదురొమ్ముపై విశ్రమించెను. అప్పుడు తమ గుజ్జువువాళ్ళ పిల్లి అమృతము తొంగిచూచెను. కుట్టాన్ నకు నవ్వు వచ్చెను ..

మఱల సైన్యము మాట తోచెను. తండ్రికోపగించెను. మామగారు తాను భరించలేననెను. తానే స్వంతముగా సైన్యము పోషించుచుండెను ...

ఇంతలో వీరభూపతి స్మృతికి తగిలినాడు. మీనాక్షి-వీరభూపతులు సుఖముగా కాపురము చేయుచుండిరి. తాను వారింటికి మఱల భోజనమునకు వెళ్లెను. మీనాక్షి గర్భవతియయ్యెను. తానామెకు సారె చదివించెను .. .

మఱల నింకొక యూహ- తాను, తన భార్యయు కలసి యామె పుట్టింటికి పోయిరి. అందు తాను భూలోకస్వర్గ మనుభవించెను. తనభార్య తన్ను ముగ్ధ మనోహరాపాంగములలో నూత్న నూత్న విలాసములలో ముంచివేయు చుండెను ...

కందాలోని నల్లపిల్లి యొకటి మేడమీదకు వచ్చి కన్ను తెఱచి మెల్లగా "మ్యావు" అనెను. కుట్టాన్ మనస్సు కదలిపోయెను. దానివంక జూచెను. మఱల ధ్యానము!

తండ్రి సైన్యమును వదలివేయుమన్నాడు. తాను వద్దన్నాడు. ఇరువురికి పోట్లాట జరిగినది. సైన్యము లన్నియు తనవైపు; వృద్ధసేనాపతులు మాత్రము తండ్రివైపు. తిరుమల నాయకుడు దూరముననుండి చూచుచున్నాడు.....

మఱల నింకొక యూహ- మీనాక్షి-వీరభూపతులకు పడుటలేదు. మీనాక్షి యుసురు తనకు తగిలినది. తనకు తనభార్యకు పొందిక లేదు. ఏకవీర తనవలెనే చిన్నప్పుడెవరినో ప్రేమించినది. అది కారణముగా తనయందామెకు మక్కువ లేదు...

మీనాక్షి-వీరభూపతులు, తాను- తనభార్య, క్రొత్తసైన్యము - తండ్రి, రాజు తిరుమలనాయకుడు - తన మేనమామగారియూరు గిఱ్ఱున కుట్టాన్ మనస్సులో

చక్రభ్రాంతిపొందెను. వాన కురిసి కురిసి వెలిసెను. ప్రొద్దుగ్రుంకినది. హజారమునుండి ఘంటాధ్వని వినవచ్చెను.

శ్రావణ బహుళదశమివాడు మధురలో వర్షముకుండలతో దిగబోసెను. ఏకవీర తన పడకగదిలో మగని పెద్దమంచము మీద ద్వారబంధము వంటి గవాక్షము నుండి జాజి పందిరివంక చూచుచు కూర్చుండెను. వానబొట్లు జాజియాకుల చివరల జాజిపూవుల మీద నిలిచి ముత్యములవలె కులుకుచుండెను. ఆ నిలిచిన ముత్యము క్రొత్తనీటి బొట్టుచే తటుమబడి నేలబడి ఆ స్థానమున గ్రొత్త నీటిబిందువు నిలుచుచుండెను. వాన ధారగా పడుటచేత తుమ్మెదలు పూవులమీద నిలుచు అవకాశము లేక వానలో తడియుచు పందిరిపైన పరిభ్రమించు చుండెను. చల్లని గాలిపొర యేకవీర మీదకు విసరుకొనెను. ఏకవీరకన్నులర్ధమీలితము లయ్యెను ఆమె పయ్యెద కదలాడెను. ముంగురులు తూగాడెను. ఆమె త్వగింద్రియము మీద మెరుపుమెరుపు వంతకాలములో వొక తడిగుడ్డ వేసి తీసినట్లు తోచినది. ఏకవీర చలించలేదు. వానధారలు మిక్కుటమయ్యెను. జాజిపందిరి మీద వానజల్లు పడిన కొలది పెద్దధ్వని చేయజొచ్చెను. జాజియాకుల చివరనుండి నీరు ధారగా పడుటయేగాని నీటిబొట్లుకొంచెము సేపయినను నిల్చుటకు వీలులేకుండెను. తుమ్మెదలు పందిరి మీద నిలువలేక పందిరి క్రిందకు పోయెను మఱలనొక చల్లని గాలితెర యేకవీర మీదపోసుకొనెను ఆ గాలివేగమునకు జాజిపందిరి కదలాడిపోయెను ఏకవీర జుట్టుముడి వీడి యామె భుజములమీదవ్రాలెను ఆమె పయ్యెద తొలగి పోయెను. ఆమె కనులు మూసికొనిపోయెను. ఆమె త్వగింద్రియము రక్తప్రవాహ దఘ్నముగా నీ చల్లగాలిని కొలుచు కొనెను గాలి మరల మరల ఆమెమీదికే విసురు కొన్నది. గాలిపొర వచ్చి నప్పుడెల్ల ఆమె సరిగా కొలుచుకొన్నది వర్షమింకను పెద్ద దెవది పందిరి మీద చినుకులు పడుటయేగాని పడుట మఱల పడుటయను కాలవ్యవస్థ గోచరించుట లేదు. వానకు తడిసి కంచుమ్రోత పోయిన నగారా మీద సన్నని పుల్లలతో వెడతెరిపి లేక మ్రోగించిన మ్రోగింయచుటలో కొఱవి నిగ్రుడ త్రిప్పినచో త్రిప్పుచున్న జ్ఞానము పోయి యొక్కటియే యొక్క యగ్ని వలయాకృతి యేర్పడినట్లు వేగముగా మ్రోగించిన వొక్కడే మొదలు, తుది, మధ్య స్థితి లేని యేకమైన మ్రోత కలిగినట్లు పందిరి మీద ధ్వని కలుగుచుండెను వానబరువునకు పందిరి కదలిపోవుచుండెను. వర్షధ్వని తప్ప యింకొక ధ్వని గాలిలో లేదు మఱల పెద్దగాలి రివ్వున విసరెను పందిరి సౌధము మీది కొరగెను మంచము మీద పఱచిన బందరు కలంకారి దుప్పటి యెగిరి యంచులు ముడుచుకొనెను ఏకవీర విడివడిన జుట్టు ఆమె మొగమున, వక్షస్సున, భుజముల మీద, ప్రవాహవేగమున విఘాతయై శైవలము వలె అల్లలలాడెను. ఏకవీర కన్నులు గట్టిగా తారకల పైన కనురెప్పలు,రెప్పల కండలు నాలుగంగుళముల పొర యేర్పడునట్లు మూసికొనెను నిష్కంచుకమైన యామె యెదుటిరొమ్ము వనవరాహము దూసిచన్న వెదురుపొదవలె పౌర్వాపరభాగముగ కంపించెను. ఆమె త్వగింద్రియము యొక్క స్పర్శగుణ వ్యాప్తి చర్మము దాటి, లోని గోరువెచ్చని రక్తప్రవాహము దాటి శల్యములదాక తాకెనని తోచినదామెకు ఆమెకు

బాహ్యజ్ఞానము పోయినది. ఇంతలో ఈదురుగాలి వెంట చిక్కని వానజల్లు వచ్చి యామె మీద తుఫాను మొదలుపెట్టు వేళ సముద్రపు కెరటము లొడ్డున నున్న వాని మీద కొట్టుకొన్నట్లు కొట్టుకొనెను. ఆమె పంచేంద్రియగుణములు స్పర్శగుణత్వము పొందెను.

కొంతసేపటికి పెద్దవాన యాగిపోయి మఱల తుప్పర లోనికి దిగినది. అంతసేపటికి ఏకవీరకు స్మృతి కలిగినది. తన్నుదా చూచుకొన్నది. తల విరబోసుకొన్నది. ఎదుఱొమ్ము దిగ్వాసముగా నున్నది. వాన తగ్గినది. సన్నని గాలి రేగినది. జాజిపందిరి యాకులు పూవులు సన్నని నీటిబిందువుల బరువుచేత కదలలేక కదలుచున్నవి. ఏకవీర ప్రక్కగా చూచినది. గుజ్జపువాళ్ళ పిల్ల అమృతము పెద్ద కన్నులు మఱింత పెద్దవి చేసికొని ఏకవీర వంక తదేక దృష్టితో చూచుచున్నది. ఏకవీరకు నిలువెల్ల సిగ్గయినది. తొందరగా తలముడివైచికొని సెలువ యెదుఱొమ్ము మీదికి లాగుకొన్నది. మఱల అమృత మున్న యెడ చూచినది. అమృత మందులేదు.

ఏకవీరకు భయము వేసినది. ఆ పిల్ల తనవంక ఏల యట్లు చూచినది? ఈసారి దానిని చూచినప్పుడు కోపించవలె ననుకొన్నది. మఱలనేమో విచారింప నారంభించినది చిన్నప్పటినుండియు ఏకవీరకు వర్షాకాలమన్న తన్మయత్వము. మఱియు చిన్నప్పుడు వానలో తిరిగి తండ్రితో దెబ్బలు తిన్నది మఱికొంచెము పెద్దయైన తరువాత పట్టుచీరలు వానలో తడిపి తల్లిచే చీవాట్లు తిన్నది ఒకసారి వానలో నిలుచుండి బిగుసుకొని పోయినది. ఇదివఱ కామె వానలకు, చల్లగాలులకు తన్మయత్వము భజించెడిది. రెండు సంవత్సరములుగా ఆమెలో నొక క్రొత్త మార్పు వచ్చినది. ఆమెకు గాలి తప చల్లదనము కొలిచి చెప్ప మొదలు పెట్టినది ఆమె దేహము క్రమక్రమముగా వాయువు యొక్క శైత్యోష్ణతలపరిమాణము కొలుచు విచిత్ర యంత్రమువలె నైనది. కస్తూరిపూత, మంచిగంధపుపూత, కప్పురపుపొడి, పట్టివేళ్ల విసనకఱ్ఱ, మలయానిలము - వీని ప్రత్యేక స్పర్శ సుఖానుభవ మామె మనస్సునకు చక్కగా నేరుపఱచి, చదివిన పాఠములోని యర్థమువలె విజ్ఞాత తత్తద్గాఢత్వ కించిద్గాఢతాऽగాఢత్వముగా, విస్పష్టముగా తెలియవచ్చెను అమృతము మఱలవచ్చి తొంగి జూచి పాఱిపోయెను ఏకవీర కలవరపడెను

వర్షాసాయంసంధ్య వచ్చెను. పగలెల్ల వెలుగురేక లెఱుగని రోదసి యావేళకు పడమటి దిక్కున నల్లని మేఘముల నలుపులో గ్రుడ్డియెఱుపులు తిరిగెను. శివరాత్రినాటి కృష్ణపక్ష గాఢయామినీవేళ గర్భగుడిలో ఏకాభిషేకము చేత చెమ్మగిలిన యవకాశమున కర్పూరనీరాజనము వెలిగించగా దట్టమై నల్లనైన హారతిపొగ హారతిజ్వాలను కమ్ముకొన్నట్లు పొలిచిన దా వర్షాసాయంసంధ్య. దీపము వెలిగించు పరిచారిక గదిలోనికి వచ్చి యేకవీరను సవినయముగా పిలిచెను

శ్రావణ శుద్ధ దశమినాడు వత్తునని కబురంపించిన వీరభూపతి బహుళ పాడ్యమినాడు గాని యింటికి రాలేదు. వచ్చి భోజనముచేసి మఱల రాజసౌధమున కేగెను. ఆనాటి కీనాడు బహుళ దశమినా డింటికి వచ్చెను. ఈ కాలములో మీనాక్షి ప్రేమ తీరుపోలేదు. క్రొత్తక్రొత్త రుచుల వంటకములతో పతి నారగింపించి తాను

గబగబ రెండు మెతుకులు తిని మేడపైకి పతి ననుసరించెను. వర్షము ద్రుతతాళ మందుకొన్నది.

మీనాక్షి గవాక్షపక్షములు మూసినది. లోపల చీకటియయినది. వీరభూపతి మంచముపైన కూర్చున్నాడు. మీనాక్షి ప్రక్క నిలుచుండి తమలపాకుల కీనెలుతీసి సున్నము రాచి చేయి చాచినది. వీరభూపతి చేత నందుకొన్నాడు. కొంతసేపటికి పతి చాలుననెను. చాలు నన్న తరువాత మీనాక్షి యొకయాకు చిలుకచుట్టి వీరభూపతినోటి కందిచ్చినది. అతడు నోరు తెరువలేదు. మీనాక్షి ప్రక్క గూర్చుండి యాకులో పెదవులనడుమ నందు చేయజొచ్చెను. అతడు కోపగించెను. ఆమె చిన్నబుచ్చుకొనెను. అతడంగీకరించెను. వర్షము గవాక్షపు తలుపులను రయమున గొడ్డళ్లతో కొట్టినట్లు కొట్టుచుండెను.

మీనాక్షి- మీరు సరిగా నింటికి వచ్చి నెలనాళ్లయినది. అంతపనియున్నదా యేమి?

వీరభూపతి సమాధానము చెప్పలేదు. నిద్ర వచ్చుచున్నట్లు నటించెను. మీనాక్షి యది గ్రహించి మంచము దులిపి ప్రక్కవేసెను. అతడు పండుకొనెను. మీనాక్షి పాదము లొత్తబోయెను. అతడు వారించెను. బయట వర్షమును, గాలియు గవాక్షమును బ్రద్దలుకొట్టునేమో యనిపించినది. వీరభూపతి యాపాదమస్తకము ముసుగు పెట్టుకొని మంచమునకు నడుమ పండుకొన్నాడు. ఆమె ప్రక్కన పండుకొన్నది. ఆమె ఒడ్డున నున్నది. క్రింద పడునట్లున్నది. అతడు జరుగలేదు. కొంచెముసేపున్న తరువాత నతనిని జరగమన్నది. అతడు జరిగి యటు తిరిగి పండుకొనెను.

అట్లు గంటసేపైనది. వీరభూపతి నిద్రపోయినట్లున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసములు ముక్తపరిగ్రహితవేళ సమానముగా కనిపించెను. మీనాక్షి యతనిపై చెయివేసి మఱికొంచెమాగి గట్టిగా దగ్గరకు లాగెను. అతడు కదలలేదు. నెమ్మదిగా నొకచేతిమీద లేచి ముసుగుతీసి మొగమును చూచెను. గాలివిసురునకు గవాక్షము త్రోసుకొని వచ్చి యొక జల్లువచ్చి మంచమును తడిపెను. మీనాక్షిలేచి మఱల తలుపులు మూసి గడియవేయు లోపల ఆమె మొగమున వాన చినుకులు గ్రుద్దుపోసినట్లుండెను. పైటయు, రైకయు తడిసెను. వీరభూపతి మేల్కొనెను. మీనాక్షి రైకయు, చీరయు మార్చినది. వీరభూపతి అంగీ విడచెను.

మీనా- గాలికి కిటికీ త్రోసికొని వచ్చెను. నిద్రాభంగమైనది.

వీర- (కొంచెముగా) నిద్రపట్టనే లేదు.

మీనాక్షి కలవరపడినది. కాని లజ్జాప్రథమసోపానము దాటితి ననుకొన్నది. విచారించినది. తా నేమి తప్పుచేసినది? తన వాంఛ ధర్మబద్ధమైనదే ననుకొన్నది.

వీర- రాజ శాసనమునకు పోవలయును.

మీనా- బండివాడు రాలేదు.

వీర- నడచి పోయెదను.

మీనా- తడిసి పోదురు.

వీర- పనియున్నది.

మీనాక్షి నవ్వియేదో యన్నది. వీరభూపతి కదివినబడలేదు. అతనికి కోపము వచ్చినది. మొగ మటు త్రిప్పుకొన్నాడు. మీనాక్షి దగ్గరకు పోయి "కోప మెందుకు? పని తడిపిపోవువా? యంటివి. క్షమించుడు" అనెను. వీరభూపతి కుక్కిరి బిక్కిరి యయ్యెను. దొడ్డిలో నేదో పెద్దధ్వని యయ్యెను. మీనాక్షి భయపడెను. వీరభూపతి "దొడ్డిలో నేదోచెట్టు గాలికి పడెను. కాబోలు"! నన్నాడు. ఆమె పతిదగ్గరగా నిలుచున్నది. వీరభూపతికి- ఒక కాలువ తూర్పుగట్టుమీద నిలుచుండి పడమటిగట్టున కెట్లు చేరుదువా యనుకొన్నది. ఇంతలో తనకు కన్నులు గిఱ్ఱునదిరిగి, తెక్కలు వచ్చినట్లై పడమటిగట్టుమీదికి పోయి తూర్పుగట్టున కెట్లు చేరుదువా యనుకొను చున్నట్లు తోచినది- తన జీవితము పూర్వము, తాను చేరవలసిన స్థానము పడమర నున్నది. అది విచిత్రముగా తూర్పునకు తిరిగివచ్చినది. తాను పడమటి గట్టుపై నున్నాడు.

వర్షము బయట కొంతసేపు మద్దెలలు వాయించినట్లు, కొంతసేపు అవ్వాయిచువ్వ లెగురవేచినట్లు, తోటాలు కాల్చినట్లు, పిచ్చివానివలె అల్లరి చేయుచుండెను. ఇరువురును రెండవగదిలోనికి పోయిరి. మీనాక్షికనులు తన చిత్రము మీదికి పోయెను. దానికిదూరమున నున్న వీరభూపతి చిత్రమును తెచ్చి యామె దగ్గఱగా రెండును నుంచెను. వీరభూపతి బొమ్మ కలకల నవ్వినది. స్థానాపతి యాలోచనా నిమగ్నుడయినాడు. మీనాక్షి బొమ్మ విచారముఖము సూచించినది మీనాక్షి మొగము కలకలలాడినది

పతి మాటాడలేదు. మీనాక్షికి కనులయెదుట తెరగానాడినది. ఆమెచూపు తనపతి పూర్వప్రణయినీ చిత్రము మీద నిలిచినది. ఆ చిత్రమున ఆమె తెల్లని చీర దరించినది. కేశపాశము పాడిపాడిగానె ముంగురులు గాలికి కదలుచున్నవా యనునట్లుండెను. మీనాక్షి యులికిపడినది. "స్త్రీనంస్థానం చాప్సరస్తీర్థ మార్యాదాక్షి ప్త్యైవాం జ్యోతిరేకం తిరోభూత్" అన్న వాక్యములోని యనుభవమునకు సాజాత్యమైన యొక యనుభవ మామెమనోచిత్రము నెదుట కదిలినది.

బయట వానతగ్గి మఱల మొదలుపెట్టుచున్నది. ఇంక జాము ప్రొద్దుండ వచ్చును. మీనాక్షి నిరస్తభూషయై యింట పనులు చూచుకొనుటకు పోయినది వీరభూపతి సంకల్పవికల్ప శక్తి కోల్పోయిన మనస్సులో మఱల నిద్రకు పడినాడు

పట్టాభిషేకోత్సవములు వర్షాకాలమున పడిపోయినవి. ఉత్సవములకన్న క్రొత్తరాజుక్రింద చేయవలసిన రాజ్యపు కట్టుబాటులకే చాలకాలము పట్టుచున్నది. వర్షము వెలిసిన సాయంకాలముల రాజసౌధపు ఏనుగులు మొగసాల నుండి రతనాలు కుట్టి వెలగల జరీపనులు చేసిన పట్టుహౌదాలతో ఊరు తిరిగి రాబోయి మఱల రాజసౌధములకు బురద మరకలతో వచ్చుచుండెను. ఉత్తమజాత్యశ్వములకు కూడ కాలుజారుచుండెను. రాజసౌధపు ముంగిలుల నౌబత్తుఖానాల మ్రోత కూడ వానలకు చెమ్మగిల్లినట్లు మందముగా వినబడుచుండెను విద్వద్బ్రాహ్మణులు రాజాగారిచ్చిన క్రొత్త సేలువల బంగారము దర్భాసనములలో దాచి తడిసిపోవునని భయమువదలక వంగి వంగి పోవుచుండిరి. సాయంసంధ్యలు నల్లనల్లనై విషాదభావము మూర్తికట్టినవి.

భాద్రపదశుక్లపంచమినాటికి మధురనుండి రామనాథమున కుదయన్ సేతుపతి బదులు రాజలేఖ యొకటి పోయినది. ఇంకొక నెల పైగా సేతుపతి రాజనగరమున నిలువక తప్పదు కుట్టాన్ శౌర్యమునకు, రాజనీతి వేతృత్వమునకు రాజామెచ్చెను. కానుకలు పనిచెను. తిరుమల నాయకుడు చెలికానిని పొగిడి యుత్తరమొండు వ్రాసెను. క్రొత్తసైన్య మాఱువందలు వెంటనే మధురకు చేర్పవలయును. కుట్టాన్ తండ్రి వచ్చువరకు రామనాథముననే యుండవలయును దశమినాడు బయలుదేరి క్రొత్తసైన్యములు గోవిందనాథుడు నాగా మధురకు ప్రయాణమయ్యెను. కుట్టాన్ పేరు విన్న చుట్టుపట్లపాళెగాండ్రకు, దోపిడి గాండ్రకు, పోర్చుగీసు వాండ్రకు సింహస్వప్నమైనది భాద్రపదము గోరంటపువ్వులతో వెనుకబట్టెను.

మధురపై నాకాశమున తెల్లని మేఘములు గాలికి కదలు దోమతెరలవలె కదలజొచ్చెను. పవళ్ళకు సూర్యకాంతి మొగపువాపు తగ్గెను. మీనాక్షి దేవాలయమున కాంధ్ర ద్రావిడస్త్రీలు సాయంకాలమున చేమంతిపూవులు కుట్టిన పెద్ద జడలతో పోవుచుండిరి నందీశ్వరుని యొడల రాచిన నూనెయు - ఆయన కొమ్ములపై వ్రేల్లించి తద్విషాణ మధ్యమునుండి శివలింగ దర్శనము చేయు భక్తులుంచిన విభూతి పులుముకొని- తెల్లబడ జొచ్చెను యామ్యదిశ నేకచుళుకాహంకార నిశ్శేషశోషిత పాథోధిపయస్కుడైన ముని తోచె

వైగెనది పతిప్రేమ జారిపోవుట తోచిన కాంతమొగమువలె తనచివరల తెల్లబడజొచ్చెను. ఆమెలోని రాగచ్ఛాయ విఱిగిపో జొచ్చెను కంఠేకాలుని శిరఃకోటీరమునకు చంద్రకాంతమాలలు సమృద్ధిగా దొరకెను. శరల్లక్ష్మి యొకనాటి ప్రొద్దున ఉన్నట్లుండి దింగత విశాలరమ్యదీర్ఘహాసము చేసెను గుజ్జపువాళ్ళపిల్ల అమృతము కూడ నాటి ప్రొద్దున సెలవివాఱ దింగతవిశాల రమ్యహాసము చేసినది. అమృతము తెలివిగలపిల్లయని గ్రహించి యొక బ్రాహ్మణుడామెకు పదినాళ్ళుగా చదువుచెప్పుచుండెను ఆమె పదినాళ్ళలో అక్షరములు నేర్చి మాటలుచెప్పుడని యాయనను బలవంతపెట్టగా ఆయన 'ఆతిచ్యూడి'లో మొదటి వాక్యము 'అరంజేవిరుంబు' అని యామెకు నేర్పెను ఆమెయు ఆ మాట తెచ్చి బొగ్గుతో ఏకవీర సౌధకుడ్యము మీద వ్రాసెను ఏకవీర యది మఱునాడు చూచి యేలకో భయపడి పాఱిపోయెను. ఈ సంగతి యమృతముచూచి యెందులకో దానికి తెలియకుండనే యొక పెద్ద నవ్వు నవ్వినది. ఆ నవ్వు శరత్కాలపు లేత యెండలో కలిసి జాజిపందిరిమీద ప్రాకిపోయెను. సౌధకుడ్యముల సున్నము కాంతిలో గలిసిపోయెను.

ఎండలు పెళ్ళున కాసెను వర్షవేళ గొడ్లతొక్కుడి బురదలైన ప్రదేశములు వాని కాలిగిట్టల గుర్తులు గుర్తులుగానే బిగియజొచ్చెను. ఱెల్లుపూవులు దూరపుటెండ పొరలతో తళతళలాడెను పంటబోదెల వెంట తెల్లనియొండు విరిగిపోయిన కొబ్బరిపాలవంటి నీరము సన్నగా ప్రవహింప జొచ్చెను బోదెల మలుపులలో జాలరులు మావులు నిలిపిపోయిరి. పచ్చని వరి పైరులు నలుపుతిరిగి గుమ్ములుకట్టి పై నాకాశపు నీలిమకు ప్రతిగా నుండెను. కొతిమేర చేలు నాగటి చాళ్ళలో చిన్న చిన్న మొక్కలుగా గాలిపొరలలో చిన్నితలలాడించెను. సెనగచేల మొక్కలు లేతబ్రాయపు

పుల్లతనమున రాత్రులపుడు కొంచెము కొంచెము మంచునకు, కొంచెము కొంచెముగా దినదిన మెరుగుచుండెను. ప్రొద్దుటిపూట చల్లని లేయెండ, మధ్యాహ్నమున వేసంగియెండ, సాయంతనసమయముల యెండ యనిపించని యెండ, రాత్రి రెండుజాములవఱకు పలుచని మేఘముల చాటుగ విరియబోసికొన్న చిక్కని పాలవంటి వెన్నెల, రాత్రి రెండవజాము మొదలు మంచుకురియుట-యిది శరత్కాలపు దివారాత్రములకు సహజమయ్యెను.

అమృతమును శిక్షించవలెనని ఏకవీర ఏకవీరకు కనబడకుండ నమృతము మేఘపు మఱుగున నున్న పలుచని చీకటులు, వెన్నెల- యొకదానినొకటి పాఱద్రోలగా తప్పించుకొని తారాడగా ఒప్పినట్లు, వారిర్వురు శరద్రాత్రుల కొక సొటువ తెచ్చుకొనిరి శరద్రాత్రుల గగనభాగ మొకవింతకళ తాండవించినది. కొంతసేపు తెల్లని చక్కని మేఘములు, గాలిచేత పరువులై, మనుజుల పశువుల పాదఘాతములు లేని యిసుకతిన్నెలు గాలిదుమారములచేత నొక్కులు నొక్కులుగా నైనట్లు, సముద్రపు కెరటములు వెనుకకు పోవుచు నొద్దునకున్న యిసుకనేల చిన్ని చిన్ని మెట్లుగా నమర్చినట్లు, తెల్లని చేప యొడలిపొరలట్లు, ఒకటి రెండు కాన్పులైన ముగ్ధపురంధ్రీ రహోవేళాస్పృష్టము దీపపు వెలుగున మెఱయు పొత్తి కడుపట్లు రమ్యముగా నుండెను మఱికొంతసేపు వలయాకార మందంది చెడిన చిన్ని చిన్ని తెల్లని మేఘములు, వానినడుమ నల్లని మేఘములు; తెల్లనివి చంద్రకాంతిచే మెఱసి, నల్లనివి చంద్రకాంతి నాపి-హూణదేశపు టావునొడలివలె, తామర గొడుగాకులు పూవులు నీటిపైకి లేచిన చెరువు పై భాగమువలె, పూలుపూచిన పొరపొదువలె మనోహరమయ్యెను. మఱి కొంతసేపు పడమటిగాలి విసరి, యా దిక్కున చలువచేసి యారవైచిన ఖద్దరు వస్త్రములవలె చిక్కని తెల్ల మొగిళ్ళు, తూర్పునకు గాలి విసురున నెగిరిపోవుచు నక్షత్రములను, చంద్రుని పడమటి దిక్కునకు పరుగెత్తించుచున్నట్లు కనిపించుచుండెను.

అది యొక శరద్రాత్రి. కుట్టాన్ భార్య కొకలేఖ వ్రాయ సంకల్పించి నాల్గుసార్లు వ్రాసి చింపి వేసి, కొంతసేపు మేఘముల వంక చూచి, శరజ్జ్యోత్స్నలో ఏకవీర కన్నుల తళతళ యున్నదనుకొని, యామెకు తన ప్రేమ హఠాత్తుగా తెలియజేసి యామె గాఢతర పరిష్వంగము లోతులు త్రవ్వుకొందు ననుకొని లేఖ వ్రాయుట మాని, తెల్లవారు లామెనే ధ్యానించుచుండెను

ఏకవీర తన్ను కుట్టాన్ ప్రేమించుట స్వప్నగత వృత్తాంతమనుకొని; యాపరాని తనపూర్వప్రేయోమూర్తిని ప్రయత్నముచేత మనసు చేరకుండ నాపరాని వానిని, శరత్కాలపు వెన్నెలల తెలికాంతుల వలన తాను ధరించు తెలిపట్టుచీరలలోని యొక విశేషానుభవమువలన మఱియుమఱియు తనయూహలో నిలుచువానిని చూచి యూహించి, సాత్త్విక భావములకు లోనయి, యొడలెల్ల పులకించి యాసుఖము తన రక్తమాంసముల లోనికి గూడ జొచ్చిపోవునట్లు భావించుకొని, యింతలో నమృతము తనవంక తొంగిచూచుచున్నట్లులికిపడి, "అరంజేపిడుంబు" తన చెవులలో ధ్వనించి,

మఱల కుట్టాన్ ప్రేమమూర్తి పరిణతభావుని భావించి నేలకుగాక మింటికిగాక పరితపించుచుండెను.

తెల్లవారి లేయెండలు కాచి దొడ్డిలోని కాకర పూలు, బీరపూలు బంగారు నాణెములవలె, పొట్లపూవులు వెండి నాణెములవలె, వంగపూలు నీలాలవలె, గన్నేరులు పచ్చలవలె మాణిక్యములవలె, అకాలదోహదపుష్పిత మల్లికలు సూచీముఖ్య పుష్యరాగము వలె, నిత్యమల్లిక లెఱ్ఱవి తెల్లవి యెఱ్ఱని రాళ్ళవలె వైక్రాంతముల వలె, దొడ్డి యంతయు ధనలక్ష్మి తాండవించి నట్లయ్యెను. ఏకవీర మనస్సులో మాత్రము దారిద్ర్యము తాండవించెను

## ౨౧

కృష్ణానదికి ఉత్తరమున తెలుగునాడులో విజయవాడకు దిగువ కూచిపూడియని బ్రాహ్మణాగ్రహారము కలదు. అందు సిద్ధప్ప యను బ్రాహ్మణయువకుడు మందబుద్ధి, సోమరి, అమాయకుడు, నిరక్షరాస్యుడు, ఆ యూరందరకు పరిహాసపాత్రము. ఆ యూరిలో మఱియొక బ్రాహ్మణుని కూతురు సిద్ధప్పకు తగిన పెండ్లమని ఆమె తండ్రి తన కూతునకు తగిన వరుని తేలేకయు, సిద్ధప్ప యందు జాలిచేతను అతనికిచ్చి పెండ్లిచేసెను. పెండ్లితో జీవితభారము తెలిసిన సిద్ధప్ప చదువు కోరిక బలిసి కృష్ణ దాటిపోయి నానాపండితుల శుశ్రూష చేసి వేదశాస్త్రములు, సంగీతము, నాట్యము, భరతము సర్వాంకషముగా నేర్చెను. అతని చదువు పూర్తి కొఱకు వ్యాకులురాలయిన యతని భార్య స్వగ్రామమున మనస్సులో, నామె తల్లితండ్రి బహిరంగముగా ప్రతీక్షచేయుచుండిరి. విద్యపూర్తియయి యింటికి తిరిగివచ్చు సిద్ధశాస్త్రి మనస్సు నానా విద్యలచేత పరిపక్వ మయినను భూతగృహస్థాశ్రమము అనుభూతదశ యందినట్లయి తురీయాశ్రమము వైపు పరువెత్తెను. కాని మాయావేశము వదలక మనస్సును నిశ్చయమునకు తేలేదు. కృష్ణవద్ద కిట్టి యూహలతో వచ్చిన శాస్త్రి యిట్లు నది జూచునకదా కృష్ణ యీ యొడ్డాయొడ్డు మోచి యున్నది. తెప్ప కొయ్యకూడ లేదు. పొద్దు క్రుంకుచున్నది. గ్రామము కొఱకు వెనుదిరిగిన ఆమడ పోవలయును. ఇంటిమీద యాస రేగుచున్నది. సాహసించి కృష్ణకడ్డుపడినాడు. నగమీదు వఱకు మానిసిపని 'త్రాహి త్రాహి' యయినది. తన కంఠ్యాకాలము సమీపించినదని యతడు మనసా మోక్షార్థి సన్యసించను ప్రయత్నరహితుడై చేతులు కాళ్ళు కదపక యూగిన యతనిని తాలోత్తాల మొక కెరటము జంఘదఘ్నముగు నీట నిలిపెను. ప్రాణాయామము చాలించిన యతనికి కృష్ణయందినది. రేయి కూచిపూడి చేరినాడు.

అల్లుడు తేజస్వి, సకల విద్యారాశి వచ్చిన యానందము మఱునాటికి గర్భాధాన లగ్నము కుదిర్చినది. గృహారామ క్షేత్రదర్శికి సిద్ధపండితునకు కృష్ణనడుమ పూనిన ఆతురసన్న్యాసము జ్ఞప్తికిరాలేదు. ఆ రాత్రి యేకాంతమున భార్యా చేలాంచలాకర్షి యతడామెచే వారితు డయ్యెను. నిజమునకు సిద్ధప్పగాని, యతని భార్యగాని మందబుద్ధులుగారు. అంతర్ద్రష్టలు. ఆమె యోగిని. తన భర్త యందు సన్న్యాసిని చూచెను. శృంగార చిహ్నములు లేని, నిదురబడలికలు లేని, ఆనకదలికలు లేని వారి కన్నులు నలుగురమ్మల నోళ్ళ నాట్యమాడి రహస్యము వెలికి తెచ్చెను

సిద్ధపండితుని మనస్సులో తనయందు యతిని గాంచిన భార్య మాటకు కృష్ణయాతకు ముడిపడి, యత డమరుకుని మేన పర్యటించిన యాదిశంకరుడు మహేశ్వరుని వాక్కులచేత వలె ప్రబోధితుడయ్యెను. తత్క్షణము క్రమసన్న్యస్తుడై శిష్యులకు విద్యాదాత యయ్యెను. మందబుద్ధి యగు సిద్ధప్ప సిద్ధేంద్రయోగి కా నా యూరెల్ల వాతనికి శిష్యకోటి యయ్యెను. ఆయనలో నిగూఢమైయున్న కవితాబీజ మాకస్మికముగ ప్రత్యవభాసించి, నియచ్ఛింపబడి, మూకీభూతమైన శృంగార భావసర్వస్వము భగవంతునియందు పర్యవసించి యతడు కదలిపోయెను. ఆయనలో పరిపక్వములైన భరతము, నాట్యము, సంగీతము, దేశభాషాజ్ఞానము, కవితాబీజమునకు రూప మేర్పఱచినవి నేర్చిన షట్ఛాస్త్రములు మనస్సుగా మారినవి. అలంకార శాస్త్రమంతయు బుద్ధియయినది. సత్యభామాకృష్ణుల ప్రణయ మాత్మ యయినది. ఈ దివ్య కవితారూప పరిణామము చేత తెలుగునేల నాలుగు దిక్కులు సంగీతసాహిత్యములను పేరి కుచద్వయ మల్లలాడ భాషాదేవి కాలిగజ్జెలు గల్లుగల్లని మ్రోగినవి. సిద్ధేంద్రయోగి గ్రంథము రెండు భాగములు- మొదటిది గొల్లకలాపము, రెండవది భామకలాపము. గొల్ల కలాపము షట్ఛాస్త్రములకు నిలుకడ భామ కలాపము పడకట్టిన యలంకార భరతశాస్త్రములు. నాటకమున కృష్ణదేవునకు స్థానములేదు. సత్యభామ ప్రధానురాలు

సత్యభామయే శృంగారరస సర్వస్వమున కాలంబనవిభావమని తెలిసినవారు సృష్టిలో ముగ్గురన్న ముగ్గురే! మొదటివాడు శ్రీకృష్ణదేవుడు. అతడు శృంగార సర్వస్వమును చూఱగొన్నవాడు. అతనికి రుక్మిణి వైకుంఠమునుండి తెచ్చుకొన్న నిధానము కావచ్చును. ఆమె పాతివ్రత్యమునకు మచ్చుముక్క కావచ్చును. సత్యభామ శృంగారాధిదేవత! సర్వవిధ నాయికలను, సర్వభావములను సృష్టించినదామె! ఆ సృష్టి యా తల్లి భర్తయగు భగవంతుని కంకితము చేసినది ఆమె యాలంబన విభావత్వ మెఱిగిన రెండవవాడు నందితిమ్మన పాదతాడనము గూడ శృంగారరసమునందు పర్యవసింప జేసిన యా దేవీరసమూర్తి యాయనకు కొంచెముగా తెలిసినది కృత్రిమ కవితాలక్షణము పెంచుకొన్న యా కాల - మతనిని సత్యాశృంగారదేవతాత్వము సంపూర్ణముగా తెలిసికొననీయలేదు. అతని రచనలో- శాఖోపశాఖలై మొదలు తుద తెలియరాని యలంకారశాస్త్రము- ఒక్క యాశ్వాసములో ముగిసెను. మూడవవాడు సిద్ధేంద్రయోగి. ఆయనసృష్టి ఆయనకే తెలియును. శృంగారరసము భగవంతుని జెప్పినను డాలంబనవిభావము (కృష్ణునితోపాటు) సత్యభామ యగుచున్నదని తెలిసికొనుట తేలికగాదు. వంగదేశ కవులు జయదేవ విద్యాపతులు రాధ కా పదవి కట్టపెట్టిరి. ఆ శృంగారము చైతన్యుని తన్మయత్వము ధ్వనించును గాని శంకరుని విజ్ఞానమును ధ్వనించదు. సిద్ధేంద్రయోగి జయదేవ విద్యాపతుల వలె భక్తుడు కాదు యోగి, జ్ఞాని! అందుచే నతడు కృష్ణునితో పాటు సత్యభామ నాలంబన విభావము చేసెను. సత్యభామ నిఖిల భావములకును ఒరిపిడిరాయి. శృంగారరస లేశములను గూడ సంతరించి సిద్ధేంద్రయోగి 'భామకలాపము' అలంకార సర్వస్వముగా సృష్టించెను. నాట్యము, అభినయము, భావము, సంగీతము, ఈ నాల్గింటి మహాసమైక్యము తెలిసిన

యాకని తన గ్రంథమును కూచిపూడి యగ్రహారికులకు తారకోపదేశము ట్లుపదేశమ్ము చేసి, కాలము పరిణతమైన కొలది మీ కిది వంశపరంపరగా భుక్తి ముక్తి ప్రదాయిని చెప్పె, యా విద్య పరిత్యజించినవారు ముక్తిదూరు లగుదురని శాసించి కొందరు శిష్యులను తయారు చేసెను. వారు తెలుగుదేశము నాల్గుమూలల నీవిద్య వ్యాపింప జేయుచుండిరి. ఈ విద్య మూలమున సర్వశాస్త్రములలోని రహస్యములు సర్వజనులకు తెలియుచుండెను. ఆ నాటకము చూచినకొలది జనులకు హృదయములు కోమలములు, మనస్సులు భావపూరితములు, ఆత్మలు రసనిమగ్నము లగుచుండెను. అది తెలుగువారందఱకు నేర్పని విద్యయైనది అజ్ఞానులు కూడ జ్ఞాను లగుచుండిరి. కూచిపూడివారి భామకలాప మన్నచో ఆ రోజులలో పసిపిల్లల దగ్గర నుండి పారవశ్యమైనది భామకలాపమునకు శరత్కాలపు వెన్నెలరాత్రులు కామధేనువులు.

శరత్తువెన్నెలలు 'మధుర వీధులలో తళతళలైనవి. నాడు ఆశ్వయుజపూర్ణిమ. మీనాక్షీసుందరేశ్వరుల కల్యాణమహోత్సవము. కళ్యాణ మంటపము వీరభూపతియింటి కెదురుగానున్నది. కూచిపూడి వారి భాగవతము కళ్యాణమంటపమున కెదురుగా నాటిరాత్రి యాడబడును.*

మీనాక్షి శ్రావణ శుద్ధ దశమినాడు పేటుపతుల సౌధమున కేగినది. మఱల వే డేగినది. ఏకవీరను భాగవతము చూచుటకు పిలుచుకొని రాతిరి జాముప్రొద్దుపోయిన తరువాత వచ్చినది ఇద్దఱును పలుచని తెరచాటున వారి యరుగుల మీద కూర్చుండిరి. ఒకవైపున కల్యాణము జరుగుచుండెను మరియొక వైపున హంగుమేళము చేయుచుండిరి. జామున్నర ప్రొద్దు పోయినది గొల్లకలాపము ప్రారంభమయినది గొల్లభామయు హాస్యగాడును తెరవెనుక నుండియుండి చాకలివాండ్రు దగ్గఱగా పెట్టిన రెండు కాగడాలమీద చల్లిన గుగ్గిలము మెఱపులో ద్రుతతాళ ముద్ధతనాట్యముగ తెర వెలికి వచ్చిరి. హాస్యగాని హాస్యమునకు, గోపికాభినయమునకు, దాని యుచ్చారణకు, దేశీయభాషా ప్రయోగమునకు జనము కదలి పోవుచుండిరి గోపిక "చల్లోయమ్మచల్లి" యనుచు తన జాతిలక్షణములు, పసువుల మేకల గొఱ్ఱెల స్వభావములతో పశుశాస్త్రము చదివి; షట్శాస్త్రముల యర్థ ముపన్యసించి; రాగములు, తాళములు, భరతము, అలంకారము చర్చించి; గర్భధారణము, గర్భోత్పత్తి, నవమాసములలో శిశువు పరిణామము, ఆత్మతత్త్వము, సృష్టి ప్రకారము సర్వమును జెప్పి ; సభికుల మ్రుగ్గుల చేసి తెర వెనుకకు పోయెను ఏకవీర తదేక ధ్యానముతో వినుచున్నది. మీనాక్షి కొంతసేపు నాటకమును చూచుచు, కొంతసేపు కళ్యాణము వంక చూచుచు, కొంతసేపు జనమున కపతల చరించు వీరభూపతిని కన్నులతో వెంబడించు చుండెను.

---

*ముత్తువీరప్పనాయకుని కాలమునాటికి కూచిపూడి వారి భాగవతము క్రొత్తగా దేశములోనికి వచ్చినది. సిద్ధేంద్రయోగి పదునేడవ శతాబ్దమువాడు. ముత్తువీరప్ప - 1610లో రాజ్యమునకు వచ్చెను అప్పటికే కూచిపూడివారి భాగవతము పేరు మ్రోగిపోయెను. చుట్టుపట్ల వేయి గ్రామములనుండి జనములు గుంపులు గుంపులై వచ్చిరి.

రాత్రి రెండుజాములు దాటి మూడవ జాము కూడ సగము గడచినది. అప్పుడు భామవేషము వచ్చి జడ తెరమీద వైచి తెరవెనుక నుండి తనకథ చెప్పుచున్నది. పద్యం కందఱ కవిమిషత్వము వచ్చినది.

మీనా- ఆ జడ తెరమీద వేయుట యెందుకో తెలియునా?

ఏకవీర- తెలియదు.

మీనాక్షి- భరతశాస్త్రము నందు తమకు సాటివారు లేరని పందెము చఱచుటయట!

ఏకవీర- అట్లయిన పండితులకు కోపమురాదా?

మీనా- రావలయుననియే! వచ్చినచో తమశక్తిని చూపించవలయు ననియే?

ఏకవీర- కొంద ఱీర్ష్యాళువు లుండవచ్చును. వారు ప్రయోగము చేసి పగదీర్చుకొందురు.

మీనా- మంత్ర శాస్త్రమున కూచిపూడివారు మహాఘనులట! వారిశక్తి యపరిమిత మట!

ఇంతలో విరహిణి యయిన సత్యభామ తెరవీడి వచ్చి భగవంతుని దశావతారముల నభినయించెను. ఆ హస్తవిన్యాసము, ఆ యవయవచాలనము. ఆ ద్రుతతాళము, ఆ సుస్వరోచ్చారణ, ఆ భ్రూవిక్షేపము, ఆ భావానుగుణ్య నేత్రోన్మీలన నిమీలనములు సాక్షాత్ భరతముని వచ్చి నేర్పెనా యన్నట్లున్నవి. తరువాత 'భామ' వేషగాడు ముగ్ధమధ్యాప్రగల్భాలాధారముగ విప్రలంభశృంగార మభినయించుచు మానావస్థ యందలి మధ్యాప్రగల్భల ధీరా, అధీరా, ధీరాధీరా భేదములు, అందులో మఱల జ్యేష్ఠాకనిష్ఠల భేదములు సూచించి విప్రలంభావస్థలు పదియును నారంభించి యభిలాష చింతా స్మృతి గుణకీర్త నోద్వేగ ప్రలా పోన్మాద వ్యాధులను నెనిమి దవస్థలు నభినయించెను. రసజ్ఞుల హృదయములు తల్లడిల్లిపోయెను పామరులందఱు హాస్యగాని మాటలకు వశంవదు లగుచుండిరి హాస్యగాడు కూడ 'భామ' భిన్నభిన్న నాయికల నభినయించు నపుడు వాగ్రూపమున తత్తదుచిత సఖీ నిరూపణము చేయుచు పండితుల హృదయము చూఱగొనుచుండెను భావయోగ్యములయిన పతాకాది హస్తములతోడి స్వాధీనమైన నేత్ర తారకా భ్రమణము తోడి నిత్యాభ్యాసవశమైన కౌశలము తోడి యతని యభినయనమునకు, సర్వవిద్యలకు జన్మస్థానమైన బీజాక్షర రూపమున తామ్రవిగ్రహమున నావేశించియున్న శివుడు, నాదతనుడు సుందరేశ్వరస్వామి పులకితుడై కనులు తెఱచి చూచుచుండెను మీనాక్షీదేవి కూడ ముగ్ధయై యతనివంక చూచుచుండెను తద్వీథివాయువులలో మృదంగస్వానములు, కాళ్ళగజ్జెలరవములు విరజిమ్మిన లయ, రమ్యాతిరమ్యమైన భాగవతుల సంగీతపుధ్వని ప్రతి పొరలో నాడుచుండెను. ద్రష్టలైన లక్షజనములో పసిబిడ్డకూడ ఱెప్ప వేయలేదు. తొలికోడికూసినది. 'భామ' జడతావస్థ నభినయించు చున్నది రాగము మాఱినది తాళము మాఱినది. మఱియొక క్రొత్త కీర్తన ప్రారంభించిరి మీనాక్షి కనులు నాట్యప్రదేశమునందు నిశ్చలముగా నతుకుకొన్నవి. ఏకవీర ప్రాణములు పూర్వములైన యెనిమి దవస్థలు మానసికముగా ననుభవించినవి. జడతావస్థాభినయవేళ ఆ గీతమునకు

తాళమునకు దించుకొనిపోయినవి. ఆమె యొడలు విదల్చుకొని, చెవులు మూసికొని, చప్పుడు లేకుండ వీరభూపతి ఇంటిలోనికి పోయినది. ఆ యిల్లామెకు కొంతభాగము పరిచితము. మంచము వేసియున్న గది యామె యెఱుగును. కాని మీనాక్షి వీరభూపతులయు, వీరభూపతి పూర్వప్రణయినిదియు చిత్రము లున్న గదిలోని కామె వారింటికి వచ్చిన మూడుసార్లలో నెప్పుడును పోలేదు. మీనాక్షి యామె కాగది చూపించలేదు. ఏకవీరపోయి పండుకొన్నది. సుకుమారమైన యామె దేహమునకు వేం గ్రుచ్చుకొని యామె యవిచారితముగా పోయి మంచముమీద పండుకొన్నది. బయటనుండి యా జడత్వము కలిగించు రాగము, తాళము సన్నగా వినిపించు చుండెను. ఈమెను జడత్వము సన్నగా నాక్రమించెను. బయట భామ వేషగాడు విధవావస్థ యమంగళమని పరిత్యజించి వాసకసజ్జికాభినయము మొదలుపెట్టెను. రాగతాళములు మఱల మారినవి. క్రొత్తగీతిక యారంభించిరి. వాయు పథమెల్ల నింతకుపూర్వము విషాదభావ పూరితమైనది, మఱల సంతోషభావములు చెలరేగినవి. తాళము విచిత్రరీతుల నడచుచున్నది. ఏకవీర కెదలోని దిగులు సన్నగిల్లినది. ఆమె నేదో కోరిక కలచివేసినది. పండుకొన్నది లేచి, యేమియు తోచక నటునిటు తిరిగినది. ఇట్లు తిరుగుచు ప్రక్కనున్న గదిలోనికి పోయినది. దీపము జేగంటవలె వెలుగుచున్నది. మీనాక్షి చిత్రము, వీరభూపతి పూర్వ ప్రణయినీ చిత్రము పైని వస్త్రాచ్ఛాదితములై యున్నవి, కావున ఆమె కవి గోచరించలేదు. వీరభూపతి చిత్రము గోడ కానుకొని యున్నది. ఏకవీర కనులు మిరుమిట్లుగొనెను ఆమె నిలువున చలించిపోయెను. ఆమె కెదురుగా తన పూర్వ ప్రణయమూర్తి సాక్షాత్కరించి నట్లుండెను. ఏకవీరలో చైతన్యములేదు. ఆమె మనస్సు జడత్వము తాల్చెను. ఆమె కన్నులు తెఱచుకొనియే యున్నవి. ఆ నేత్రములలో జీవచిహ్నము లేదు. ఆమె గోడకానుకొని నిల్చుండుటచేత క్రింద పడిపోలేదు. మనోరథము నిశ్చల మయ్యెను. చల్లగాలికి గవాక్షము తెఱచుకొనెను. బయట సఖీపరిహాసము వినవచ్చెను. ఏకవీర ప్రబోధిత యయ్యెను. తాను నాయిక! ఆ చిత్ర స్థితివలన అది తన నాయకుడు వచ్చునన్న స్థలము! తాను వాసకసజ్జిక! ఇదే యూహ యామెకు! అప్పుడామె స్థితిలోని యణువునకును రసజగత్తును దాటిన యునికి లేదు. ఆమె మనస్సులో మీనాక్షిలేదు. అది మీనాక్షి యిల్లనిలేదు. తానెవరో కూడలేదు. తానున్నది రసజగత్తు! ఆమె నాయిక! అందులో వాసకసజ్జిక! నాయకుని కొఱ కెదురు చూచుచున్నది!

తూర్పురేఖలు తోచినవి. గది బయట సామగ్రీ సంపాదనపు గడబిడ తోచినది. ఏకవీరం తెలివివచ్చి చీరసర్దుకొన్నది. తలవెంట్రుకలు గోళ్ళతో చిక్కు తీసికొన్నది. తన నాయకుడు తన్నువచ్చి కౌగిట పూను ననుకొన్నది.

మఱల బయట మార్గ విలోక మను చేష్టాభినయము నందలి గీతము మొదల్చు "ఇటువచ్చు చున్నాడె, అటు వచ్చు చున్నాడె" యనునవి వినబడెను. ఏకవీర కనులు అప్రయత్నముగా ద్వారము వంకకు తిరిగినవి. ద్వారము తళ తళ లాడినది. బయట నాట్య సౌందర్యము కన్నులువిచ్చి చూచుచున్న సుందరేశ్వరుని కంటివేడిమికి పూజారిచేతి చామరము మండిపోయినది పూజారి చాకలివాని చేతికాగడా యంటు

కొన్నరని వానిని కోపపడినాడు. నాటకమాడుటకు వేయబడిన పందిరి యాకులివర లెత్తబడినవి. భామవేషము వేసిన వాని కోక చివరలు తగులబడినవి. ఆ దోషముకూడ చాకలి వానిపై మోపబడెను. ఎవరో ప్రయోగముచేసిరన్న భ్రాంతివలన మేళమునకు నాథుడైన వృద్ధ బ్రాహ్మణుడు దిగ్బంధము చేసెను. అప్పుడే కృష్ణవేషము వచ్చెను సుందరేశ్వరుని చూపు చల్లబడి గందరగోళమంతయు తగ్గిపోయెను తెల్లవాఱెను. వచ్చిన కృష్ణుని యెడల సత్యభామ సమాదరము చూపుచున్న ధ్వనులు మఱల లోనికి వచ్చినవి.

ఏకవీర కనులు ద్వారమందున్నవి. అందు వీరభూపతి నిలుచున్నాడు. వారిద్దరొకరివంక నొకరు చూచుకొన్నారు నాటి కాఱేండ్ల క్రింద అంబాసముద్రమునకు వీరభూపతి వెళ్ళినప్పు డామె తండ్రి యంతఃపురమున గవాక్షమునుండి యేకవీర చూపులు వీరభూపతి చూపులతో కలసిన నిమేషమునకు నాఱేండ్ల తరువాత చెప్పరానన్ని మార్పులు జరిగి యిప్పుడొకరికొకరు తెలియకుండ నాకస్మికముగా మఱల చూపులు కలిసిన యీ నిమేషమునకు వారి యిర్వురి మనస్సులలో వ్యవధి లేనట్లు తోచెను. ఇరువురును తా మొకరి నొకరు తక్క నింకొక డేమియు ఆ సమయమున చూడలేదు ఊహించలేదు శరీరములతో పాటు, మనస్సులతో నాత్మలతో వా రిరువు రా స్థానమునకే, యాభావమునకే లగింపబడిరి ఆమె యిప్పుడు కోటలో బంధింపబడి లేదు ఇతడు వీధి యందు నిలబడి వేయునది యేమియులేక కాదు వారి యిర్వురి యీ సంయోగ మెట్లు గలిగిన దన్న ప్రశ్న రాలేదు. ఆమె యచ్చట, నత డచ్చట నేల యున్నా రన్న యూహలేదు వీరభూపతి పరిష్వంగార్థము దగ్గఱ దగ్గఱకు వచ్చుచుండెను ఏకవీర చేతులు చాచికొని నిలబడినది

ఆమె యొడలెల్ల చెమ్మటపోసెను. సవ్వడిలేక వీరభూపతి వేయు నడుగు లొక్కటొక్కటి యేకవీర కామె ప్రాణముల మీద వేయుచున్నట్లుండెను ఆమె యొడలంతయు స్తంభించెను వీరభూపతి కౌగిలించుకొ దగినంత దగ్గఱకు వచ్చెను ఆమె పాదముల క్రింది భూమి యల్లలనాడెను. ఆమె నిలువున పులకించినది

అత డామె చేతులు తన చేతులతో తాకెను ఆమె దేహమునిండి కొక విద్యుత్ప్రవాహము ప్రవహించెను ఆమె యొడలంతయు కదలిపోయెను

అతని చేతులామె దేహము చుట్టు చుట్టుకొనెను అంత వఱకు వినవచ్చిన యతని నిశ్వాస వాయువు యొక్క మనోహర మృదుస్వనము వినబడలేదు ఆ నిశ్వాస వాయువు లోకము పూవులన్నియు పూచిన వనము మీది మందమారుతమువలె ఆమె ఘ్రాణేంద్రియమును మాఱగొనెను. ఆమె చక్షుస్సు లతని వక్షస్సులే చూచుచుండెను ఆమె కన్నులలో వైవర్ణ్య ముదయించెను. ఆమె త్వగింద్రియము చర్మదఘ్నముగా శిశిరాతిశిశిరమయ్యెను

అతడామె నెదుఱొమ్మున కాన్చుకొనినాడు. ఆమె నేత్రములు తెఱచుకొని యుండియు అతనివంక చూచుట లేదు వానికి చూచునట్టి గుణము పోయినది కన్నుల నిండ నశ్రువులు నిండియుండెను. అతని యీ కౌగిలింతలోని చల్లదన మామె

రక్తములో ప్రవేశించెను. ఆమెకు 'భూ మధ్య రేఖా' ప్రాంతస్థుని ఉత్తర ధ్రువ సమీపమున కొక్కసారి కొనిపోయినట్లయ్యెను.

అతడామెను గాఢాతి గాఢముగా కౌగిలించుకొనెను. ఆమె ఘ్రాణేంద్రియమున కతని నిశ్వాసపరిమళ మనుభవించు శక్తి పోయినది. గట్టిగా కౌగిలించుకొనుట చేత హృదయము నుండి ధ్వనిరీతి వచ్చిన గాలి యామె కంఠమందు స్తంభించిపోయెను. అతని యా కౌగిలింతలోని చల్లదనమామెలో నరమునరమున వ్యాపించినది. ఆమె హృదయములోని సర్వనాళములు ఆ మహాస్పర్శసుఖ మనుభవించినవి.

అత డామె పెదవిపై నొక్కముద్దిడెను. ఆమె జిహ్వేంద్రియ మా ముద్దురుచి తెలిసికొనలేదు. అతని స్పర్శ యీ సారి యామెలోని అస్థిసంచయమునకు గూడ తాకినది. ఆమెకు హృదయ సంచలనము నందు మాత్రమే స్థితి! తక్కిన సర్వాణువులయందు ప్రళయము! చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణేంద్రియ జ్ఞానమంతయు త్వగింద్రియ మందు లీనమయి యా స్పర్శగుణ మతిక్రాంత మర్యాదమై "ఆమె" యన్న పదార్థవాచ్యమైన సర్వమునందు నిండినది. మంచుగడ్డను కౌగిలించు కొన్నట్లుగా చైతన్యపువేడి కానరాని యామె కౌగిలి వీరభూపతి కప్పుడు తెలిసినది

వెంటనే యతనికి ప్రబోధము కలిగినది ప్రబోధము వెంట ప్రపంచమంతయు గోచరించినది. తాను స్థానాపతి. ఆమె తా నాతేండ్లకు పూర్వము ప్రేమించిన యువతి. ఆమె గురించి తనకు తెలియదు ఆమె యచ్చట నెందులకున్నదో తనకు తెలియదు. తాను చేసిన తప్పు సర్వము తక్షణ మాతని మనస్సులో స్ఫురించెను అతడు దిగ్భ్రాంతి పొందెను ఆ వెనుకటి నిముసమున మహానందము; మఱునిముసమున మహాసంశయావస్థ ఆమెలో ప్రాణమున్నట్లు లేదు. ఆమె మూర్ఛపోయినదా? గతించినదా? వీరభూపతి తొందరపడెను

బయట నాటకము చివరకు వచ్చినది మీనాక్షి వెనుదిరిగి చూచెను వెనుక ఏకవీర లేదు పరుగెత్తుకొని మేడమీదికి వచ్చెను ఆమె గదిలోననులేదు. క్రిందకు మఱల దిగబోయి, అయినను చూతమని రెండవగదిలోనికి పోయెను. నేలబడియున్న యేకవీర! ఆమె ఎద్ద విషణ్ణుడై యున్న తనపతి! ఏకవీరలో మీనాక్షి తనపతి పూర్వ ప్రణయనీరూపము గుర్తించినది కాని తనపతికి చెప్పలేదు ఈ దృశ్యము చూచి యామె మనస్సు పరిపరివిధముల పోయినది

వీరభూపతి యామెను చూచినవెంటనే వచ్చి యతిదీనుడై జరిగిన సర్వము నామెకు నివేదించెను అసంభవమైనది అతని మాటలలోనను, అయథార్థమైనది అతని మొగములోనను ఏమియు కనబడలేదు మీనాక్షి పోయి ఏకవీరను ప్రబోధించు ప్రయత్నము చేసినది ఆమె స్పర్శవలన నామెకు మఱల హృదయమునుండి వేడినెత్తురు నరములలో నెత్తురులో ప్రవహించెను. చర్మమునకు వేడిమి వచ్చెను నిశ్వాసమాడెను. కన్నులు తెఱుపుడు పడెను చెవులకు శబ్దము వినవచ్చెను. సర్వేంద్రియజ్ఞానము కలిగెను. ఆమె మనస్సు సహస్రధా పరుగెత్తెను. ఆమె తొందరలో లేచి లజ్జావనత వదనయై మీనాక్షి వెనుక నిలబడెను.

వెన్నెలలో దీపము దగ్గఱ వాకపస్తువునకు రెండు నీడలుండును. దీపపు చిక్కని నీడ, వెన్నెల పలుచనినీడ! వీరభూపతికి వారిద్ద రాతని కా రెండు నీడలు! మీనాక్షి దీపము నీడ! ఏకవీర వెన్నెలనీడ! బయట నాటక మయిపోయినది.

౨౨

దిగ్భ్రాంతులయి యట్లే మువ్వురును అరగడియసేపు నిలుచుండిరి. ప్రతివిలిప్తయు ఏకవీరా వీరభూపతులకు ఒక మహాయుగమంత భారముగా నుండెను. వీరభూపతి యెవ్వరో యేకవీరకు కొంచె మర్థమయినది. కాని నిశ్చయము కాలేదు. వీరభూపతి కే గోడును తెలియలేదు. కొంత సేపటి కతడు మాట పెగుల్చుకొని మీనాక్షిని ప్రశ్నించబోయెను. మాటరాలేదు. మీనాక్షి యతని యభిప్రాయము తెలిసికొని యామె కుట్టాన్ సేతుపతి భార్య యని చెప్పినది. వీరభూపతిమీద పిడుగు పడినట్లయ్యెను. నిలుచున్నవాడు పెద్దపెట్టున కేకవేసి, నేల చదికిలబడి, 'అయ్యయ్యో!' అని తలవంచుకొని కుడి యరచేతితో మాడుపట్టున మోదుకొనెను. ఆ మఱునిముసమున నాతనికి స్మృతి లేదు.

ఈ సంఘటన వలన ఏకవీరకు సర్వ మవగత మయ్యెను. మీనాక్షి పైగా విప్పి చెప్పెను. "ఈయనయే నాపతి! స్థానాపతి! కుట్టాన్ మహారాజా ప్రాణస్నేహితుడు! ఏకవీరా! ఇది విచిత్రసంయోగము. నీ వివాహమునకు పూర్వము నీ వీతనిని, నా వివాహమునకు పూర్వము నేను కుట్టాన్‌ను ప్రేమించితిమి. వారు మనలను ప్రేమించిరి. దైవసంఘటనము వ్యత్యస్త ఫలితమైనది. వారిద్దరు పరమమిత్రులైరి. నేను పరమమిత్రుని భార్య నగుట తెలిసిన నీ భర్త తన ప్రేమబంధము కోసివేసి నా యందు సోదరీ ప్రేమ నిలిపినాడు. నేను మీ యింటికి రాకపోకలకు కారణమిదియే. పాపమా కుట్టాన్ వాడుగా నీయందలి ప్రేమచే పరిభ్రమించు చున్నాడు. కాని రాచకార్యము లతనిని నీనుండి దూరము చేసినవి ప్రేమోద్వేగి యగు నతడు నేడు వచ్చునో, రేపువచ్చునో! ఉదయన్ సేతుపతిగారు రామనాథమునకు బయలుదేరి నాల్గునాళ్ళయినది. నీ యంతఃపుర వర్తనము, వీరభూపతికి నీదగు కుట్టాన్ భార్యాత్వము తెలియనీయలేదిన్ని సంవత్సరములు! నేటిరాత్రి యీ విచిత్ర సంయోగము! నీ వింత యుద్వేగ ప్రణయినివి!"

ఈ చివరమాట లేకవీరకు వినబడలేదు. తనయెడల కుట్టాన్ ప్రేమచలితుడని విన్నప్పుడు, అతడు నేడోరేపో వచ్చునన్నప్పుడు ఆమె నేత్రములలో ఒకవిచిత్ర సంచలనము కలిగినది. మీనాక్షి మాటాడుచునే యున్నది. ఏకవీర భ్రామహము వలె చరచర మేడదిగిపోయి కళ్యాణమంటపమున కెదురుగా నిలుచున్నది. భాగవంతులందఱు వెడలిపోయిరి. జనము పవ్వడి పదింటికి తొమ్మిదివంతులు తగ్గెను. స్వామిని కదల్చుటకు పూజారులు ప్రయత్నము చేయుచున్నారు. ఏకవీర తూర్పుదిక్కువ చూచెను. సూర్యభగవాను డెఱ్ఱనిచూపులు క్రక్కు చున్నాడు. ఏకవీరకు భయమై కనులు మూసికొన్నది. తన దేహమందు ప్రత్యణువునందు వీరభూపతి స్పర్శ సుఖచిహ్నములు ముద్రితము లైనట్లు తోచిన దామెకు! కనులు తెఱచినది. ఎదురుగా గుజ్జువాళ్ళ పిల్ల యమృతము నిలుచున్నది. చింపిరిజుట్టు, మాసినపరికిణి,

చొక్కాలేదు. దానికన్ను తెల్లగా నున్నవి. ఇంతకుముందా తూరుపు దూరాన తోచిన సూర్యబింబ మీపిల్లగా తనదగ్గఱకు వచ్చినట్లున్న దామెకు! ఆమె నిలువెల్ల చలించిపోయినది. కనులు మూసికొన్నది. సూర్యబింబ మొక కంటికిని, ఆ పిల్ల యొక కంటికి కనబడిరి. వారిద్దరు తన దేహము నందు ప్రవేశించినట్లయిరి. ఆమె కనులు గిఱ్ఱున తిరిగినవి. ఓర్చుకొనలేక కన్నులు తెఱచి తూర్పు వంక చూడక, యన్యుతమున్నయెడ చూడక సుందరేశ్వరుని వంక చూచెను. చాల నాళ్ళుగా దేవుని కొకసంకల్ప మున్నది. ఆ నాటి నాటక ప్రదర్శనము వలన స్వామి యా సంకల్ప ముత్తేజిత మైనది. స్వామికనులు-సంకల్పవికల్పములు సహస్రముఖముల విజృంభించు మనమ్మునకై ప్రతీక్షించుచుండెను. ఆ సమయమున ఏకవీర మనమ్మున సంకల్ప వికల్పములు శతసహస్రముఖముల విజృంభించుచుండెను. ఏకవీర కనులు భగవంతుని కన్నులతో కలిసెను. స్వామి యా చూపు వెంట నామెలో ప్రవేశించెను ఏకవీర భగవంతుని ప్రవేశభారమున కాగలేక మూర్ఛపోయినది. స్వామి విగ్రహము పూజారు లచట నుండి కదల్పలేక పోయిరి.

రాబర్టు డి నోబిలి యను నొక పోర్చుగీసు క్రైస్తవమత వ్యాపకుడు సన్యాసివేషము వేసికొని తత్త్వబోధకస్వామి యని పేరు పెట్టుకొని పరిబోధితులు కాని సామాన్యులను మతాంతరుల చేయుచున్నాడు. విగ్రహారాధన దూషించు చున్నాడు. నాలుగేండ్లుగా నతని యాపని భగవంతుడు హర్షించినాడు. నేటి కతని ప్రాబల్యము మితిమీఱుచున్నది. వానిపని ఆపుచేయవలెనని చొక్కనాథశివుని యాజ్ఞ. ఏకవీరలో స్వామి కదలినాడు. జన మప్పుడే చుట్టును మూగిరి. వార్త పురమెల్ల వ్యాపించెను. అంతఃపురస్త్రీ! అప్సరస! మేలిముసుగు లేక దేవునివెంట పోవుచుండెను. జను లామె సౌందర్యమునకు ఆమె కన్నులలోని అగాధత్వమునకు మెచ్చుకొనుచుండిరి, భయపడుచు నుండిరి అందరు చొక్కనాథశివుని యాలయము ముందున కేగిరి. స్వామి కల్యాణమున కచ్చట పెద్ద పందిరి వేయబడెను ఏకవీర యచట నిలుచున్నది. స్వామి వాహకులు నిలువబడిరి. జనము దూరముగా క్రిక్కిరిసి పోవుచుండిరి. జాము ప్రొద్దెక్కెను. వీరభద్రభట్టరు, ఆతనివెంట నలుగురు దాసీలును, వచ్చి యేకవీరకు నమస్కారము చేసిరి. ఆమె మాటాడలేదు. దాసీలు 'అమ్మా'! ఇదియేమి? పోదముర మ్మనిరి. ఆమె యింకొక దిక్కునకు చూచెను. మీనాక్షి వచ్చెను. ఏకవీర "నింటికిపోదము రా! అంతఃపురస్త్రీలిట్లు వత్తురా? ఇది యేమి యాగడమమ్మా!" యనెను. ఏకవీర భ్రూభంగము చేసెను. ఆమె నెవ్వరును బలవంతముగా లాగుకొనిపో ప్రయత్నించలేదు. ఆమె యెవరి కోసమో యెదురుచూచు చున్నట్లుండెను.

ఎవరో రాజస్త్రీ యంతఃపురము వదలి వచ్చి పిచ్చి యెక్కినదాని వలె బజారులవెంట పోవుచున్న దన్న వార్త నోబిలికి తెలిసినది. తన మతములో కలిసిన యిద్దరు ముగ్గురు శిష్యులను వెంటబెట్టుకొని, వలలో పిట్టపడినదని తెలిసిన వేటకానివలె పరుగెత్తుకొని వచ్చెను పగలు రెండుజాములైనది. చొక్కనాథ సుందరశివుని కంటిమంట భగ్గుమని మండిపోవుచుండెను. నోబిలి జనమును

త్రోచికొని లోనికి వచ్చినాడు. ఏకవీర కన్నులు విచ్చి చూచెను. వోబిలి యా చూపాగ లేకపోయెను. ఏకవీర మందహాసము చేసినది. వోబిలి నిలువ ద్రొక్కుకొనెను.

జనము నిశ్శబ్దమైనది. సూదిపడిన ధ్వని వినంబడుచున్నది.

తరువాత ఏకవీరకు, నోబిలికి వాగ్వాదము జరిగెను.

అందులో నోబిలి సిద్ధాంతము ఏకవీర ఖండించి తన మతమును నిలబెట్టుకొనెను.

చివర కేకవీర యిట్లు తనవాదమును ముగించెను!

"ప్రతి దేశము లోనను జనసామాన్య ముందురు సంఘమున నుచ్చస్థాన మాక్రమించువారు నుందురు. అందఱకు వివేకము సమానముగా నుండదు ఏ దేశమందైనను జన సామాన్యమునకు మతసారస్వతాది విషయములలో విశేషము తెలియదు వారి కెవ దేమాట చెప్పిన నదియే వేదము. విద్యగల యొక సంఘ భాగమున గూడ మూఢు లుందురు వారిని నీ మతములోనికి దింపి నీ భుజములు చట్టలు పొంగ నక్కఱలేదు ఇంకొక సంగతి జెప్పెదను వినుము బుద్ధి యెవని సొమ్ము? వేళను బట్టి యొకని బుద్ధి పనిచేయదు ఒక మందబుద్ధియే సంతోషవేళ లోకములు జయించిన వానివలె మాట్లాడును అర్జును డంత మహావీరు డొక సమయమున కర్ణుని జూచి బెదరినాడు. అది వేళావిశేషము. వాదమునకు పైవాద మెప్పుడు నున్నది. తీవ్రతరవాది వచ్చినప్పుడు లొంగిపోవు సిద్ధాంతములు ప్రతిపాదించియేమి? ప్రతిపాదించకయేమి? లోకమందఱు మూఢులై యొక నీచమత మవలంబింతురనుము ఆ మత ముండియేమి? లేకయేమి? నే డొక వందమంది నీ మతస్థులైరి. ఱేపు నీ తలదన్నిన వాని మాటచే వారు వానిమత మవలంబింతురు ఇది వృథా ప్రయాస. మహావిజ్ఞానఖని తనమోక్షము తాను సాధించుకొనును సనాతనధర్మము యుగముల తరబడి నిలిచినది నీ మత ప్రాబల్యము బౌద్ధమత ప్రాబల్యములో పోల్చుకొమ్ము. దానిని గోట చిదిమినాడు శంకరుడు. ఈ దేశమున ఏ యితరమతమైనను నింతియే' తొలినాడు ఉత్తరమున చైతన్య మీరాబాయి ప్రభృతులు, పడమట రామదాసు శివాజీ ప్రభృతులు, తూర్పున విద్యారణ్యులు నుదయించి శివునకు ప్రీతిజేసిరి. మీరింక మీమత మిట్లే పోషింతురా, మీకు తగినవారు మీకు నుదయింతురు. అవివేకుల యందలి యేకదేశఫలితము వలన లోకవంచనము కాక బ్రహ్మప్రీతిలేదు. భగవద్గీత చదువుకొనుము- "**యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.**"

ఆమె గొంతు చివరకు రాను రాను పెద్దదైనది. కనులు విప్పారు గ్రక్కున నిలువెల్ల కదలిపోయెను 'సృజామ్యహం' అని పలుకుచుకొని పడిపోయెను. ప్రొద్దుగ్రుంకుచుండెను దాసీలు, వీరభద్రభట్టరు, మీనాక్షియు నామె నింటికి తీసికొనిపోయిరి. ఊరిలోని సగముజన మచ్చట నుండెను. ప్రొద్దుటినుండి యెవరికి భోజనములేదు. డి.వోబిలి యచ్చట నిలువలేకపోయెను జనుల నిందావాక్యములు వినలేక తలవంచుకొని యదే పోక పోయెను అతడు గతించిన నాలుగేండ్లుగా నిర్మించిన సౌధమా నాటితో నేల కూలెను అతని శిష్యులు తలా ఒక త్రోవ పట్టిరి.

జనులు సంజచీకటులలో నొకరినొకరు త్రోసికొనుచు నిండ్లకు పోయిరి. భర్త జీవితమును సుఖపఱుపవలెనని తల్లి నేర్పించిన యేకవీర చదువు శ్రీ సుందర చొక్కనాథశివుని కుపయోగపడినది.

౨౩

ఏకవీర మఱునాడు ప్రొద్దుతిరిగి నిదుర లేచినది. ఆమెకు వెంటనే స్మృతికి వచ్చిన సంగతి వీరభూపతి కౌగిలింత! ఆ పరిష్వంగ పారవశ్యముపోయి దానిలోనున్న యొక మహానుభూతి యామె సర్వావయవముల యందు రక్తనాళములయందు వ్యాపించినట్లే యున్న దామెకు. రెండవది విపరీతమైన యాకలి. ఆ వెనుకటి దిన మేమిజరిగెనో యామెకు స్మృతిలేదు. పరిచారికలు వేన్నీళ్లు పెట్టి తలంటి సుగంధ ద్రవ్యము లలంది స్నానము చేయించిరి. దీర్ఘమైన యామె కేశపాశము దులిపి యగురు ధూపములు వేసిరి. ఒడలినిండ సువాసన ద్రవ్యములు పూసిరి. జరీయంచు పూవులుగల తెలిపట్టుచీర కట్టిరి. సుకుమారములు, తేలికలైనవి, మధురములైన పదార్థము లారగింపించిరి. ఒడల నగలు కొద్దిగా నలంకరించిరి. ఇంతలో నొక సేవకుడు పరుగెత్తుకొని వచ్చి కుట్టాన్ సేతుపతి మహారాజా వచ్చుచున్నాడని, యీ పాటికి నగర ద్వారము చేరియుండునని, తన ప్రేమ చిహ్నము దీర్ఘ రమణీయాష్టాపదదామము భార్యకు పంపెనని, తా నామెను చూచునపు డది యామె ధరించియుండ వలయునని చెప్పి గోధుమవన్నె త్రాచువలె తళతళలాడు నగనిచ్చెను. ఒక పరిచారిక తా నది యందుకొని యేకవీర మెడలో వైచెను. ఏకవీర వలదనలేదు. ఆమె మొగమున నంగీకారములేదు. ఆ హార మామె కాంచీప్రదేశము వఱకు వ్రేలాడెను. ఆ సూత్రము రైకలేని చోట మెడమీద తగిలి యామెకు విషలిప్తమైన సన్నని కత్తివాదర యంటుకొన్నట్లయినది. ఆమె తాళలేక దొడ్డిలోనికి పోయి, తక్కిన యాకులు కోయబడి సన్నని, తెల్లని విరిసిన మొవ్వాకుల యరటి బోదె మొదల నిలుచుండెను. పొద్దు మూడు జాములు దాటినది. ఆమె యటనుండి కదల లేదు. పరిచారిక లొకరిద్దఱామెను పలుకరించుటకు భయపడిపోయిరి.

నురుగులు గ్రక్కుచున్న గుఱ్ఱములుగల రథమునుండి కుట్టాన్ దిగెను. స్నానము చేసెను. స్నానము చేసినంతసేపు ఏకవీరను గూర్చియే ప్రశ్నించెను. దాసి లేకవీర నిన్నటికథ చెప్పిరి. అతడాశ్చర్యపోయెను. అల్పాహారము తీసికొనెను. తీసికొని నంతసేపు ఏకవీరను గూర్చియే ప్రశ్నించుచుండెను. ఏకవీర యంతఃపురమును వదలి యట్లేగుట యెట్లున్న దన్న దొకదాసి? కుట్టాన్ సమాధానము చెప్పలేదు. అతని యెదలో ఏకవీర దేవతామూర్తి యనిపించినది. వనపువ్వుచ్చాయ సన్నని పట్టుధోవతి, బూదిరంగు జరీపూవుల పసుపుపచ్చని పట్టుత్తరీయమును ధరించెను. తలకు ఘుమఘుమలాడు మందార నూనె రాచెను. కర్పూరపు తావులు చిమ్ము తాంబూలము సేవించెను. ఇంతసేపు ఏకవీరను గూర్చియే ప్రశ్నించుచుండెను. ఒకదాసి ఏకవీర చదువున కందఱాశ్చర్యపడి రనెను. కుట్టాన్ మనస్సులో ప్రేమ ప్రవాహము కట్టలు తెగిపోయెను. పొద్దు మూడు జాములు దాటినది. కుట్టాన్ ఏకవీరను చూచుట

కామెగదిలోనికి పోయెను. ఆమె యచ్చటలేదు. ఒక పరిచారిక దొడ్డిలో నున్నదని చెప్పెను. అచ్చటికి పరుగెత్తుకొనిపోయెను.

ఒంటి మొవ్వాకు విరిసిన యరటిచెట్టు కింద నిలుచున్నది యేకవీర. ఆమె మెడలో తాను పంపించిన హారముతళతళ యెండపొరలో మెఱయుచున్నది. సౌదామినీ గర్భమైన సితమేఘ మలంకరించుకొన్న శరల్లక్ష్మివలె ఆమె కుట్టాన్ కన్నులు మిఱుమిట్లు గొలిపెను. కుట్టాన్ పరుగున పోయి కౌగిలించుకోవలె ననుకొనెను. ఏకవీర మొగము విషణ్ణమై యున్నది. కుట్టా నామెను సముత్సాహపఱుప వెంచి నవ్వెను. ఏకవీర మొగము వికృతమయ్యెను. కుట్టా నామెను సమీపించెను. ఆమె వెనుక వెనుకకు పోయెను.

కుట్టాన్ కన్నులలో ప్రేమకురిసినది. ఆమె కన్నులలో భయము విరిసినది. కుట్టాన్ మాటాడుద మనుకొన్నాడు. ఆమె పరాంగన కాదు. ఇదివరకే తన్ను ప్రేమించినది; తాను ప్రేమించలేక పోయినాడు. ఇప్పు డా ప్రేమ ముసు...వి వచ్చినది. "బాగుగ నున్నావా! ఏమి చేయుచుంటివి?" మొదలగు ప్రశ్నలకు తావులేదు. తన ప్రేమకు తగిన దొక్కటియే! గాఢ పరిష్వంగము! తాను మాట్లాడలేక పోయినాడు. అతని కనుల వెంట నీరు గిఱ్ఱున తిరిగెను. అతడొక యడుగు ముందునకు వేసెను. ఏకవీర ఆన పెట్టినది. కుట్టాన్ నిలిచి పోయెను. ఏకవీర యేడ్చినది కుట్టాన్ మఱియొక యడుగు వేసెను. ఆమె తన్ను తాకవలదన్నది. తాకినచో చచ్చిపోయెద నన్నది. ఈ మాటలు కుట్టానుకు వినిపించలేదు.

అతని గొంతుక విడివడెను. ప్రశ్నమీద ప్రశ్నగా నొక లక్షప్రశ్న లతని నోట వెలువడెను. "ఇంత చదు వెప్పుడు నేర్చితివి? క్రైస్తవ సన్యాసి నీ ముందు నోరు మెదపలేక పోయెనటగదా! అంతఃపురము వదలిపోవుట కెట్లు సాహసించితివి? నిన్ను సుందరేశ్వరు డేమైనను బూనెనా? నేను నిన్న నైన వచ్చితినిగాదు. వచ్చినచో నీ విజయమున కెంత సంతోషించియుందును!"

మఱల నింకొకరీతి ప్రసంగము చేసెను. "ఇన్నాళ్ళు నిన్ను ప్రేమించజాలనందులకు క్షమించుము. దానికి కారణము నీకు చెప్పితిని. ఆ కారణము నాల్గు నెలల క్రిందనే కారణము కాకుండబోయెను దుర్విధి నన్ను మధురనుండి తఱిమినది. హఠాత్తుగా నిన్ను కలిసికొని పొందు మహానందము నందలి యాశ నీకు నాచేత నుత్తరము వ్రాయించలేదు. నా మిత్రుడు వీరభూపతి భార్య మీనాక్షి " అని కుట్టాన్ మొదలు పెట్టగనే యేకవీర పాఱిపోజొచ్చెను. ఆమె వీధివాకిలి దాటి హజారముదాటి పోయెను. కుట్టా నామె వెంట పరుగెత్తెను. అరజాము ప్రొద్దుండెను. వీధిలోనికి వచ్చి యేకవీర తలయెత్తి చూచెను. మీనాక్షి దేవి దేవాలయ శిఖరపు బంగారపు తొడుగు ఎండలో ధగధగ మండిపోవు చుండెను. ఇంతలో కుట్టాన్ ఏకవీరను కలిసికొనెను.

**కుట్టాన్**- ఎక్కడకు పోవుచుంటివి?
**ఏకవీర** - వైగెవదికి.
**కుట్టాన్**- ఎందుకు?

**ఏకవీర** - నాయెడల మహోపు మున్నది. అది కడిగి వేయుటకు.

గుజ్జువువాళ్ళపిల్ల యమృతము దువ్వినతలతో పరికిణీ తొడుగుకొని చొక్కా తొలిచి-బడి వదలి పెట్టిరి- యింటికి వచ్చుచు "ఆరంజేవిరుంబు, " "ఆరవదుశివతో" అని పిచ్చిపిచ్చిగా పాడుకొనుచు వచ్చుచుండెను. ఆమె యేకవీరను చూచి భయపడి పాటిపోయెను. ఏకవీర మఱల పరుగెత్తెను. కుట్టాన్ వెంబడించెను. వైగ చూపుమేరలో నిలచెను. కుట్టానున కేకవీరకు మధ్య వందగజములు దూర ముండెను. ఏకవీర గాలి పొరవలె వెగిరిపోవుచున్నది. కుట్టాన్ పర్వతమువలె కదలలేకుండెను. ఏకవీర కెదురుగా నొక సన్న్యాసి వచ్చుచుండెను ఏకవీర యతని జూచి నిలువున కంపించిపోయి కన్నులు రెండు చేతులతో మూసికొనెను సన్న్యాసి యామెవంక నైన చూడలేదు. ఆమె యున్న యెడదాటి సన్న్యాసి నెమ్మదిగా కుట్టాన్ దగ్గఱకు వచ్చుచుండెను. కుట్టాన్ చూచెను. ఏకవీర నిలుచున్నది సన్న్యాసివంక చూచెను. కుట్టాన్ ఒక మహాశ్చర్యము పొందినట్లు దేహము వెనుకకు కదల్చెను. సన్న్యాసి తలయెత్తలేదు. కుట్టా నతనిని పలుకరించెను.

**కుట్టాన్**- వీరా! ఇది యేమి?

సన్న్యాసి తలయెత్తెను. ఎదుట కుట్టానును చూచెను. వీరభూపతి కన్నులలో బాష్పము లేర్పడపోయి వెనుకకు మరల్చబడెను. కుట్టానున కనేకములగు నూహలు తోచెను. తన మీనాక్షి ప్రేమ యతని సన్న్యాసమునకు కారణ మనుకొని "స్థానాపతీ! క్షమించలేకపోయితివి!" అన్నాడతడు. వీరభూపతి కన్నులలో జాలి చూపెను.

దూరమున ఏకవీర మఱల నడచుచుండెను. కుట్టాన్ వీరభూపతిని వదలి మఱల నామె ననుసరించెను. ఈ సారి యేకవీర నడువలేకపోయెను. కుట్టాన్ ఏకవీర నందుకొనెను. ఇరువురు గజ మెడముగా వైగ నీటి పొర వద్ద నామెయు, నివతల నతడు నుండిరి. కుట్టాన్‌కు కోపము వచ్చెను

**కుట్టాన్**- అడుగు వైచితివా, నిన్ను బలవంతముగ ఇంటికి తీసికొనిపోయెదను

ఏకవీర కదలలేదు వీరభూపతి, తన ప్రేమ దాని విచిత్ర పరిణామమును పూసగ్రుచ్చినట్లు చెప్పెను. తన దేహములో నున్న ప్రతియణువు వీరభూపతిస్పర్శ మనుభవించు చున్నదని చెప్పెను. అది యింకొక విజాతీయస్పర్శ తాళుకోలే దనెను. కుట్టాన్ చివరిమాటలు వినలేదు. అత డాలోచనలో పడెను

పడమట లోకబంధు డస్తమించబోవుచున్నాడు. విచిత్రముగ చీకట్లును, ఎఱ్ఱనికాంతులు నొక్కసారి లోకము మీదికి వచ్చెను. ఏకవీర మొగము తూర్పునకు తిరిగియున్నది. కుట్టాన్ పడమటికి తిరిగి యున్నాడు. ఏకవీర మొగమున చీకట్లు, కుట్టాన్ మొగమున వెలుతురు వ్యాపించినవి.

కుట్టాన్ చివరకు మాట్లాడెను. "ఇది విచిత్ర కథా మంటపము. దీనికి మన మిద్దఱము, మీనాక్షి వీరభూపతులు నాలుగుస్తంభములము."

ఏకవీర యొకవిచిత్రమైన ప్రశ్నవేసెను. "మీరు నన్నింకను ప్రేమింతురా?" ఆమె పెదవులసందునుండి యొక సన్నని నవ్వు వినబడెను. తపస్వియైన కుట్టాన్ తా

నామెను ప్రేమించుచున్నా నన్న సంగతి చెప్పలేదు. అతడు ప్రేమచే కదలిపోయెను. ప్రేమప్రవాహ మతనిమీద విఱుచుకొనిపడినది.

హఠాత్తుగా కుట్టాన్ రెండుచేతు లామె దేహము చుట్టు చుట్టుకొనెను. అంతవఱకు వినవచ్చుచున్న వైగైతరంగముల తటకల సవ్వడి, గాలి రివ్వుమన్న సవ్వడి యామె చెవులకు వినబడలేదు. ఆమె కన్నులు చీకట్లను చూచుచుండెను. ఆమె ఘ్రాణేంద్రియమునకు గాలిలో నొక వగరువాసన తోచెను. ఆమె త్వగింద్రియము చైతన్య రహిత మయ్యెను.

అతడామె వెదుటొమ్మున కాన్చుకొనెను. ఆమె నేత్రములలో చూపు తప్పిపోయెను. ఆమె దేహములోని రక్తము ప్రాణవాయువును భరించలేకపోయినది. ఆ రక్తమంతయు మృత్యుస్పర్శవలన కలుగు శైత్య మలవరించుకొన్నది.

అతడామెను గాఢముగా నొక్కుకొనెను. ఆమె నాసారంధ్రముల లోని శ్వాస మాడలేదు. ఆమె నోరు కొంచెముగా తెఱచుకొనెను. ఆమెలో నాడి నిలిచిపోయెను.

అతడామె పెదవి తన పెదవిలో తాకెను ఆమె హృదయములో ప్రాణవాయువు నిలిచిపోయెను

ఇది యంతయు కన్నుమూసి కన్ను తెఱచునంతలో జరిగెను కుట్టానునకు ప్రబోధము గలిగెను తన కౌగిలిలోని నిర్జీవపదార్థ మతడు వెనుకకు త్రోసెను అది మోకాటిబంటినీటిలో పడి చప్పుడయ్యెను చీకటులు క్రమ్మి నల్లని గుడ్డ కప్పబడిన గతప్రాణివలె వైగై తరలిపోయెను

స మా ప్తి

# స్నేహఫలము

## ౧

అది వసంతకాలము. మావితోపులలో కోకిలలు కూయుచుండెను. కాంచీపుర పరిసరములందు మావితోపులు మెండు. ఎండ కాయుచుండెను. వేసగి యెండకును వసంత కాలపుటెండకును మిక్కిలి భేదము లేదు రెండు ఋతువులకును భేదము సాయంకాలములందు గాని, మధ్యాహ్నమందు కాదు. ఆయెండలలో భేదమున్నది. వేసవి యెండలో వడయున్నది, వసంత కాలపు టెండలో వడ లేదు ఎండలో నున్నప్పుడే వసంతకాలపు టెండ బాధించును గాని నీడ పట్టున నున్నపుడది బాధించదు ఆ యెండను సహించవచ్చును వేసవికాలపు టెండ తాను లేనిచోట కూడ తనప్రతాపము చూపును. ఐనను ఈ యెండలు రెండింటికిని చాల సామ్యముకలదు

వేసంగిలో కూడ నేల సారవంతమైన దయినచో కొన్ని పైరులు వేయుదురు. కాంచీపురము నలువైపుల ఈ పైరు పచ్చగానున్నది కోకిల కూయుచున్నది.గాలిలో నుండి యొక సన్నని మ్రోత వినవచ్చుచున్నది. తేనెకై తేంట్లు తిరుగాడుచు ఝుమ్మనిరొద సేయుచున్నవి అది తేంట్ల ఝుమ్మను రొదయని తెలియకుండ చెవులకు వినబడియు వినబడకుండ రమ్యముగా వినవచ్చుచున్నది. అది వినవచ్చు చున్నదనియు తెలియదు చెవులకు వినబడినదో లేదో కూడ అంతు పట్టదు. శ్రవణేంద్రియమునకు తెలియకుండ ఆత్మకు మాత్రమే తెలిసి ఆనందము మాత్రము కలుగుచుండును పగటిపూట చెవులకేదో సవ్వడి వినిపించకుండ నుండదు. వినిపించుచున్నట్టు తెలియదు. పట్టణములలో కోట్లకొలది జనము తమ తమ పనులు చేసికొను చుండుట అనేక ప్రాణులయొక్క కంఠస్వరములు గాలిత్రోవలలో ఆకాశమునందెగిరి కలియుచుండును ఇది యంతయు సవ్వడియే. రాత్రి రెండు జాములు దాటిన తరువాత సర్వజగమును నిద్దుర పోవుచున్నప్పుడు నీకు మెలకువ వచ్చును అప్పటి నిశ్శబ్దతకు, పగటిపూట నిశ్శబ్దముగా నున్నదని మన మనుకొను వేళయందలి నిశ్శబ్దతకు పోల్చి చూచినచో ఈ సంగతి తెలియును పగటిపూట నిజముగా నిశ్శబ్దత లేదు మన చుట్టు పట్ల శబ్దము లేకుండ నుండవచ్చును. కాని మారుమూలనుండి పిచ్చుకల కిచకిచలలో, రథధ్వనులలో, పశువుల యఱపులలో కీలగా వినిపించును వినిపించకపోయినను ఈధ్వనియంతయు ఒక ముద్దకట్టి చెవులకు వినిపించుచునే యుండును ఆ ముద్దకట్టిన ధ్వని ధ్వనియైనట్లు మనకు స్ఫురించదు మఱియు అట్టి సమయమున ఒక మధురమైన సన్నని ధ్వని మిక్కిలి జాగ్రత్తగా పరిశీలించినచో వసంతకాలపు పగళుల యందు నిస్సందేహముగా వినిపించును. అదియే తేనియ కొరకు తిరుగులాడు తేంట్ల సవ్వడి పూతోటలలో ఆ సవ్వడి విస్పష్టముగా వినిపించును ఇంత మధురమైన సవ్వడి వినుటకు చెవి మిక్కిలి సుకుమారమైనదై

యుండవలయును. ఏ యింద్రియమైనను సుకుమారమైనదై యుండుటకు మనస్సునకు మంచి పరిపాకము కావలయును. మధురమైన సంగీతము వినుచు, శాస్త్రములు కవిత్వములు నిత్యాభ్యాసము చేయుచు హృదయమునందు పరమ సుకుమారుడైన మనుష్యునకు ఇట్టి ధ్వనులు వినిపించును. ఆలోచన లేనివాని కేవియు వినిపించవు.

అట్టి సమయమున అంతటి సుకుమార రవములు విని యాస్వాదించి యొక సుఖమనుభవించుటకు అలవాటుపడిన ప్రాణి పగటి రెండుజాముల వేళ తోటలలో, డొంకలలో, వట్టి యెండలలో వాహ్యాళిపోవును. మహామల్లుడు నరసింహవర్మ పల్లవరాజు తానా యెండలో వాహ్యాళికి బయలుదేఱెను. ఈ మహారాజు మహాపరాక్రమ వంతుడు దేశమునందు శాంతి నెలకొల్పినవాడు. ఆయన యేనుగుమీద నెక్కి వాహ్యాళికి బయలుదేఱెను. ఆ యేనుగుమీద ముగ్గురే యుండిరి. మహారాజును, మావటి వాడును, మానవర్మయు మానవర్మ సింహళ దేశీయుడు. రాజుకొలువులో నున్న యొక గొప్ప యుద్యోగి. కార్యమునకు ఖడ్గమునకు ఘనవాడు. ఏనుగుపైనున్న హౌదాకు పైన కప్పులేదు. హౌదాలో రాజు ముందు కూర్చుండెను. వెనుకతట్టున మానవర్మ కూర్చుండెను. రాజు పాలములయందమును దూరపు కేకలను మానవర్మతో ఉపన్యసించుచుండెను. మానవర్మ విషయములో నడుమ నడుమ సముచితములైన సమాధానము లను చెప్పుచుండెను క్రమక్రమముగా ఎండ బలియుచుండెను రాజునకు దప్పిక వేసెను మానవర్మకు దప్పిక వేయలేదు రాజు మావటివానితో "ఓయీ! దప్పిక వేయుచున్నది ఒక కొబ్బరితోట దగ్గఱకు తీసికొనిపొమ్ము. వారి కేళపు బొండములు త్రాగుద" మనెను దూరముగానున్న యొక కొబ్బరితోట యొద్దకు మావ డేనుగును నడిపించెను ఆ తోటవాడు వచ్చి మహారాజును చూచెను. తలమీద పాగతీసి నేలనుంచి మోకరించి నమస్కారము చేసెను మావటివాడు తోటకల వానితో, "మహారాజునకు దప్పికయగుచున్నది రెండు కొబ్బరి బొండములు తీసికొని ర"మ్మనెను ఆ తోటమాలి యానాడు తనయదృష్టము పండినట్లు తోట లోనికిపోయి చెట్లన్నియు పరిశీలించెను తోట కలవానికి తనతోటలో ఏ చెట్టుయొక్క కాయనీళ్ళు తియ్యగానుండునో తెలియును వానిలో మఱియు తీయగా నుండెడి మూడు చెట్ల కడకు పోయి తలయెత్తి పరీక్షించెను ఒక చెట్టు బొండములు మిక్కలి పెద్దవి, లేతవి, సన్నగా లోన కొబ్బరి యేర్పడిన కాయలోని నీళ్లు మిక్కలి తీయగా నుండును ఆ చెట్టుకాయలో శేరు నీళ్ళుండును. అతడు చెట్టున కెగబ్రాకి నాల్గు బొండములు క్రిందికి పడద్రోసెను దిగి వచ్చి చూడగా అందులో రెండుకాయలే పానయోగ్యములుగా కనిపించెను కొడవలితో వాని తలలు కొట్టి శిరమున రంధ్రములు చేసి వాని రెంటిని తెచ్చి మావటివాని దగ్గఱ నిలుచుండెను వాడేన్గు యొక్క ముందు కాళ్ళు వాలింపించి బొండ మందుకొనెను వాడు రెండవ బొండ మందింపబోయెను రాజు తొలుత పలదని మఱల తీసికొనెను. ఏన్గును మావటివాడు యథాస్థితిలో నిలువబెట్టెను. రాజు మొదటి బొండములో నీళ్లు త్రాగుచుండగా ఏన్గు ముందు కాళ్ళు లేపుట చేత బొండములోని సగము నీళ్ళు తొణికిపోయెను మహారాజు కాయనీటితో

తృప్తిపడక రెండవ కాయలోని నీరుకూడ త్రావ నారంభించెను. కొంత త్రావిన తరువాత ఆయన కింక నక్కఱలేకపోయెను. రాజు బొండమును మానవర్మ చేతి కందించెను. ఆ బొండమును పాఱవేయుమని రాజుయొక్క యుద్దేశము.

ఆ బొండమును పుచ్చుకొని మానవర్మ యిట్లాలోచించెను. 'ఈ రాజు నాకు మిత్రుడు. ఇతడు నాకాశ్రయమిచ్చినవాడు. మిగిలిన నీరు నేను త్రావవలయునని యిచ్చెను కాబోలు. తన యెంగిలి నన్ను త్రావుమనునా? రాజు ధూర్తుడు కాడు ; దురహంకారి కాడు; సాధువైన పురుషుడు. నాయందు మిక్కిలి ప్రేమ కలవాడు. గతిలేక తన పంచచేరిన నన్ను మిత్రుని వలె, అంతరంగికుని వలె పరిపాలించు చున్నాడు. నాయందెంత ప్రేమలేకున్నచో తా నెంగిలి సేసిన యెడ నీటి బొండము నాకందిచ్చును? నేను దీనిని దురహంకారముతో పాఱ వేసినచో రాజునకు కోపము వచ్చును. ఆయన నాయందు చూపించుచున్న ప్రేమకు నేనిది పాఱ వేయుట న్యాయము కాదు. ఆయన యెంగిలి చేసిన యెడ నీరము నేను త్రావినచో నాకు వ్యాధి పుట్టదు. నాకు మర్యాదభంగము లేదు" అని మానవర్మ యాలోచించెను.

ఇంత యాలోచనయు జరుగుటకు అఱనిముసమైన పట్టదు. ఊహ, కనుమూసి కనుతెఱచు నంతలో చెప్పుటకు పదినిముసములు పట్టినంత వచ్చును. మానవర్మ యానీరమును పరిహరించుట అవివేకము. స్వీకరించుట వివేకము. అతడా యెడ నీటి బొండమును నోటికడ నుంచుకొని త్రావుచుండెను. ఇంతలో రాజు వెనుదిరిగి చూచెను. తాను పాఱవేయుమని యందిచ్చిన నీటిబొండమును మానవర్మ త్రావుచుండెను. రాజు తానతనిని త్రావుమని యిచ్చెననుకొన్నాడు కాబోలును. మానవర్మ గొప్పవంశము నందుపుట్టినవాడు. అతడు నొక రాజ్యమున కర్తుడు. దినములు బాగుండక తన్ను వచ్చి యాశ్రయించినవాడు. అతనికి తనయందింత స్నేహభావ మున్నదని ఇదివరకు తనకు దెలియలేదు. తానిట్లియగా మఱియొకడైనచో మనస్సులో మిక్కిలి కోపము తెచ్చుకొనును "ఇది రాజయోగ్యమైన పని కాదు" అనుకొని వెంటనే మానవర్మ చేతిలోని కొబ్బరి బొండము తాను తీసికొని మిగిలిన నీరము తాను త్రావెను. మానవర్మ యాశ్చర్యపోయెను.

తరువాత ఏనుగు దారివెంట పడిపోవుచుండెను. మావటివాడు బంగారునాణెము నొకదానిని తోటవానివైపు విసరివేసెను అతడది స్వీకరించి కొయ్యబొమ్మవలె నిలిచి పోయెను బంగారునాణె మెట్లుండునో వాడెఱుగడు. అతనికి నాల్గు కొబ్బరితోట లున్నవి. ఆనాడు వస్తువిచ్చి వస్తువు పుచ్చుకొనుటయే కాని జనము నాణెము లెఱుగరు. నాణెములని యుండునని వినికిడి. ఒక్క బంగరు నాణెము కంటికి కనిపించినచో లక్ష్మీదేవి దర్శన మయినట్లే. పూర్వమెప్పుడో తన పల్లెలో నొక పండితుడు తన పాండిత్యము చేత రాజును మెప్పించి కొంత పొలమును సంపాదించెను. ఆయనకు రాజుగారు పది బంగారునాణెముల నిచ్చెనట. ఆ నాణెములు గ్రామమంతయు చూచిరి. అబ్బురముగా చెప్పికొనిరి.

అతడా నాణెమును చూడలేదు. వట్టి వినికిడియే. ఆ వినికిడి కూడ అతనికి లేనిచో ఇది నాణెమనియు తెలిసెడిదికాదు. తన తలపాగ యూడదీసి యా నాణెమును

పాగకొంగున ముడివేచి మఱల తలపాగ ధరించి రాజుగారి యేనుగు పోయినంత మేఱ దాని వంకనే చూచుచు నిలుచుండెను. తోట అడ్డము వచ్చి యేనుగు కనిపించుట మానివేసెను.

ఏనుగు మీదనున్న మహారాజును, మానవర్మయు, మావటివాడును ముగ్గురును మూడు విధములుగా ఆలోచించుకొనుచుండిరి.

మావటివాడిట్లనుకొనెను- "రాజుగారికి మానవర్మగారిమీద ఎక్కువ గౌరవ మున్నదని నాకు దెలియును. ఆ యిరువు రొకరి యెంగిలి నొకరు త్రాగుటకు వెనుదీయ నంత స్నేహమున్నదని తెలియదు. రాజునకు మానవర్మగారికిని భేదము లేదన్నమాట! మానవర్మ రాజున కంగరక్షకుడు. పరాక్రమవంతుడు. మంత్రి, పండితుడు. ఆయన యీదేశము వాడు కాడు పరదేశస్థుడు నాలుగేండ్ల క్రింద రాజు కొలువులో ప్రవేశించినవాడు. తన పరాక్రమముచేత, సేవించు నేర్పు చేత, తన మంచితనము చేత మహారాజున కాప్తుడైనాడు తోడ మానవర్మ లేకుండ మహారాజు కాలు బైటపెట్టడు మానవర్మదే యదృష్టము. ఇదివఱకు నే నెప్పుడును చూడలేదు మహారాజు కొంత త్రావి యాతని కందిచ్చెను అతడు కొంత త్రావి మఱల రాజున కందిచ్చెను. ఇట్లు సురాపానము చేయువారు చేయుదురు. పరమమిత్రులుచేయుదురు."

మానవర్మ యిట్లనుకొనెను- "రాజు కొబ్బరి బొండమును పాఱవేయుమని యందిచ్చెను. నేనది గ్రహించలేక త్రావితిని. రాజు నాయొక్క భక్తిని మన్నించెను. తాను తప్పుచేసితి ననుకొనెను. ఆ తప్పునకు పరిహారమేమి? మఱల యెంగిలి తాను త్రావుట! మహారాజు దీనికి వెనుదీయలేదు ఈయన యెంతటి సత్పురుషుడు! అహంకారియైనచో నేటినుండి నన్ను నిరాదరణగా చూచెడివాడు ఉచ్చనీచములు లేకుండ నాచేత పనులు చేయించెడివాడు మహారాజు యొక్క గౌరవదృష్టిలోనేను పడిపోయెడి వాడను. నా యవివేకమును రాజు ప్రాణస్నేహముగా మన్నించెను ఒక తల్లి కడుపున పుట్టిన బిడ్డలు ప్రవర్తించినట్లు ప్రవర్తించెను ఈ రాజునకు నాయెడలి కండలు కోసి యిచ్చినను తప్పులేదు. రెండు మూడుసార్లు నేను మహారాజును రక్షించినమాట నిజమే. అది సేవకుని ధర్మము. రాజులు మెచ్చినచో ధనమిత్తురు. అధికారమిత్తురు. ప్రాణమీయరు. ఈ రాజు తన ప్రాణములు నా కిచ్చు చున్నాడు. నేనీ రాజు నాశ్రయించి నా రాజ్యమును నేను సంపాదించుకొనవలయునని యనుకొను చున్నాను. ఇట్టి ప్రాణ స్నేహితుని వదలిపెట్టి నేనెట్లు పోగలను?"

మహారాజిట్లనుకొనెను- "ఈనాటితో మానవర్మ నాకు ప్రాణస్నేహితు డయినాడు. ఇతడు నా ప్రాణములను రెండుమూడు సార్లు రక్షించెను. అర్ధరాత్రముల యందైన నీడ మార్చి వెడబాసి యుండును. ఇతడు నన్నెడ బాయడు. ఇతడు స్వరాజ్యమునకు భ్రష్టుడై నన్నాశ్రయించెను నేను గొప్ప పదవి నిచ్చితిని కాని, యతనిని రాజును చేయలేదు గదా! నేటినుండి యతడును నేనును నారాజ్యమున కిద్దఱము రాజులము. నా సింహాసనము మీద నాతో పాటితడు కూడ కూర్చుండును నా మాట యెట్లు చెల్లునో నేటినుండి యితని మాట యట్లే చెల్లును. ఇతడు నామీద చూపించిన ప్రేమకు వేఱొక విధముగా నేను కృతజ్ఞత చూపలేను. తిరిగి కృతజ్ఞత

చూపనిచో నరకమునకు పోయెదను. ఒక ప్రాణదాతకు కృతజ్ఞత చూపుట వేఱు, ఎడము లేకుండ ఇంతటి ప్రేమ చూపించిన వానియందు కృతజ్ఞత నెఱపుట వేఱు."

ఇట్లనుకొని రాజు మానవర్మను వెనుక కూర్చున్న వానిని ముందునకు పిలిచెను. ఇద్దఱును బుజాలు బుజాలు రాచుకొనుచు కూర్చుండిరి. రాజు తనచేయి మానవర్మ భుజముపై వేసెను. ప్రొద్దు వాటారిన తరువాత ఇంటికి తిరిగి వచ్చు రాజును మానవర్మను ప్రజలిట్లు చూచిరి.

## ౨

మానవర్మ సింహళరాజకుమారుడు. వారివంశము పేరు మహాసమ్మత వంశము. మహాపరాక్రమవంతుడును రాజ్యమును విస్తరింప జేసినవాడును అగు మహాసమ్మతుని పేర వారివంశము ప్రసిద్ధినొందెను. ఆ వంశములో హాతదత్తుడను రాజు పాలించుచుండెను. మానవర్మ కశ్యపుని కుమారుడు. సింహళులది బౌద్ధమతము. వారిది పాలీభాష. పాలీభాష సంస్కృత భాష యొక్క వికృతి. కాశ్యప శబ్దము పాలీ భాషలో కస్సప శబ్దమయ్యెను. మానవర్మ మానవమ్మ యయ్యెను. మానవర్మ యొక్క తండ్రియైన కాశ్యపుడు గొప్పవీరుడు. అతడు త్రిపురాసురుడనువానిని సంహరించెను. హాతదత్తుని అనంతరము సింహళ రాజ్యసింహాసనము మానవర్మకు రావలయును. మానవర్మ యొకసారి మలయాద్వీపమునకు రాజకార్యము మీద పోయెను. మలయాదేశపు రాజు మానవర్మను మిక్కిలి గౌరవించెను. తన యింటిలో అతని నతిథిగా నుంచుకొనెను. అతనికి పరిచర్య చేయుటకు తన కూతురైన 'సంఘ' యను పేరుగల దానిని నియమించెను. భారతదేశమునకు దక్షిణమున సింహళ ద్వీపమున్నది. సింహళ ద్వీపమునకు ఆగ్నేయ దిశయందు మలయా ద్వీపకల్ప మున్నది. మలయా ద్వీప వాసులయు సింహళ ద్వీప వాసులయు ముఖాద్యవయవ లక్షణములు సమానముగా నున్నను వారు వేఱు వీరు వేఱుగా కనిపింతురు. సింహళద్వీప నాగరికత పూర్తిగా భారతదేశ నాగరికత. మలయా ద్వీపవాసులు చీనాదేశవాసుల నాగరికత కలవారు. ఆచార వ్యవహారములు వేఱుగా నుండును. ఐనను సర్వప్రాచ్య దేశములయందు ప్రధానముగా భారతదేశనాగరికత వ్యాపించెను. సింహళ వాసులకు మలయా నివాసులకును కొన్ని సామ్యములున్నవి.

సింహళద్వీప ధరాపతియైన హాతదత్తునకు మలయా దేశపు రాజునకు వర్తక వ్యవహారములలో సామ్యము కుదరక కొన్ని మనస్పర్థలుండెను. ఈ విభేదములకు కారణము హాతదత్తుడే. హాతదత్తుడు మలయాద్వీపవాసులను తక్కువగా చూచును. వారి నాగరికత తక్కువ నాగరికత యనుకొనును. సింహళ ద్వీపవాసులు మలయా ద్వీపవాసులతో వివాహములు చేసికొనరాదు. ఈ కట్టడి యున్నది. కాని మానవర్మ మహోదారుడు. అతనికి సర్వ మానవులు సమానమే. ప్రాచ్యదేశములందున్న సర్వ రాజవంశములు క్షత్రియ వంశములు. మతములు భేదించినను, భాషలు భేదించినను, దేశాచారములు వేఱుగా నున్నను వారందఱును క్షత్రియులే. ఒక్కొక్కప్పుడు రాజనీతి

కంచిపురము నందున్న ఘటికలో బోధింపబడు పదునాల్గు విద్యలలో ప్రాభాకరమీమాంస యొకటి ఘటిక యనగా పల్లవరాజుల నాటి యొక విశ్వవిద్యాలయము. దీనిని ఘటిక యందురు. ఘటక యనికూడ నందురు. మానవర్మ చిన్నప్పుడు కంచిలో చదివెను కంచిలోని ఘటిక జగత్ప్రసిద్ధమైన విశ్వవిద్యాలయము. ఈ విశ్వవిద్యాలయము కామేశ్వరస్వామి యాలయములో నుండును అచట పదునాల్గు విద్యలకు పదునాల్గు విశాలములైన మంటపములు కట్టబడియున్నవి ఆ విశ్వ విద్యాలయములో మూడువేల ఏడువందల మంది మహా పండితులున్నారు. విద్యార్థుల సంఖ్య కొన్ని వేలుండును మానవర్మ చిన్నప్పుడు పదియేండ్లు ఘటికలో చదివెను అతని యభిమాన మంతయు బ్రాహ్మణమతము మీదను, పల్లవ రాజ వంశము మీదను. మానవర్మ ప్రభాకర మీమాంసాశాస్త్రములోని రహస్యములను సంఘకు బోధించి యామె మనస్సును బౌద్ధమతమునుండి త్రిప్పెను. ఈ విద్యా వ్యాసంగములో వారిరువు రొకరినొకరు ప్రేమించుకొనిరి. సంఘ యిరువదియేండ్ల పడుచు ఆమె నాసిక సంపెగ పూవు. ఆమె కనులు తామర పూవులు మానవర్మ యామె సౌందర్యమును సంస్కృత సాహిత్యము లోని సమయములతో వర్ణించు చుండెను ఈ పోలికలు ఆమె కదివఱకు తెలియవు ఈ పోలికలు క్రొత్తగా నున్నవి సంఘయొక్క హృదయ మాకర్షింపబడినది మానవర్మ మహాపరాక్రమ వంతుడు

ఒకసారి యీ నాలుగు నెలలలో మలయాదేశములో ఒక రహస్య విప్లవము జరిగెను. సింహళద్వీప వాసులకు నావికాబలము లేదు, తమిళుల నావికాబల మున్నది సింహళముమీద దండెత్త నెచ్చగిన ప్రజాభిప్రాయము రాజు దానికి విముఖుడు. అందుచే ఆయుధాంతర్విప్లవము లేవదీయబడె రాజును పదభ్రష్టుని చేయుటకు రహస్యముగా ఒకనాటిరాత్రి రెండు వేలమంది ఆయుధపాణులు రాజనగరము ముట్టడించిరి కోటలోని భటులు వారి నెదిరించినను లట్టుకొనలేకపోయిరి అపుడు మానవర్మ అశ్వారూఢుడై ఖడ్గమును చేబూని ప్రళయరుద్రునివలెనె విప్లవనాయకుల నందఱను సంహరించెను మిగిలిన వారందరు పారిపోయిరి ఈ సహాయమునకు రాజు మానవర్మయందు కృతజ్ఞత చూపెను. సంఘ మానవర్మను మిక్కిలి ప్రేమించెను. వారిరువురు వివాహము చేసికొనదలచుకొనిరి మలయరాజు తన కంతకంటె కావలసిన దేమి యనుకొనెను. కాని ఈ వివాహము రహస్యముగా జరుగవలయును హరదత్తునకు తెలియరాదు తెలిసినచో మానవర్మకు రాజ్యము రానీయడు. ఎంత కప్పిపుచ్చినను రహస్యము బట్టబయలాయెను మలయా నావికుల ద్వారా సింహళములో ఈ వార్త తెలిసెను ఇతర రాజవంశీయులు దీనిక సంతోషించిరి మానవర్మయేకాక రాజ్యమునకు మరికొందరు వారసులుండిరి మహిషియొక రాజకుమారుడు దర్పోపతిస్సుడు. తరువాతి వారసుడు; ఈ శబ్దము పితృోపదేశ శబ్దమునకు వికృతి అతడు వెంటనే హరదత్తున కీ వార్త తెలియజేసెను. సింహళద్వీప మంతటను దీనిని ప్రచారము చేసెను రాజవంశీయు లందఱు మానవర్మ రాజ్యార్హుడు కాడనిరి మానవర్మ సింహళ ద్వీపములో దిగినచో అతనిని కారాగృహములో నుంచుటకు ప్రయత్నములు జరిగెను. తరువాత ఆఱు నెలలలో హరదత్తుడు చనిపోయెను. దర్పోపతిస్సుడు రాజయ్యెను.

మానవర్మ యిన్నాళ్ళత్తవారి యింటిలోననే యుండెను. మలయాదేశ వాసులను ప్రోవుచేసి సైన్యశిక్షణ యిచ్చి తాను సింహళము మీదికి దండెత్తవలయు ననుకొనెను. కాని మలయాదేశములో ఏకీభావము లేదు. కొందఱు రాజున కనుకూలురు. కొందరు వ్యతిరేకులు. ద్వీపకల్పము మిక్కిలి చిన్నది మానవర్మ యీ ప్రయత్నమును మానివేసెను. అదియుకాక మానవర్మకు సంఘమీద ప్రేమ మిక్కుటముగా నుండెను. ఆమె యుద్ధము వల దనెను. ఆమె మాటను మానవర్మ కాదనలేడు వారిద్దఱు రతీమన్మథులవలె, నలదమయంతులవలె, సీతారాములవలె నానందించు చుండిరి మానవర్మ తాను పోయి కంచిరాజు నాశ్రయించి తన రాజ్యము సంపాదించుకొందు నని మామగారితో చెప్పెను. ఆయన అంగీకరించెను. కాని సంఘ తానుకూడ భర్త వెంట పోదుననెను. మానవర్మ, "కొలది దినములలో నిన్ను తీసికొని పోయెదను నేను పోవుటయే క్రొత్తగదా! అచట నేదైన యుద్యోగము చూచుకొనిగదా నిన్ను గొనిపోవుట" యని నచ్చ జెప్పి తాను కాంచీపురమునకు వెళ్లెను

కాంచిపురము లో ఘటకాచార్యుల సంఘ మొకటి వెలయుచుండెను ఘటకాచార్యులు - మహాపరిషత్తువారు. రాజకార్యములయందు రాజున కుపదేశకులు వారిలో నిద్దఱు పండితులు మానవర్మ యందు ప్రేమ కలవారు "త్రివేది క్రొత్తశర్మ"యు. "అగ్నిశర్మ"యు. "షడంగవేద త్రివేది వెన్నయ్య"యు మానవర్మయందు మిక్కిలి యనురాగము కలవారు వీరు ముగ్గురును తెలుగు బ్రాహ్మణులు కాంచీపుర విశ్వవిద్యాలయములో ఆంధ్ర బ్రాహ్మణ పండితులు చాలమంది యుండిరి తమిళ దేశములో ద్రావిడ భాషాభిమాన మెక్కువ వైష్ణవ, శైవ పండితులు ద్రావిడ భాషలోనే యెక్కువ వ్రాసిరి పల్లవులు సంస్కృత భాషా పోషకు లగుటచే తెలుగు దేశము నందలి సంస్కృత పండితులు చాలమంది కంచిపురములో నుండిరి పల్లవ రాజునకు తెలుగు దేశ పండితుల మీద కొంచెము పక్షపాత ముండెడిది త్రివేది పండితులిద్దఱు రాజదర్శనము తఱచుగా చేయుచు రాజాశ్రయములో నుండిరి పల్లవచక్రవర్తియైన మహామల్ల నరసింహవర్మ యొక్క సేనాపతి 'చిఱుతొండడు'. త్రివేది పండితులకు స్నేహితుడు ఆ ప్రాపకముచేత మానవర్మ సులభముగా రాజుకొలువులో ప్రవేశించెను ప్రవేశించిన కొలది కాలము లోనే మానవర్మ తన పరాక్రమము చేత పాండిత్యముచేత రాజుమనస్సు చూఱగొనెను చిఱుతొండనికి 'పరంజ్యోతి' యని మఱియొక పేరు చిఱుతొండడు వీర శైవుడు మానవర్మ వచ్చిన క్రొత్తలో చాళుక్య రాజయిన పులకేశి పెద్దసైన్యమును తీసికొని కంచిమీదికి పెద్ద దండయాత్ర సాగించెను అతని సైన్యము కంచిపురము కోట గుమ్మము దాక వచ్చెను నరసింహవర్మ తన సైన్యములతో పులకేశి సైన్యముల నెదిరింపబోయెను సేనాపతియైన పరంజ్యోతి మహారాజువెంట నుండెను పరియాల, మణిమంగళ, శూరమార యను మూడుచోట్ల నరసింహవర్మ సైన్యము చాళుక్య సైన్యము నోడించి తఱిమి వేసెను ఆ సమయములో చాళుక్య సైన్యము లోని యొక భాగము వచ్చి కంచిని ముట్టడించెను కంచిలో యువరాజు మాత్రమే యుండెను యువరాజు చిన్నవాడు అతని పేరు మహేంద్ర వర్మ మానవర్మ తానప్పటికి సామాన్య సైనికోద్యోగి ఆ యుద్ధములో మానవర్మ తానే ముందంజవేసి,

ముట్టడించిన చళుక్యసేనను తఱిమి వేసెను కోటగుమ్మముముందు ఒకదండు పట్టువిడువక గుమ్మమును భేదించుటకు ప్రయత్నించుచుండగా మానవర్మ కోట తలుపులు తెఱపించి నాల్గువందల కటారులతో తాను వెలికి పోయి వారందఱను సంహరించెను. రాజును, పరంజ్యోతియు వెనుదిరిగి వచ్చిన తరువాత, మానవర్మ పరాక్రమము రాజునకు తెలియజేసిరి రాజు మిక్కిలి సంతోషించెను. మానవర్మను తన కంగరక్షకునిగా నియమించెను. మానవర్మ రాజునొద్ద నుండి యొక వాగ్దానము తీసికొనెను రాజు తన్ను సర్వకాల సర్వావస్థలయం దెడబాసి యుండరాదు. రాజంగీకరించెను ఆ నాటి నుండి పరంజ్యోతికి రాజశరీర రక్షణ భారము తగ్గెను. చాళుక్యం మీద తిరిగి దండయాత్ర సాగించవలయునని రాజునకు కోరిక కలిగెను. పరంజ్యోతి రాజరక్షణమును మానవర్మకు వదలి యా కార్యమునందు నిమగ్నుడగుట సులభమయ్యెను

## 3

క్రమముగా రాజునకు మానవర్మ పండితుడని తెలిసెను. అతడు కాంచీ ఘటికములోని విద్యార్థియని తెలిసికొనెను. కాంచీ మహానగర మతనికి సుపరిచితము. అతడు [illegible] నెఱుగును పల్లవశిల్పమంతయు నెఱుగును మామల్లపురము, మహాబలిపురం మెఱుగును దండీ కావ్యాదర్శ మెఱుగును. సంస్కృతములో [illegible] మహాకవి [illegible] కావ్యాదర్శ మని యలంకారగ్రంథమును వ్రాసెను అది గొప్ప గ్రంథము. సాహిత్య వేత్తయైనవాడు కావ్యాదర్శమునందు పండితుడు [illegible] కావ్యాదర్శమునకు వ్యాఖ్యానము వ్రాసినవారికి ఘటిక పండిత [illegible] మహారాజు [illegible] పల్లవ రాజులలో చక్రవర్తి పదవిని [illegible] మహాపండితుడు ఒక రాజు సంస్కృతములో మత్తవిలాస ప్రహసనమను యొక నాటకము వ్రాసెను. దండిమహాకవి [illegible] దండి దశకుమార చరిత్ర మని యొక వచన [illegible] మని యొక పద్య ప్రబంధమును వ్రాసెను. దండి [illegible] సాహిత్య [illegible] పాత్యములుగా నుండెను. మహామల్ల [illegible] మహారాజునకు [illegible] మానవర్మతో సాహిత్య గోష్ఠులు, శిల్ప ప్రసంగములు [illegible] జరుగుచుండెను. మహావీరుడైన మానవర్మ పరమసాహిత్యవేత్త యగుటకు రాజు మిక్కిలి ఆశ్చర్యపడు చుండెను. రాజునకు మానవర్మ యొక క్షత్రియ కుమారుడని మాత్రమే తెలియును సింహళ దేశ రాజకుమారు డనియు తెలియును రాజ్యమున కతడే యధికారియనియు తెలియును. ఏ కారణముల చేత పాఱిపోయి వచ్చెనో తెలియదు

మానవర్మ గొప్ప జ్యోతిష్పండితుడు. ఈ సంగతియు రాజునకు తరువాతనే తెలిసెను [illegible] రాజునొద్ద కొక యవియోగము వచ్చెను. కాంచీపురములో సర్వమతస్థులు [illegible] కాపాలికులు, జైనులు, బౌద్ధులు, బ్రాహ్మణులు, శైవులు,

వైష్ణవులు నందఱు కలరు కాపాలికులు విపరీతమయిన ప్రవర్తన కలవారు. కాపాలికులందఱు హస్తములలో మనిసిపుఱ్ఱెలను ధరింతురు. సింహవిష్ణుమహారాజు వారట్లు ధరించరాదనియు, ధరించినచో వీధుల వెంట కపాలహస్తులై తిరుగరాదనియు శాసించెను. సింహవిష్ణుని తరువాత ఆ శాసనమునకు ఆచరణ లేక పోయెను. కాపాలికులకు పల్లవరాజులమీద కోపముగా నుండెను వా రొడలంతట బూది పూసికొందురు. వారు సురాపానము చేయుదురు కల్లు మనిసిపుఱ్ఱెలో పోసికొని త్రాగెదరు వారికి కార్యకారణముల కవినాభావము. ఈ జన్మలో వ్రతములు నియమములు చేసి శరీరమును శుష్కింప చేయరాదు మోక్ష మనగా ఆనందముగదా! నియమములు దుఃఖముతోడివి. ఆనందమయమైన మోక్షము దుఃఖముచేత రాదు. అందుచేత వారు సురాపానము చేయుదురు వారు వివాహము చేసికొనరు. స్త్రీ పురుషులు కలిసి తిరుగుచుందురు ఈ పుఱ్ఱెతో బాటు వా రొక యావు కొమ్మును గూడ ధరింతురు శివుని పూజించునప్పుడు కొమ్మూదుదురు వారికిని బౌద్ధ భిక్షువులకును పడదు శాక్య భిక్షువులు మాంసాహారము తిందురు వారివిహారములకు పూర్వ రాజు లిచ్చిన సంపద చాల కలదు వారనుభవించుచు బలిసిరని కాపాలికులు వారిని నిందింతురు బుద్ధుడు తెచ్చిన గొప్పయేమియు లేదు సాంఖ్యమతమునుండి, యద్వైతమతము నుండి మహాభారతమునుండి సిద్ధాంతములను కొట్టివేసి తనమతము నేర్పాటు చేసినాడని కాపాలికులవాదము శాక్యభిక్షుకులయు కాపాలికులయు వివాదములు సింహవిష్ణుని యొక్క కాలమున నెక్కువగా నుండెడివి అవి క్రమక్రమముగా తగ్గుచు వచ్చినవి నరసింహవర్మ కాలములో కాపాలికులు తమ యాచారము లన్నియు వారి పేటలలో వారి గృహములలో చేసికొనవలయునే కాని వీధిలోనికి రారాదని గట్టి కట్టుడి జరిగెను బౌద్ధులు కూడ తమ విహారముల యందే యుండవలయును లౌకికములైన సర్వ వ్యవహారములు చేసికొనవచ్చును వారిమతమునకు సంబంధించిన [illegible] ఘర్షణలు అప్పుడప్పుడు [illegible] కాంచీపురములో ఏకామ్రేశ్వరు[illegible]యును ప్రధానముగా ఘటికా స్థానములు ఈ ఘటికా స్థానములకు బౌద్ధవిహారమునకు చాలదవ్వు కలదు

[illegible] కాపాలికుడు [illegible] వెంటబోవు ఒక బౌద్ధ సన్యాసిని జుట్టు పట్టుకొని తన గృహము లోనికి లాగుచుండెను దారి వెంట పోవు కొందఱు జూచెను [illegible] అది పోయి తమ విహారమున చెప్పెను విహారమునందలి యువభిక్షువులు కొందఱు కర్రలు కత్తులు పుచ్చుకొని కాపాలికుల గూడెము మీదికి దండెత్తి వచ్చిరి కాపాలికులకు వారికి పెద్ద పోరాటము జరిగెను అటు నలుగు రిటు నలుగురును చనిపోయిరి అభియోగము జరిగెను మంత్రి పరిషత్తు సమావేశమై దోష మెవరిదో నిర్ణయించలేక పోయెను శాక్యభిక్షువులును, కాపాలికులును, చక్రవర్తి వచ్చి కొట్లాట జరిగిన స్థలమును చూడవలయు ననిరి గృహములలో జొరబడి శాక్యభిక్షువులు, [illegible] పాత్రలనుగూడ ధ్వంసముచేసి రని కాపాలికులు చెప్పుచుండిరి రాజునకు పోక తప్పినది కాదు. రాజు వచ్చి తమ

పిల్లలు లేవు మానవర్మ యాజానుబాహువు తన చేతిలోని ఖడ్గముతో ఆ పుల్లలలో నుండి పొడిచెను ఖడ్గము పైకి పోయి పైనున్న కంబళి గోపురముగా లేచెను సరిగా ఆ సమయమునందే రాజు అచట అడుగు పెట్టబోవుచుండెను రాజు వెనుకకు తగ్గగా వెనుకనున్న భటులు వచ్చి కంబళిని లాగివేసిరి క్రింది నుండి మానవర్మ కేక వినిపించెను ఆ కాపాలికు లిద్దఱు బంధింపబడిరి. మానవర్మ దొడ్డి యంతయు వెదకెను. ఆ పొట్టివాడు కనిపించలేదు. ఒక మూల రాళ్ళు గుట్టగా పోసియుండెను ఆ రాళ్ళు కదలినట్లు కనిపించి మానవర్మయు రాజభటులును రాళ్ళను తీసివేసిరి పొట్టివాడు వాని క్రింద పండుకొని యుండెను వానిని పట్టుకొని రాజభటులు చావచితుక బాదిరి తీసికొనిపోయిరి మానవర్మకు రాజునకు కాపాలికులు పన్నిన పన్నుగడ యంతయు తెలిసెను నాటినుండి కాంచీపురములో కాపాలికుల జీవితము మఱియు దుర్భరమయ్యెను రాజు మానవర్మను "నిజముగా నాకు గండమున్న దని నీకు దెలియునా? యూఱకే యంటివా" యని యడుగగా మానవర్మ చెప్పిన సమాధానముతో అతడు జ్యోతిషపండితు డని గూడ రాజునకు తెలిసెను పూర్వము మానవర్మ వీరుడు, పండితుడు. ఇపుడు మానవర్మ బంధువు

పరంజ్యోతి సైన్యములను సమకూర్చి చాళుక్య దేశము మీదికి తిరిగి దండెత్తెను చాళుక్య విషయ బహుగ్రామములు పరంజ్యోతి వశపఱచుకొనెను పరంజ్యోతి తనసైన్యమును రెండుగా విభజించి రెండు దెసలకు పోవలయునని నిర్ణయించి మహామల్లునకు వార్తపెట్టెను రెండవ సైన్యమునకు మఱియొక సేనానాయకుడు కావలయును మానవర్మను పంపించినచో చాళుక్య సైన్యము మఱల కంచిమీదికి రాకుండ చేయవచ్చు ననెను రాజు మానవర్మను 'వెళ్ళుదువా' యని యడిగెను. మానవర్మ పో ననెను. మఱియు నిట్లనెను "మహారాజా! పరంజ్యోతి యింక వెనుకకు తిరిగివచ్చినచో మంచిది. నేను తమరిని విడిచిపెట్టి పోను పరంజ్యోతి యిది వఱకు గెలిచిన గెలుపులే చాలును వాతాపినగరమును [illegible] వాతాపి చాళుక్యుల యొక్క ప్రధాననగరము, [illegible] పోయినచో వాతాపి రక్షించుకొనవలయును వాతాపిలో [illegible] వంటిది కాదు [illegible] బహుమతస్థులు [illegible] బహురాజ్యవాసులు [illegible] దక్షిణాపథనాగరకతకు కంచి [illegible] యుత్తర దేశపురాజు [illegible] నాక్రమించినను కష్టములేకుండ పాలించగలడు [illegible] పట్టణములో నుండుడు వారి అండతో [illegible] పరిపాలన సుకరమగును [illegible] పట్టణ మట్టిది కాదు. అది చాళుక్యుల నాగరికతకు వారి మతమునకు కూడలి మఱియు నేను తమ యంగరక్షకుడను మఱియొక సేనానాయకుని బంపు" డనెను రాజు మఱియిద్దఱు సేనానులను పంపించెను పంపించుచు పరంజ్యోతి వెనుతిరిగినచో శ్రేయమని వార్త పెట్టెను మానవర్మ రాజున కింతటి దగ్గఱివాడయ్యెను రాజు పొమ్మనగా పోనని యెవ్వడును చెప్పరాదు వానికి విహితములయిన కారణములు కూడ పనికిరావు. రాజు పొమ్మని యాజ్ఞాపించును గాని పోవుదువా యని యడుగడు ఆ యడుగుటయే రాజునకు మానవర్మయందలి ప్రేమానురాగములు వెల్లడిచేయును. పైగా

మానవర్మ చెప్పినట్లు పరంజ్యోతిని వెనుకకు రమ్మని వార్తపెట్టెను. ఈవార్త యందిన తరువాత చిఱుతొండనికి రా జన్నచో విసుగు కలిగెను. తనమాట యిదివరకు రా జెన్నడు కాదనలేదు. అచటికి పోయిన సేనానాయకులిది మానవర్మ చెప్పినమాట యని నుడివిరి. పరంజ్యోతికి కొంచెము కోపము వచ్చెను. అతనికి తా నిప్పించిన యుద్యోగము! మఱియు సేనానాయకులు చిఱుతొండనితో ఇచట జరిగిన కాపాలికవృత్తాంతము చెప్పి మానవర్మ గొప్ప జ్యోతిషపండితు డని ప్రశంసించిరి. మానవర్మ కందఱును స్నేహితులే తాను రాజు దగ్గఱ నిట్లుంటినని యతనికి గర్వము లే, దహంకారములేదు. అతని కుండవలసిన యవసరము లేదు. అతడొక రాజ్యమున కధిపతి. మఱియొక యల్పునకు వచ్చిన యధికారమువలె అతనికీ ఈ యుద్యోగము గర్వహేతువు కాదు. ఆ సేనానాయకులు మానవర్మను ప్రశంసించిరి. మానవర్మ తనయందు చూపించుచుండెడి గౌరవమును పరంజ్యోతి స్మృతికి తెచ్చుకొనెను. తన జ్యోతిష్కులను విచారించెను. వారు మానవర్మ మాటను దృఢపఱచిరి



పల్లవ రాజులు సంస్కృత భాషతోపాటు సంస్కృత నాగరకతనే యవలంబించినవారు నాట్యములో కూడ దేశి నాట్యములు చాలనున్నను భరత శాస్త్రాభినయమునే యాదరించినవారు ఐనను దేశి నాట్యములను నిరాదరించలేదు పల్లవ రాజ్యము తమిళుల దేశము తమిళులలో అనేక విధములైన నృత్యములు కలవు ఒక నృత్యమునకు "కుట్టు" అని పేరు ఈ కుట్టు పలురకములు 'శాంతికుట్టు' చతుర్విధము ఇవి యుత్తము కులజులు చూచునది 'వినోదకుట్టు' పామరుల నాట్యము ఇది యాఱువిధములు ఇవికాక 'కుడవై కళినదం,' 'కూడకుట్టు', 'కరణం', 'నాక్కు', తోల్పావై' మొదలైన నాట్యములు కలవు ఇవియన్నియు పదిమందికలసి చేసెడి నృత్యములు తలమీద కుండ పట్టుకొని చేతులతో పట్టుకొనకుండ నృత్యము చేయుదురు దీనికి "కుడక్కూత్తు" పేరు ఈ నృత్యము చేయువారు గొల్లభాముల వేషము వేసుకొని పాడుచు ఆడుచుందురు ఇవియన్నియు దేశినృత్యములు

పల్లవ రాజులు భరతాభినయ మాదరించిరి అందులో హస్తాభినయము నందు వారి కభినివేశము మెండు గజహస్తము, చతురహస్తము, చతుర్స్వస్తికహస్తము, లలాట తిలకహస్తము, తాలసంఘట్టితము, లలితము, కుంచితము మొదలైనవానియందు ప్రవీణులైన నటకులను నటులను వారు సమాదరించుచుండిరి

ఇన్ని విద్యలతోపాటు దేశమున మంత్రశాస్త్రము ప్రబలియుండెను ఈ మంత్రములు రెండు రకములు అధర్వవేదము నుండి వచ్చిన సంప్రదాయములు సంస్కృతభాషా సంబంధి శాబరమంత్రములని కొన్ని కలవు ఆ మంత్రములను జపము చేయుటకుగాని ప్రయోగించుటకు గాని యాచార వ్యవహారము లక్కఱలేదు వీనికి తంత్ర మెక్కువ గ్రహణ సమయములందు స్నానము చేసి యొకానొక వృక్షము వేరుతీయుట, యర్ధరాత్రములందు నిర్జనమైన శ్మశానమునందు కూర్చుండి

మంత్రమును వల్లించుట మొదలైనవి వీనిని సాధించుటకు మార్గములు. ఇవి యనాది నుండి యీ దేశములో నున్నవి. మాటలలో కూడా మంత్రములు పెట్టుదురు. పూర్వ మొక దొమ్మరవానికి నొక మంత్రశాస్త్రవేత్త మీద కోపము వచ్చినది. ఈ మంత్రశాస్త్ర వేత్తమీద దొమ్మరివాడు ప్రయోగము చేయదలచెను. ఈ యూరిహరిజను డొకడు దారివెంట వచ్చుచుండగా దొమ్మరివాడు వానియూరు పే రడిగి, యా బ్రాహ్మణుని యూరి వాడని తెలిసికొని, ఆ శాస్త్రులుగారు క్షేమముగా నున్నారా యని తా నడిగితినని చెప్పు మనెనట. ఆ మాటలోనే ప్రయోగమున్నది. ఆ హరిజనుడు వచ్చి యా మంత్రశాస్త్రవేత్తతో, "అయ్యా! ఫలానా దొమ్మరివాడు-' అనిన తోడనే యా బ్రాహ్మణుడు తెలిసికొని వానిని తూర్పువైపుగా తిరిగి చెప్పుమనెనట. వాడు తక్కినమాటలు తూర్పు తిరిగి చెప్పెను. ఆ తూర్పువైపున నొక పచ్చని చెట్టున్నది. ఆ చెట్టు మాడిపోయెను. ఈ రీతిగా మాటలతో ప్రయోగము చేసెడివారు.

సింహవిష్ణువునుండి నరసింహవర్మ మూడవతరము వాడు ఈ పల్లవ వంశమునకు మొదటివాడు నందివర్మ నందివర్మ కిద్దఱు కుమారులు. సింహవిష్ణువు, భీమవర్మయు. సింహవిష్ణువు యొక్క వంశమువారికి రాజ్యము వచ్చెను. భీమవర్మ వంశమువారికి రాజ్యాధికారము లేకపోయెను అందుచేత భీమవర్మ వంశము వారు సర్వదా రాజులుగా నున్న వారిమీద వైరముతో నుండిరి భీమవర్మవంశమువాడైన యాదిత్యవర్మ మహామల్ల నరసింహవర్మకు జ్ఞాతియు సమకాలికుడునై యుండెను రాజులైన సింహవిష్ణు వంశమువారు తమకు సగోత్రులైన భీమవర్మ వంశమువారిని సేనానాయకులుగా రాజప్రతినిధులుగా నియమించుచునే యుండిరి నరసింహవర్మ కిద్దఱు కుమారులు పెద్దవాడు మహేంద్రవర్మ, ఇతడు యువరాజు. రెండవవాడు పరమేశ్వరవర్మ. ఇతడు రాజకుమారుడు. ఆదిత్యవర్మకుమారుడు గోవిందవర్మ అతనికిని పరమేశ్వరవర్మకును పడలేదు అతడు శాబరమంత్రముల యందు ప్రసిద్ధుడై యుండెను అతడు చిన్నప్పుడే లేచిపోయి కొండలలో తిరుగుచు బౌద్ధవిహారము లలో తిరుగుచు కాపాలికులతో తిరుగుచు చెడిపోయెను బౌద్ధవిహారములు తత్పూర్వము మిక్కిలి నియమము కలిగి యుండెడివి రానురాను శాక్యభిక్షువులు కాపాలిక సంసర్గము చేతను అధికారము పోవుటచేతను కుత్సిత మార్గములకు దిగిరి బౌద్ధమతము విడెట్టి చీనాదేశములకు పోయి బుద్ధుడుపదేశించిన నిర్వాణమార్గము వదలి మంత్రతంత్రముల లోనికి దిగెను. కంచికి సమీపమున నున్న బౌద్ధవిహారము దేశాంతరముల యందు కూడ ప్రసిద్ధి గాంచుటచేత చీనా త్రివిష్టపవాసులైన బౌద్ధులు భారతదేశమునకు వచ్చి పర్యటించుచు వారి మంత్ర తంత్రములను భారతదేశమున వ్యాపింపజేసిరి కంచిలోని బౌద్ధవిహారములోని యొక భిక్షువు వీనియందు మిక్కిలి నిపుణుడయ్యెను కంచి చుట్టుపట్ల సుమారు వంద బౌద్ధ విహారములు కలవు వానిలో పదివేలమంది భిక్షువు లుండిరి.

కంచికి దక్షిణమున నొక సంఘారామము కలదు అది యొక పెద్దతోట పూర్వము బుద్ధుడచట తైర్థికులను గెలిచెనట ఈ విహారమునకు రాజవిహార మనిపేరు ఈ విహారమునకు చాల నాదాయము వచ్చును. తక్కిన సర్వవిహారములకు ఇది

తలకట్టు. ధనదాసి యను పేరుగల ధనవంతురాలు రాజవిహారమునకు చాలధన మొసంగెను. మాంత్రికుడైన యీ బౌద్ధుడు తొలుత రాజవిహారములో నుండెను. ఇతని మంత్రతంత్రములు దుష్టపుపనులు చూచి యచటి బౌద్ధపండితులు వీని నందుండి వెడలనడిచిరి. అతని కెవరిమీదనైన కోపమువచ్చినచో వానిమీద మంత్రప్రయోగము చేయును. అతడు జ్వరపడుటయో మంచమునబడి తీసికొనుటయో యిట్టిది జరుగుచుండెను. ఒక పిండిబొమ్మ చేసి యా పిండిబొమ్మ యందు తన విరోధి నావహింపజేసి కొన్ని మంత్రములు చదివి యా పిండిబొమ్మలో ఒకమేకు కొట్టును. నాటినుండి యా విరోధి మంచముపట్టును. ఇది టిబెట్టునుండి భారతదేశమునకు వచ్చిన విద్య. ఆ బౌద్ధభిక్షుకుని రాజవిహారమునుండి వెడల నడువగా అతడు వచ్చి కంచిలోని విహారమున నివాసమేర్పరచు కొనెను. గోవిందవర్మకు అతనికి స్నేహమయ్యెను. గోవిందవర్మ యా విద్యలన్నియు ఆతనివద్ద నేర్చెను. తొలుత గోవిందవర్మ పరమేశ్వరవర్మ మీద ప్రయోగము చేయవలయునని యెంచెను. పరమేశ్వరవర్మ మీద ప్రయోగముచేసినచో అధికలాభము లేదని యనుకొనెను. యువరాజు మహేంద్రవర్మ యుండెను. మహేంద్రవర్మ యుండగా తనకు రాజ్యము రాదు అదియే మిదియేమని తాను మహామల్ల నరసింహవర్మ మీదికే ప్రయోగముచేసి ముందతనిని చంపినచో తరువాత కొడుకుల నిద్దఱను జంపవచ్చును. ఈ చంపుట యెట్లా యని యాలోచించుచుండెను

గొడగూచియను నాట్యకత్తియకలదు ఆమె కుట్టు నృత్యములో ప్రసిద్ధురాలి. ఎదునొకండు విధములైన కుట్టు నృత్యములలో ఆమె యందెవేసిన చేయి. ఆమెనృత్యమును చూడవలయునని మహారాజునకు కోరిక కలిగెను గోవిందవర్మ గొడగూచి నెఱుగును అతడు బైరాగులలో గలసి తిరుగుచు ఒకనాడు పెద్ద ముసురుపట్టి జోరున వర్షము కురియుచుండగా గొడగూచి యింటికి చేరెను. ఆమె దయతలచి యితనిని లోనికి రానిచ్చెను ఇతడు రాజ వంశీయు డని తెలిసి మిక్కిలి యాదరించెను. గోవిందవర్మ తన క్షుద్రవిద్యలను ప్రదర్శించి యామె మెప్పు వడసెను తరువాత నితడు గొడగూచి యింటికి రాకపోకలు జరుపుచుండెను గోవిందవర్మ కొంచెముగా కవి ఇతనిచేత నామె కొన్ని పాటలు వ్రాయించుకొనెను ఆ పాటలు విన్న పురుషుల కుద్వేగము కల్గును వాని హేతువున గొడగూచి ప్రతిష్ఠ యెక్కువైనది దానితో గొడగూచికిని గోవిందవర్మకును స్నేహ మెక్కువయ్యెను. మహామల్ల నరసింహవర్మ మహారాజు కుట్టునృత్యమును చూడవలయునని వాంఛించిన విషయము గోవిందవర్మకు తెలిసినది అతడు కోటలోనికి వచ్చుచుండును, పోవుచుండును. అతడు వచ్చినది రానిది యెవరును పట్టించుకోరు. వాని నొక యున్మత్తునిగా భావింతురు అతనిని అభ్యంతర పెట్టుటకు రాజాజ్ఞ లేదు. ఈ గోవిందవర్మకు వివాహమయ్యెను. అతని కేడాదికొడుకుకలడు. అతనిపేరు ఆదిత్యవర్మ గోవిందవర్మ భార్యయు శిశువును కోటలో నుందురు వారికి వేరే సౌధ మున్నది గోవిందవర్మ తన యిష్టము వచ్చినపుడు వచ్చును. ఇష్టము వచ్చినపుడు వెళ్ళును. ఇంటికి పోయినపుడు నాల్గైదు దినములుండును భార్యవలననో పొరుగు

వారివలననో రాజవంశములోని వార్తలన్నియు తెలిసికొనుచుండెను. రాజున కీ కోర్కె కల్గినవార్త గోవిందవర్మకు తెలిసెను. గొడగూచి యొక్క ప్రసక్తి రాజునకు తెలియ జెప్పునట్లు రాజగృహ పరిచారికలలో ప్రచలింపజేసెను.

కంచిలో వైకుంఠపెరుమాళ్ళు దేవాలయము కలదు. ముక్తేశ్వర దేవాలయము కలదు. ఈ రెండు దేవాలయములలో సంగీతవిద్యా ప్రదర్శనములు, భరత శాస్త్రాభినయములు జరుగుచుండును. గొడగూచి నృత్యము వాని రెంటిలో నేదో యొకచోటనైనచో బాగుగానుండునని గోవిందవర్మ వారికి చెప్పెను గోవిందవర్మ పాచిక పారెను.

రాజవార్త గొడగూచికి వచ్చెను గోవిందవర్మ గొడగూచి కొకపాట వ్రాసియిచ్చెను. అది యైదు చరణములు. ఒక్కొక్క చరణమున నొక్కొక్క ప్రాణము పోవునట్లు గోవిందవర్మ మాటలలో ప్రయోగించెను ప్రతి చరణము చివర మహామల నరసింహవర్మ పేరు వచ్చును ఆ పాట గోవిందవర్మ గొడగూచికి నేర్పెను గొడగూచికి సంగతి తెలియదు తన జన్మకు తనకు రాజదర్శన మగుచున్న దనియు, తనయిల్లు బంగారమగుననియు, దన కీ మేలు చేసిన వాడు గోవిందవర్మ యనియు నామెయుద్దేశము గోవిందవర్మ తన రహస్యమును గొడగూచి కి చెప్పలేదు అతడు చాల గడుసువాడు అతడు మొదటినుండియు జాగ్రత్తపడెను ఈ పాట వ్రాసినది తాను కాదనియు, బౌద్ధభిక్షుకుడనియు, వాడు గొప్పకవి యనియు, పూర్వము రాజవిహారములో నుండెడి వాడనియు జెప్పెను. మహారాజును పొగడుటకు బౌద్ధుడైన నేమి కాపాలికుడైననేమి యని గొడగూచి యనుకొనెను కుట్టునృత్యములో నృత్యము చేయువారి దేహము మెలికలుగా తిరుగుటలో నెక్కువ యొడుపున్నది గొడగూచి బక్కపలుచగా నుండి ప్రాకుచున్న పాముల వంగును పామువలె చుట్టలు చుట్టుకొనును పక్షివలె నెగురును ఆమె గొంతు కంచుగీతి వలెనుండును ప్రక్క వాద్యములతో శ్రుతితో ఆమెనృత్యము చేయుచుండగా జనులు దిగ్భ్రాంతిపొంది పోవుదురు రాజు గొడగూచికి కబురంపినా వన్నవార్త పౌరులకు తెలిసిపోయెను నృత్యము వైకుంఠ పెరుమాళ్ల కోవెలలో ఏర్పాటు చేయబడెను.

ఈ నృత్య మేర్పాటైనది మొదలు మానవర్మ కడుమ కష్టపడెను అతడు తొలుత మలయాదేశము నందున్న తన భార్య కేమైన జబ్బుచేసెనేమో యని సందేహపడెను ఆ మఱునాడే మలయానుండి వార్త వచ్చెను సంఘ తన కొకజాబు వ్రాసినది. మఱి యెడమకన్నదరుట దేనికి? మానవర్మకు ప్రాణములు రెండు మొదటిది సంఘ. రెండవది రాజు అతని మనస్సు వెంటనే రాజుమీదికి పోయెను అతడు రాజు జాతకమును తీసికొనెను. పరిశీలించెను. అందేమియు దోషము కనిపించ లేదు. మొదటిసారి జాతకములో గండము ప్రత్యక్షముగా కనిపించెను ఈసారి విస్పష్టముగా తెలియలేదు. తనగురువైన త్రివేది కొత్తశర్మయొద్దకు రాజు జాతకము తీసికొనిపోయెను షడంగవేది వెన్నయ్య యప్పుడచట నుండెను వెన్నయ్యయు తెలుగువాడే. అతనిది ద్రవిడ దేశము సమీపముననున్న తెలుగు గ్రామము ఆయన విస్పష్టుడు కోయంతో నవరంతో తిరిగినాడు. వెన్నయ్య రాజజాతకమును చూచి

యిట్లు చెప్పెను. "ఈ నాటికి వారము దినములకు రాజుగారిమీద శాబరమంత్ర ప్రయోగము జరుగును ఈ కేంద్రములోనున్న యీ గ్రహము మఱి యీ రెండు గ్రహములచే చూడబడినచో వానిమీద నిట్టి ప్రయోగము జరుగుట నేను మాయూరిలో నొకని జాతకమును బట్టి గ్రహించితిని". దాని ప్రతిక్రియ యేమిచేయవలయునో ముగ్వురును కలసి యూహించిరి. వెన్నయ్య తా నిచట నేమియు చేయలేననియు తనయూరిలో నున్నచో చేసెడివాడ ననియు జెప్పెను. ప్రయోగము వారము రోజులలో జరుగబోవు చున్నది. వెన్నయ్య యెంత తొందరగా వెళ్ళినను తన యూరికి పోయి తిరిగివచ్చు వేళకు మూడు నెలలైన పట్టును. ముగ్వురకు నేమియు తోచినది కాదు కొన్ని శాబరమంత్రములకు తిరుగులేదు ఐన నాలోచించి చెప్పెద నని వెన్నయ్య వెడలి పోయెను ఆ మఱునాడు మానవర్మ రాజదర్శనము చేసెను అతని మొగము దీనముగా నుండెను రాజు ప్రశ్నించెను అత డేమియు చెప్పలేదు. ఈ నాట్య విషయము మానవర్మకు తెలియదు ఇది యేమి పెద్ద విషయము గనుక మానవర్మతో జెప్పవలయునని కుట్టునృత్యము చూడనందమైనదని, గొడగూచి యానృత్యములో శ్రేష్ఠురాలని యంతఃపురములో చెప్పుకొనిన మాటలు. గొడగూచి నృత్యము రాజు చూచెడు ఏర్పాటంతయు అంతఃపురములోననే జరిగెను రేపు నృత్య మనగా రాజు మానవర్మతో చెప్పెను మానవర్మ వేయి ప్రశ్నలు వేసెను ఆ రాత్రి మానవర్మకు నిదురపట్టలేదు అతడు తా నొక సామాన్యుని వేషము వేసికొని అర్ధ రాత్రమున గ్రామములోనికి పోయెను చాలసేపు నిర్జనమైన రాజవీధులలో సందు గొందులన్నియు తిరిగెను అప్పటి కతనికి గుర్తు వచ్చెను తన చిన్నప్పు డొకనాడు తా నొక చిన్న సందు వెంట పోవుచుండగా లోపల మేళతాళములు వినిపించి యొక మేడలోనికి పోయెను అచట కుట్టునృత్యము జరుగుచున్నది ఇప్పటి కా సందు సరిగా జ్ఞాపకములేదు కాని పట్టణము యొక్కయే ప్రాంతములలో అది సంభవించినదో గుర్తున్నది కోట కది యామడదూరమున నున్నది. ఈ యామడదూరము కంచి పట్టణమే తాను మఱియొక జాము సేపు నడచినచో ఆ ప్రాంతము జేరవచ్చును. రాత్రి మూడు జాములు దాటిన తరువాత మానవర్మ యా ప్రాంతము చేరెను అచట సందుగొందులు తిరుగ నారంభించెను కుక్కలు మొఱుగుటతప్ప మఱేమియు వినిపించలేదు అతనికి విసుగు పుట్టి వెనుదిరిగి పత్త మనుకొనుచుండగా దూరమున నొక మానిసి కనిపించెను అత డెవరో తెలియలేదు తనవలె అతడు కూడ నెందుకు తిరుగుచుండెను? ఈ రాజు యొక్క ప్రాణముతో తనకు సంబంధమున్నట్లు వానికి గూడ నున్నదా? రాజు ప్రాణముతో సంబంధములేనివా రా రాత్రి తిరుగునన్నట్లు తోచలేదు పోయి యతనిని గొడగూచి యిల్లెక్కడ నని యడుగవలె ననుకొనెను కాని యెందుకో యడుగలేదు ఏమియు తోచనివాడు కనుక వాని ననుసరించి పోజొచ్చెను అతడొక మిద్దెముందాగి ద్వారమును చేతితో తట్టెను లో నుండి యెవరో తలుపు తెఱచిరి ఇతడు లోన ప్రవేశించి నంతనే తలుపు మఱల మూయబడినది మానవర్మ యదియే ద్వారబంధము యొద్ద నిలుచుండెను లోన జనులు లేచుటయు, దీపములు వెలిగించుటయు, మద్దెల, యాల, కుళాల్ మొదలైన వాద్యముల మ్రోతయు

వినిపించెను. మానవర్మ మనస్సు వ్యగ్రమయ్యెను. లోనుండి గొడగూచి పేరు వినవచ్చెను. మానవర్మ యచటనే నిలుచుండెను. తెల్లవాఱబోవుచుండెను. లోన రాజుమీది పాట యైదు చరణములు పది పదునొకండు సార్లు వినిపించెను. పాట అఱవములో నున్నది. కొంత అఱవము, కొంత పాలి, కొంత సంస్కృతము. మానవర్మ పాటనంతయు వల్లెవేసెను మాటిమాటికి తనలో ననుకొనెను. ఐదు చరణములు నొక్క యక్షరమైనను వదలకుండ కంఠము నందు పట్టెను. తెల్లవాఱబోవుచున్నది. తాను క్రొత్తశర్మ వద్దకుపోయెను. ఇద్దఱును కలసి వెన్నయ్య యింటికి పోయిరి. ఆకు మీద వ్రాసి మానవర్మ యాపాటను వెన్నయ్య ముందు పెట్టెను. వెన్నయ్య గంటసేపు పరిశీలించి యొక చరణములో నొకమాటను గుర్తుపట్టెను. ఇది పవరలు చేయు ప్రయోగములోనున్న యొకమాట ఆ చరణములో ఇంక నట్టిమాట లెన్నికలవో, తక్కిన, చరణములలో అట్టిమాట లెన్నికలవో వెన్నయ్యకు తెలియలేదు. వెన్నయ్య యొక్కటియే చెప్పెను. అది రాజున కెదురుగానుండి యభినయము చేయరాదు. అభినయము చేసినంతవరకు రాజువంక చూడరాదు. రాజు ప్రక్కగా దూరముగా కూర్చున్నచో ఈ ప్రయోగము పనిచేయదు మానవర్మకు సందేహము కలిగెను. రాజుతో ఇది చెప్పుట యెట్లు? రాజసభలో అది జరుగుట యెట్లు? ఏమైనను రాజున కెదురుగా నది నృత్యము చేయరాదు అపుడు మానవర్మ కొకయూహ తోచెను. గొడగూచి తలుపు తట్టిన వాడెవడు? లోనికి వెళ్ళినవా డెవడు? వానిని తెలిసికోకుండ వచ్చితినే యని యనుకొనెను. తా నచటికి పోవుటకు మఱల బయలుదేరెను. దారిలో నిట్లనుకొనెను "నేను రాజు నంగరక్షకుడను. నన్నందఱెఱుగుదురు. వాడు నన్ను గుర్తుపట్టును. పథకమంతయు జెడిపోవును " మానవర్మ వెనుతిరిగి కోటలోనికి పోయెను.

ప్రతి దినము సూర్యోదయము వేళకే తనకై చావడిలో ప్రతీక్షించు మానవర్మ నాడు కనుపించక పోవుటకు రా జబ్బుర పడెను మానవర్మ నివసించు చోటికి వార్తపెట్టెను. మానవర్మ కొక్కడే సేవకుడు. అతడు "దొర రాత్రి రెండు జాముల వేళ కెచటికో బయలుదేరి వెడలిపోయెను ఇంతవరకు రాలేదనెను మానవర్మ జాము ప్రొద్దెక్కి తన యింటికి వచ్చి స్నానము చేసి రాత్రి నిదుర లేని కనులతో రాజదర్శనమునకు వెళ్ళెను రాజతనిని జూచి నివ్వెఱ పోయెను. మానవర్మ మహాసీతిమంతుడు. ఏకపత్నీవ్రతుడు. సత్యప్రవర్తనుడు రాజు స్నేహముకొఱది పరాచికముగానైన నవ్వలేదు, "నీ కొఱకు పదిగడియలుగా ప్రతీక్షించుచుంటిని రాత్రి యింటి దగ్గఱలేవట" యనెను మానవర్మ మాటాడలేదు కొంతసేపటికి "నృత్యము వేటిపాయంతవముననేకదా!" యనెను. రాజు తలయూపెను మానవర్మ రాజుతో నిట్లనెను. "మహామల్లుడా! నేనింతవఱకు నిన్నేదియు నభ్యర్థించలేదు. ఒకటి యభ్యర్థించుచున్నాను. అది రాజమర్యాదకు భంగమైనను చేసి పెట్టెదనని వాగ్దానము చేయుము." రాజు నివ్వెఱపోయి చూచెను. రాజమర్యాదకు భంగమయినచో చేయుట యెట్లని రాజడుగగా మానవర్మ "సేవకులయం దనుగ్రహము చూపుట యనగా, నట్టివి చేయుటయే యథార్థమైన యనుగ్రహము నెఱపుట' యనెను. రాజు "నీవు

నా ప్రాణరక్షకుడవు. నీ విడిపటి కేమియు నడుగ లేదు. ఇది తప్పకుండ జేసెదను." మానవర్మ "మహామల్లుడా! సాయంకాలమున వైకుంఠపెరుమాళ్ళు కోవెలలో నృత్యము జరుగును గదా! నాట్యకత్తె ప్రభువున కెదురుగా నిలుచుండి నాట్యము చేయును. నా యభ్యర్థన యిది. ఆమె కెదురుగా తాము కూర్చుండరాదు. ఆమెకు ప్రక్కగా దూరముగా మీరు కూర్చుందురు. ఆమె కెదురుగా నెవరినో కూర్చుండ బెట్టుదము." అనెను. రాజు నవ్వి "యిది యేమి కోరిక?" యనెను. "ఐనను అట్టి సమయములో ప్రభువెదురుగా గూర్చుండనిచో నృత్యము చేయు స్త్రీ కేమి యుత్సాహము? అది రాజమర్యాద కాదుకదా" యనెను. మానవర్మ "అందుకనియేకదా! తమవద్ద వరము తీసికొంటిని." రాజు, "మానవర్మా! నీ యుద్దేశ్యము నీకే తెలియవలయును నాయందు నీకు పట్టరాని గౌరవ ప్రేమాదరములు [illegible] విశ్వాసము చేతగాని లేనిచో ఇట్టి కోర్కె యెవ్వడును భావించడు" [illegible] మరికి నాయం దున్న యనుగ్రహమునకు నేను సదా విధేయుడను." రాజు నవ్వెను. ఆ నవ్వులో మానవర్మ యందలి వాత్సల్య ముబికెను.

మానవర్మ రాజునొద్ద సెలవు తీసికొని తన వసతికిపోయి ఇద్దఱు రహస్యచారులను పిలిచి గొడగూచి యింటిగుర్తులు చెప్పి, యా యింటిలో నెంతమంది యున్నారు, వారి పేరులు వారిని గుఱించిన సర్వ వర్తమానములు తెలిసికొని రమ్మనియు, రాజు నాట్యదర్శనమునకు బయలు దేరక ముందు రావలయుననియు చెప్పి వారిని తొందరగా ప్రయాణము చేయుటకు గుఱ్ఱముల మీద పంపించెను

వైకుంఠ పెరుమాళ్ళు కోవెలకు రాజు బయలుదేరి పోవుచుండెను మానవర్మ వెంటనే యుండెను. ఆ పంపబడిన రహస్య చారులలోనొక్కడు వచ్చి మానవర్మ చేతిలో నొక యాకుపెట్టెను. ఆ యాకులో నిట్లున్నది. "ఒకటి- గొడగూచి. ఈమె పుట్టుసట్టువరాలు తల్లి కాలాట్టి నివాసము కంచి వయసు పాతికయేండ్లు రెండు- [illegible] గొడగూచి మేనమామ, వయసు నలుబది యేండ్లు జన్మస్థలము పల్లుమంగళము యాళ్ వాద్యగాడు, మూడు- శిరుహరి వయి సరువది కుళాలు వాద్యగాడు నివాసము కంచి తెలివిగలవాడు కాడు నాల్గు- కాలాట్టి, గొడగూచి తల్లి వయసరువది యేండ్లు కూతురి మీద డబ్బు సంపాదించవలయునని తప్ప యామెకు వేఱే కోర్కెలేదు. ఐదవ పేరు లేదు. క్రింద వేఱ యేదియో వ్రాయబడినది అది యిది- ఇంటిలో గోవిందవర్మగా రున్నారు. ఆదిత్యవర్మగారి కుమారుడు. ఆయన వైరాగిగా తిరుగు చుండును ఇతడు రాజబంధువు స్వేచ్ఛాచారి ఆయనను మేము పలుకరించలేదు

మానవర్మకు వెంటనే స్ఫురించెను గత రాత్రమునందు తాను చూచినది గోవిందవర్మను అతడు వైరాగిగా తిరుగుట వలన వానిని గుఱించి మానవర్మ పూర్వ మెప్పుడును శ్రద్ధ తీసికొనలేదు. ఇదియంతయు గోవిందవర్మ పన్నాగము. అటువంటి వాడిట్టి పనులే చేయును సరిపోయినది. రాజు మానవర్మ వంక చూచి యా యాకేమిటని యడిగెను మానవర్మ తరువాత మనవి చేయుదుననెను. ఏనుగు మీద

రాజును, ప్రక్కగుఱ్ఱముపై మానవర్మయు వైకుంఠ పెరుమాళ్ళ కోవెలకు వెళ్ళిరి. జన మచ్చట నదివఱకే గుమిగూడిరి. సేనానాయకులు, రాజబంధువులు, మహామాత్రులు, ఘటకపరిషత్తులో కొందఱు, వైకుంఠ మంటపమున చేరిరి. రాజు గజము నవరోహించెను. మానవర్మయు రాజును లోనికి నడచిపోయిరి. రాజురాకకై యందఱు నెదురు చూచు చుండిరి. మానవర్మ ముందుకు పోయి గొడగూచితో మాటాడెను. ఆమె "అయ్యా! ప్రభువులవారి కెదురుగా నృత్యము చేయనిచ్చి నన్నుగౌరవ పరచుటకదా! నా యీ పేదజీవితము నేటికి ఫలించిన దనుకొనుచున్నాను. కాని దేవరవారి యాజ్ఞ" యనెను. ఆమె మాటలలో ఈ రహస్యము గొడగూచికి తెలియదని మానవర్మ గ్రహించెను. ఆమె తెలిసియు తెలియనట్లు నటించుచున్నదా? దీనివలన ఆమెకు కలుగు ప్రయోజన మేదియు లేదు. రాజాసన మున్నదాని నున్న చోటునుంచి యభినయమును వేరొక చోటికి మార్చిరి. దేవాలయములో స్వామి యెదురుగా నుండెను. వైకుంఠ పెరుమాళ్ళ తామర రేకులవంటి కన్నులతో, పచ్చకప్పురముతో, కుంకుమపువ్వుతో చేర్చిన పంగనామముతో, పీతాంబరధారియై లక్ష్మీ దేవిచేయి తన చేతితో పట్టుకొని నవ్వుచు నిలుచుండెను. గొడగూచి స్వామికెదురుగా నిలుచుండి నృత్యము చేయవలయును. మానవర్మ నంబులను పిలిచి లోన నెవ్వరు నుండరాదని చెప్పెను. స్వామిదగ్గర అగ్ని స్పర్శ యేమియు నుండగూడదు. అగురువత్తికూడ కనిపించరాదు. స్వామి యీ నృత్యము తనయంతట తానే చూడవలయును. నంబులు గర్భగుడిలో ఏమియు లేకుండ చేసి యందఱు వెలికి వచ్చిరి. గొడగూచికి కుడివైపున రాజుదూరముగా కూర్చుండెను. గొడగూచికి దేవునకు నడుమ నెవ్వరు పోరాదని మానవర్మ రాజాజ్ఞగా చెప్పెను. గొడగూచిని విడిగా పిలిచి రహస్యముగా మానవర్మ యిట్లనెను: "నీవు నృత్యము చేయుచున్నప్పుడు పొరపాటున నైన మహారాజు వంకకు దిరుగగూడదు. నీవు మొగమిటు త్రిప్పితివా ప్రక్కనున్న రాజభటుడు నిన్ను కత్తితో పొడిచి చంపును." గొడగూచి వెనుదిఱిగి చూడగా ఒఱనుండి వెలికిదీసిన కత్తితో రాజభటుడొకడు నిలిచి యుండెను మానవర్మ గోవిందవర్మ కొఱకు సభయంతయు వెదకెను. ఎచ్చటను గోవిందవర్మ జాడలేదు మానవర్మ చేసిన యీ కట్టడులన్నియు నంబులకు తెలియును గొడగూచికి, గొడగూచి మేళమునకు తెలియును రాజు మానవర్మను పరిశీలించుచుండెను రాజునకేమియు తెలియలేదు మానవర్మ ప్రవర్తన యంతయు కొంచెము విపరీతముగా నుండెను కాని రాజునకు మానవర్మ మహాసత్పురుషుడు. రాజు క్షేమమే కోరెడివాడు. అందుచేత నవ్వుచు కూర్చుండెను

గొడగూచి నృత్యమారంభించెను. చాలసేపు బహువిధ నృత్యములు చేసెను శాంతికుట్టు యొక్క నాల్గురకములు, వినోద కుట్టుయొక్క యాఱురకములు నభినయించెను. తల మీద నీటితో నిండిన కుండ పెట్టుకొని కొడుక్కుట్లు చేసెను అప్పటికి చాలసేపైనది. నృత్యమై పోయినట్లనిపించినది గొడగూచి యట్లే నిలుచుండెను. మానవర్మ యామెవద్దకు పోయి రహస్యముగా "రాజుగారిమీది కీర్తనపాడు" మనెను. గొడగూచి 'అయ్యా! మహారాజు లిటుకూర్చున్నారు. భగవంతుని వైపే తిరిగి యాపాట పాడుమందురా?" యనెను. మానవర్మ 'అవు'ననెను. మానవర్మ

వెళ్ళిన తరువాత మందబుద్ధి యైన గౌడగూచికి తోచెను. ఆకీర్తన సంగతి మానవర్మ కెట్లు తెలియునని? అడుగుటకు మానవర్మ దూరమున నుండెను. గౌడగూచి యా కీర్తన పాడ నారంభించెను. రాజు వించునే యున్నాడు గదా! ఎదురుగా లేకపోయిన నేమి యని తన గొంతులోనున్న మాధుర్యమంతయు నొలుకునట్లు తన నేర్పంతయు వెలికి వచ్చినట్లు కీర్తన యైదు చరణములు పాడెను. గుడి లోపలి నుండి పెద్ద వెలుగు కనుపించెను. నంబులు పోయి చూచిరి. స్వామికి కట్టిన పీతాంబరములు తగులబడిపోవు చుండెను. రాజువచ్చి చూచెను. నంబులు వెళ్ళుసరికి వస్త్రము లన్నియు తగులబడి పోయెను. సభయంతయు గగ్గోలయ్యెను. నంబుల యొక్క యశ్రద్ధ యని జనము చెప్పజొచ్చిరి. కొంత సేపటికి రాజును మానవర్మయు నిద్దఱొకేయేనుగు నెక్కి కోటకు తరలిపోయిరి. రాజాలోచనాగ్రస్తుడయ్యెను.

## ౫

నాల్గుదినములైన తరువాత రాజు మానవర్మ నడిగెను. "నీకంటె నాకు ప్రాణమిత్రుడు లేడు. నాకు రాబోవు సర్వాపదలను నీవు ముందు చూతువు. వానికి ప్రతిక్రియ నాలోచింతువు. నీవుదీని నెట్లాలోచించితివి?" మానవర్మ సర్వమును పూసగ్రుచ్చినట్లు చెప్పెను. గోవిందవర్మ ప్రసక్తిని తీసికొని రాలేదు. గౌడగూచికి కూడ ఈ సంగతి తెలియదనెను. ఎవడో దుష్టుడు నేర్పినపాట రాజును పొగడెడు కీర్తనగదా యని యమాయికముగ నేర్చుకొన్న దనియు చెప్పెను. రాజు విశ్వసించెను. కాని యది నిజము కాదు. మానవర్మ యావిషయమున ఊరకుండలేదు. భగవంతుడు కట్టిన బట్టలు తగులబడుట చేత స్వామికి తిరిగి సంప్రోక్షణ చేయవలసి వచ్చెను. దానికి చాల వ్యయ మగును. ఈ వ్యయము గౌడగూచి భరించవలయునని చెప్పెను. ఆ పేదరాలు మిక్కిలి దుఃఖపడు చుండెను. గోవిందవర్మతో మొఱపెట్టుకొనెను. అతడు తనపాటకు దేవునకు కట్టిన బట్టలు తగులబడిపోవుటకు సంబంధము లేదనుచుండెను. గౌడగూచి వలన తనపేరు బయటకు రాలేదు. అందుచేత రాజాధికారులకు తనసంగతి తెలియ దని గోవిందవర్మ యనుకొనుచుండెను. మానవర్మ యతని నట్టి విశ్వాసములో మననిచ్చెను. అతని నిప్పుడే బెదిరించరాదు.

ఆ రాత్రి గౌడగూచి యింటికివచ్చిన తరువాత మహారాజులవలన తనకువచ్చిన బహుమానములు లేవు. తనవెంట రాజభటులు వచ్చిరి తా నింటిలో నుండి కదలుటకు వీలులేదు. తానింటికి తిరిగివచ్చు వేళకే గోవిందవర్మ ఇంటిలో నుండెను. అతడు రాజుమరణమును గూర్చిన వార్త శ్రవణపేయముగా వినవలయునని కూర్చుండెను. నిజముగా మహరాజే యట్లు దగ్ధుడై యుండినచో గౌడగూచి యింటికి తిరిగి వచ్చెడిది కాదు. అతడు తెలివితక్కువవాడు కనుక ఆమె కొఱకు ప్రతీక్షచేయు చుండెను. కొంతవఱకు అదృష్టవంతుడు కనుక ఆమె యింటికి తిరిగివచ్చెను. రాజునకట్టి యాపదయే జరిగినచో గౌడగూచిని, ఆమె మేళమును రాజభటులిచ్చటనే

సంహరించెడివారు. గోవిందవర్మ యట్లనుకొనలేదు. ఈ ప్రయోగము సంపూర్ణముగా మనిసి నున్నవాని నున్నచోటనే తగులబెట్టు ననుకొన లేదు. క్రమముగా రాజా వ్యాధిగ్రస్తు డగునవియు, కొన్ని దినములు కడచిన తరువాత మరణించుననియు అనుకొనెను. అతడు చిన్న చిన్న ప్రయోగములు పూర్వము చేసెను. కాని యింతటి పెద్దప్రయోగమెవ్వరి మీదను జేయలేదు. దాని ఫలిత మింత తక్షణమే సమకూడునని యెఱుగడు. తెలిసినచో ఇంతకు సాహసించెడి వాడు కాడు.

ఆ రాత్రి గొడగూచి వచ్చి నెత్తినోరు కొట్టుకొనెను. "ఆ మానవర్మ చండ ప్రచండుడు. ఆవులించినచో ప్రేవులు లెక్కపెట్టెడివాడు. అతడుండగా రాజునకే యాపదయు రాదు. రానీయడు. అట్టివానిని తెలియకుండ రాజుప్రాణముల మీది కెత్తెడివాడు తన ప్రాణముల మీదికి తెచ్చికొనెడివాడు. నీవేదో మంచిపాట రాజుమీద వ్రాసి పెట్టితివని సంతోషించితిమి.నీవు రాజద్రోహివని మాకు తెలియదు. పొట్టకూటికి టికాణా లేని మేమెక్కడ? రాజుతో వైరమెక్కడ? చాలు చాలు; ఇంక నీవు మాయింటికి రావ"ద్దని గోవిందవర్మను నలువురు దూషించిరి. గోవిందవర్మ "ఇది నిజముగా నాకు తెలియదు. ఆ బౌద్ధుడు చేసెను. బౌద్ధులకును కాపాలికులకును రాజుమీద విరోధము. ఇదివఱకు రాజును చంపుటకు కాపాలికులు సన్నగడ సన్నిరని యందఱకు తెలియునుగదా! ఈసారి బౌద్ధులు చేసిరి. ఇది నాకు తెలియదు. నీ నృత్యమును రాజుగారు చూడవలయు ననుకొను చున్నారని నేనతనితో ప్రాస్తావికముగా చెప్పితిని. అతడీ కీర్తన వ్రాసిపెట్టెను. మీరు నమ్మినచో నమ్ముడు, లేనిచో లేదు" అని వెడలిపోబోయెను. గోవిందవర్మకు కోపముకూడ వచ్చినట్లుండెను. ఆ యమాయకుల కేమి తెలియును? "ఇతడు రాజవంశీయుడు. ఇందు దోసమున్నచో మానవర్మ కీపాటికే గోవిందవర్మ సంగతి తెలిసియుండును. రాజభటులు గోవిందవర్మను గూడ నిగ్రహించెడివారే. దీని నాబౌద్ధుడే చేసియుండును." అనుకొని మఱల గోవిందవర్మను బతిమాలిరి. అతనికి ప్రాణములు నిలచెను. లేనిచో అతడు వెంటనే బయటికిపోయి యుండెడివాడు. అతనిని రాజభటులు బంధించెడివారు. ఆ కుటుంబమువారు తప్ప ఒరు లెవ్వరా యింటిలోనికి పోయినను, లోనుండి వెలికి వచ్చినను వారిని నిగ్రహించవలయునని మానవర్మ యాజ్ఞాపించెను. ఆ రాత్రి ప్రొద్దుపోయిన తరువాత గోవిందవర్మకు తెలిసెను. తానా గృహమునందు నిర్బంధింపబడినాడనని. తాను పలు విధములుగా తిరుగునని రాజవంశములో తెలియును, కాని యింతటి నీచగృహములలో నుండునని యందఱకును తెలియదు. ఆ పేటలోనే తెలియదు. కాంచీపురములోని జనులందఱు గోవిందవర్మను బైరాగివంటి వాడనియు, కాపాలికులతోడను, బౌద్ధులతోడను తిరుగుననియు, మతిమాలినవాడని మాత్రమే యనుకొందురు. అతడు జారుడని కాని, నీచగృహములతో అతనికి సంబంధమున్నదనికాని జనము మొత్తము మీద తెలియదు. ఇప్పుడు గోవిందవర్మ రాజభటులకు తెలియకుండ ఆయింటిలో నుండి బయటకు పోవలయునని విచారించుచుండెను. అది యెట్లు? యని యాలోచించ నారంభించెను. బౌద్ధభిక్షువులు కొందఱు పగటివేళ బిచ్చమెత్తు చుందురు. వారిలో కొందఱు స్త్రీలు కొందఱు పురుషులు. వీరు మఱియు

విద్యావిహీనులు. మహాపండితులకు, విద్యార్థులకువిహారములో భోజనాదులు జరుగును. అవిద్యావంతులు చాలమంది విహారములో సేవకులుగా నుందురు. పండితులుకాక, సేవకులుగా పనికిరాక, కుంటివారో చెవిటివారో గ్రుడ్డివారోయైన బౌద్ధభిక్షుకులు పట్టణమునందు భిక్షాటనము చేయుదురు. గోవిందవర్మ యాజానుబాహువైన మనిషి. వెంటనే బౌద్ధభిక్షువుగా కనుపించడు. బౌద్ధులు శిరోముండనము చేయించుకొందురు. గోవిందవర్మకు జుట్టున్నది. రాజభటులు చాలమంది గోవిందవర్మ నెఱుంగుదురు. బౌద్ధులు కావిగుడ్డలు పై నుండి క్రిందవరకు వేసికొందురు. ఆ యింటిలో నుండి గోవిందవర్మ బయటికి పోవలయుననగా మొదట తల గొరిగించుకోవలయును. మఱియు నతనికి కాషాయవస్త్రములు కావలయును. ఇవి రెండు నెచటినుండి వచ్చును? ఇట్లొకటి రెండు దినములు గడచెను. గొడగూచి యింటిలోనికి పోయెడివారు లేరు. వచ్చెడివారు లేరు. ఒకనాటి మధ్యాహ్నము బౌద్ధభిక్షుకురాలొకతె వారి యింటి ముందుకువచ్చెను. గోవిందవర్మ యామె నింటిలోనికి పిలిచెను. ఆమె నచ్చటనే నాడు భోజనము చేయుమని చెప్పెను. ఆ పేదది యతనియొక్క దయా విశేషమునకు సంతోషపడి యొక పూటకు అన్నము దొరికినను చాలుగదా యని యంగీకరించెను. గొడగూచితో చెప్పి ఆమెకు భోజనము పెట్టుమనెను. ఆమె స్నానము చేయవలయును. ఆమె ధరించిన కావిగుడ్డలు వదలిపెట్టి యామెను స్నానమునకు పంపించెను. ఆమె యెప్పుడును స్నానము చేయదు. తనకు స్నానము వలదు. అన్నము పెట్టినచో చాలునని యామె యెన్నిసార్లు చెప్పినను గోవిందవర్మ వినలేదు చివరికామెకు స్నానము చేయక తప్పినది కాదు. కొందఱు బౌద్ధ భిక్షుకురాండ్రు శిరోముండనము చేయించుకొనరు. డబ్బులేక చేయించుకొనరు. ఆమె వారిలో నొకతె. అది గోవిందవర్మకు కలిసివచ్చినది ఆమె స్నానమునకు వెళ్ళినంతనే గోవిందవర్మ యామె దుస్తులు వేసికొని వెడలిపోవుటకు సిద్ధపడి గొడగూచితో నిట్లుచెప్పెను. "ఈముసలిదానిని బయటకు పోనీయకుము బయటకు వెళ్ళినచో రాజభటులు పట్టుకొందురని చెప్పుము. తన గుడ్డలకొఱ కడిగినచో నవి మాసిపోయినవి. చాకలి వానికి వేసితినని చెప్పుము" అని చెప్పి తాను వెడలిపోయెను. బయట దూరముగానున్న రాజభటులు భిక్షుకురాలే తిరిగిపోవు చుండెననుకొనిరి. గోవిందవర్మ వంగి నడచుచు కఱ్ఱను నేలమీద కొట్టుచు గడపగడపకు ఆగుచు భిక్షాపాత్రలో వేసినచోట బిచ్చము వేయించుకొనుచు బుద్ధుని మీద పాటలు పాడుచు ఆ వీధిని దాటిపోయెను. అతడావేషముతో నెచ్చటికి బోవలయును? బౌద్ధ విహారమునకు పోవలయును. పోయినచో అచటతొల్లింటి గౌరవము లేదు. వానికి పట్టణము చివర ఒకచోట నొక స్నేహితుడుండెను.

అతడు వృద్ధుడు. పూర్వము సైనికుడు. గోవిందవర్మ వానియింటి కప్పుడప్పుడు పోవుచుండును. ఇద్దరును కలిసి పాగ్రతాగుచు వేదాంతమును మాటాడెదరు సర్వమతముల యందును వేదాంత ముండును. పండితులలో ఆవేదాంతము యొక్క స్వరూపము వేఱు. పామరులలో దాని స్వరూపము వేఱు. అచటనున్న సిద్ధాంతములన్నియు మాఱిపోయి యిదియొక క్రొత్త మతముగా

కనిపించును. మతముల యొక్క యథార్థ స్వరూప మట్లుండగా, పామరులలో దానికిష్టము వచ్చిన స్వరూప మింకొకటి యేర్పడును. ఈ వేదాంతము చదువుకొనెడిది కాదు. విని వాగుచుండెడిది. అట్టి వేదాంతములు- బౌద్ధ, జైన, కాపాలిక, బ్రాహ్మణ మతములకు చెందినవి- నాడు పల్లవరాజ్యములో పామరులయందు వ్యాపించి యుండెను. ఆ వేదాంతములన్నియుకలిపి గుండకొట్టి యొకమతము పామరుల యందు వ్యాపించియుండెను. వారు బౌద్ధులుకారు, కాపాలికులు కారు, జైనులు కారు; మఱల వందఱునగుదురు. అట్టి వేదాంతమును గోవిందవర్మయు ముసలివాడును కలపి మాటాడుకొనుచుందురు. ఆ వృద్ధునకు కన్ను లేదు. మనిసి వచ్చినచో కంఠస్వరముచే గుర్తుపట్టవలసినదే కాని వాని వేషమును చూడలేడు. గోవిందవర్మ యచ్చటికి పోయెను. ఆముసలివాడొంటరిగాడు. అతని కొడుకు సైనికుడు. అతడు మహాబలిపురములో నుండును. నెలకింత యని తండ్రికి పంపించుచుండెను. ఇతడే వంట చేసికొనును. సామాన్యముగా దుంపలు తినును. పొరుగువనున్న యొక కుఱ్ఱవాడు వానికి కావలసినది తెచ్చిపెట్టుచుండును గోవిందవర్మ వాని యింటికి పోయి వానితో మాటాడుచు తన కావి గుడ్డలచట వదలి పెట్టి ముసలివాని దుస్తులు వేసికొనెను. ముసలివానికి బొందుచొక్కా యొకటి కలదు దానిని పూర్వ మతడు వాడుకొనుచుండెను. ఇప్పుడది వాడుట లేదు. అది గోడకు తగిలించి యుండును. మూడేండ్లనుండి తగిలించి యుండెను. గోవిందవర్మ తాను వచ్చినప్పుడెల్ల యా బొందు టంగీవి దులిపి వంకెకు తగిలించుచుండును. గోవిందవర్మ కిప్పటికా శ్రమ ఫలించింది. దానిని ధరించి ముసలివాని ధోవతి నొక దానిని కట్టుకొని గోవిందవర్మ కొంతసేపటికి వెడలిపోయెను

అప్పటినుండి యాముసలివాని బ్రతుకు బైటపడెను. తన రెండవ ధోవతి కొఱకు ముసలివాడు మఱునాటి ప్రొద్దున వెదుకగా ఈ కావిగుడ్డ కనిపించెను. తరువాత జాము పేపటికి రక్షకభటులు వచ్చిరి. కావిగుడ్డను చూచిరి ఈ గుడ్డ నీకెక్కడిదో చెప్పుమని నిర్బంధము చేసిరి. అతని కేమియుతెలియదు. వానిని నిర్బంధించి తీసికొని పోయిరి.

గొడగూచి యింటినుండి సాయంకాలమున ఏడ్చుచు బౌద్ధభిక్షువురాలు బయటికి వచ్చెను. ఆయింటిలో నున్న యెవడో తనగుడ్డలెత్తుకొని పోయెనని, తన్ను ప్రేమగా ఆదరించెనని, యన్నము పెట్టించి తన్ను మోసము చేసెనని, తన కావిగుడ్డలు భిక్షాపాత్రయు చేతికఱ్ఱయు దొంగిలించెనని, నడుమ నడుమ 'బుద్ధ దేవుడా! రక్షించు' మని 'బుద్ధ శరణం గచ్ఛామి' యనియు నేడ్చుచుండగా రాజభటులామెను వచ్చి పట్టుకొని సంగతియంతయు తెలిసికొనిరి తొలుత వారు నమ్మలేదు. ఎవ్వతెయో కుత్సితురాలు తానీ పన్నుగడ పన్నుచున్నదని యామెను తాడించిరి. గొడగూచి యిఱకాటములో పడెను. గోవిందవర్మను గూర్చి చెప్పవలయునా, చెప్పరాదా? చెప్పనిచో నొక కష్టము, చెప్పినచో నొక కష్టము. దానితల్లి కాంట్టే యొక కథనల్లి చెప్పెను. ఒక బిచ్చగాడు, యోగీశ్వరుడు తమ యింట పదిదినముల నుండి యుండెననియు అతడాహారములేకుండ ముందున్న చిన్నగదిలో పండుకొను

ముండెననియు ఆతడే పని చేసెననియు చెప్పెను. రాజభటులతనికోసము వెదకుట వారంభించిరి. కావిగుడ్డలు ముసలివాని యింటిలో కానిపించెను. రాజ వ్యవహారము చిలవలు పలవలుగా పోవును. రాజ రహస్యచారులు చూచి రమ్మనుచో తగులబెట్టి వత్తురు. ఇతని కొడుకు సైనికుడని, యతడు మహాబలిపురము నందుండెనని రహస్యచారుల వార్త వెడలిపోయెను. అచట ఆ సైనికుని యుద్యోగము పదిదినములలో ఊడిపోయెను. వాడు వంగతి తెలిసికొనుటకు కంచి వచ్చెను. ఇంటికి వచ్చినంతనే రాజభటులు వానిని బంధించిరి. అతని కేమియు తెలియలేదు. రాజభటుల నతడు ప్రార్థించెను. తన్నేమియు తెలియకుండ బంధించిన ప్రయోజనమేమి? తన్ను మంత్రుల యొద్దకో రాజునొద్దకో తీసికొనిపోయినచో తన కేమియు తెలియదని చెప్పుకొందుననెను. వారు వినలేదు. అతడు చాల బుద్ధిమంతుడు. అతనిని మంత్రుల సేవకులలో నొకడెరుగును. వీనియదృష్టము వలన అతనిని చెఱసాలకు తీసికొనిపోవు మార్గములో అతడు కనిపించెను. అతడతనితో తనగోడవ చెప్పికొనెను. ఆ మంత్రిసేవకుడు పోయి తన మంత్రితో చెప్పెను. మంత్రి తన కావంగతి తెలియదనియు నదియంతయు మానవర్మగారి వ్యవహారమనియు చెప్పెను. ఈ సేవకుడు పోయి మానవర్మ దర్శనము చేసెను మానవర్మ వంగతులన్నియు తెలిసికొని వృద్ధు డందుడు కనుక గోవిందవర్మ యిట్టిపని చేయగలిగెనని గ్రహించెను. ఇది రాజవ్యవహారము. తన చేయి దాటి చాల దూరము పోయెను. తను రాజున కంగరక్షకుడు. ఈ వ్యవహారము రాజాధికారుల చేతులలో పడినది. తానిచట నిట్లు చేసినచో బాగుగానుండునని చెప్పువాడేకాని మించిచేయుట కధికారము లేనివాడయ్యెను. ప్రత్యేకముగా రహస్యచార విషయము క్లిష్టమైనది దానికి మంత్రియని లేదు. రాజు యొక్క అంగరక్షకుడని లేదు రాజునకు ప్రాణస్నేహితుడని లేదు. అందఱిపైన ననుమానమే! అందఱిని గుఱించి రహస్యముగా వర్తమానములు వ్రాయబడి యుండును పైన రాజాశ్రయము మిక్కిలి చెడ్డది. ఇన్నాళ్ళు నుండి యితడు రాజభక్తుడుకదా. ఇప్పుడిట్టిపని చేయునాయన్న విచారణ రాజనీతికి లేదు. తాను రాజునకాంతరంగికుడు రాజక్షేమమే తనక్షేమముగా చూచుకొను చున్నాడు. అంతే కాదు. రాజునుమించి తన బ్రతుకు లేదు మలయాలోనున్న తనభార్యకు జబ్బుచేసినను తనయెడమకన్నదిరదు. రాజునకు రాబోవు యాపదకొఱకు తన యెడమకన్నదరును తాను రాజుకోసము బ్రతుకుచున్నాడు. పరమేశ్వరుడు తన జీవితమును, తనకైన జీవితము కాకుండ రాజుకొఱకైన జీవితమునుగా చేసెను. ఇట్టి తనను కూడ రాజనీతి యనుమానించును. గోవిందవర్మ రాజవంశీయుడు. అతనిని వ్యవహారములోనికి తీసికొనివచ్చినచో రాజవంశీయులకు తనమీద అసూయపుట్టునని తానా విషయమును గుంపనగా నుంచెను. అట్లు తప్పించుకొని పోవుచున్న గోవింద వర్మను రాజభటులు పట్టుకొనినచో అతనిమీద నేరము ధృవపడెడిది ఇపుడే నేరము దావాగ్నివలె గాలి యెటు వీచినచో నటు తగుల బెట్టును. తాను వృద్ధుని పక్షము పూనినచో అది యేమగునో తెలియదు. కంచిపురములోని యంతర్వ్యవహారములు చూచు మంత్రి మిక్కిలి కుత్సితుడు అతనికి లోకమంతయు కుటిలమైనది [illegible]

పరమతీవ్రుడు. సరిగా రక్షకభటుల బుద్ధి యెటులుండునో వానిబుద్ధి యట్లుండును. లోకములో సత్పురుషులు లేరు. అందరును చోరులే, అందఱును దురాచారులే, అందఱును రాజద్రోహులే. సమయము కుదరక సత్పురుషులుగా ప్రవర్తించుచున్నారు- ఇది వాని సిద్ధాంతము. మానవర్మ రాజునొద్ద ఇంత పలుకుబడి కలవాడుగా నుండుట రాజ్యములో నెవ్వరికిని కన్నెఱ్ఱగా లేదు. ఆ మంత్రి కొక్కనికి కన్నెఱ్ఱ.

పల్లవరాజ్యములో మహామాత్రులు పదునాఱుగురును వృద్ధులు బ్రాహ్మణులో క్షత్రియులో యైయుండిరి. అందఱును వేదవేదాంగ పారంగతులు. అందఱును సత్పురుషులని ప్రసిద్ధి పొందినవారు. అట్టివారినే రాజునకు మంత్రులుగా ఎన్ను కొందురు. ఈ మంత్రి మాత్రము పండితుడు కాడు. ఎన్నికలలో ఇతడు వచ్చెను. అతనియందు రాజున కభిమానము లేదు. అందుకనియే పట్టణములోని అంతర్విషయముల మీద నతనికి మంత్రిత్వ మిచ్చెను. మానవర్మ యెంత విచారించినను రాజుతో చెప్పకుండ ఆ ముదుసలి వానికి జరిగిన యన్యాయము పరిహరింపరానిదిగా నున్నది. గోవిందవర్మను గూర్చి రాజుతో జెప్పుట యతని కిష్టము లేదు. ఒక వృద్ధుడు నిర్హేతుకముగా ఇట్టి యాపద పొందుట తనకిష్టములేదు. మఱియు వాని కొడుకు యొక్క యుద్యోగమే పోయెను ఆ తండ్రి కొడుకు లింకెట్లు బ్రదుకుదురు? మానవర్మ మహారాజుతో మఱునాడిట్లు చెప్పెను. "మహాప్రభూ! నేను తమ ప్రాణరక్షణ చేయుటకు చేసిన ప్రయత్నములలో ఒక నిర్దోషియు అంతకంటె నిర్దోషియైన వాని కుమారుడును రాజనీతివాగురలో తగుల్కొనిరి ఇందులో నొక రహస్యమున్నది. ఆరహస్యము తమ కిప్పుడు తెలియజేయరానిది కొలది దినములలో దెలియజేసెదను. తమరికి నాయందు సంపూర్ణ కటాక్షమున్నచో ఆ తండ్రి కొడుకుల నిద్దఱను వదలి పెట్టించుటకు పట్టణాంతర్వ్యవహారమంత్రికి తామాజ్ఞ యీయ వలయును " అని మనవి చేసెను రాజు వారి నామములేవియో చెప్పు మన మానవర్మ రాజాజ్ఞ వ్రాయించికొని రాజునకు తన యందున్న విశ్వాసమునకు, తన యందలి యనుగ్రహమునకు బరవశుడై యా యాజ్ఞను రాజుయొక్క ప్రధానవార్తాహరుని చేత మంత్రికి పంపించెను

ఆ మంత్రి యిట్టి యొకటి రెండు రాజాజ్ఞలు పూర్వము పొందెను చెఱలో బంధింపబడిన వానిని విడుచుట యనగా వానికి తలప్రాణము తోకకు వచ్చును అతని కిష్టములేదు ఎంతమందిని శిక్షించినచో అంత ధర్మము జరిగినదని వానియూహ అందఱును మనుజులేకాని వారిలో కొందఱు రాక్షసులు కొందఱు దేవతలు దేవతాంశ కలవారు కొందఱు రాక్షసాంశకలవారు కొందఱు ఈ రాక్షసాంశ కలవారును మానవుల వలెనే కనిపింతురు వారును చదువు చేతనో మఱి యితర కారణముల వలననో యుద్యోగు లగుదురు వారికి వచ్చెడు ఉద్యోగము కూడ వారి స్వభావమున కనుకూలముగానే వచ్చును. వాని రాక్షసప్రవృత్తి వాడు చేసెడు సర్వవ్యవహారము లందు కనుపించును. వాడు చేసెడు పనుల చేతనే వాడు రాక్షసాంశ కలవాడో దేవతాంశ కలవాడో తెలియును. ఆ మంత్రికి వారిని వదలిపెట్టుట యిష్టము లేదు నాల్గు దినములు వదలలేదు వదలలేదని మానవర్మకు తెలిసినది మఱల రాజువద్దకు

పోయెను. వెంటనే వదల వలసిన దని రాజు యొక్క వార్త మఱల వెళ్ళెను. అతనికి వదలక తప్పినది కాదు.

ఆ తండ్రి కొడుకు లిద్దఱు తమ యింటికి పోయిరి. కొడుకు పాతికయేండ్లవాడు. తండ్రి నుండి యీ సంగతి యంతయు తెలిసికొనెను. తండ్రి వెంవాళ్ళు చెఱసాలలో నుండెను. కొడుకు వారముదినములు చెఱసాలలో నుండెను. ఈ వెంవాళ్ళలో తండ్రి యారోగ్యము చెడినది, అతడు మంచమున బడెను.

## ౬

ఆకుఱ్ఱవానిపేరు కరిపుట్టి. అతడు సాహసము కలవాడు. ఆలోచన కలవాడు. కోపము కలవాడు. పగతీర్పవలయు ననెడివాడు. ఇంటికి తిరిగివచ్చిన తరువాత ఈ గుణములన్నియు వానియందు వెలికి వచ్చెను. పూర్వ మారోగ్యముగా తిరుగుచున్న తండ్రి నే డవధ్యుడై యుండెను. అతని మంచమువద్ద సర్వదా పరిచర్యకొక మనిసి యుండవలసి వచ్చెను. అతడు ధనముకలవాడు కాదు. ఇప్పుడు రెండు పొట్టలను పోషింపవలసి వచ్చెను. తానేమి చేయవలయును? కొద్దిగా కూడబెట్టిన ధనముకలదు. అది మహాబలిపురములో నున్నది. దానిని తెప్పించుకొని దానితో కాలక్షేపము చేయుచుండెను. ఆ కావిగుడ్డలు తన యింటిలోని కెట్లువచ్చినవో విచారింప నారంభించెను. తనతండ్రి నడిగెను. అతడు తనకు దెలియదన్నాడు. ప్రశ్నలమీద ప్రశ్నలు వేయగా తత్పూర్వము వచ్చి యతనితో నా రోజున మాటాడినవారు నలువురు తేలిరి. వారిలో గోవిందవర్మ యొకడు. గోవిందవర్మ యిట్లుండునని తండ్రి చెప్పలేదు. ఆ గోవిందవర్మ యెవరో? రాజవంశములలో బైరాగివలె తిరిగెడి గోవిందవర్మ యొక డున్నాడని కరిపుట్టికి తెలియును. ఒకనాటి సాయంతనమున ఆ గోవిందవర్మను కలిసికొనుటకు కరిపుట్టి బయలుదేఱెను. కోటలోనికి వెళ్ళుటకు వీలులేదు. మఱియేమి చేయును. ఆ గోవిందవర్మ కాపాలికుల చుట్టు తిరుగును. బౌద్ధుల చుట్టు తిరుగును. తరువాత నాల్గురోజులు కరిపుట్టి బౌద్ధవిహారములకును కాపాలికపేటకును పోవనారంభించెను. ఇది క్రొత్త తప్పిద మయినది. రాజును వధించుటకు కాపాలికులు చేసిన ప్రయత్నమునాటి నుండియు కాపాలికులపేట మీద రాజభటులు కన్నువేసి యుంచిరి. అచటికి రెండు మూడుసార్లు కరిపుట్టి వెళ్లగా కరిపుట్టి రాజద్రోహపు నేరము మీద బంధింపబడి వదలిపెట్టబడినవాడు కాగా అతని యీ ప్రాంతములకు రాకపోకలు సందేహాస్పదములయ్యెను. కాని కారణము లేకుండ నిగ్రహించుట యెట్లు? కరిపుట్టికి గోవిందవర్మ కాపాలికులపేటలో గనిపించలేదు. బౌద్ధవిహారము నొద్దకు పోయెను. బౌద్ధులు కానివారిని విహారములోనికి రానీయరు. అతడా చుట్టుపట్లనే తిరుగుచుండెను. ఒకనాడు కరిపుట్టి విహారమువఱకుపోయి ప్రవేశములేక తిరిగివచ్చు చుండగా ఒకపురుషు డతనికి కనిపించెను. కరిపుట్టి వానితో మాటాడనారంభించెను. ఆ పురుషుడు మాటలలో మంచి నేర్పుకలవాడు. చాల సత్పురుషునివలె నటించి కరిపుట్టినుండి సర్వ విషయములను తెలిసికొనెను. అతడు

గోవిందవర్మ కొఱకు వచ్చెననియు, గోవిందవర్మ యతనికి కనిపించినచో కత్తి యుద్ధము గోవిందవర్మకు తప్పదనియు ఆ పురుషుడు గ్రహించెను. కరిపుట్టి సైనికుడు. కత్తియుద్ధము బాగుగా నేర్చినవాడు. మహాబలిపురములోని సైనికులలో కత్తియుద్ధములో నేర్పరులైన యైదాఱుగురిలో కరిపుట్టి యొకడు. గోవిందవర్మ చిన్నప్పుడు కత్తిసామునేర్చెను కాని, యతనికేవిద్యయు నంటలేదు. కత్తి పుచ్చుకొనుట మాత్రము తెలియును. ఆ పురుషు డిట్లనెను. "ఓయీ! గోవిందవర్మకు కత్తివిద్య తెలియదు. వానితో నీవు కత్తి యుద్ధము చేసినచో వానిని చంపినట్లగును కాని చేసినట్లు కాదు. ఆ గోవిందవర్మ అప్పటి కాపదలో నుండియుండును. తానెట్లు తప్పించుకొనవలయునాయని యతని ప్రయత్నమై యుండును. కాని, నీ తండ్రి మీదికి, నీ మీదికి ఈయాపద తీసికొని రావలయు నన్న ప్రయత్నమై యుండదు. అతడొక్కటే తప్పుచేసినాడు. ఆ కావి గుడ్డలను తీసుకొనిపోయి తగులబెట్టినచో ఈ ప్రమాద ముండెడిది కాదు. ఇది యతని యవివేకము. అతని ద్రోహము కాదు. అతడు ద్రోహియైనచో నీ యింటిలో నేమియైన ఎత్తుకొనిపోయియుండును. రాజభటులకు నీ తండ్రి నప్పగించియుండును. అతడు రాజవంశీయుడనుచున్నావు కదా! అది యతనికి సులభమైన పని" అని యా పురుషుడు చెప్పగా కరిపుట్టి 'నిజమే' యనెను. వీరిరువురకు స్నేహమయ్యెను. కరిపుట్టిపేరు నూతనపురుషునకు తెలియదు. వానికి కరిపుట్టిపేరు తెలియదు. కరిపుట్టి యా వృద్ధుని కుమారుడని మాత్రమా పురుషునకు తెలియును.

దినదినము కరిపుట్టి విహారమునకు పోవును. అచట నా పురుషుడు కలిసికొనును. ఆపురుషుడు విహారములో తానొక వంటవాడ ననియు ప్రతిదినము తెల్లవాఱుజామున అచ్చటికిబోయి మధ్యాహ్నము తిరిగివత్తు ననియుజెప్పెను. ఆగోవిందవర్మను తా నెఱుగననెను. అతడు విహారములోని కెప్పుడును రాడని చెప్పెను. ఇద్దఱును కలిసి మఱల మాటాడుచు పోవుచుండగా ఆ పురుషు డిట్లనెను "ఒకవేళ కావిగుడ్డలు మీ యింటిలో దొరకె ననుకొందుము. మీతండ్రి కన్నులు లేని ముసలివాడుకదా! ఈ రాజునకు బుద్ధియున్నదా? ఆ ముసలి వానిని జెఱలో బెట్టుటయేమి? కాదొకవేళ నీతండ్రి దోషియేయందము. నీయుద్యోగము తీసివేయుట యెందుకు? నిన్ను చెఱలో పెట్టుట యెందుకు? ఇటువంటి రాజ్యములోపుట్టుట పాపము. ఈ రాజులనగా నేమి యనుకొంటివి? వీరు ధర్మమును పాలించెడివారు కారు. తమ యధికారమును తమ రాజ్యమును నిలువబెట్టుకొనెడి వారు. భగంతుడున్నచో నిట్టివారలకు శిక్ష తప్పదు" కరిపుట్టి 'నీవు బౌద్ధుడవు కావా'యని యడిగెను. ఆ పురుషుడు తాను బౌద్ధుడను కాననియు, కడుపునకు జరుగక విహారములో వంటకు కుదిరితి ననియు, గొప్పవంశములో పుట్టినవాడననియు, తాను కొందఱు మంత్రులను కూడ నెఱుగుదు ననియు చెప్పెను. కరిపుట్టి ప్రకృతి యుద్వేగము కలది అట్లు మాటాడిన పురుషుని మాటల నందిపుచ్చుకొని యతడెన్నడు చేయని రాజదూషణము చేసెను. ఆపురుషుడు కరిపుట్టికి క్రమక్రమముగా నావేశ మెక్కించెను. నెల దినములు వారిద్దఱు సాయంకాలము లందు కలిసికొనిరి. రాజద్రోహపు మాటలే

మాటాడుకొనిరి. ఒకనాడు కరిపుట్టి ప్రసంగవశమున తన నిలుపయున్న డబ్బుపోయిన దనియు, ఏమిచేయవలయునో తెలియుట లేదనియు జెప్పెను. ఆ పురుషుడు పదు నేను నిష్కములను కరిపుట్టి కిచ్చి "మొగమాట పడవద్దు. నీ చేతిలోనికి డబ్బు వచ్చినప్పుడు నాడబ్బు తీర్చవచ్చును. నేను గొప్పయింటి వాడ నని చెప్పితిని గదా! నే నింటియొద్ద కూర్చున్నచో నాకు జరుగును. ఐనను వ్యర్థుడనుగా కూర్చుండి పూర్వులిచ్చిన యాస్తి తినుట యెందుకని కాయ కష్టపడి బ్రదుకుచుంటిని. నాకు కావలసినచో మఱి పది బంగారు నిష్కములను తెచ్చికొనగలను. ఎప్పుడేపని వచ్చునో యని పది బంగారు నిష్కములు నా యొద్ద నుంచుకొందును;" అని బలవంతము చేసి కరిపుట్టి కిచ్చెను. ధనము సుంతయు ఆలోచనను చేయనీయదు. వ్యతిరేకమైన యాలోచన వచ్చినచో దానిని పరిహరింప జేయును-'ఎప్పుడు పడిన నప్పుడు పది నిష్కములు తెగలిగిన యితడు విహారములో వంటపని చేయుట యేమి?' యన్నయూహయే కరిపుట్టికి రాలేదు. తానాపదలో నుండగా తనచేతికి పదినిష్కములిచ్చినవాడు మహానుభావుడు, ప్రాణస్నేహితుడు, మహొదారుడు, సత్పురుషులలో శ్రేష్ఠుడు. పది నిష్కము లనగా తనకును తన తండ్రికి పదినెలల జీవితము సుఖముగా గడచును ఆనాడు వారిద్దఱు విడిపోయిరి. మఱల నెలదినములు గడచెను. వారు ప్రతిదినము కలిసికొనుచునే యుండిరి. రాజద్రోహపు మాటలు మాటాడుకొనుచునే యుండిరి ఒక్కొక్కనాడు కరిపుట్టికి ఆ పురుషుడు పట్టరాని కోపము తెప్పించును. కరిపుట్టి యొక్క మనోలక్షణ మా పురుషుని చేతిలో ఆడెడి కీలుబొమ్మ వంటి వస్తువయ్యెను. కరిపుట్టి యతనిపేరు పదిసార్లడిగెను. అతడు చెప్పలేదు. పేరడిగినప్పుడెల్ల వేదాంతోపన్యాసము చేయును. "పేరులో నే మున్నది? ఈ శరీరములో నేమున్నది? నేను గొప్పయింటిలో పుట్టినానని నా కహంకారములేదు. ఈ సృష్టి యెందుకో నా కర్థమగుటలేదు. బౌద్ధులు నిర్వాణ మందురు. కాపాలికులు ముక్తి యందురు శైవులకు శివలోకము వైష్ణవులకు విష్ణులోకము ఇంక బ్రాహ్మణు లున్నారందఱికంటె పై మెట్టు అక్కడ నేమియులేదు. అగమ్యగోచరము!" ఆ పురుషుడు సర్వమత తత్త్వములను విస్తరించి యుపన్యసించును. కరిపుట్టి కివి యేమియు తెలియవు. తనకొక మహాపురుషుని దర్శనమైనదనియు, అతడు పరమవేత్తయనియు, మహాపండితుడనియు, పరమవిరాగియనియు అతని యభిప్రాయము. ఎన్నిసార్లో కరిపుట్టి వానిని తన యింటికి రమ్మని బలవంతము చేసెను. ఆ పురుషుడు రాలేదు రాడు అతడిట్లన్న "గృహములో నేను అడుగు పెట్టను. బౌద్ధవిహారములో వంటకు కుదిరితి ననగా అది గృహము కాదు. వా రందఱు సన్యాసులు. నేను రాత్రులందు దేవాలయములందు నిదురింతును. మా యింటికి పోయి నాళ్లేండ్లయినది. వెళ్ళిన నచట నుండను నీకు పది నిష్కములిచ్చిన తరువాత మఱల పదినిష్కములు తెచ్చుకొనుటకు నెల్లాళ్ళ క్రింద మఱల వెళ్ళితిని. నిజముగా ఈ డబ్బుతో నాకు పని లేదు. ఎవరైన పేదవారి కిచ్చుటకే తెచ్చెదను నాతో నెవ్వరును మాటాడరు. నీ కిచ్చిన డబ్బు నీదగ్గఱ నైపోయిన తరువాత నివి మఱల నీకే యిచ్చెదను. నాకు డబ్బుతో పని లేదు. నే నాకపూటయే భోజనము

చేయుదును. ఆ భోజనము విహారములో చేయుదును. నాకు జాతిమత విచక్షణ లేదు." ఇట్టిమాటల తరువాత కరిపుట్టి మఱల నతనిని రమ్మనడు.

ఒకనాటి సాయంకాలమున ఆ పురుషుడు కరిపుట్టికి మఱల ఉద్యోగ మెక్కించెను. కరిపుట్టిని చెఱనుండి వదలి యప్పటి కైదునెల లయ్యెను. అతడు సుఖముగా బ్రతుకుచుండెను. మఱల నుద్యోగము సంపాదించవలయు నన్న ప్రయత్నమే లేదు. దినదినము సాయంకాలముల నితనితో గలసి ప్రొద్దుపోవు వఱకు కాంచీపురము యొక్క బయటనున్న యొక పాడుబడిన శిలాగృహము నందు కూర్చుండి మాటలాడుట తప్ప వేఱే పని లేకపోయెను. అతడు తనకు జరిగిన రాజావమానమును మఱచియే పోయెను. ఈ పురుషుడు లేనిచో దానిని స్మరించుట కూడ నుండదు. కాని స్మరించిన తరువాత, అతని క్రోధ మంతయు ఒక్కసారి త్రవ్వికొని వచ్చును. తన జీవితమంతయు పాడైపోయినదని, దానికి కారణము రాజుయొక్క యవివేకమనియు నివి రెండే ప్రధాన భావములు. ఊఱకే రాజున్నీ కోపము పెఱిగిపోవు చున్నది. "ఇట్టి రాజ్యమును ధ్వంసము చేయవలయును. పుట్టిన తరువాత గిట్టక మానరు. బ్రదికియుండగా ధర్మ మాచరింపవలయును.. లోకములో రాజద్రోహము మొదలెవని లేవు. ఉన్నదొక్కటే ద్రోహము. అది ధర్మద్రోహము. ఎవడు ధర్మద్రోహియో వానిని మొదట చంపవలయును. రాజద్రోహిని చంపుట ఆ రాజ్యమును .ఆ రాజును రక్షించుటకొఱకు. ధర్మద్రోహిని చంపినచో భగవంతుని ప్రపంచములో నిలబెట్టినట్లగును. ఈ రాజు ధర్మద్రోహి. కానిచో గతిలేని నీసంసారము నిట్లుచేయునా? నీవు రాజభక్తుడవు. రాజుసైన్యములో చేరితివి. రాజును నిలబెట్టుటకు ప్రయత్నించితివి. నీయంతటి కటారికాడు లేడు. నీ బ్రిదుకంతయు రాజున కర్పణము చేసితివి. అట్టినిన్ను నీ తండ్రి యున్నచోట కానిగుడ్డలు దొరికిన వన్న మాత్రాన చెరలో బెట్టునా? ఇది ధర్మమా! అధర్మము నంతయు నొక్కసారి యెవ్వడును నిర్మించలేడు. అది మనమును చేయలేము. కాని మనకు తెలిసిన యధర్మవిషయములో మన మూరకుండరాదు. అట్లూరకుండినచో భగవంతునకు ద్రోహముచేసినవార మగుదుము" అని పురుషు డనగా కరిపుట్టి-"మనము రాజు నేమిచేయగలుగుదుము? ఆయన కోటలోనుండును. ఆయన బయలుదేరినచో ఏనుగు మీద బయలుదేఱును ఆయన వెంట నిత్య మాయుధపాణులు పాతిక ముప్పది మంది యుందురు మనకోపము వృధా! నాకైనచో కోపమున్నది. ఆ రా జెదురుపడినచో నీవు ధర్మాధిరాజువుకదా! ఇట్లు చేయవచ్చునా? యని యడిగెద" ననెను. ఆపురుషుడు మఱల నిట్లనెను, "నీ వట్లడిగినచో అడుగవచ్చును. కాని నిన్నెవ్వర డుగనిత్తురు? నిన్ను రాజున కెదురుగా నిలుచుండ నీయరు. వెంటనే నిన్ను రాజభటులు బంధింతురు. ఓయి పిచ్చివాడా! ఈ యధర్మమును నశింపచేయవలయు నన్నచో రాజును దొంగతనముగా వధించుటతప్ప మఱి యే మార్గమును లేదు. దొరతనముగా నీవు రాజునెదుటికే పోలేవు" అని యాపురుషు డొక ధర్మావేశమును తెచ్చుకొని "నీకు నిజముగా అధర్మము జరిగిన దని యధార్థమైన కోపమున్నచో ఎట్లో యొకట్లు రాజునొంటరిగా చూచి వానిపై బడి వధించుము. లేనిచో నూరకుండుము" అనెను,

కరిపుట్టికి నెత్తురునాళము లన్నియు నుడికి పోవుచుండెను. కన్నులలోనికి నిప్పులు వచ్చెను. "ఏమైననుసరే, ఆరాజును నేను వధించి తీరెదను. కాని నాకతఁ డొంటరిగా కనిపించవలయును." పురుషుడు, "నేనట్లు చేయగలను. రాజు నీ కొంటరిగా కనిపించగలడు." **కరిపుట్టి**- "నే నతనిని నిశ్చయముగా వధింతును. లోకమునుండి యధర్మమును తొలగింతును". **పురుషుడు**- "నీ నామాటమీద నిలువుము. నిలువనిచో భగవంతునకు ద్రోహముచేసినవాడ వగుదువు."

పురుషున కావేశము పెరిగెనో లేదో తెలియదుకాని కరిపుట్టికి పిచ్చి యెక్కిపోయెను. కరిపుట్టి, "యా రాజును నా కెప్పుడు చూపించెదవో చెప్పు" మని యడిగెను. పురుషుడు "ఓయీ! ఈరాజు ధర్మద్రోహి యని కొందఱు మంత్రులకు కూడ తెలియును. ఆ మంత్రులును నేనును పలుపార్లు రాజవధమును గూర్చి యాలోచించు చుందుము. మాకు మంచి కటారికాడు దొరుకలేదు. ఆ మంత్రులతో మాటాడి నీకు రాజొంటరిగా కనిపించునట్లు చేసెదను. అది కొద్దికాలము పట్టును. నీ వోపిక పట్టవలయును. ఈ నిశ్చయము నుండి బెసగి పోరాదు. పోయితివా, నిన్ను భగవంతుడు శిక్షించును."

కరిపుట్టి తనకు పూర్వము భగవంతునికంటె రాజెక్కువవాడు, ఇప్పుడు రాజుకంటె భగవంతు డెక్కువవాడనును తరువాత పదిదినములకు ఆపురుషు డిట్లు చెప్పెను- "నీ వెప్పుడు సిద్ధముగానున్నచో అప్పుడు నేను నిన్ను కోటలోనికి తీసికొని పోగలను. నేను నీ వెంట నుండను. నీ కన్నియు ఏర్పాటులు చేసితిని. రాణివాసములో ముచ్చెబొమ్మలు కొనవలయునని యనుకొనుచున్నారట. నీవు ముచ్చెవాని వేషము వేసికొని పెద్ద తట్టనిండ మంచి బొమ్మలు పెట్టుకొని కోటలోనికి పోవచ్చును. ఇద్దఱు రాజపరిచారికలు నిన్ను తమ వెంట తీసికొని పోయెదరు. ఆ దినము నిర్ణయింపబడలేదు. నీకు తరువాత చెప్పెదను. నీకు పాగా యుండరాదు. నీవు జుబ్బావంటి కంచుకము తొడుగుకొనవలయును నీవు కుమ్మరివి. నీ మొగమునందు, నీ కన్నుల చివఱ చక్కగా విభూతి రాచుకొనవలయును. ముంజేతుల క్రింద నంతయు విభూతి. మెడలో రకరకములైన రుద్రాక్షలు ఎడమకాలికి మెలికల కడియము, కుడిచేతి మణికట్టుపైన సత్తు కడియము. ఎఱ్ఱరంగు వేసినగుడ్డ కట్టుకొనవలయును. ఆజుబ్బా తెల్లనిది. పై యుత్తరీయము నల్లనిరంగు. చెవి కొక కుట్టుపోగు,-ఈ వేషముతో కోటలోనికి పోవలయును. నిన్నెఱిగియున్నవారు కూడ నిన్ను గుర్తుపట్టలేరు. నిన్ను రాజద్వారము ముందు సోదాచేసి పంపింతురు. నీయొద్ద కత్తి కనిపించరాదు. అందుచేత కోటలోనికి వెళ్ళిన తరువాతనే నీ కెవరో స్త్రీ రహస్యముగా తెచ్చి కత్తి యిచ్చును. నీవు ప్రొద్దు తిరుగగా కోటలోనికి పోవుదువు. ఇంచుమించుగా ప్రొద్దు క్రుంకువఱకు కొటలోనేయుందువు అచటతోట యున్నది. ఆ తోటలో రాజు సాయంకాలముల యం దొంటరిగా విహరించును. రాజును చూచుట తోడనే గుర్తుపట్టగలవు. నీ వతనిని వధింపుము. వెంటనే యెవ్వరికిని తెలియదు పొద్దుక్రుంకినదని తొందరపడుచు నీవు కోటదాటి రావలయును. కోట దాటినంతనే కుడివైపునకు సందున్నది. అచట నొకయింటిలో నిన్ను రమ్మని పిలుతురు. లోనికి వెళ్లుము. ఈ వేసమంతయు

తీసివేయుము. నీ దుస్తు లచ్చటనుండును. నీవు వానిని ధరించి దొడ్డి త్రోవను వెళ్ళిపొమ్ము. వెనుక తోటలున్నవి. వానిలోనికి పోయి పట్టణము చుట్టు తిరిగి నీయింటికి రమ్ము. పట్టణము చుట్టు తిరుగుట యనగా ఐదామడ తిరిగివచ్చుట. మఱునాటి పొద్దుటికిగాని నీ వింటికి చేరవు. ఈరీతిగా నీ వధర్మమును శిక్షింతువు. అధర్మమును శిక్షించుటలో ధర్మము నశించగూడదు. అందుచేత నీకేమియు చేటురాదు. నేను నీకు సద్గురువును దొరికితిని. నీవు నాకు సచ్ఛిష్యుడ వనిపించుకొనుము."

ఇదియంతయు నిర్ణయింపబడిన తరువాత ఆ పురుషుడొకదినము నిర్ణయించెను. కరిపుట్టి వేషమువేసికొని కోటలోనికి వెళ్ళెను. రాజభటులు సోదా చూచిరి. అతనియొద్ద బొమ్మలుతప్ప వేవియులేవు. అతనిని లోనికి పోనిచ్చిరి. అతడు కోటయొక్క మెలికల ద్వారములను దాటి యంతిపురము వైపునకు తీసికొనిపోబడెను. అంతిపురమునకు పోవు మార్గము లేదు. ప్రక్క నొక సందున్నది. ఆ సందులో నుండి కోట యొక పెడనున్న యిండ్ల నడుమగా చుట్టు తిరిగి కోటవెనుక భాగమునకు పోవలయును. అచ్చట రాణులు పరిచారికలును బొమ్మలు చూచుటకు వచ్చిరి. కరిపుట్టి చూపించుచున్నట్లు నటించుచున్నను తనకు ఖడ్గమెవరిత్తురో యెప్పుడిత్తురో తెలియక బెదరుకనులతో నటునిటు చూచుచుండెను. రాణు లతని నొకసారి యట్లు చూతు వేమని యదలించిరి.

మానవవర్మ గొడగూచి నృత్యము చూచిన వేళనే రాజు జాతకములో తరువాత ఆరునెలలకు రాజున కింకొక యాపద గలదని చూచెను. అది మఱియొక ప్రయోగము. ఇదికూడ మఱియొక పాటద్వారా చేయబడునని మానవర్మ యనుకొనెను. కాని వెన్నయ్య దానికి దీనికి సంబంధమున్నను పాటద్వారా యిది చేయబడదు, కత్తితో రాజును వధించుటకే ప్రయత్నము జరుగునని చెప్పెను. పదునేను దినములు మానవర్మకు నిదురలేదు. రాతిరి జాముప్రొద్దు పోయిన వెంటనే వెన్నయ్య యింటికి పోవును. ఇంచుమించుగా తెల్లవాఱువఱకు లగ్నములు కట్టుదురు. గోచారములు చూతురు. ప్రశ్నలు వేయుదురు. ఇద్దఱును కలిసి పదునేను దినము లయిన తరువాత నొక నిశ్చయమునకు వచ్చిరి. ఈ ప్రయత్నము ఫలానా దినమున ప్రొద్దుగ్రుంకు వేళ జరుగును. కోటలో ఈశాన్యదిక్కున నున్న యొకగృహమునుండి యీ కటారికాడు పోవును. వారిలెక్క కొంచెము తప్పెనది. కటారికాడు పోడు. ఒక్క కత్తియే పోవును. గోవిందవర్మ యిల్లు కోటలో ఈశాన్యదిక్కున లేదు. మానవర్మ కంతుబట్ట లేదు. అతడు సూక్ష్మసూక్ష్మముగా విచారించెను. గోవిందవర్మ బైరాగులలో గలియక మునుపు, తా నొకదాసితో సంబంధము కలిగియుండెను. ఆ దాసియి ల్లీశాన్యదిక్కున నున్నది. ఆ యింటి మీద మానవర్మ రాజభటులను ప్రయోగించెను. అచ్చటినుండి యేమియు వార్త యందలేదు. ఆ దాసి యిపుడు వెలుతి మూల యందు నివసించుచుండెను. అందుచేత నతనికి తెలియలేదు. జ్యోతిష్యపులెక్క లీ రీతిగా తల్లక్రిందులగుచుండును. దాసి యిపు డచట నున్నదా లేదా యన్న వేఱొక ప్రశ్న పుట్టలేదు. పుట్టినచో నది పెద్ద చిక్కాకైన లెక్క.

మానవర్మ కేమియు తోచక రా వా తోటలో రాజుతో కలిసి వెళ్ళవలయునని నిశ్చయించెను. అది యంతిపురమునకు సంబంధించినతోట. అచ్చటి కెవ్వరును పోరాదు. పోయినచో శిరచ్ఛేదము. ఈ ఘుచ్చెవానిని గూడ నచ్చటికి తీసికొని పోరాదు. అందుకనియే వానిని రా జిక్కడికి రాక ముందే తొందరగా పంపించి వేసిరి. వాడు తన తట్టవొక మూల దాచి పాదల వెనుక పొంచియుండెను. ఒక స్త్రీ వానికి ఖడ్గము తెచ్చియిచ్చెను. అతడు పాదల వెనుక విలీనుడైయుండెను. మానవర్మ నాటిపొద్దున రాజుతో నిట్లు చెప్పెను, "మల్లుడా! మీరు నేటిసాయంత్రమున అంతిపురపు పూతోటలో విహరించుచుందురు. మీరు చేతిలో ఖడ్గమును ధరించి పోవలయును. ఆ తోటలో మీమీద మీకు ద్రోహము చేయుట కెవ్వడో పొంచియుండును. వాడెవ్వడో తెలియదు. అచ్చట కెట్లువచ్చునో తెలియదు. ప్రతినిమేషము తమరు వెనుకముందులు చూచుకొనిపోవలయు నని నాకు వాగ్దానముచేయుడు". రాజు నివ్వెఱపోయి వాగ్దానము చేసెను. అట్లే ఖడ్గమును పుచ్చుకొని వాడు తోటలోనికి పోయెను.

కరిపుట్టి రాజును చూచెను. రాజు చేతిలో కత్తి యున్నది. రాజుమొగము వంక చూచెను వానిలో నున్న ధైర్యమంతయు ఏఱయ్యెను. లోనుండి రాజభక్తి పొంగివచ్చెను తన జన్మకు రాజదర్శన మగుట మహాదృష్టము. తన కాఱువేలల నుండి పెఱిగిన కోపము నిర్హేతుక మనుకొనెను. ఇంత శాంతుడైన రాజు-ఎదురుగా చంద్రు డుదయించినట్లున్న రాజు-ధర్మ ద్రోహియా? కాదు, కాదు. తన రాజును తాను చంపడు. పోయి రాజుయొక్క పాదములమీద పడి మన్నింప వలయునని యడుగవలయును. చంపకపోయిన మానె, రాజు విహరించినంతసేపు దాగియుండి తరువాత తప్పించుకొని పోవచ్చు నన్న యూహయు వానికి తట్టలేదు. కరిపుట్టి వణకుచున్న దేహముతో చెమట పోయుచున్న దేహముతో పరమదుఃఖియై రాజు వద్దకు పరుగెత్తుకొని పోయి పాదములమీద పడెను. అతడు ఖడ్గమును తాను దాగిన చోటనే వదలిపెట్టెను. రాజు దిగ్భ్రాంతుడైపోయెను. "ఎవడువీడు? ఎవరో తన్ను వధించుటకు వత్తురని మానవర్మ చెప్పెను. వీడెవడో వచ్చి పాదాక్రాంతుడగు చున్నాడు. వీడీ తోటలోని కెట్లురాగలిగెను? వీనికి వచ్చిన యాపదయేమి?"

రాజు ‘నీ వెవ్వర వని యడిగెను. కరిపుట్టి యిట్లనెను, "ప్రభూ! నా కంఠ మా కత్తితో నఱకుము. నేనింకొక దానికితగను. నాకు నీచేతిలో చావే కావలయును. మఱి యేదియు నక్కఱలేదు. నాద్రోహమున కిదియే తగిన శిక్ష. నన్ను వెంటనే నఱకుము" అనెను రాజు తోటవెలికి పోయి మానవర్మను రమ్మని వార్తపెట్టెను.

## ౨

మానవర్మయు, రాజును, కరిపుట్టియు రహస్యముగా నొక గదిలో చేరిరి. రాణివాసపు పూదోటలోనికి మానవర్మను రమ్మని వార్త పెట్టుటయే పరిచారికల కబ్బురమయ్యెను. మానవర్మ రాజుయొక్క ప్రాణ మని యందఱకు తెలియును.

అంతిపురపు తోటలోనికి మానవర్మను రమ్మనుటచేత అంతిపురములో, రాజునకు మానవర్మ ప్రాణముల కంటె ఎక్కువ వాడని యనుకొన జొచ్చిరి. మానవర్మ వచ్చి యతనిని చూచెను. అప్పటినుండి సర్వాంతఃపుర స్త్రీలును పంపివేయబడిరి. ఎవ్వరికి తెలియకుండ ఈ ముగ్గురును రాజుయొక్క రహస్యమందిరమునకు పోయిరి. బయలుదేరు చుండగా మానవర్మ కరిపుట్టిని ఖడ్గ మెచ్చట దాచితి వని యడిగెను. అంతవఱకు ఖడ్గప్రసక్తి లేదు. కరిపుట్టి నిలువున నీరై మానవర్మవంక దిగ్భ్రాంతుడై చూచెను. ఒక నిమేష మట్లుచూచి తోటలోనికి పోయి తాను దాగియున్న చోటునుండి ఖడ్గమును తెచ్చెను. తెచ్చి రాజు పాదములయం దుంచెను. రాజు నివ్వెఱపోయెను.

రహస్యమందిరములో మానవర్మ కరిపుట్టిని తనకథయంతయు జెప్పుమనెను. కరిపుట్టి పూస గ్రుచ్చినట్లు చెప్పెను. కావిగుడ్డ లే వృద్ధునింట దొఱికినవో తాను వానికొడుకునని, యొక సన్యాసి తనకు రాజుమీద కోపము తెప్పించెనని, కాని రాజుగారి వంక చూచినతోడనే తననెత్తురులో లీనమైయున్న రాజభక్తి బయటకువచ్చి కత్తినివదలి రాజుపాదములపయి పడ జేసినదని, రాజు తన్ను వధించుట తప్ప తన బ్రదుకునకు నిష్కృతి లేదనియు ఎన్నెన్నో చెప్పెను. ఆ సన్యాసి పేరడుగగా అతని పేరు తనకు తెలియదని చెప్పెను. ఆఱునెలల స్నేహములో అతడు తనకు తనపేరు చెప్పలేదని చెప్పెను. మానవర్మ యిట్లనెను- "మహామల్లుడా! ఆ పురుషుడు మన కోటలోనివాడు. కోటలోని యానుపానులు తెలిసినవాడు, కోటలో నుండియే ఖడ్గము నితని కందించ గలవాడు. ఒకవేళ రాజ వంశీయుడైనచో కావచ్చును. కరిపుట్టి పేదవాడు. ఉద్యోగము పోయినవాడు, నిష్కారణముగా శిక్షింపబడినవాడు ఉద్వేగము కలవాడైనను, యథార్థమైన యుద్వేగము కలవాడు. తనరాజును చూచినంతనే వానికి లోనుండి రాజభక్తి పొంగివచ్చిన దనగా సహజముగా రాజభక్తి కలవాడు. ఇతరుడైన దుష్టుని మాటలకు లొంగిపోయెడివాడు ఆ మాత్రమే యితని దోషము" ఈ మాటలు విని కరిపుట్టికి తన జీవితము మీద మఱల నాశ కలిగెను ఇట్లనెను- "మహారాజా! ఈ మహానుభావుడు నన్ను తమరు క్షమించుటకు పునాదులు వేయుచున్నాడు. నారాజు చేతిలో నేను చనిపోయినగాని నాకు పాపనిష్కృతి లేదు తమరి చేతిలో చనిపోయినచో నాకు స్వర్గలోకము వచ్చును మీరు చంపనిచో నేను నిరాహారదీక్ష పూని చనిపోయెదను. ప్రభూ! నన్నురి తీయించవద్దు. తలారులచేత తల నరికించవద్దు. తమరే నన్ను కత్తితో పొడిచి చంపవలయును "-అపుడు మానవర్మ "ఓయీ! మహారాజా నట్లు కోరరాదు. నీవు కుఱ్ఱవాడవు నీకు తెలియదు నీవు నిజముగా మహారాజు చేతిలో మరణము కోరితివేని చక్కని యవకాశమును పాడుచేసికొంటివి. ఆ కత్తిపుచ్చుకొని రాజుగారిమీదికి వెళ్ళినచో నిన్ను మహారాజప్పుడే వధించెడివాడు. ఇప్పుడాయవకాశము తీరినది. మహారాజుతో కత్తియుద్ధము చేయగలవా, నీవు? సరే. ఆ పంపించినవా డెంత తెలివికలవాడు? మహారాజుతో గాదు. నాతో కత్తియుద్ధము చేయుము! కత్తి యుద్ధములో నీవు నేరుపుకలవాడవో, దొంగగా రాజును సంహరించుటకు వచ్చినవాడవో తెలిసికొనెదను." కరిపుట్టి "ప్రభూ! నాకు కత్తివిద్య

చేతనగును. మహాబలిపురములో నున్న సైనికులలో ఖడ్గవిద్యలో నా యంతటివాడు లేడు." **మానవర్మ**- "మరి పూదోటలో రాజు కత్తిలేకుండ తిరుగునుగదా! కత్తిలేని రాజుమీదబడి వధించుటకా వచ్చితివి?"

**కరిపుట్టి**-"స్వామీ! మహారాజువొద్ద నిత్యము ఖడ్గముండుననియే యనుకొంటిని. ధర్మాధిరాజు వొద్ద ఖడ్గమే లేనిచో నేను వారి జోలికే పోయెడివాడను గాను. ఖడ్గముతో తొలుతనే యెదిరించెడివాడను కాను. 'మహారాజా! నా దౌర్భాగ్యజీవిత మిట్టిదనది. ఇది యధర్మము! మీరు ధర్మమూర్తులు. ఇట్లుచేయుట న్యాయమా?' అని మొదట నడుగవెంచితిని. దానికి రాజు సమాధానము చెప్పనిచో అప్పుడు కత్తియుద్ధము చేయుదు ననుకొంటిని. చక్రవర్తి పాదములే సాక్షిగా నిది చెప్పుచుంటిని. నే నిట్లడిగెదనని చెప్పగా ఆ సన్యాసి 'కాదు. మాటలతో పనిలేదు. వధించవలయు' నని చెప్పెను. నేనతనితో నట్లే యంటినిగాని మనస్సులో నే ననుకొన్నట్లే చేయదలచితిని. నా కిప్పు డింకొక యూహ తోచుచున్నది. మహారాజుగారి ముఖము చూచినంతనే సర్వజనులకు శరీరము నిస్సారమై పోవును. ఆ ప్రభువు నెదిరించుట యెట్లు? ఎదిరించి యుద్ధముచేయుట యెట్లు!"

**మానవర్మ**- "నీవు నిజముగా కత్తియుద్ధములో నేర్పరివి కావని నేననుకొనుచున్నాను. నీకు రాజదండన మెట్లును తప్పదు. ఆ దండన లోని తీవ్రతను తప్పించుకొనుట కిట్లుచెప్పుచున్నావు". **కరిపుట్టి**- "ప్రభూ! నాకు కొంతవిద్య చేతనగును. నేనుహింసవధను చేసెడివాడను కాను. నన్ను పరీక్షింపదలచినచో పరీక్షింపవచ్చును."

మానవర్మ ప్రక్కనున్న గదిలోనికి వానిని తీసుకొనిపోయి వానిచేతికి ఖడ్గమిచ్చి తాను ఖడ్గమును చేబూని నిలుచుండెను. వానితో కత్తియుద్ధము చేయ నారంభించెను. వాడల్పుడని, తాను తనకు దెబ్బ తగులకుండచూచుకొనుటయేతప్ప దనలోని నేర్పు చూపించ నక్కఱలేదని మానవర్మ యనుకొనెను. మానవర్మ కతనిచొఱవ తట్టుకొనుట కష్టమయ్యెను. అతడు విచిత్రముగా దూకుచు, వొడ్డుకొనుచు, వంగుచు, ఎగురుచు విజృంభించెను. "వీడు నన్ను చంపుటకు ప్రయత్నించుచున్నా" డని మానవర్మయనుకొనెను. కరిపుట్టి కొట్టిన యొకదెబ్బలో మానవర్మకు తప్పుకొనుటకు సాధ్యము కాకపోయెను. వెనుకగోడ యడ్డము వచ్చెను. కరిపుట్టి మానవర్మ బుజము మీద కొట్టిన యా దెబ్బ తగులుచున్నదని తెలిసి కత్తిని తేల్చివేసెను. వెంటనే కత్తిని పాఱవేసి మానవర్మ పాదములపై పడెను, "ప్రభూ! నా ముందీ మాత్రము నిలువగలవాడు మహారాజు సైన్యములో లేడు. తమరు రాజున కంగరక్షకులు. రాజున కంగరక్షకులుగా నుండుటకు తమరే తగుదురు. నేను నావిద్య చూపించుటకు తగినంత యుత్సాహము తెచ్చుకొంటిని. తమరు నావిద్యను చూడవలయునని మాత్రమే నిలుచుండితిరి. అందుచేత నిట్లయినది. తమరు విజృంభించినచో నావంటివారు పదిమందియు తమ ముందు నిలువలేరని నేను గ్రహించితిని!"

అంత నిద్దఱును మహారాజ సమక్షమునకు పోయిరి. కవచములేని తెల్లనిచొక్కాగం మానవర్మ బుజముమీద గొంచెము గాయమునుండి నెత్తురువచ్చి యెఱ్ఱగా గనబడుచుండెను. రాజునకు మానవర్మ బుజము మీద నెత్తురు చూచినంతనే కోపము వచ్చెను. తాను చేతిలో కత్తి తీసికొని కరిపుట్టని సంహరించబోయెను. మానవర్మ యడ్డమువచ్చి "మహామల్లుడా! ఇతడు గొప్పవీరుడు. నిజముగా మంచివాడు. అతడు నన్నేదియైన చేయదలచినచో ఈ గాయము దీనికంటె పది రెట్లుండెడిది. ఇతడు ఖడ్గవిద్య తెలిసినవాడే! అతనిని పరీక్షచేయనెంచితిని. ఇతడు వధచేసెడివాడు కాడు. ఆ సంగతి తెలిసికొంటిని. ఇతడు చేతిలో చిక్కినవాడు. వీని నేమైన చేయవచ్చును. ఆ సన్యాసి యెవరో తెలిసికొనవలయును. ఇతనికి ఖడ్గమిచ్చినవా రెవరో తెలిసికొనవలయును."

**రాజా** – "గోవిందవర్మయై యుండవలయును." **కరిపుట్టి** – "మహారాజా! గోవిందవర్మయా? అతడే కావిగుడ్డలు నా తండ్రియింటిలో వదలిపెట్టి పోయినవాడు. అతడు కనుపించునేమో వధించవలయునని నేను బయలుదేరితిని. అతడు నా కింతవఱకు కనిపించలేదు. **మానవర్మ**– "నిన్ను ఈ దుష్టపు పనికి నియోగించిన సన్యాసియే గోవిందవర్మ యైనచో నీ వేమి చేసెదవు?" **కరిపుట్టి**– "ప్రభూ! ఆయన గోవిందవర్మ కాడు. ఆయన చాలపండితుడు. ధర్మాభిమాని, పేదవా రన్నచో దయగలవాడు." **మానవర్మ** – "నిన్ను రాజవధమునకు ప్రోత్సహించుట కత డట్లభినయించెనేమో?" **కరిపుట్టి**– "ప్రభూ! అతడు తమయంతటి ఖడ్గవిద్యానిపుణుడు గానిచో నేను వానిని వధియించెదను." **మానవర్మ**– "నిన్ను మహారాజాచెఱలో పెట్టును. నీకు విడుదల లేదు. నీ వాయనతో యుద్ధమును చేయవు" అని కరిపుట్టిని తన వెంట తీసికొని పోయెను. వాని నంతఃపుర భటుల కప్పజెప్పెను. కోటలో చెఱసాల యున్నది. కోటలో జరిగిన ద్రోహమునకు కోటలోనే శిక్షింతురు. అది బయటకు పోదు. ఆ ద్రోహులను కోటలోనే యుంతురు. అవి రెండు చెఱసాలలు. అంతఃపురద్రోహుల నొక చెఱసాలలో నుంతురు. తదితరుల నింకొకదానిలో నుంతురు. కరిపుట్టి నా రెండవదానిలో బంధించిరి. అప్పటికే చాల ప్రొద్దుపోయెను. మహారా జెప్పుడును జాము ప్రొద్దుపోయిన తరువాత బయట నుండడు. మానవర్మ ప్రభువునొద్ద సెలవు తీసికొని వెడలిపోయెను.

మఱునాటి ప్రొద్దున రాజకార్యములైపోయిన తరువాత మహారాజు మానవర్మను చూచి వాని నేమి చేసితి వనెను. మానవర్మ చెప్పెను. **రాజా**– "అది గోవిందవర్మ యగునో కాదో నిర్ణయింపవలయునుగదా!" **మానవర్మ**– "గోవిందవర్మ యీసారి కోటలోనికి వచ్చినంతనే యతనిని నిగ్రహించుట కేర్పాట్లు చేసితిని". **మహారాజు**– "గోవిందవర్మకు కొడుకున్నాడు ఏడాది పిల్లవాడు. అతని కాదిత్యవర్మ యని పేరు పెట్టితిమి నామకరణ మహోత్సవమునకు మేము వెళ్ళితిమి. నీవు రాలేదు" **మానవర్మ**– "మహామల్లుడా! రాజవంశమునకు కళంకము రానీయను" రాజు నవ్వెను.

గోవిందవర్మ కరిపుట్టి తిరిగివచ్చునని మఱునాటి ప్రొద్దుటికి తాను వాని యింటికి పోయెను. మంచములో పడియున్న వృద్ధుడు గోవిందవర్మయొక్క

కంఠస్వరమును గుర్తుపట్టెను. "ఏమయ్యా! నీవా, కావిగుడ్డలు నాయింటిలో వదలిపెట్టి పోయినది?" యని యడిగెను. గోవిందవర్మ తాను కాదని చెప్పెను. వృద్ధుడు " నా కొడు కెచ్చటికి బోయెనో? నిన్న ప్రొద్దున పోయెను. రాలేదు" అని యేడ్వ వారంభించెను. గోవిందవర్మ మఱికొంచెము సేపటిలో వచ్చునని వెడలిపోయెను. మఱునాటి సాయంతనమునఱకు కరిపుట్టి రాలేదు. అతనిని పట్టుకొని చెఱయం దుంచిరన్ని యూహ గోవిందవర్మకు రాలేదు. అతనిని వధించియుందురనియే తలచెను. అతడు వధింపబడినచో తన కేమియునష్టములేదు. బ్రదికి యుండినను తానెవరో కరిపుట్టికి తెలియదుకదా! దీనికి హేతువు తానని యెవ్వరికిని తెలియదు. సర్వమానవుల యూహయు తమ కనుకూలముగా ప్రసరించుచుండును. ఏట్లైనను మంచిదని గోవిందవర్మ పదునేను దినములు కోటవైపునకు పోలేదు. కరిపుట్టిని చెఱలో పెట్టుట యెంత రహస్యముగా జరిగిన దనగా ఈ సంగతి యంతఃపురములో కూడ ఎవ్వరికి తెలియదు. ఏ దాసి గోవిందవర్మ యొక్క ప్రథమ పరిచిత, ఖడ్గమును తెచ్చి యిచ్చెనో యా దాసికికూడ ఏమియు తెలియదు ఆ ఖడ్గ మేమైనది? ఆతడేమయినాడు? మొదలైన విషయము లామెకు తెలియక యా పురుషుడు పచ్చకప్పురమువలె గాలిలో ఆరిపోయినా డనిపించెను. మానవర్మ యా నాటి యర్ధరాత్రిమున మహారాజావద్ద ననుజ్ఞతీసికొని యా తోటలోనికి పోయియా బొమ్మలబుట్ట తగులబెట్టెను. బొమ్మల నన్నింటిని జామునేపు కూర్చుండి చిదుకగొట్టి యొక గోయి త్రవ్వి దానిలో ఈ ముక్కలను బూదినిబోసి గోయిపూడ్చి పైని బచ్చికపెళ్ళలు పెట్టెను అంతఃపురస్త్రీలు తోటలోనికి పోయి విహరింతురు. వారి కే తట్టు కనిపించరాదు.

గోవిందవర్మ పట్టణములో కరిపుట్టి కోసము ప్రతీక్షించు చుండును. మహారాజు చనిపోలేదన్న విషయము ధ్రువము. వింధమన్నను కరిపుట్టి ప్రసక్తి లేదు అతడు తాను భద్రముగా నుంటి ననుకొనెను. పదిదినములైన తరువాత మానవర్మ కరిపుట్టిని తీసికొనిపోయి యొక మిద్దెమీద ప్రవేశపెట్టెను. ఆ మిద్దె మిక్కిలి చిన్నది. దానికొక గవాక్షము కలదు, గవాక్ష మనగా గవాక్షము! అనగా చిన్నది. అర్ధరాత్రమునందు వానిని తీసికొనివెళ్ళి యందు ప్రవేశపెట్టెను. మఱునాడు సాయంకాలమున కొందఱు స్త్రీ లాదారిని పోదురు. వారిలో పదిమంది, పదిమందియు పదిరంగుల చీరలు ధరింతురు. తెలుపు, గోధుమరంగు, కావిరంగు, ఎఱుపు, నలుపు,ఊదా, బచ్చలిపండురంగు, పసుపు, ఆకుపచ్చ, నీలిరంగు. ఈ రంగుల చీరలలోతనకు ఖడ్గమిచ్చిన స్త్రీ యే రంగు చీర కట్టినదో కరిపుట్టి గుర్తుపట్టవలయును. అంతిపురములో నా ప్రాంతములకు పోదగిన దాసీవాండ్రు సుమారు వందమంది కలరు అదియేదో యుత్సవము అనిచెప్పి రాజు పదిదినములా యుత్సవములు జరుగుననియు రోజున కొక పదిమంది పరిచారికలిట్టి వేషములతో ఆదారివెంట పూవులు చల్లికొనుచు వచ్చి రాజదర్శనము చేసి పోవలయుననియు ఆజ్ఞాపించెను

ఐదవనాడు, "కావిచీరకట్టిన స్త్రీ తనకు ఖడ్గమిచ్చినద"ని కరిపుట్టి మానవర్మకు చెప్పెను. తక్కిన యైదురోజుల యుత్సవము మానివేయబడెను ఆ యుత్సవ

మెందులకో, తక్కిన యెదురోజు లెందుకు మానివేయబడినదో యెవ్వరికిని తెలియలేదు. కురంగికి మాత్రము అనుమానము కలిగెను. తానువచ్చిన మఱునాడే యిది మానివేయబడుటకు కురంగి ఈ ఐదుదినములు ప్రాణములు గుప్పిలిలో పెట్టుకొని బ్రదుకుచున్నది ఆదగ్గరలోనున్నగవాక్షమునుండి యెవరో చూచుచున్న ట్లామె బెదరుకన్నులకు స్ఫురించెను ఆ మొగము ముచ్చెవానిది కాదు. మఱునాడు కురంగి బంధింపబడి కరిపుట్టి యున్న కొట్టులో నుంచబడెను.

## ౭

మఱునాడు కురంగిని వదలిపెట్టిరి. ఎందుకు పట్టుకొనిరో యెందుకు వదలిపెట్టిరో యెవ్వరికిని తెలియదు. ఆ యొక్క రాత్రియు చెఱలో ఆమె కరిపుట్టితో కలిసియుండెను. అతడామె నెఱుగును. ఆమె యతని నెఱుగదు ఆ చెఱలో రాత్రులందు దీపముపెట్టరు. కాని యా నాడు దీపము పెట్టిరి. అతడామెను జూచి నీవేకదా నాకు కత్తినిచ్చితి వనెను. ఆమె నిన్ను నేనెఱుగ ననగా, ముచ్చెవాని వేషముతో బొమ్మలు తెచ్చినది నేనే, నన్ను నీ విపుడు గుర్తుపట్టలేవనెను ఆమె నివ్వెరపోయెను కాని సంబాళించుకొని "నీ వనుచున్నది నాకు తెలియుటలేదు ఏ ముచ్చెవానికిని నేను ఖడ్గమీయలేదు."-అనెను. ఆమె లోకజ్ఞురాలు రాజాంతఃపురము లోని మెలకువలు తెలిసినది అతని కింత గడుసుదనము తెలియదు తానే పొఱపాటు పడితినేమో యనుకొనెను తరువాత ప్రసంగములో నామె యేమి చెప్పలేదు అతడెంత ప్రయత్నించినను నామె యేమీయలేదు ఆమె నిశ్చయముగా కాదని యతడు దృఢపఱచుకొనెను మఱునాడీమె కాదని మానవర్మతో చెప్పెను మానవర్మ తానును నమ్మినట్లే నటించి యామెను వదలి పెట్టించెను ఆమె యొక్క గోవిందవర్మ వలననే పట్టుకొన బడవలయును ఆమె చెఱసాలకు లోన నుండరాదు ఆమెవలన గోవింద వర్మయు, గోవిందవర్మవలన నామెయు పట్టుబడవలయును. తరువాత నైదు దినములకు గాని గోవిందవర్మ కోటలోనికి రాలేదు వచ్చిన గోవిందవర్మ నాల్గు దినములు తన యిల్లు వదలిపెట్టి పోలేదు దివారాత్రము లతనిని రాజభటులు దూరమునుండి తెలియనట్లు చూచుచునే యుండిరి అతనిని కోటలోనుండి బయటకు పోనీయరాదు అంతవఱకే రాజాజ్ఞ గోవిందవర్మ కూడ తనమీద నేమియులేదని క్రమముగా విశ్వసింపసాగెను. అత డొకనాటి యర్ధరాత్రమున ఇంటినుండి బయలుదేరెను. అది చీకటిరాత్రి అతడును తెలియకుండ దొడ్డివైపున నుండి బయలుదేరెను. అచట నొక ముసలిది యతనిని పలుకరించెను అతడు ముసలిది తనమీద ప్రయోగింపబడినదని తెలిసికొనలేదు అతడు కురంగి యింటికి పోయెను. పక్షి యాడుటలేదు కురంగి యింటికి ప్రక్క యింటిలో నొక ముసలిది లేచి యెవరని గద్దించెను. గోవిందవర్మ వెంటనే స్మృతి తెచ్చికొనెను అక్కడ ముసలిది ఇక్కడ ముసలిది. ఇది యేదో వార్త నందించినట్లున్నది అతడు వెనుదిరిగి కురంగి యింటిలోనికి పోకుండగనే మరల తన గృహమునకు పోయెను మఱునాడు మానవర్మ తాను మిక్కిలి వివేకవంతునితో వ్యవహరించవలయునని తెలిసికొనెను. అతని

కేమియు పాలుపోలేదు. ఆ మానవర్మ కేమియు తోచక గోవిందవర్మను కోటలో నుండి వెళ్ళదలచినచో అభ్యంతరపెట్టవద్దని యాజ్ఞాపించెను.

ఘటకములో మానవర్మ యొక విద్యార్థి నెఱుగును. అతడు బౌద్ధభిక్షుకులను చిత్రముగా అనుకరించును. అతనికి శిరోముండనము చేసి కావిగుడ్డలు కట్టినచో అతని మాటలు, అతని నడకయు; అతని చూపులును సర్వము శాక్యభిక్షువు వలె నుండును. శాక్యభిక్షువు లప్పుడపుడు కోటలోనికి కూడ వచ్చి బిచ్చ మడుగుట కలదు. మానవర్మ వార్తపంపించి వాని చేత నా వేసము వేయించి కోటలోనికి రప్పించి గోవిందవర్మ యింటికి పంపించి రహస్యముగా, "కరిపుట్టి యింటికి వచ్చినాడు మీరే గోవింద వర్మయని తెలిసినదట. మిమ్ము తన యింటికి రమ్మని చెప్పు"మని చెప్పించినాడు. గోవిందవర్మ కరిపుట్టి యేమయ్యెనో తెలియక గుండెలో మథనపడుచున్న వాడు దీనికి లొంగెను. ఆరాత్రి యతడు కరిపుట్టి యింటికి పోయెను ఇతడు పోవువేళ కచ్చట నొక బైరాగి యుండెను. ఆ బైరాగి ముసలివానితో మాటాడుచుండెను. గోవిందవర్మ పోగానే ముసలివాడు, "అయ్యా! మీరా! నా కొడుకు కిన్నాళ్ళకి వచ్చెను" అని యేడ్చుచు జెప్పెను. ఆ బైరాగి "యిప్పుడే బయటకు వెళ్ళినాడు తమరు వచ్చినచో నుండుమన్నా"డనెను గోవిందవర్మకు నమ్ముటకు వీలుండెను నమ్మక తప్పకుండెను బైరాగి సన్నగొంతుతో నిట్లనెను- "ఈ ముసలి వానికి చెముడు వచ్చినది మనము నెమ్మదిగా మాటాడినచో వినపడదు పాపము కరిపుట్టి చాల శ్రమపడెను కోటలో అతనికి కత్తి యందలేదట అతడు ప్రొద్దుపోవు వఱకు కోటలో దాగియుండి యేమి చేయవలయునో యెఱుగక అర్ధరాత్రమున కోటగోడ దూకి బైటనున్న కందకములో పడెను చావవలసినవాడు బ్రదికెను. ఎట్లో యీది యొడ్డునకు వచ్చి స్మృతిలేక పడియుండెను నేనతనిని జూచి బుజము మీద వేసికొని మా బైరాగుల మఠమునకు తీసికొని పోయితిని అతడు తెప్పరిలుటకు నాలుగయిదు దినములు పట్టినది. మీ కథయంతయు మాకు జెప్పినాడు మేము బైరాగులము కాము, కాపాలికులము. కాపాలికులను రాజభటులు హింసించుట చేత బైరాగులుగా తిరుగుచున్నాము కరిపుట్టి చెప్పిన యా పురుషుడు మీరే నని యీ వృద్ధుడు చెప్పెడి వఱకు నాకుగాని, కరిపుట్టికి గాని తెలియలేదు ఈ ప్రయత్నము వ్యర్థమాయెనది. తమవంటి రాజవంశీయులే మా పక్షమున నున్నచో మే మెంతైన చేయగలము. కరిపుట్టి వచ్చును ఈ ముసలివానికి ప్రొద్దుటి నుండియు ఆహారము లేదు పొరుగు వారేమైన తెచ్చి పెట్టినచో తెచ్చి పెట్టినట్లు, లేనిచో లేనట్లు-ఇట్లు బాధపడుచున్నాడు తండ్రి తినుట కేదైనను సరే సాధించుకొని వత్తు నని యీ అర్ధరాత్రమున బయలుదేరి వెళ్ళినాడు ప్రొద్దున మీయొద్దకు వచ్చిన శాక్య భిక్షువు బౌద్ధుడు కాడు మాయన్న కొడుకు. వాడు బౌద్ధుల ననుకరించును వెక్కిరించును" అని యా బైరాగి చెప్పుచుండగా, అతని కన్నులు వాని ముఖావయవముల కదలిక, యతడు మాట మాటాడుటలోని పద్ధతి నమ్మకతప్పనట్లుండెను. రెండు మూడు గడియలైన తరువాత

గోవిందవర్మకు నమ్మకము గలిగెను. "ఆ కురంగి మాఱిపోయినది" యనెను. బైరాగి కురంగి యెవరని యెఱుగ నట్లడిగెను. గోవిందవర్మ మాటాడలేదు. బైరాగి "కురంగి యెవరు బాబూ? కరిపుట్టికి కత్తి తెచ్చి యిత్తు నన్నదా? అయ్యో! ఇట్టిపని స్త్రీల కప్ప జెప్పుదురా? కత్తి యెవరో యిచ్చుట యెందులకు? ఆ తోటకు సూటిగా కందక మివతలి నుండి రాత్రిపూట కోటలోనికి తోటలో పడునట్లు ఖడ్గమును విసరవచ్చును. నే నాపని చేయగలుగుదును. లోపలివాడు పడిన ఖడ్గమును వెదకికొనినచో జాలును. మాకు నీ సాహాయ్యమున్నచో ఈసారి మేము ప్రయత్నము చేయుదుము. కరిపుట్టిని రానిమ్ము. మే మెటువంటివారమో యతడే నీతో జెప్పగండు." గోవిందవర్మ మఱియు నమ్మెను. బైరాగి కరిపుట్టి తిరిగి వచ్చుచున్నాడేమో యని రెండు మూడుసార్లు బయటకు పోయెను. గోవిందవర్మకు నమ్మక తప్పలేదు. అతడిట్లనెను- "నేను కరిపుట్టి చనిపోయినాడనుకొన్నాను. కోటలో నతనిని వధించి వారనుకొన్నాను. పాపము బ్రదికియున్నాడు." బైరాగి "బ్రతికియుండుట యేమి, ఆ యధర్మాత్ముడైన రాజును వధించుటకు మఱల నెట్టి సాహసమైనను చేయుదు ననుచున్నాడు. నీవే గోవిందవర్మ యని తెలిపినది. ఇందాక తండ్రి చెప్పినాడు. అతడాశ్చర్యపోయినాడు. కానిచో కోటలోని రహస్యమిట్లెవరికి తెలియుననన్నాడు" గోవిందవర్మ- "నేను గోవిందవర్మనని తెలియగా నతనికి కోపము రాలేదా?" బైరాగి "కోపమెందుకు? సంతోషించినాడే" యనెను. గోవిందవర్మ యాలోచించి "కరిపుట్టి తొలివర్తమానము మఱచిపోయి నాడనుకొందును' అనుకొనెను. అతనికి విసుగు జనించెను. "ఓయీ! నేను చాల నమ్మితిని. ఎంత పథకము వేసితిని అంతయు ఆ కురంగి మూలముగా వృథాయైనది." బైరాగి "ఇప్పుడు మించిపోయిన దేమియు లేదు మేము నలుగురమువ్నాము. పూర్వ మొక్క కరిపుట్టియే. ఇప్పుడైదుగురము. ఇంక మీ రే యెత్తు నెత్తినను తిరుగులేకుండ కొనసాగింతుము. ఇంకను- కరిపుట్టి రాలేదు. నేనుపోవలసియున్నది" యని ముసలివానితో బిగ్గఱగా "అయ్యా! సెలవు తీసికొందును నేను రేపు సాయంతనము వత్తునని మీ పిల్లవానితో జెప్పు" మని బయలుదేర బోయెను. గోవిందవర్మ తానును బయలుదేఱెను అతడుకూడ కరిపుట్టిని మఱునాడు చూతు ననెను. ఇద్దఱును గలిసి పోయిరి. బైరాగి వెంటనే గోవిందవర్మ పోవుచుండెను. దారిలో బైరాగి "అయ్యా! నే నిచ్చట నుండి మా మఠమునకు పోయెదను. రేపు సాయంతనము తమరు కూడ కరిపుట్టి యింటికి వచ్చినచో అచట గలిసికొందము. తమరు కోటలోనికే పోవుచున్నారా"యనియడిగెను. గోవిందవర్మ కోట లోనికే పోవుచున్నా ననెను. బైరాగి "తమతో నేను కోటదాక వచ్చెదను. ఈ యర్ధరాత్రమున మీరొక్కరు పోవుటయేల? అయినను ఇప్పుడు కోటతలుపులు తెఱువరు. తమ కభ్యంతరము లేనిచో మా మఠమునకు వచ్చినచో అచట నిద్రించవచ్చు" ననెను గోవిందవర్మ యతని వెంట పడిపోయెను. అతని మఠము దూరముగా తిరిగివచ్చినను కోటకు దగ్గఱలోననే యున్నది. అది

పెద్దభవనము. పాడుపడినయిల్లు వలె కనిపించుచున్నది. ఇంటికి జేరకముందు బైరాగి యిట్లనెను- "ఒకవేళ కరిపుట్టి మా మఠమునకు తిరిగివచ్చెనేమో? ఈ యర్ధరాత్రమున ఏమియు దొరకక, మఠములో నెప్పుడు నేదియో తినుబండారము లుండియుండును గనుక వచ్చి యుండవచ్చును. లేనిచో గడియలో తిరిగి వత్తునన్నవాడు తన యింటి కంతసేపేల రాలేదు?"

ఇద్దఱును మఠములోనికి బోయిరి. మఠములో నెవ్వరును లేరు. ముువ్వురు బైరాగు లచ్చట బండుకొని నిద్రించుచుండిరి. కరిపుట్టి తానచట నుండెను. చిన్నదీపము నొకదానిని పుచ్చుకొని దేనినో వెదకు చుండెను. ముందు బైరాగిని చూచెను. కరిపుట్టి యిట్లనెను. "ఏమండీ! ఏ దుకాణమును తెఱచిలేదు. ఇక్కడ నేమైనను దొఱకునేమోయని వచ్చితిని. ఇచట దీపమే లేదు. నేను వచ్చి వెలిగించితిని" అనుచుండగా, బైరాగి, "వీరిని జూచితివా" యనెను. కరిపుట్టి గోవిందవర్మను చూచి యాశ్చర్యపోయినట్లు నటించి పాదములమీద పడి నమస్కరించి "గురూ! మీరా గోవిందవర్మ! నాకిన్నాళ్ళు తెలియనట్లు నటించితిరి. నాకు మీమీద కోప మెప్పుడో పోయినది. ఎవరా కత్తి తెచ్చి యిత్తునన్న వారు? నేను వృథా శ్రమపడితిని. రాజును చూచుచు చూచుచు వదలి పెట్టవలసివచ్చెను" అని దైన్యము, కోపము, నిస్సారత వెలువఱచెను. గోవిందవర్మ మొగములో నవ్వు వచ్చెను. "ఓయీ! అన్ని ప్రయత్నములు ఫలవంతము లగునా? ఇప్పుడు నీతో బాటు మఱి నలుగురున్నారు. ఈసారి మన ప్రయత్నము వ్యర్థము కాదు. కురంగిని నమ్మి చెడిపోయితిని. ఈసారి కురంగి యొక్క ప్రసక్తియే లేదనెను. ముగ్గురుసన్యాసులును నెమ్మదిగా లేచి కూర్చుండిరి. అందులో నొకనిని గోవిందవర్మ చూచెను. అతడు మానవర్మ. మానవర్మను గోవిందవర్మ యెఱుగును. వెంటనే గోవిందవర్మకు తెలిసిపోయెను. కాని కరిపుట్టి యిక్కడ నెట్లుండెనో తెలియలేదు. అతడు కలవరపడుచుండెను. మానవర్మ యిట్లనెను- "అయ్యా! మీ కొక్కమాట చెప్పెదను. మిమ్ము బంధించు విషయము రాగా మహారాజాగారిట్లన్నారు. "అతని కొక కొడుకు కలడు. ఏడాది పిల్లవాడు. అతని కాదిత్యవర్మ యని నామకరణము మేమే చేసితిమని. అనగా నర్థ మేమియో తెలియునా? తమరి ప్రాణములు రక్షించవలయునని... ఆ రాజును వధించవలయునని మీ ప్రయత్నము. నేను బ్రదికియుండగా మీరు రాజుయొక్క కేశము చిట్టచివర ముట్టుకొనలేరు. మీరు పాటయొక్క మాటలలో పెట్టిన ప్రయోగమును గుర్తుపట్టినది మానవర్మ! అది గుర్తుపట్టిన వాడెంతవాడో వాని కెదురుగా ప్రవర్తించుట యెట్టిదో మీకు తెలియక పోవుటకు నేను విచారపడుచున్నాను. ఆనాటి సాయంకాలము రాజువధకు ప్రయత్నము జరుగుచున్నదని మానవర్మకు తెలియును. ఎవ్వడు నంతిపురపు పూదోట లోనికి కత్తితోపోని రాజా వాడు కత్తితో వెళ్ళెను. మీ కరిపుట్టిని కనుగొనుడు. మీ రీ నాటినుండి కోటలో నుండి బయటకు పోరాదు."

వెంటనే నలుగురు బైరాగులును గోవిందవర్మ చుట్టును చేరిరి. వారి చేతులలో ఆయుధము లుండెను. కరిపుట్టి చేతికి మఱల శృంఖలములు వేయబడెను. అందఱును కలసి మఱల కోటలోనికి పోయిరి. చిన్న త్రోవ గుండ పోయిరి. కత్తి పిడితో

మూడుసార్లు ద్వారము కొట్టగా అది తెరువబడెను. కరిపుట్టిని చెఱసాలలో వేసిరి. గోవిందవర్మ నతని యింటివద్ద నుంచిరి.

గోవిందవర్మ తనలో తాను లేడు. అతని పై ప్రాణములు పైన పోయెను. "ఔను, మహారాజే తనకొడుకునకు నామకరణము చేసెను, మానవర్మ తానెంత వాడనని చెప్పెనో నిజముగా నంతవాడు. లేనిచో ఆ ప్రయోగము నెట్లుగుర్తుపట్టగలడు? ఆపాట నెట్లువినెను? ఎప్పుడు వినెను? కరిపుట్టి బ్రదికి యుండుట, అతనిని చెఱసాలలో నుంచుట యేమి? కరిపుట్టి యింటిలో ఈ నాటకమేమి? తా నెట్లు నమ్మెను? ఎవరు నమ్మరు? ఓహో! రాజనీతి! దేవతల రాజుకు వేయియే కన్నులు. మానవులైన రాజుల కన్నులకు సంఖ్యాపరిమితి లేదు. తా నేమి యగును? తనకు కరిపుట్టి యెదురు సాక్ష్య మిచ్చును. తనమాటలు నలుగురు రక్షకభటులు వినిరి. మానవర్మయే వినెను కురంగి నేమి చేసెనో? కురంగి తాను చెప్పినంతయు చేసినది దాని వలన తప్పులేదు. దానిని చెఱలో పెట్టలేదేమి? ఏమి జరిగినదో తెలిసికొనుటకు కూడ కోటలోపల వీలులేకుండెను. ఈ మానవర్మ యెవడు? వీడు సింహళద్వీపవాసి. అనగా రాక్షసుడు!" గోవిందవర్మకు తెల్లవాఱులు నిదురపట్టలేదు. తన్నేమి చేసెదరో తెలియదు.

మఱునాడు మానవర్మ మహారాజుతో నిట్లు చెప్పెను "మహామల్లుడా! కురంగి కత్తి యిచ్చినది గోవిందవర్మ యీ ప్రయత్నమంతయు చేసినవాడు తగిన సాక్ష్యమున్నది. నేనే యొక సాక్షిని. తరువాత మహారాజుల చిత్తము" మహారా జిట్లనెను- "గోవిందవర్మను రాజ్యమునుండి వెడలనడువ వలయును. కురంగి యొక్క శిరచ్ఛేదము చేయవలెను. కరిపుట్టికి మఱల సైనికోద్యోగమిచ్చి, వాని మీద ఎప్పుడును మరి యిద్దరు సైనికులను పరీక్షకులుగా నియమించవలయును. వాడెప్పుడును కంచి నగరమునకు రారాదు అంతకంటె పై పదవి రారాదు."

౬

అదియంతయు వెనుకటి కథ.

ఈ రీతిగా మానవర్మ రాజునకు మిక్కిలి ప్రియుడై యుండెను. రాజు మిక్కిలి సత్పురుషుడు స్వభావము తెలిసి శిక్షించెడివాడు లేనిచో కరిపుట్టికి మఱల నుద్యోగ మిచ్చునా? ఒక మహారాజ వంశములో అట్టి సత్పురుషుడు పుట్టుట వలననే యా వంశము నందు తరువాత కొందఱు దుష్టులు పుట్టినను రాజవంశము కొన్ని వందల యేండ్లు సాగును మానవర్మ రాజునకు ప్రాణప్రియుడు. అతని యందు రాజుయొక్క యభిప్రాయ మిట్లుండగా కొబ్బరి బొండములనీటి కథ జరిగెను. ఆ కథలో వారిద్ద అన్నదమ్ముల కంటె నెక్కువ యైరి అతడు యువరాజువంటి వా డైనాడు ఒకనాడు రా జిట్లనెను- "మిత్రుడా! నీవు వచ్చి నాలుగేండ్లయినది నీ భార్య మలయాలో నున్నది నీ వామెను వెంటనే తీసుకొని రమ్ము నీకును నాకును భేదము లేదుకదా! నా కెట్లు జరుగునో నీ కట్లు జరుగును నీ కిష్టమైనచో ఆమె రాణివాసములో

నుండును. కానిచో నీ కిష్టము వచ్చిన దాస దాసీ జనములను తీసికొనుము. మన రాజ్యమున నాల్గు రాష్ట్రము లున్నవి. మండరాష్ట్రము, వెంగోరాష్ట్రము, కర్మరాష్ట్రము, ద్రవిడరాష్ట్రము. వెంగోరాష్ట్ర మాంధ్రదేశము. నీ కాంధ్రపండితులు గురువులు. నీ కభిమతమైనచో ఈయే రాష్ట్రమునకైనను నిన్ను రాజప్రతినిధిగా పంపింతును. రాజప్రతినిధి యనగా సామంతుని వంటివాడని నీకు తెలియునుగదా! నీ యిష్టము వచ్చినది కోరికొని నీభార్యను తీసికొని రమ్ము"

మానవర్మ "మహాముల్లుడా! నాయందు తమకు గల ప్రేమ నే నెఱుగుదును. కాని నాకు రాష్ట్రాధిపత్యము వలదు. నేను సింహళ దేశస్థుడను. ఎప్పటికైన సింహళ దేశమునకు పోవలసినవాడను ఇక్కడ నాకు రాష్ట్రాధిపత్యమెందులకు? నే నిం దున్నన్ని దినములు తమ కంగరక్షకుడుగానే యుందును. తమ యనుజ్ఞ యైనచో నా భార్యను తీసికొనివత్తును. నాభార్య రాణివాసములో నుండుట న్యాయము కాదు. పలుమంది కీర్ష్యా కారణ మగును. మఱియు నామె పరదేశస్త్రీ. ఆమె వేషభాషలు, ఆచారములు భిన్నములుగా నుండును. ఇక్కడివారికి హాస్యభాజనములుగా నుండును. కనుక వేఱే సౌధములో నుండును" రాజు "నే నెప్పుడు పూర్వ మడుగలేదు. నీవు సింహళమునుండి పారిపోయివచ్చితివా? ఎందుకు పాఱిపోయి వచ్చితివి? నీవంటివాడు దోషము చేసి భయపడి వచ్చె ననుటకు వీలులేదు నే నెప్పుడు నిన్నడుగలేదు. చాలసార్లడుగవలె ననుకొంటిని - నీవంటి వా డొక దేశమునకు రాజైనచో ఆ దేశములో ధర్మ మెంత చక్కగా పరిపాలింపబడును? ఆ దేశ మెంత యభివృద్ధికి వచ్చునో? ఆ సింహళదేశీయులెంత దురదృష్టవంతులో, వారు నీవంటి వానిని రాజుగా నోచికొనలేదు. మహాపరిషత్తును పిలిచి వారిచేత వొప్పించి నీ కర్ధరాజ్య మిప్పించెదను నీవు రాజ్యము చేసికొనుము." మానవర్మ. "మహాముల్లుడా! నే నిదివఱకు తమ సద్గుణములకు, తమరికి నాయందు గల కృపకు మనస్సులో బానిసనై యున్నాను మఱియు అధికమైన దయ చూపించినచో మనుష్యుడైనవాడు బానిస యగుటకంటె తక్కువస్థితి యేమి పొందగలడు? నాయందు తమరికి ఎంత ప్రేమయున్నను నన్ను తమ యంగరక్షకునిగా నుంచుకొనుటయే నాకు చేసెడి మహోపకారము. తమ యేనుగు మీద నన్ను ప్రక్క గూర్చుండ బెట్టుకొనుట కంటె అధికమైన గౌరవ మేమి చేయవలయును?"

రాజు తల పంకించి "సరే, నీ భార్యను తీసికొనిరమ్ము. మలయాస్త్రీని వివాహ మెందుకు చేసికొంటివి?" యని యడుగగా మానవర్మ తన కథయంతయు చెప్పెను. రాజు విని యాలోచించెను మానవర్మతో ఏమియు నవలేదు. అతని భార్యను వెంటనే తీసికొని రమ్మని బలవంతపెట్టెను అతనికి వేఱే రాజభవన మొక దేర్పాటుచేసెను తగినంత గాలి దాని కనుసంధించి పూదోట, కేళకుళులు, రత్నకంబళములు, కుడ్యముల నిండ చిత్రములు, పదిమంది పరిచారికలు, నలుగురు సేవకులు, మహావైభవముగా నున్నది. రాజు మానవర్మను నాటనుండియే తన సౌధములో నివసించుమని చెప్పెను మానవర్మ తనభార్య వచ్చిన తరువాత నందు ప్రవేశింతు ననెను తరువాత నెలదినములకు సంపూదేవి వచ్చెను ఆమె వెంట మలయా

దేశీయులైన పదిమంది పరిచారకులును పదిమంది పరిచారికలును వచ్చిరి. మానవర్మ గృహ ప్రవేశము చేసెను. కోటలో పెద్ద యుత్సవము చేసిరి. మహారాణియు, అంతఃపుర స్త్రీలు నందఱు, కుటుంబములతో రాజవంశీయులును, భార్యలతో మహా మాత్రులును, ఘటకాచార్యులును వచ్చిరి. ఒకనాడు పెద్ద సంగీత సభ జరిగెను. పల్లవ రాజ్యములో మహాసంగీత విద్వాంసులుండిరి. నరసింహ వర్మయే గొప్ప గాయకుడు. పల్లవరాజు లందఱు పండితులును గాయకులును. సంఘాదేవి వెంట వచ్చిన స్త్రీలలో నొకర్తుక గాయని, పురుషులలో ఇద్దఱు వాద్యగాండ్రు. ఆమె మలయాదేశపు సంగీతము పాడెను. జనమందఱు సామాన్యులు నవ్విరి. పండితులు హర్షించిరి. సంగీత మెచ్చుట వెనను స్వరాశ్రయమే. భారతీయ సంగీతములోనను, ప్రత్యేకముగా పల్లవులవాటి సంగీతములోనను గాంధార స్వరము విశేషముగా కలిగిన రాగము లుండవు. గాంధారగ్రామము మానవులకు సాధ్యముగాదు. మధ్యమ గ్రామము, షడ్జగ్రామము విశేషముగాగల రాగములకే పల్లవ రాజ్యమున ప్రశస్తిమెండు. మలయా సంగీతములో గాంధారస్వరమువంటి స్వరమొకటున్నది. ఆ గాంధార గ్రామము విస్తరముగా జేసి రాగముల తోడి పాటలు వారు పాడిరి. పండితులు మిక్కిలి ప్రశంసించిరి. మఱియొకనాడు నాట్యములు పెట్టిరి. ప్రధానముగా భరతనాట్య మాడబడెను. మానవర్మ మనస్సులో నొక యూహ కలిగెను. అతడు గొడగూచి మేళమునకు కబురంపెను. ఆమేళము ప్రాణములు గుప్పిలిలో పెట్టుకొని వచ్చెను. వారి నందే యుండుడనియు మఱునాడు గొడగూచి నృత్యముండుననియు అందఱకు చెప్పెను. రాజాశ్చర్యపడి నవ్వెను. మానవర్మ యారాత్రి గోవిందవర్మ యింటికి పోయెను. ఆ కీర్తన వ్రాసి యందులో విషమాక్షరములను ప్రయోగము చేసిన మాటలను తీసివేసి తన పేర వ్రాసి పెట్టుమని యడిగెను. గోవిందవర్మ యిట్లనెను: "అయ్యా! మానవర్మగారూ! చచ్చిన పామునెందుకు జంపుదురు? నే నేదో బైరాగులతో బౌద్ధులతో కాపాలికులతో తిరిగి చెడిపోయితిని. నాకును పరమేశ్వరవర్మకు పడక నేను పిచ్చి వేషములు వేసితిని. మీ కరుణా విశేషమువలన రాజు నన్ను దేశమునుండి వెడలగొట్ట లేదు. నేను పిచ్చి వేషము లన్నియు వదలి వేసితిని. నాబిడ్డ యున్నాడు. వాని పెద్ద వానిని జేసికొనుటయే నాకిప్పుడు ప్రధానకర్తవ్యము. పైగా ఆ ప్రయోగ మొక్కసారియే పనిచేయును. ఆపాటలోని శక్తి యై పోయినది. గొడగూచిని మీ రొకసారి మాయింటికి తీసికొనిరండు. మీకాసంగతి చూపించెదను" అని తానే గొడగూచికి కబురంపెను. ఆమె రాగా ఆ పాటలో రాజు పేరు తీసివేసి రాజు పేరున్న ప్రతి స్థలమువందు తన పేరు పెట్టి తానామె కెదురుగా కూర్చుండి యాపాట నామె చేత నభినయింపచేసెను. గోవిందవర్మ కేమియు బాధకలుగలేదు. అతడు పడిపోలేదు. మానవర్మ యదియంతయు చూచెను. ఐనను దానిలోని విషమాక్షరము లేవియో చెప్పుమనెను. గోవిందవర్మ వానిని చెప్పెను. "మఱియింక నివి పనికిరావా!" యనెను. గోవిందవర్మ "పనికి వచ్చును. దానికి మఱల కొంత తంతు చేయవలయును. గ్రహణము పట్టిననాడు జిల్లేడాకు రసము ఒడలినిండ పూసికొని యుమ్మెత్తాకుల మీద కూర్చుండి శ్మశానములో అర్ధరాత్రమున ఈ పదిశబ్దములను ఒకొక్క దానిని వేయిసా

ర్లుచ్చరించినచో వానికి మఱల శక్తి వచ్చును. అప్పు డామాటలను వినియోగించి మన మెవరిమీద ప్రయోగము చేయ నెంచితిమో వానిమీద పాట వ్రాసి పదిదినములు మనుష్యులు నివసించని ప్రదేశమున "జ్వాలాగుంప" యను దేవతకు ప్రతిదినము హారతియు, నైవేద్యము చేయవలయును. ప్రతిదినమును నైవేద్యమునకు ఏదో యొక మాంసము కావలయును. సుర కావలయును. ఆమాంసమును సురయును ఏయాకు మీద పాట వ్రాయుదుమో ప్రతిదినము నా యాకునకు రాయుచుండ వలయును. ఇది పెద్దతంతు. ఆ జ్వాలాగుంప యను దేవత టిబెట్టు దేశములోని పామరబౌద్ధుల దేవత" అనగా, మానవర్మ తన కా ప్రయోగములు నేర్పెదవా యని యడిగెను. గోవిందవర్మ "ఛీ! ఛీ! తమవంటి సత్పురుషులు నేర్వవలసినవా యివి? మానవర్మగారూ! నామీద మీకింకను కోపముపోనిచో మఱల వానికి ప్రాణ ప్రతిష్ఠ చేసెదను ఒక నెలదినములు పట్టును. తరువాత గౌడగూచిని పిలిపింపుడు. ఇప్పుడు నాపేరు మార్చి యీపాట వ్రాసితిని గదా! ఈపాట నిట్లే విషవంతము చేయుదును. గౌడగూచి నెదురుగా కూర్చుండి నేనే పాడించెదను. చేయుమందురా" యనెను. మానవర్మ నవ్వి మహారాజాపేరుతో నున్న పాటను తా నెదురుగా కూర్చుండి గౌడగూచి చేత అభినయింపించెను. తనకేమియు జరుగలేదు. మానవర్మ యిట్లనెను. "గోవిందవర్మ గారూ! మీకును నాకును నేడు కాకున్నను మఱికొన్నాళ్ళకైన జబ్బు చేయును. మంచము పట్టుదుము. ఇద్దఱము చనిపోవుదుము" అనెను. ఎందుచేతనని గోవిందవర్మ యడుగగా "ఆ పాటలోని ప్రధానశక్తి పోలేదుకదా! వెంటనే జరుగు ఫలము పోయినది. క్రమముగా జరుగుఫల మట్లేయున్నది" యనెను. గోవిందవర్మ "అయ్యా! ఈపాట ఎవరిమీద ప్రయోగమో వారిని వెంటనే చంపును. వెంటనే యనగా వారము దినములలో చంపును. కాని యా క్షణమునందు వాడు స్మృతి తప్పి పడిపోవును. పది నిముసములలో తేఱికొనును. ఆ రాత్రికే దాని చెడ్డఫలితము మొదలుపెట్టి వారముదినములలో ప్రాణము తీయును. ఎవరి నుద్దేశింప బడలేదో వాని కెదురుగా ఇది పాడబడినచో వాడు తాల్చిన దుస్తులు తగుల బడును. ఇది దానిలోని రహస్యము. దీనిని నాకు నేర్పిన వాడు చెప్పిన మాటలివి". మానవర్మ మఱల నడిగెను. "ఒక వేళ దీనివలన నాకేమైన బాధ కలుగునేమో? దీనికేమైన బ్రతిక్రియకలదా?" గోవిందవర్మ, "దీనికి ప్రతి క్రియలేదు. నా కతడు చెప్పలేదు. కాని నా యనుభవములో నొక విషయ మున్నది. మనము క్షత్రియులము. మనము శైవులము. పంచాక్షరి పునశ్చరణము చేసినవాని నిది యేమియు చేయజాలదు." మానవర్మ దానిని నమ్మెను. తనయింటికి పోయెను. అప్పటికి రాత్రి ప్రొద్దుపోయినది. స్నానముచేసి సహస్రపంచాక్షరి చేసెను. మఱునాఁడు ప్రొద్దుననే రాజునొద్దకు పోయి సహస్రపంచాక్షరి చేయుడని చెప్పెను. రాజునకు మానవర్మ యెంత చెప్పినచో నంత. రాజు సహస్రపంచాక్షరి చేసెను. ఆనాటి సాయంకాలమున గౌడగూచి నృత్యము. ఆ నృత్యము యొక్క చివరలో మానవర్మ గౌడగూచిని రాజునెదుట ఆపాట పాడుమనెను. గౌడగూచి నిరాకరించెను.

ఇంతకు మానవర్మ కాపాటమీద నెందు కంతయభిమాన మనగా ఆ పాటలోని భావములు మిక్కిలి రమ్యములుగా నుండెను. ఆ పాట వ్రాసినవాడు

నైతిని. నా పినతండ్రులు ఆ తండ్రులను మొన్నటిదాక తెలిసికొనలేక పోయితిని. ఒకడు మహారాజు, రెండవవాడు మానవర్మ వీరిద్దరు నాకు పితృసమానులు. మీతో మాటాడునది పూర్వపు గోవిందవర్మ కాడు. ఆ గోవిందవర్మ రాజపురుషోచితవేషముతో సభలో కూర్చుండడు గోవిందవర్మ వాడు కానేకాడు. వీడింకొకడు ఇతడు రాజపురుషుడు. మహారాజునకు ముగ్గురుకుమారులు. మొదటివాడు యువరాజు మహేంద్రవర్మ. రెండవవాడు పరమేశ్వరవర్మ. మూడవవాడు గోవిందవర్మ గోవిందవర్మ తప్పుదారుల వెంట పోయిపోయి తిరిగి కట్టుకొయ్యకు వచ్చినాడు ఎన్ని తప్పుదారుల వెంట పోయెనో వానికే తెలియును ఒక తప్పు దారియే నా తండ్రులిద్దరికి తెలియును అదియైనను వారికెట్లు తెలియును? ఆ గోవిందవర్మ వారికే ద్రోహము తలపెట్టినాడు. కనుక తెలియును ఆ ద్రోహమటువంటిది. వానిని ముక్కముక్కలుగా నరికి గ్రద్దలకు వేయదగినది. వానిభార్యను చిత్రవధ చేయదగినది. వాని రెండేళ్ళ పసిబిడ్డను మెడ పిసికి చంపదగినది. ఆ తండ్రులిట్లు చేయవలసినది వారట్లు చేయలేదు లజ్జకల కలవాడైనచో గోవిందవర్మ తనయంతట తాను కత్తి పెట్టి పొడుచుకొని చావవలసినది వాడు లజ్జాహీనుడు. లజ్జాహీనుడేకాడు, తన భార్యను బిడ్డను వదలిపెట్ట లేనివాడు ఈ దోషమంతయు వాని కామసంబంధి వాడు మానవర్మ గారు సంఘా దేవి నెట్లు ప్రేమింతురో తనభార్యనట్లు ప్రేమించును అది యొక్కటియే యా వైరాగియం దున్న మంచిగుణము అదియే వానిని రక్షించినది తన కొడుకన్నచో వాడు పడి చచ్చిపోవును అందుచేత క్రొత్త గోవిందవర్మ యైనాడు ఆ ప్రాత గోవిందవర్మకు తెలిసినన్ని మందులు మాయలు మంత్రములు మరి యెవ్వరికి తెలియవు. వాడు తెలియక తన తండ్రి మీద ప్రయోగము చేసినాడు ఆ ప్రయోగమునకు వైకుంఠపెరుమాళ్ళు తట్టుకొనలేక పోయెను ఆ పాట వచ్చిపోయినది. నా రెండవ పినతండ్రిని నేను నమ్మించలేక పోయినాను గొప్పగా భయపడినది అందుకని నేనే తెర నిలుచుండి నా తండ్రియెదుట పాడినాను నా తండ్రి మీద ఈ వేలనాళ్ళ నుండి రోజుకొక్క కీర్తనగా వేలకీ ముప్పది కీర్తనలు వ్రాసితిని నాలో భగవంతుడే కవితాసరస్వతిని నా గ్రంథపుస్తకలో నుంచినన్ని నాళ్ళు నా తండ్రుల మీద కీర్తనలు వ్రాయుచుండును మీ యనుగ్రహమున్నచో రేపు ఆ కీర్తనల నన్నింటిని పాడి వినిపింతును ఆ పాటలలో కూడ విషమూర్తనములు పెట్టితినని యనుమాన ముండవచ్చును నేనే పాడుదును నా తండ్రి యెదురుగా నిలుచుండి పాడుదును ఈ గోవిందవర్మ నేర్చిన విద్యయు క్షుద్రమంత్రములు నా తండ్రి మహారాజు గొప్ప జపిత ప్రతిదినము సహస్ర పంచాక్షరి చేసినచో క్షుద్ర ప్రయోగములు పనిచేయవు. నన్ను పరీక్షించుట కాయన సహస్రపంచాక్షరి చేయవలదు ఇదిగో రాజపురుష లాంఛనమైన యొఱకత్తి నా హస్తములో నున్నది ఈ నాడుగాని, నాపాటలు వినిపించిన తరువాత నేనాడు గాని నా తండ్రికి తలనొప్పి వచ్చినను సరే, నే నీయొఱకత్తితో పొడుచుకొని చనిపోవుదును నాబిడ్డకు భయములేదు (రాజాంకకజూపించి) నాతండ్రి యున్నాడు తన మనుమని బ్రతికించుకొనును అట్లు తలనొప్పి వచ్చినచో నా

తండ్రి నెల దినములు రెండు పూటల సహస్రపంచాక్షరి చేసినచో నా యవ కే యాపదయు నుండదు. రేపు నా తండ్రుల యనుజ్ఞయైనచో ఆ కీర్తనలు వినిపింతు" నని గోవిందవర్మ మహారాజు చరణములకు సాష్టాంగపడి నమస్కరించెను. మహారాజు గోవిందవర్మను లేవదీసి కౌగలించు కొనెను. తరువాత గోవిందవర్మ మానవర్మకు నమస్కారము చేసెను. మానవర్మ తలక్రిందులయ్యెను. "అయ్యా! మీరు రాజపురుషులు ! నేను రాజసేవకుడ" ననెను. గోవిందవర్మ" మానవర్మగారూ! మీరు రాజపురుషులు. నేను రాజసేవకుడను. ఒకవేళ నేను రాజపురుషుడ నైనను, మానవర్మ సేవకుడను" అనెను.

ఆనాటికి సభ పూర్తియయ్యెను. రాత్రి మిక్కిలి ప్రొద్దు పోయెను. అందఱి భోజనము అచ్చటనే. సభయైపోయినంతనే గోవిందవర్మ పరమేశ్వరవర్మ యొద్దకు పోయెను. పరమేశ్వరవర్మ నమస్కారము చేయబోగా గోవిందవర్మ కౌగిలించుకొనెను. "తమ్ముడూ! క్షమించుము! మనమిద్దఱ మన్నదమ్ములము. నా మీద కోపము పెట్టుకొనకుము. నేను మీరాజవంశమునకు భక్తుడ"ననెను. ఇద్దఱును మఱల కౌగిలించుకొనిరి. గొడగూచి గోవిందవర్మవంక చూచినప్పుడెల్ల ఆమెగుండెలో భయము వేయుచుండెను. తన యింటిలో తినినవాడు, తన యింటిలో గౌరవహీనముగా బ్రదికినవాడు, తనతల్లి కసరినను నోరుమూసుకొని యుండినవాడు, తనచేత నెప్పుడును గౌరవింపబడని వాడు- నేడా గోవిందవర్మను జూచినచో ఆమెకు భయము వేసెను. గౌరవము పెరిగెను. అతని రాజపురుష లక్షణమునకు నివ్వెఱగందెను. ఆయన తనవంక నే చూడడు. ఆయన నడచుచుండఁగా రాజవంశములోని యొక మహోపకారి నడచి నట్లుండెను. అన్నాళ్ళు తనయింటికి రాకపోకలు నడపి గోవిందవర్మ తన యభినయవిద్యను తన సంగీతవిద్యను మఱుగుపఱచెను రాజవంశీయులకు తప్ప, అట్టి రహస్యగోపనశక్తి మఱియెవ్వరికుండును? ఆమె గోవిందవర్మను గూర్చి యాలోచించినంతసేపు, మఱియు, తన విద్యను గూర్చియామెకున్న యహంకారమే పో జొచ్చెను. గోవిందవర్మవలె పాడెడువాని నాడెడువాని తానిదివఱ కెఱుగదు. భరతాభినయము చేయుట వేఱు, దేశినృత్యము చేయుట వేఱు. భరతాభినయము నేర్చినంత మాత్రమున దేశినృత్యము చేయలేరు. దానిని వేఱే నేర్చుకొనవలయును. గొడగూచి కెంతసేపటికి తా నొక నిలుచూచుకొని గోవిందవర్మకు నమస్కారము చేయవలెనని యనిపించెను. గోవిందవర్మ తన వంకనే చూడడు. ఇంక ఆమె పట్టుకొనలేకపోయెను. అతడు తన తలపాగలో నున్న పదునేను నిష్కములను తీసి యామెకు బహుమతి జేసెను.



మఱునాటి సభ మానవర్మ యింటి లోననే యేర్పాటు చేయబడెను. మానవర్మ మహారాజు కొలువులో నేర్పాటుచేయవలయు ననగా, మహారాజు "నీ యింటికి నా యింటికి భేద మేమి? అతడు మనయిద్దఱికి బిడ్డయేకదా!" యని నవ్వెను. గోవిందవర్మ ఆ నాటి రాత్రి గొడగూచిని తన యింటికి తీసికొనిపోయి

యొకపాట సాభినయముగా నేర్పెను. ఆమె చివరకు " ప్రభూ! తమవంటి గురువు లేడు. తమవంటి గురువే నాకు దొరికినచో గోడగూచి పేరు దీనికి పదిరెట్లుండెడిది" యనెను. గోవిందవర్మ పూర్వమువలె ఆమెతో పరాచికము లాడలేదు. మాటమాటకు నవ్వలేదు. ఆమెకు దగ్గఱగా కూడ నిలుచుండ లేదు. తన రాజపురుషుని యొక్క ఠీవి నంతయు వెలిపెను. లేదా యది యతనికి సహజమో!

మఱునాడు మానవర్మ యింటిలో సాయంకాలమున సభ జరిగెను. మానవర్మ తన యింటి ముందున్న బహిరంగ స్థలములో సభ నేర్పాటు చేసెను. పెద్ద యెత్తైన బల్లలు వేయించి వానిపైన రత్నకంబళములు పఱపించి మహారాజా కూర్చుండుటకు వానిమీద ఆసనముగా మూడు వైపుల మూడెత్తుదిండ్లు పెట్టించెను. ఆ దిండ్లమీద చెమికీపనిచేసిన పట్టుగుడ్డలు తొడుగులు తొడిగెను. రాజానకు వెనుక భాగమున ఇద్దఱు వేత్రహస్తులు. సభాంగణమంతయు అగరువత్తులు, పూల మాలలు, పట్టుచాందినీ! రాజాసనమున కెదురుగా నంత యున్నత పీఠ మొకటి యేర్పాటు చేసెను. దాని మీద గోవిందవర్మ కూర్చుండును. రాజాసనమునకు కుడివైపున రాజపురుషులు, మహామంత్రులు, ఘటకాచార్యులు కూర్చుండురు. రాజాసనమున కెడమప్రక్క రాణివాసము, రాజస్త్రీలు, తక్కిన గొప్ప వారిభార్యలు కూర్చుండురు. ఆ ప్రదేశము వెనుకయు ప్రక్కలను మూయబడి యుండెను. ముందుభాగము సన్నని తెర వేయబడెను. లోనివారికి బయట నందఱు కనిపింతురు. లోని వారు బయటివారికి కనిపించరు రాజాసనము వెనుక సేవకులు పరిచారకులు ఇతరజనములు నిలుచుందురు. వారికి కనబడునట్లుగా ఆ ప్రదేశమంతయు మెరక చేయబడెను. మహారాణి కడచిన మూన్నాళ్ళుగా రాలేదు. ఆమెకు కొద్దిగా సుస్తీగా నుండెను. నిన్నటి వర్తమానము లన్నియు ఆమె వినెను. ఆమె కవి యన్నియు క్రొత్తగా నుండెను. అసలు విషయమెవరికిని తెలియదు. గోవిందవర్మ రాజద్రోహము చేసెననియు, మహారాజా క్షమించెననియు, గోవిందవర్మ మహాభక్తుడయ్యెననియు, ప్రధానాంశములు. అతడు చేసిన రాజద్రోహవిషయము పదిమంది పదివిధములుగా కల్పించికొని చెప్పుకొనుచుండిరి. అన్నిటికంటె గోవిందవర్మ యొక్క యభినయము, సంగీతము విడ్డూరముగా చెప్పుకొన జొచ్చిరి. రాణిగారు తానా నాడు తప్పక వత్తు నన్నది. అంతఃపురస్త్రీల కేర్పరచిన ప్రదేశములో రాణిగారికి మహాసన మేర్పాటు చేయబడినది. రాణిగారు మొదట వేగి సంఘమును జూచెను. సంఘ మానవర్మ చెప్పిన ప్రకారము రాణిగారికి నమస్కారము చేసి యైదు హేమనిష్కములను రాణిగారి కిచ్చెను. ఇది రాజమర్యాద. రాజ దర్శనము చేయునపుడు వారి కైదు హేమ నిష్కములను బహుమానము చేయవలయును. మహారాణి సంఘుకు పది చీరలు, పది పట్టురైకలు, పది పట్టు మేలిముసుగులు, పసుపు కుంకుమ, కొన్ని రత్నాభరణములు కానుకగా నిచ్చెను. దీని కర్థ మున్నది. రాజసేవకులు మహారాజునకుగాని మహారాణికిగాని యైదు నిష్కము లిత్తురనగా తమ పంచప్రాణములు వారి కర్పించుచుంటి మని యర్థము. వారు తిరిగి పది వస్తువు లిచ్చిరనగా నీ యైదు ప్రాణములు నా యైదు ప్రాణములు కలిసిపోయిన వని యర్థము. మహారాజుగాని మహారాణిగాని పదివస్తువులు

తిరిగి యందఱకు నీయరు. రాజానుగ్రహముకల చోటనే యిత్తురు. సేవకభావములో నున్న వారిచ్చినచో స్వీకరించి యూరకుందురు. ఎవరికి పది వస్తువులు తిరిగి యీయవలెనో యెవరి కీయరాదో మహారాజునకే తెలియును. మహారాణి నెవరైన దర్శనము చేయ వచ్చినచో, తిరిగి పది వస్తువు లీయవలయునో యీయరాదో మహారాజు మహారాణికి వార్త పంపును. కాని యీనాడు మహారాణికి వార్త పంపలేదు. ఆమె వచ్చునో రాదో తెలియదు. రాదనియే యనుకొనెను. వచ్చినచో ఆమెకు తెలియదా యనుకొనెను. కాని యా మఱునాటిరాత్రి మహారాజు మహారాణిని మిక్కిలి ప్రశంసించెను.

సంఘకు రాణిభాష తెలియదు రాణికి సంఘాదేవి యొక్క భాష తెలియదు మలయానుండివచ్చిన పదిమంది స్త్రీలలో నొక్కర్తుక దక్షిణాపథ స్త్రీ. ఆమె రాణిగారి మాటలు సంఘకు, సంఘ మాటలు రాణికిని చెప్పెను. సంఘ యిట్లన్నది- "మీరు మాతలిదండ్రులు. మేము మీ బిడ్డలము. మీ దయవలన నేను మఱల నా భర్తను కలిసికొంటిని. మహారాజుగారు దయామయులు. తమయుప్పు తిని బ్రదుకుచున్నాము. మాకు గర్వములేదు. నే నొక రాజు కూతురను ఐనను తల్లీ! నేను మీ బిడ్డను నేను కొలది దినములలో మీ భాష నేర్చికొందును నేర్చికొనిన తరువాత తమరిభాష లోననే మాటాడెదను. అంతవఱకు నన్ను క్షమించవలయును నే మీ దేశపు వేషముతోడనే తమ దర్శనము చేయవలయు ననుకొంటిని. కాని నా భర్త మలయాదేశ స్త్రీ వేషముతోనే తమ దర్శనము చేయుమని యాజ్ఞాపించెను. ఈ వేషము తమకు వినోదము కలిగించునని వారి యభిప్రాయము బిడ్డలు తలిదండ్రులకు వినోదము కల్గించుట తప్ప నేమి చేయుదురు?" రాణి యీ మాటలు మఱునాటిరాత్రి మహారాజుతో చెప్పెను. మానవర్మభార్య యొక్క మాట లేమి సంతోషము కలిగించెనో - మహారాజును మహారాణియు నాటిరాత్రి తమ ప్రథమసంగము ప్రథమదినములలో ఒకనాటి రాత్రి వలె సుఖించిరి ఈ మాట లనినతరువాత మహారాణి సంఘను కౌగిలించుకొని యిట్లనెను- "తల్లీ! మానవర్మ తన సంగతి యంతయు మహారాజుగారితో మనవిచేసెను ఆయన నాతో చెప్పెను మంచిరోజులు వచ్చును మీ రాజ్యము మీకు వచ్చును నా బిడ్డ లిప్పుడు నా బిడ్డలుగానే యున్నారు. వారి నట్లే చూచుచున్నాము ఆ మంచిరోజులు వచ్చిన తరువాత మా బిడ్డలను మహారాజుగా మహారాణిగా చూతుము పరమేశ్వరుడున్నాడు"

సభ యారంభింపబడెను. గోవిందవర్మ తన కీర్తనలను వినిపించుటకు రాజు నాజ్ఞయైనది. గొడగూచి వచ్చెను మొదటి కీర్తన పాడెను గోవిందవర్మ యామెకు తా నొక ముత్యాల హారము బహుమతి యిచ్చెను. ఆమె దిగిపోగా గోవిందవర్మ తన కీర్తనల నొకదాని తరువాత నొకదానిని చదివెను. వ్యాఖ్యానము చేసెను ప్రతి కీర్తనయు చిత్రవిచిత్రములైన భావములతో నుండెను మఠకాచార్యు లందఱు కూర్చుండిరి. అతని కవితాశక్తి కందఱు నాశ్చర్యపోవుచుండిరి అతని వ్యాఖ్యానమునకు పండితులు విస్మేఱపోవు చుండిరి గోవిందవర్మకు సంస్కృతము రాదు తన కీర్తనలన్నియు ద్రవిడభాషలో వ్రాసెను. ద్రవిడభాషలో అప్పటికే నయనారులుండిరి.

నయవారు అనగా దైవభక్తులు- అవతారపురుషులు. వారందఱు ద్రవిడభాషలో వ్రాసిరి. వారి కవిత్వము పరమ ప్రమాణభూతమైనది. గోవిందవర్మ కవిత వారి కవిత్వమువలె నున్న దనిరి. గోవిందవర్మ యొక కీర్తనలో నిట్లు వ్రాసెను. "నేను క్షత్రియ వంశజుడను. కాని బైరాగినై పోయితిని. తండ్రీ! నిన్ను కత్తితో సేవించలేను. కాని, సరస్వతీదేవికొప్పులో ముడిచిన కలివెపూవులోని తేనియవంటి యరవభాషా కవితలో నిన్ను పూజించెద" నని. ఈ పద్యము చదివి, "ద్రవిడభాష కలివెపూ తేనెవంటిది; సంస్కృతభాష తామరపూ తేనెవంటిది" యని వ్యాఖ్యానముచేసెను. రాజు కరాస్ఫాలనము చేసెను సభ యందఱు కరాస్ఫాలనములు చేసిరి అన్ని కీర్తనలలోనను మహారాజాధిరాజనియో,మహాధర్మరాజనియో, మహాధర్మాధిరాజనియో యొక సంబోధన తప్పక యున్నది తక్కిన సంబోధనము లన్నియు జనకశబ్ద పర్యాయములు సభ యైపోయినది మహారాజు గొడగూచి నా మొదటి కీర్తన మఱల పాడుమనెను. ఆమె పాడి దిగబోవు చుండెను. మహారా జామె నచ్చటనే నిలువు మనెను. సభలో నెవరిని గౌరవించినను మహారాజు స్వహస్తములతో గౌరవించడు అందఱను పురోహితమంత్రి గౌరవించును. కాని నేడు మహారాజే గొడగూచిని గోవిందవర్మను తన యున్నచోటికి రప్పించి గొడగూచి మెడలో రత్నహారమును వేసెను "పద్య పుష్పహారము బదులు దీనిని వేసితి" నని మహారాజు నవ్వెను గోవిందవర్మను కౌగిలించుకొని " నీ వింక మా యాస్థాన కవివి నీకు నెలనకు వేయి నిష్కముల జీతము నీకు పదినాడులు దానము జేసితి" ననెను




పరంజ్యోతి గెలిచిన స్థలములయం దంతటను భ్రమము చేసి తిరిగి వచ్చెను మానవర్మ గృహప్రవే శోత్సవములు ఆయన వచ్చువఱకు పూర్తియై పోయినవి మానవర్మ పరంజ్యోతిని తన యింటికి భోజనమునకు పిలిచెను పరంజ్యోతి భోజనమునకు రాకమున్నే పట్టణములో మానవర్మ చేసిన మహాకార్యములు, గోవిందవర్మ యొక్క మార్పు, అతని కవితా వైభవము సూచనగా మాటమున నుండియు, వివరముగా పట్టణములోనను వినియుండెను ఆయనకు జ్యోతిషము చెప్పినను, పరిస్థితులు తా నాలోచించి చూచి దండయాత్ర మాని రావలయునని మట సరిపోల్చుకొన్నను, లోనుగా మానవర్మ భోజనమునకు పిలుచుట మానవర్మయొక్క మర్యాదా విశేషమని తెలిసెను మానవర్మ యహంకారి కాడు రాజాశ్రయము దొరికిన దని తల తిరిగెడివాడు కాడు

పరంజ్యోతి భోజనమునకు వెళ్ళెను జరిగిన వర్తమానములన్నియు నతనిని చెప్పుమనెను మానవర్మ వెన్నయ్య జ్యోతిశ్శాస్త్ర పాండిత్యమును పొగడును. గోవిందవర్మలో నివురుకప్పిన నిప్పువలె నున్న మంచితనమును కవితాశక్తిని పొగడును కరిపుట్టియొక్క అవివేకమునకు జాలిపడును తన ప్రశంస యేమియు లేదు గోవిందవర్మకూడ భోజనమునకు వచ్చెను. రాజుమీద వ్రాసిన కీర్తనలు విఱితొండనికి

వినుపించు మనెను. ఆయన వినిపించెను. మానవర్మ యిట్లనెను- "మహాసేనానీ! గొడగూచి నృత్యము మీరు చూచితీరవలయును. ఆమె గోవిందవర్మ వ్రాసిన పాటలను పాడును. ఆ పాటలను వినవలయును. ఈనాడే యామె నృత్యముగూడ తమకు చూపించవలయు ననుకొంటిని. ఆమె గ్రామములో లేదట. గోవిందవర్మకు కోపము రానిచో ఈయనకంటె గొడగూచి యీయనవ్రాసిన పాటలు పాడుచుండగా మిక్కిలి మనోహరముగా నుండును. గోవిందవర్మ జనపదములయందెంత తిరిగినను తక్కువ జాతివారితో ఎంతపరిచయమున్నను వారియాస సంపూర్ణముగా ఈయనకు పట్టుబడలేదు. తమరు వింటిరిగదా! ఈయన భాషలో ఎక్కువ భాగము పామరభాష. తక్కువజాతి వారు మాటాడికొను నుడికారములు, తదర్థచ్ఛాయగల శబ్దప్రయోగములు మిక్కుటముగా నున్నవి. ఆ మాటలును ఆ వాక్యములును గొడగూచి నోటివెంట వచ్చినప్పుడామె వానిని ఉచ్చరించు వైఖరి యొక యాసగా ఒక ఒయ్యారముతో నుండును. ఆమె వట్టి యపండితురాలు. నీచసంఘము నందు పెరిగినది. పేదవారి సంతోషము కొఱకు నృత్యము చేయునది. ముక్కునకు బులాకీ పెట్టుకొని, వ్రేలాడు చెవులకు తమ్మలు పుటించి, తాంబూలము సేవించుచు, మోకాళ్ళక్రిందకు దిగని చీరలో కక్షభాగమునుండి చేతులును పయ్యెదలోనుండి కనిపించు దేహములో, ముంతకొప్పుపెట్టికొని, యెడమువైపున తట్టలో ఎడమ మోచేయిపోనిచ్చి ప్రక్క కాన్చుకొని నడుచుచున్న కూలిపడుచు యొక్క శృంగారరస మెట్లు మనస్సున కొక విచిత్రమైన యనుభూతి కలిగించునో యామె పాడుచుండగా అట్టి యనుభూతి కలుగును. ఇప్పుడు యుద్ధములు లేవుగద! తమరు పట్టణములోననే యుండిపోదురు ఎప్పుడో మీకు గొడగూచి నృత్యము చూపింతు" ననెను. పరంజ్యోతి మానవర్మ యొక్క యీ రసికతకు చకితుడయ్యెను- "పూర్వము మానవర్మ యింత మాటాడెడివాడు కాదు. ఇతనియందలి రాజుయొక్క దయ యితని నహంకారిని కలుషితుని చేయక, సుకుమారభావుని ఆర్ద్రమనస్కుని చేసెను. సత్పురుషు లిట్లుందురు కాబోలు!" పరంజ్యోతి యీ రీతిగా ఊహించెను.

భోజనములైన తరువాత ముందరిసావడిలో కూర్చుండిరి. సంఘ తానే తాంబూల కరండమును తెచ్చెను. మానవర్మ యామెనుజూపి, "యీమె నా భార్య. గోవిందవర్మకు పినతల్లి కనుక అతడామెను చూడవచ్చును. తమరు పినతండ్రులు కనుక మీయెదుటికి కూడ వచ్చినది." పరంజ్యోతి "యీ మానవర్మ యింత నిష్కల్మషుడు! తనయం దింతగౌరవము కలవాడా? తానెంతపొరపడితి', ననుకొనెను. సంఘ మలయాదేశపు స్త్రీ వేషములో నుండెను. కొంచెముగా మోకాలి క్రిందికిదిగి కక్షభాగము వఱకు పట్టుసేలువ చిత్రవిచిత్రములైన బంగరుపూవుల పనితనము కలదానిని చుట్టుకొని కుడివైపున కక్షభాగము క్రింద ముడివైచెను. ఆమె శరీరచ్ఛాయ గోధుమవన్నె! శరీరము నిగనిగ లాడుచుండెను! కనుపాపలు తుమ్మెదఱెక్కల వలె నుండెను! జుత్తు మిక్కిలి నల్లగానుండి నూనెరాచుటచేత మృదుతమముగా కనిపించెను. చేతులకు పాదములకు బంగారు కంకణములు కడియములు కలవు. వ్రేళ్ళకు రత్నపు టుంగరములు కలవు. మెడలో నొక పచ్చల హారము రత్నహారము ముత్యాలసరము

మంగళసూత్రము వరుసగా కలవు. ఆమె చూచుటకు అప్సర స్త్రీ వలె నుండెను. సామాన్యముగా మలయాదేశ వాసులకు నాసిక వెడల్పుగా నుండి అణగియుండును. ఆమె నాసిక భారతదేశవాసుల నాసికవలె ఎత్తుగా వెడల్పు తక్కువ కలదిగా నుండెను. ఆమె మొగమున పునుగుబొట్టు సన్నగా దీపించుచుండెను. ఆమె తాంబూలకరండ మచటనుంచి లోనికి వెడలిపోయెను. మానవర్మ పరంజ్యోతి యెడల చూపిన గౌరవము లన్నిటిలో యిది శిఖరాయమాణమైనది. దీనితో పరంజ్యోతి మనసులో నున్న సమస్తమైన యనుమానము మూలభూతముగా తుడిచి వేయబడెను. తరువాత మానవర్మ యిట్లనెను- "తమరు మలయాదేశము చూచితిరో లేదో తెలియదు. ఆమె మలయారాజకూతురు. ఆ వేషము మీకు చూపించవలయు ననియే యామె నిట్లు రమ్మని చెప్పితిని. ఇక్కడకు వచ్చినతరువాత ఈ దేశపు స్త్రీల వలెనే వేషమును ధరించుచున్నది. కాని తమరు చూతురని యామె నీవేషముతో రమ్మంటిని. నా యీ గృహప్రవేశోత్సవములు మహారాజు చేయించినప్పుడు రాణిగారు నా యింటికి దయచేసిరి. అప్పుడు నాభార్య నిట్లు చూచిరి. ఈ వేషమును గూర్చి మహారాణి మహారాజుతో పలుసార్లు చెప్పినదట. ప్రభువు నాతో రెండుమూడుసార్లన్నారు నేనొక విచిత్రమైన పురుషుడను. గొడగూచి యుచ్చారణలో నా కొక చమత్కారము కనిపించినట్లే యీ వేషములో కూడ నా కొక భారతనాగరకతేతరమైన యొక విలాసము కన్పించును. తమ రెప్పుడు వత్తురా మహారాజు నాయందు చూపించిన యీదయ మీ కెప్పుడు చెప్పుదునా యని పలుసార్లనుకొంటిని. నేను మహారాజుయొక్క శరీరమును మాత్రమే రక్షించుచున్నాను తమరు వారి యాత్మయైన రాజ్యరక్షకులు!" పరంజ్యోతికి మానవర్మ మాటాడిన ప్రత్యక్షరము మిక్కిలి యందముగా వినిపించెను. ఆయన యిట్లనుకొనెను- " ఈ మానవర్మ లేనిచో రాజేమియై యుండెడివాడో?"

మఱునాడు పరంజ్యోతి మహారాజ దర్శనము చేసెను దండయాత్ర మానివేసి రమ్మన్నందుకు పరంజ్యోతి మనస్సులో కొంచెము కష్టపడి యుండునని మహారాజునకు తెలియును. మహామల్లు డాప్రసంగమును తెచ్చెను. పరంజ్యోతి యిట్లనెను- "మహారాజాధిరాజా! మానవర్మకంటె ఎక్కువ యెవరికి తెలియును. తమరి రాజ్య మాయన యెట్లు చెప్పెనో యట్లు నడువవలయును. ఆయన యుద్ధము చేయుమనగా చేయవలయును వలదనగా మానివేయవలయును మనము మనకు కనిపించుచున్న యీ లోకము లోని విషయములనే చూతుము అతడు కనిపించని దైవమును కూడ చూచును అతడు దైవమును పౌరుషమును జోడించును. అతడు తనకు నియమితమైన కార్యమును దాటి, గీసిన గీత దాటి పోడు నిన్న నన్ను తనయింటికి భోజనమునకు పిలిచెను. వేనాతని భార్యకు పినతండ్రినట! అంతఃపురస్త్రీని మన మెట్లు చూడగలము? ఆయనకు నాయం దంత ప్రేమ యున్నది. ఇంక ప్రభువునెడల ఆయన కున్న గౌరవము నెవరు చెప్పగలరు?" అపుడు మహారా జిట్లనెను- "మానవర్మ యొకసారి నాతో నిట్లనెను, నాకేదైన యపకారము జరుగబోవుచున్నచో అతని కెడమక న్నదరునట! సంపుకు వే యాపత్తైన రాబోయినను తన కట్టి శకునము కలుగదట నేనే యతనిలోనున్నా

నట." **పరంజ్యోతి–** 'ఆ మాట యెంతయు నిజము'. **మహారాజా–** "మహాసేనానీ ! మీరు నాకంటె, మానవర్మకంటె పెద్దవారు. అత డెంత మంచివాడనగా కొన్నాళ్ళ క్రిందట నేను రెండుజాములవేళ ఏన్గుమీఁద విహారముపోయి దప్పికయై యొకచోట ఎడనీరు త్రాగితిని. అందులో కొన్ని నీళ్ళు మిగిలినవి. అతడు పాఱవేయు నని కొబ్బరిబోండ మతని చేతి కందిచ్చితిని. తక్కిననీళ్ళతనిని త్రాగుమని యందిచ్చితి ననుకొన్నాడు కాబోలు! తా నామిగిలిన నీరమును త్రావెను. నే నన్నచో అతనికి రాజు నని కాదు. రక్షకుడనని కాదు. దేవుడనని కాదు. నేను తానే యని. అట్లని మఱల కొంచెమైనను తన ధర్మమును దాటడు. అతనికి నాయం దున్న చనవునకు రాజాధికారము చేయవచ్చును. నాతో చెప్పకుండ ఏ పనియైన చేయవచ్చును. నేను కా దనలేను. నాప్రాణము లతడిచ్చినవి. నన్ను నాల్గుసార్లు రక్షించెను." **పరంజ్యోతి–** "మహారాజాధిరాజా! పల్లవరాజపురుష రక్షణమునకు భగవంతుడతనిని జనింపజేసెను."

ఇట్లు మానవర్మ తనకు తెలియకుండగనే తన సహజమైన మంచితనముచేత మహాసేనాని మనస్సులో నున్న లవలేశమైన మాత్సర్యమును తీసివేసెను

కాలము గడచుచుండెను. రాజ్యము భద్రముగానుండెను. పరంజ్యోతి గెలిచిన నేల నరసింహవర్మయొక్క గొడుగునీడ యందు సుఖముగా నుండెను. మహారాజు జీవితము సాహిత్యగోష్ఠులతో సంగీత సభలతో నృత్యాభినయములతో దినదినము పరిమళించుచుండెను. ఎండ సమపాళముగా కాయుచుండెను. వానలు పరిమితముగా కురియుచుండెను. నదు లొడ్డులు మిగిలి ప్రవహించుట లేదు.

భారతదేశమున అనాది నుండియు దేవాలయములు కలవు ఆ దేవాలయములు కొయ్యలతోడను మట్టితోడను నిర్మింపబడుచుండెను కొన్ని రాళ్ళతో నిర్మింపబడినను పెద్దవికావు, చిన్నవి. అట్టి స్థితిలో పల్లవరాజులు పర్వతములు తొలిచి; గుహలు, దేవాలయములు, ఆ దేవాలయములలో మహాశిల్పములు చేయింప నారంభించిరి. మహాశిలలు తెచ్చి లోకమునకు కనులు మిఱుమిట్లు గొలిపెడి మహాదేవాలయములు కట్టింప నారంభించిరి. వైకుంఠ పెరుమాళ్ళు దేవాలయము, ఏకామ్రేశ్వరుని దేవాలయము, కైలాసనాథుని దేవాలయము కంచిపట్టణమున మహాశిలలతో నిర్మింపబడినవి ఆ రాళ్ళ మీద నాట్యభంగిమలు, మల్లయుద్ధములు, దండ యాత్రలు, పురాణములలోని బహుకథలు మహాశిల్పుల చేత చెక్కింపబడెను. కంచిలో శిల్పపువాడ కలదు. అందులో నలుబదివేల మంది శిల్పులు కలరు.

పల్లవులు రాజ్యము సంపాదించిన వేళకు దేశమునందు జైన బౌద్ధ మతములు విజృంభించియుండెను. వారి విహారములు వారి స్తూపములు రమణీయములైన కట్టడములు. సామాన్య ప్రజలకు వేదాంతము తెలియదు. తర్కములోని సూక్ష్మ విషయములు తెలియవు. ఒకమతము యొక్క బహిర్విషయములు చూచి సామాన్యులు మోహపడెదరు బౌద్ధుల విహారముల యొక్కయు సంఘారామముల యొక్కయు సౌందర్యమును చూచి పామరులా మతములే గొప్ప వనుకొను చుందురు. పండుగలకు పబ్బములకు విహారములకు పోయి, యచ్చటి ప్రార్థనలు అచ్చటి వైభములను చూచి ముగ్ధు లగుచుందురు. పల్లవరాజు లీ విషయము గ్రహించిరి. పల్లవరాజులు క్షత్రియులు

వారిది వేదమతము. సామాన్యజనుల మనస్సుల నిటువంటి యపండితమైన మూఢభావము నుండి మఱలించుటకు దేవాలయముల నిర్మింప నారంభించిరి. కంచిలో గొప్ప దేవళములు నిర్మింపబడు చున్నపుడు, నిర్మించిన తరువాత జనులు విహారములకు పోవుట మానివేసి దేవళము లందలి యీ శిల్పములను చూచుటకే వచ్చుచుండిరి. ఈ దేవళముల లోని శిల్పను వలన జనులందఱకు సర్వ శైవ్లవ కథలు తెలియును. సర్వశైవ కథలు తెలియును. ఈ రీతిగా పామర జనులయొక్క మనోభావములు మాఱిపోయెను. శివభక్తులు విష్ణుభక్తులు దేశములో శరపరంపరగా బయలుదేరిరి. రాజానుమతో దర్మః ! రా జేమతమువాడో ప్రజాబాహుళ్య మా మతము ననుసరించును. అట్లు బయలు దేరిన శివభక్తులలో నయనారులు, విష్ణుభక్తులలో ఆళ్వారులు బయలుదేరిరి. వా రవతారపురుషులుగా భావింపబడు చుండిరి. ఇదియంతయు పల్లవరాజులు దక్షిణాపథమున తెచ్చిన మార్పు. మహామల్ల నరసింహవర్మకూడ తన పూర్వులవలెనే పర్వతములు దొలిచి దేవాలయములు నిర్మింపజేయు చుండెను. ఒక్కొక్క దేవాలయమునకు పెద్ద పెద్ద యాస్తు లిచ్చెను. ఘటకములో నాచార్యులుగాని విద్యార్థులుగాని యైదాఱు వేలమందికి తక్కువ యుండరు. వారందఱు దేవాలయపు టాస్తిమీదనే బ్రదుకుదురు. అందు సర్వ శాస్త్రముల యధ్యయనము జరుగును అధ్యాపనముజరుగును. బౌద్ధమత పండితులతో పూర్వము వేద పండితులు వాదించెడివారు. కాని వారికి రాజానుగ్రహము లేదు. అందుచేత వారు మూలబడియుండిరి ఇప్పుడు వీరి కాధిక్యము వచ్చెను. ఒక మతమును ఒకనాగరకతయును యధికముగా పామరులలో భావింపబడుటకు హేతువు-రాజ్యముచేయువారికి దానియం దున్న యభిమానము! లోకములో పది వేలమందిలో తొమ్మిదివేల తొమ్మిదివందల తొంబది తొమ్మిది మంది వ్యాప్తిలో నున్న భావముల ననుసరించుచు అదియే పరమార్థ మనుకొనెడి వారు. ఒకమహామేధావి యెప్పుడో యుదయించును. అతడు తత్పూర్వ మున్న దానిని మాన్పించును. అతనికి రా జనుకూలుడు కావలయును. ఇది నాగరకతా వ్యాప్తికి మూలకారణము. పల్లవరాజులు మఱల దక్షిణాపథమున వేదమతము నుద్ధరించిరి. సంస్కృత భాషను మఱల పైకి తీసికొని వచ్చిరి భరతాచార్యుల యభినయమునకు జీవము పోసిరి. నారదుని సంగీతవిద్యకు ప్రాణము పోసిరి.

## ౧౨

చాళుక్యులు పరంజ్యోతి చేత తఱుమబడి పలాయితులై ప్రతీకారము నూహించిరి. తొలుత తాము పల్లవుల రాజధానియైన కంచివఱకు దండెత్తిరి. ఆ దండయాత్రను పల్లవులు నిగ్రహించిరి, అంతటితో సరిపోయినది కాని పల్లవ రాజూరకుండక యెదురు దండయాత్ర చేసెను. ఆ పరంజ్యోతి మహాఘటకుడు. అతని పరాక్రమము ముందు చాళుక్య సైన్యము నిలువలేక పోయెను. చాళుక్య సేనాపతులు నిలువలేకపోయిరి. దండయాత్ర సాగక వెనుమఱలి వచ్చిన చాళుక్యసైన్యమునకు తొలుతటి యావేశము లేకపోయెను. తాము తొలుత చేసిన

దండయాత్రలో గాయపడియున్న సేనానాయకులు యుద్ధములోనికే పోవుటకు వీలు లేకపోయెను. చాళుక్య సేనానాయకులలో చాలమంది వృద్ధులు. మధ్యవయస్కుడైన పరంజ్యోతి కున్న పట్టుదలయు ప్రతాపము వారికి లేకపోయెను. చాళుక్య రాజా పులికేశి దీని నవమానముగాభావించెను. పల్లవరాజ్యములో కొంతభాగము తమిళదేశము, కొంతభాగ మాంధ్ర దేశము. పల్లవు లచ్చముగా ద్రవిడ దేశాధిపతులు కావచ్చును. తెలుగు దేశములో వారి కేమి పని? ఈ రెండు భాషలు మాటాడు ప్రజాసమూహము నొక్కగొడుగు క్రిందికి తెచ్చుటలో పల్లవులు సంస్కృతభాషను రాజభాష చేసిరి. పల్లవు లౌత్తరాహులు. ఆ మాటకు వచ్చినచో చాళుక్యులు నౌత్తరాహులేకాని చాళుక్యు లట్లనరు నరసింహవర్మ మహాయోధుడో కాడో తెలియదు అతని తాతగారైన సింహవిష్ణువు మహాయోధుడని ప్రసిద్ధి. అట్టి ప్రసిద్ధి నరసింహవర్మకు లేదు. ఏ మహారాజా మహాయోధుడో వానిదేశము మీదికి దండెత్తిపోవుటకు పరరాజులు భయపడుదురు. అతడు పర రాజులు దండెత్తి వచ్చు వఱకు ఊరకుండనే యుండడు. తానే పరరాజుల మీదికి పోవును. పరరాజ్యముల మీదికి దండెత్తని రాజానందు మహాయోధ లక్షణములు తక్కువ పూర్వులార్జించిన రాజ్యము సుఖముగా అనుభవించుచు అట్టివాడు సంగీత సాహిత్యములతో కాలక్షేపము చేయుచుండును. అందుచేత అతని రాజ్యమునకు పొరుగున నున్న రాజా యోధుడైనచో వానిమీదికిదండెత్తివచ్చును. పులకేశిమహాయోధుడు మహారాష్ట్రము నంతను గెలిచి ఓఢ్ర దేశమును గెలిచి యాంధ్ర దేశము నంతయు ఆవరించినవాడు అట్టివాని దండయాత్ర సాగలేదు సరిగదా, నరసింహవర్మ తిరుగు దండయాత్ర తీసెను. అతడు పరంజ్యోతి సాయమువలన నిట్టిపని చేయగలిగెను. ఒకరాజా సేనలో పదిమంది సమర్థులైన సేనానాయకు లుండవచ్చును. దండెత్తివచ్చిన రాజా వారిని పాటించడు. మకుటాధిపతి యైన రాజాయొక్క యోధత్వమునే పాటించును చాళుక్య రాజానకు తలకొట్టుకొన్న ట్లుండెను తాను గెలిచిన రాజ్యము తన కింకను పూర్తిగా స్వాధీనము కాలేదు. అచట బహురాజకార్యముల వలన తాను తిరిగి దండయాత్ర చేయుటకు వీలు లేకుండెను ప్రచండుడైన యొక సేనానాయకుని క్రింద కంచిమీద మఱల దండయాత్ర సాగించవలయునని పులకేశి యనుకొనెను ఆ సేనాపతి ప్రళయ రుద్రుడు కావలయును చాళుక్యుల క్రిందనున్న తెలుగు దేశములో ఒక రాష్ట్రాధిపతి కుమారుడు వల్లభుడని కలడు. అతని పరాక్రమము, అతని సాహసము, అతని బలము పదిదిక్కుల చెప్పుకొనుచుండిరి మహారాజతనిని పిలిపించి తానొక యుద్ధములో రాష్ట్రకూటుల కెదురుగా నితనిని పంపించెను పులకేశి యతని యుద్ధనైపుణ్యమును చూచెను. వల్లభు డాజానుబాహువు మహాబలశాలి అతడు, అతనికవచము, అతనిఖడ్గము కలిసి పుట్టెడుబరువుండును. అతని గుఱ్ఱము మీది యినుప కవచము పదిమణుగుల బరువుండును. ఆ గుఱ్ఱము ఈగవలె పరుగెత్తును. వల్లభుడు శత్రురాజెచ్చటనుండెనో చూచి యతని కెదురుగా తప్ప ఇంకొక దెసగా పోడు. శత్రువులతో ఎదురుబడి యుద్ధముచేయునపుడు శత్రువుయొక్క కంఠమును తప్ప ఇంకొకటి చూడడు. అతనిముం దెవ్వరును నిలువ లేరు ఇది యంతయు

చాళుక్యరాజు కనులార చూచెను. రెండు మూడు యుద్ధములలో జూచెను. అప్పటికే వల్లభుని పేరు చెప్పినచో వీరులకు గుండెదిగులుగా నుండెను. చాళుక్య రాజు వల్లభుని రాష్ట్రాధిపతినిగా చేసెను. వల్లభుడు సామంతుడైనను స్వతంత్రరాజు. సామంతుడైన రాజు మహారాజునకు యుద్ధములందు సైన్యములను పంపవలయును, ధన మీయవలయును. వల్లభుడట్లు చేయనక్కఱలేదు. కప్పముకూడ కట్టనక్కఱలేదు. అతడు స్వతంత్రుడు. కాని చాళుక్య చక్రవర్తి కొక విధముగా సామంతుడైయుండెను. చాళుక్య చక్రవర్తి వానినొక దేశము మీదికి దండెత్త వలయుననిన్నచో అతడు దండెత్తవలయును. ఇదియొక్కటియే నియమము. వల్లభునకు పెద్ద రాజ్యములేదు. అతడొక విషయాధిపతి. కాని, స్వతంత్రుడగుటచేత వానినిగూడ రాజుగానే చెప్పుకొన జొచ్చిరి చాళుక్యరాజు నభిప్రాయము ననుసరించి వల్లభుడు పల్లవరాజ్యముమీదికి దండెత్తెను. చాళుక్యసైన్య మంతయు వల్లభుని యధికారము క్రిందనుంచబడెను. వల్లభుడు ప్రళయకాల సముద్రమువలె కంచిమీదికి దాడివెడలెను.

పల్లవసైన్యము నాల్గు భాగములుగా విభజింపబడి నాల్గుస్థలములయం దుండును. కంచి ప్రధాన నగరము కంచిలో కొంత సైన్యముండును. అది మూలబలము దాని నెప్పుడును కదలించరు.

వల్లభుడు చాళుక్యసైన్యమును నాల్గుభాగములుగా చీల్చి నలుగురు చాళుక్య సేనాధిపతుల క్రింద ఆ నాల్గుభాగములను జయించుటకు నాల్గు చోట్లకు పంపించెను. తాను కంచిమీదికి బయలుదేర వలయును తాను నరసింహవర్మను వధించి కాని వెనుదిరుగనని ప్రతిజ్ఞచేసెను

ఈ వార్తలన్నియు గంచికి జేరినవి. మహాసేనాని యైన పరంజ్యోతి యొకయేడాదిమాత్రము కంచిలో సుఖముగానుండెను తిరిగి యుద్ధమునకు పోవలసి వచ్చెను అతడిట్లనుకొనెను- "అప్పుడే చాళుక్యులను తెలుగుదేశము నుండి తఱిమివేసినచో ఇంత తొందరలో ఈ దాడి వచ్చెడిది కాదు కానియప్పటి కదియే మంచిది"- మహాసేనానికొక్కటే సందేహము- వల్లభుడు కంచిమీదికి వచ్చుచున్నాడు... తాను రాజును విడచిపోవుచున్నాడు. మానవర్మ యున్నాడు కదా యని యొక ధైర్యము కంచి యొకయెత్తు, తక్కినసైన్య మొకయెత్తు తక్కిన సైన్యము లోడిపోయినచో పల్లవ రాజ్యమునకే భంగము. కంచి పడిపోయినచో మఱల గెలువవచ్చును కంచిలోనున్న శత్రుసైన్యమును మహాసేనతో ముట్టడించి నాశనము చేయవచ్చును. అందుచే పరంజ్యోతి వెడలిపోయెను. వల్లభు డెదురు లేకుండ కంచిమీదికి వచ్చుచున్నాడన్నవార్త క్రమక్రమముగా బలిసెను దినమున కెంతెంతదూరము వచ్చుచున్నాడో వేగరులవలన తెలియజొచ్చెను. నరసింహవర్మ యొకయూహ చేసెను వల్లభుడు కంచిమీదికి రాకముందే వానినిబోయి యెదిరించవలయును కంచికి ప్రమాదముండదు. తానే యుద్ధమునకు పోవును. కొడుకైన మహేంద్రవర్మను కంచి రక్షణమునకు నియమించి తాను యుద్ధమునకు పోవును. తానొకవేళ యుద్ధములో మరణించినచో మహేంద్రవర్మ రాజగును. వెంటనే రాజులేని స్థితి రాజ్యమునకు రాదు. వల్లభునియొక్క సేనాపరిమితి కొద్దియని రాజు

తెలిపికొనెను. ఆ సైన్యము వాల్లవేల కన్న ఎక్కువ లేదట. నరసింహవర్మ ఆయువేల సైన్యమును తీసికొని వల్లభుని కెదురువడచుటకు బయలుదేరెను. మానవర్మను తన కొడుకును రక్షించుటకు కంచిలోననే యుండుమనెను. మానవర్మ యంగీకరించలేదు. మహారాజు కాదనెను. నేనచ్చట యుద్ధములో ఏదైన వైనచో ఇంటి దగ్గఱ దిక్కులేకపోవును. నీవు మహేంద్రవర్మకు రక్షకుడవుగా నుండక తప్పదనెను. మానవర్మకు తప్పలేదు కంచిలోననే యుండెను

మానవర్మ యింటికిపోయి రాజు గోచారమును చూచెను. రాజున కిది మహాపత్సమయము. ఇది దాటినచో రాజు నిరుపద్రవముగా తఱువాత ఇరువదియేండ్లు రాజ్యము చేయును. ఈ యాపద తాను తప్పించక తప్పదు. పిదప రాజున కంగరక్షకు డక్కరలేదు. అట్లున్నదా జాతకము!

రెండు దినము లున్న తరువాత మానవర్మ తాను బయలు దేరెను. మానవర్మ క్రింద రెండువందల సైన్యమున్నది. దండులో పదిమంది సింహళీయులు. పాతికమంది మలయాదేశస్థులు మలయాదేశస్థులు సహజముగా సోమరులు. కాని సమయము వచ్చినచో భల్లూకపుపట్టు పట్టుదురు. ఈ రెండు వందలతో మానవర్మ బయలుదేరెను. రెండువందలమందియు ఆశ్వికులే మానవర్మ మహేంద్రవర్మతో చెప్పెను. "ఇది నాయనగారికి గడ్డుసమయము. కానిచో మిమ్ము నేను వదలి పెట్టిపోను. మహారాజున కెదురుగా వచ్చెడివాడు ప్రళయరుద్రునివంటివాడని వినుచున్నాము. మహారాజు ఖడ్గయుద్ధములో ఘటకుడు. ఆయన ఖడ్గశిల్పి ఒడుపు లెన్నియైన తెలియవచ్చును కాని మోటుగా మీద పడెడివానిని పూర్తిగా తట్టుకొనుటకు ఏనుగంతబల ముండవలయును శరీరబల మధికముగా నున్నవాడు మీదికి చొచ్చుకొని వచ్చును. కత్తి నేర్పైనప్పుడు పనికివచ్చును; మఱియొకప్పుడుపనికిరాదు ఆ వల్లభుని సంహరించి మహారాజుకంటె నేను ముందు కంచికి వత్తును" అని మహేంద్రవర్మను వొప్పించి మానవర్మ యుద్ధమునకు పోయెను

మానవర్మకంటె మహారాజు రెన్నాళ్ళు ముందు పోయెను. గుఱ్ఱపుదళ మురికించి యుద్ధము జరుగు స్థలమునకు చేరుకొనువేళకు అచ్చట సరిగా యుద్ధము జరుగుచుండెను దూరమునుండి యీ రెండువందలమంది చూచిరి యుద్ధ కోలాహలము వినిపించెను వారు గుఱ్ఱములను దె . యించిరి

యుద్ధము క్రిందటిరోజు సాయంకాలమునన యారంభింపబడెను రాత్రిపూట యుద్ధము మానివేసిరి. ఒక చిన్న సెలయేఱునకు రెండువైపు రెండు సైన్యము లున్నవి. ఆ సెలయేటిలో నీళ్ళున్నను వల్లభునిసైన్యము దాటివచ్చుట కడ్డుపెట్టెడివి కావు. వల్లభుని సైన్యమునకు ముందు వల్లభుడుండెను. నరసింహవర్మకు ముందు పల్లవసైన్యముండెను. ఆనాటి ప్రొద్దున వల్లభుడు తన గుఱ్ఱము నెక్కి పల్లవసైన్యము నడుమనుండి మహారాజు వద్దకు చొచ్చుకొనిరా నారంభించెను. పల్లవసైన్య మతనిముందు నిలువలేకుండెను వల్లభుడును అతనితో వందమందియు సుడి గుండము నుండి మొసళ్ళిడుకొని వచ్చుచున్నట్లుండిరి చివరకు వల్లభుడు మహారాజున్న స్థలమునకు చేరెను. నరసింహవర్మ వద్ద వందమంది యంగరక్షకు

యుండిరి. వారును, వల్లభునితో వచ్చిన వందమందిలో చనిపోగా మిగిలిన యేబది మందియు తలపడిరి. వల్లభుడు రాజుమీదికే పోయెను. రాజు చుట్టునున్న పాతిక ముప్పదిమంది యంగరక్షకులను నఱకెను. రాజు వల్లభుని తలపడెను. వల్లభు డొక్క కత్తి వ్రేటుతో రాజును నరుకుదు ననుకొనెను. నరసింహవర్మ తనగుఱ్ఱమును లఘువుగా దాటించు చుండెను. కత్తితో వల్లభుని పదిచోట్ల పొడిచెను. అతని కవచ మనిర్భేద్యముగా నుండెను. పల్లవరాజు కత్తి వల్లభుని కవచముమీ ఇరువదిసార్లు పడెను. లాభములేక పోయెను. వల్లభుని కత్తి యొక్కసారి కూడ రాజుమీద పడలేదు. పడినచో రాజు కవచముతో సహా రెండుముక్కలై యుండును. కవచధారి యైనవానిని సంధిబంధముల యందు నఱుకవలయును. మెడయందు, మోచేతుల యందు, నడుమునందు, మోకాళ్ళయందు నఱుకవలయును. రాజునకు సాధ్యమగుట లేదు.

ఆ సమయములో మానవర్మ యచటికి వచ్చెను. అతడు సింహనాదము చేసి రాజునకు వల్లభునకు నడుమ తన గుఱ్ఱమును తోలెను. తక్కిన రెండువందల మంది యాశ్వికులు వల్లభు ననుయాయులను నఱికిరి. మలయాదేశస్థులు పాతిక మందియు రాజుచుట్టును జేరి నిలుచుండిరి. వల్లభున కప్పుడెంత యాశ్చర్యము కలిగినదో యంతకోపము కలిగినది . మానవర్మ వందగజముల దూరమునుండి యీ యుద్ధమును చూచుచునే యుండెను. వల్లభుని యెట్లు జయించవలయునో మనసులో అప్పుడే నిశ్చయించు కొనెను తాను కత్తితో వల్లభుని నరుకలేడు. వల్లభుని గుఱ్ఱముమీది నుండి క్రిందికి త్రోయవలయును. మానవర్మ తన గుఱ్ఱమును పదిగజములు వెనుకకు మరలించి మహాప్రళయవాయు వేగముతో వల్లభుని గుండెయకు సూటిగా తన బల్లెమును గురిచేసి వానిమీదికి దూకెను వల్లభుడు గుఱ్ఱము మీది నుండి క్రిందికి దొరలెను అతనిపాదములు రికాబులో తగులుకొనెను అప్పుడొక మలయాదేశీయుడైన యాశ్వికుడు వల్లభుని గుఱ్ఱముతల నఱికెను వల్లభుడు రికాబు వదలించుకొని లేచెనులోన మఱియొక యాశ్వికుడు వాని శిరస్త్రాణమును పగిలిపోవునట్లు ఖండించెను మానవర్మ వల్లభుని దక్షిణబాహువు నఱికెను అతనిని బంధితుని జేసిరి

వల్లభుని బంధితుని చేసిన వెంటనే మానవర్మయు అతని రెండువందల సేనయు తిరిగి కంచికి బయలుదేరిరి. వెళ్ళుట యెంత తొందరగా వెళ్ళిరో, వచ్చుట యంత తొందరగా వచ్చిరి వల్లభుని మహారాజు బంధితుని జేసి తీసికొని వచ్చు చున్నాడని చెప్పిరి. నగరమంతయు మహోత్సవముగా నుండెను వల్లభుడు బంధితు డనంతనే పల్లవసైన్యము విజృంభించి చాళుక్య సైన్యమును వెంటబడి తఱిమెను వారు చెట్టు కొకడు పుట్టకొకడుగా పాఱిపోయిరి. మహారాజు వల్లభుని యపజయము పరంజ్యోతికి వార్త పంపించెను తక్కిన నాల్గు చాళుక్య సేనాభాగములకు వల్లభుని యపజయము తెలిసినంతనే ధైర్య సాహసము లణగారెను. చళుక్య సేనాపతులు యుద్ధము చేయవలయునో యక్కఱలేదో తెలియక గగ్గోలు పడుచుండిరి. చళుక్య సేనలో నలుబది మంది సేనానులుండిరి. అందఱును గలిసి సైన్యము

యుపసంహరించుటకే తీర్మానించుకొని పల్లవరాష్ట్రమును వదలి తమ సైన్యములను తీసికొని పోయిరి. మరల పల్లవరాజ్యము నిరుపద్రవమయ్యెను. మహామల్ల నరసింహవర్మ తరువాత నాల్గు దినములకు పట్టణము జేరెను. పట్టణమంతయు విజయోత్సవములు చేసిరి. మహారాజాయుద్ధములో ఎంతపాటు పడెనో యెంతయాపదనుండి బైటబడెనో యెవ్వరికిని తెలియదు. మానవర్మ చెప్పలేదు.

మానవర్మయే వెళ్ళకపోయినచో కొంతసేపటికి రాజా పరిక్రాంతు డయ్యెడివాడు. పల్లభుడు రాజును సంహరించెడివాడు. అట్టి మహాపాయమునుండి రాజును మానవర్మ సంరక్షించెను. మానవర్మ రావలదని రాజా కట్టుదిట్టము చేసెను. మానవర్మ వచ్చుట రాజాజ్ఞను తిరస్కరించుట. రాకపోయినచో రాజా ప్రాణములు లేవు... తొలుత రాజా మానవర్మను నిషేధించుటలో ఒకయూహ పెట్టుకొనియే చేసెను. అతనికి తనమీద నెంత ప్రేమయున్నదో రాజా పరీక్షింపదలచెను. ఇప్పుడు మానవర్మ పూర్వమువలె గాదుకదా! తానొక రాజసౌధములో నివసించు చుండెను. భార్యయున్నది. సర్వభోగములు నున్నవి. అతని యుద్యోగమున కేదియు భంగము లేదు. రాజ్యములో పలుకుబడి కలదు. తన తరువాత తనకొడుకున కంగరక్షకుడుగా నుండును. లేదా తన తండ్రి ప్రాణము లన్నిసార్లు రక్షించినవాడని మహేంద్రవర్మ యతని కొకపెద్ద యధికార మీయవచ్చును. అతడు సింహళమునుండి వచ్చిన దాది సామాన్యసైనికుడు, రాజున కంగరక్షకుడు! నెంతు కొర్ది జీతము! ఇప్పుడు మానవర్మ తానే రాజా, రాజే తాను. ఇదివఱకు రాజాప్రాణములు రక్షించుటకు తన ప్రాణములొడ్డెను. ఇప్పుడు కూడ అట్లుసేయునా? తనభార్య కోసము తన్ను రక్షించుకొనును. మఱియు ఆ భార్య యిప్పుడు గర్భవతి! తన ప్రాణమును పూర్వమువలె నే డంత సులభముగా రాజా ప్రాణము కొఱ కొడ్డడు. ఎదురుగా వచ్చిన పల్లభుడు ప్రళయరుద్రుడని పేరు. వానికి దా నెదురునడచునా? రాజావెంట పలువుంది సైనికులున్నారు, రాజును వారే రక్షింతురని యూఱకుండునా? ఈ పరీక్ష చేయుటకు రా జతనిని కంచిలో వదలిపెట్టిపోయెను. మఱియు మానవర్మ యుద్ధభూమికి వచ్చినచో రాజానాజ్ఞ యుల్లంఘించి నట్లగును. ఇప్పుడు తనయందు తను చూచుకొనవలసిన రక్షణభారమును, రాజాయొక్క యాజ్ఞోల్లంఘనమును, ఈ రెంటి నతిక్రమించి మానవర్మ తన్ను రక్షించుటకు వచ్చినచో అతని స్నేహము యొక్క నిజము తెలియగలదు...ఇట్టి యూహ మనస్సులో పెట్టుకొని మహారా జతనిని పట్టణములో నుండుటకే నియమించి పోయెను

మానవర్మ కి యూహయే లేదు తనకు రాజా ప్రాణము. తన భార్య గర్భవతియైనను సరే, తాను రాజా యొక్క ప్రాణమును సంరక్షించవలయును. రాజా యొక్క జాతకమునందు దోషము కనిపించుటచేత మానవర్మ వెళ్ళెను. లేనిచో వెళ్ళెడివాడు కాడు. ఆ సమయమున రాజా జాతకమునందు దోషముండుట కూడ మానవర్మకు ఫలించినది. మానవర్మ కా దోషము కనిపించనిచో వెళ్ళెడివాడు కాడు. అపుడు రాజునకు మానవర్మ యొక్క యదార్థమైన స్నేహభావ మింత విస్పష్టముగా తెలిసెడిది కాదు. మానవర్మకు మిక్కిలి మంచిరోజు వచ్చెను.

మహారాజా విజయోత్సవములు పూర్తియైన తరువాత చళుక్యసైన్యము పూర్తిగా పల్లవరాజ విషయమును దాటిపోయినదని వార్త వచ్చిన తరువాత పరంజ్యోతిని వెంటనే రాజధానికి రమ్మని వార్త పంపించెను. పరంజ్యోతి వచ్చెను. వచ్చిన తరువాత ఒకనాడు విజయసభ యేర్పాటు చేయబడెను. సభలో మహారాజా సింహాసనము మీద కూర్చుండెను. మానవర్మను తన ప్రక్కనే మఱియొక యున్నతాసనమున కూర్చుండ బెట్టెను. యువరాజా రాజున కెడమవైపున కూర్చుండెను. మానవర్మ కుడివైపున గూర్చుండెను. పరంజ్యోతితో పాటు పాతికమంది సేనానులు, ఏబదిమంది సేనాపతులు సభ నలంకరించియుండిరి. మహామాత్రులు, ఘటకాచార్యులు, ఇతర రాజోద్యోగులు కొలువు కూటమున నిలిచియుండిరి. కొంతసేపు నృత్యము జరిగెను. కొంతసేపు మల్లయుద్ధము జరిగెను. పల్లవరాజుల కాలమున నాట్యములో పాటు మల్లయుద్ధము కూడ వినోదార్థము జరుగుచుండెడిది. మల్లయుద్ధము జరిగినంతసేపు సంగీతము పాడబడుచుండెను. నాట్యవేళ వంతపాటలు పాడెడివారును, శ్రుతిపోసెడి వారును, తాళము వేసెడివారును- మల్లయుద్ధము జరుగునపుడు కూడ వాయించు చుండెడివారు

ఆ రెండు వినోదములు జరిగిన తరువాత మహారాజా సభలో నిట్లనెను, "మేము విజయముకొఱకు నిజముగా ఈ సభను పెట్టలేదు. మహామాత్రులలో సేనానాయకులలో ఒకవిషయము చెప్పుట కీ సభ యేర్పాటుచేసితిమి. మేము వల్లభుని గెలిచితిమని సర్వజనులు తలంచుచుండిరి. వల్లభుడు పరాక్రమ వంతుడు కాదో యవునో మాకు తెలియదు కాని యేనుగంత బలము కలవాడు. అతని మీద వందకత్తులను ప్రయోగించినను లాభములేదు. అతని కెదురు నిలుచుండి యెవ్వరును గెలువలేరు మా జీవిత మప్పుడు సంశయగ్రస్తమైనది. అప్పుడు మానవర్మ, అతని రెండువందలసైన్యము వచ్చి మమ్ము రక్షించిరి ఆ రెండువందల సైన్యము మన సభలో నుండిరి వారందఱకు మహాసభలో గౌరవములు సేయవలయు నని మే మిన్నాళ్ళూరకుంటిమి అందఱకును తలాయొక వంద హేమనిష్కములు కోశాధ్యక్షుడు సభాంతమున ఇప్పించును అందఱకు రాజగౌరవ లాంఛనములైన సేలువ లిప్పింపబడును. అందఱకు మహావీరబిరుదము చెక్కబడిన బంగారుపతకము లీయబడును. ఇది స్వల్పవిషయము ప్రధానభూతుడైన మానవర్మ నెట్లు గౌరవించవలయునో మాకు తెలియుటలేదు అతనికి నామీదనున్న ప్రేమ యింతయని నేను చెప్పలేను. అతనికి నాజీవితములో ఋణపడి యున్నాను. లోకములో కృతజ్ఞత యన్న గుణము సులభ్యముకాదు, అందులో రాజులయం దది మృగ్యము! రాజా తన సేవకుడు తన కుపకారము చేసినచో అది వాని ధర్మ మనుకొనును అట్లు చేయుట వానివిధి యనుకొనును. ఈ దుష్ట లక్షణము రాజుల యందుండును. రాజులవలె ప్రవర్తించెడి వారి యందుండును. కృతఘ్నుడు నరక లోకమునకు పోవునని మన శాస్త్రములు చెప్పుచున్నవి. నేను మీకు రాజును మీరు నాకు ప్రజలు ఈ పల్లవరాజ్యము నందు రాజా ప్రజల చేత ఎన్నుకొనబడెడువాడు. మీ యంగీకారము లేకుండ నే నే పనియు చేయజాలను నా కృతజ్ఞత మానవర్మకు

చూపించవలయునన్నచో ఏమి సేయవలయునో మీరే చెప్పుడు. మానవర్మ నాకింతవఱకు నాల్గువార్లు ప్రాణ రక్షణము చేసెను. ఇదివఱకు చేసిన ప్రాణరక్షణములు నా వ్యక్తికి సంబంధించినవి. ఒకరాజు పోయినచో మఱియొక రాజు వచ్చును. ఈ సారి మానవర్మ చేసినది నరసింహవర్మ యొక్క ప్రాణరక్షము కాదు. పల్లవరాజుయొక్క ప్రాణరక్షణము. నేను రాజును కానిచో అతనియెడల నాకృతజ్ఞతను చూపుటకు నే నేమైనను జేసెడివాడను. ఇప్పుడు నామీద నాకధికారములేదు. మీపైన నే నధికారిగా కనిపించుచున్నానేకాని నిజానికి నా మీద మీ రధికారులు. ప్రజల యిష్టము లేనిది రాజు చేయకూడదు. ఇప్పుడు మానవర్మ యుద్ధములో నాకు సాయపడనిచో నటు చళుక్యసేనలు విజృంభించి వెడలి యిటు వల్లభుడువచ్చి కంచి నాక్రమించెడివాడు. ఈ వల్లభుడు క్రూరుడు! దుష్టుడు! కంచిని వశముచేసికొని పరంజ్యోతి మీదికి పోయెడివాడు. పరంజ్యోతి మనరాజ్యమునకు రక్ష! ఆయన మహావీరుడు! ఎంత వీరుడైనను వల్లభునిముందు నిలువలేడు. మానవర్మ యొక్కడే నిలువగలడు. అట్లని మానవర్మ పరంజ్యోతికంటె వీరుడు కాడు. నామిత్రునికి రోషము వచ్చినను నే నామాట చెప్పుచున్నాను. పరంజ్యోతి తన బుద్ధిచాకచక్యమును చూపించును. తెగబడి యుద్ధము చేయును. ఒక ఖడ్గమృగము తనమీదికి వచ్చుచున్నచో తానేమిచేయును? మానవర్మ యేదియో చేయును. అది మానవర్మ విశేషము. తరువాత మీయిష్టము మీరాజును మీరు కృతఘ్నుడుగా చేయకుడు" అని, రాజు మానవర్మయొక్క పుట్టుపూర్వోత్తరములు, సింహళద్వీప రాజ్యమున కతడర్హుడగుట, తన ప్రాణరక్షణ విషయములో నెఱపిన మానవర్మ యొక్క బహుశాస్త్రపాండిత్యము, అతని భావుకత, యతని శౌర్యము, రాజవంశమర్యాదను రక్షించినగుణము బహువిధములుగా చెప్పెను. అప్పుడు పరంజ్యోతి లేచి యొక్కటియే మాట యనెను- "మానవర్మ రాజ్యము మఱల మానవర్మ కిప్పించుట యొక్కటియే మహారాజు కృతఘ్నలోకములకు పోకుండ చేసెడిది"! అనినంతనే జయజయ ధ్వానములు లేచెను. పరంజ్యోతి మఱల నిట్లనెను- "ఆ సైన్యములు నేను నడిపికొని పోయెదను"

వెంటనే మానవర్మ లేచి మహారాజునకు నమస్కరించి సభకు నమస్కరించి యిట్లనెను " పరంజ్యోతి దయామయులు! ఆయన నా భార్యకు పెంపుడు తండ్రి అందుచేత నామీద అంత దయ చూపించుచున్నారు మహారాజుయొక్క యనుజ్ఞ యైనచో నేను నాదండు నడుపుకొనగలను. నేనే దండయాత్రి పోవలయును. నేనే రాజ్యమును సంపాదించుకొనవలయును."

## ౧౩

మానవర్మ పదివేలమంది కాలుబంట్లతో వేయిగుఱ్ఱములతో దండయాత్రి బయలుదేరెను. ఈ సైన్యమంతయు సముద్రతీరము వఱకు నడచి యచటనుండి నావల మీద సింహళద్వీపము చేరిరి సింహళద్వీప మడుగడుగునను మానవర్మకు పరిచితమైనదే. మహాటవుల వెనుక నెవ్వరికి తెలియకుండ మానవర్మ తన

సైన్యమును తామును దిగెను. దధోపతిస్సునకు మానవర్మ దాడి వచ్చుచున్నాడనియే తెలియదు. మానవర్మ తనమీదికి రాడు పల్లవరాజా కొలువులోననే యుండిపోవునని యతడు భావించెను. తనమీదికి దాడివెడలుటకు మానవర్మకు సైన్యమెక్కడిది? తానే రాజా కొలువులో నున్నాడో యా రాజా చాళుక్యులతో నిత్యయుద్ధములతో సతమత మగుచున్నాడు. ఒకవేళ మానవర్మ మలయాదేశములోనున్నచో మలయాదేశమునుండి సైన్యమును తీసికొని రావచ్చును. భారతదేశమునుండి తీసికొనిరాలేడని యతనినిశ్చయము.

ఈ సైన్యమంతయు లంకలో దిగెను మానవర్మ క్రమక్రమముగా దేశమునంతయు స్వాధీనము చేసికొన నారంభించెను. దండయాత్ర చేయుచున్నవాడు మానవర్మయని తెలిసినతోడనే, కస్సపుని కుమారుడని తెలిసినతోడనే, రాజ్యమునకు ప్రధానమైనవారసుడని తెలిసినతోడనే, యెక్కడి గ్రామములక్కడ అతనికి వశమగుచుండెను. కొంతదూరము సేనలాక్రమించినవఱకు దధోపతిస్సునకీ వార్త తెలియదు.

దధోపతిస్సునకు మానవర్మ సైన్య మిరువది వేల కాల్బలమనియు, రెండు వేల గుఱ్ఱము లనియు తెలిసెను. మానవర్మ యొక్క పరాక్రమాదులు పూర్వమే దధోపతిస్సునకు పల్లవ రాజ్యమునుండి వార్తలు వచ్చుచుండెను. పల్లవరాజునకు మానవర్మ యంగరక్షకుడనియు, రాజునకతడు ప్రాణస్నేహితుడనియు దధోపతిస్సుడు విన్నాడు. ఎంతయైనను అతనికి రాజ్యమిప్పించుటకు రాజున కేమి యితడల్లుడా యనిపించెను. స్నేహముకూడ ఇంతపని చేయించగలదని దధోపతిస్సు డనుకొనలేదు

దధోపతిస్సుని దర్పసైన్యము

దధోపతిస్సుడు రాజ్యమునకు వచ్చినంతనే వేటలు, నృత్యములు, భోగములు వీనిలో కాలక్షేపము చేయుచుండెను అతడు యుద్ధప్రియుడు కాడు. తనదేశము సముద్రములో ఒకలంక తనదేశము చుట్టును భగవంతుడే సముద్రమువలె కందకమును త్రవ్వి పెట్టెను. ఆ కందకమును పూర్వ మెప్పుడో రావణసంహారమున రాముడొక్కడే దాటెను. మఱియెవ్వరును దాటలేదు ఏ ప్రాంతముననైనను వర్తకము చేయు చిన్న నావ లుండునుగాని. నావలమీద సైన్యములు వచ్చునా? గుఱ్ఱములు వచ్చునా? రెండువేల గుఱ్ఱములను మానవర్మ నావలమీద దింపెను ఎన్నివందల నావలు భారతదేశమునుండి వచ్చినవో తెలియలేదు. అతని కెంతసేపూహించినను రాజునకు మానవర్మకుగల స్నేహ మెంతగాఢమో యంతుపట్టలేదు అంతస్నేహము రాజునెడల సంపాదించుటకు మానవర్మ యొక్క బలపరాక్రమము లెట్టివో యూహించినచో వానికి భయమువేసెను మానవర్మ పేరు చెప్పగనే దధోపతిస్సునకు దిగులయ్యెను అతనిముందు తానేమి నిలువ గలడు? స్నేహితులును మంత్రులును కోటతలుపులు మూసి యుద్ధము సేయుదమనిరి కోటలో ఆఱునెలలకు తగిన గ్రాస మున్నది. కందక మున్నది. మంచి సైన్య మున్నది. భయము లే దనిరి దధోపతిస్సు డిట్లనెను-

"ఓయీ! సముద్రము దాటిన వానికి మన కందకము లెక్కా? ఈ దేశమున కతడు యధార్థమైన రాజు బయటనున్న యీ సైన్యమునకు ఆహార పదార్థములు దొరకవనగా దేశములో అందఱును తీసికొని [illegible] అతనిని

పోషింతురు. ఆఱునెలలైన తరువాత నైనను మనము వానికి లొంగి పోవలసినదే. అందుచేత పాఱిపోవుటయే మనమిపుడు చేయవలసినది." చివరకు రాజు పాఱిపోవుటకే నిశ్చయించెను. రాజే యట్లుండగా తక్కిన వారేమందురు? రాజునకు పరమాప్తులైన వారందఱు వానివెంటనే బయలుదేరిరి. ఎప్పటికి పాఱిపోవలయును?

మానవర్మ రామేశ్వరమునుండి ఓడల మీద మన్నారుగ్రామము వద్ద దిగెను. అచటనుండి యతనిసైన్యములు క్రమముగా నడచి యనూరాధా పురమును చేరెను. సింహళములో ఉత్తరమున 'మన్నారు', దక్షిణమున 'గాలి', పడమటితీరమున 'కొలంబో', తూర్పుతీరమున "పెట్టిక" పురములు ప్రసిద్ధములైనవి. 'మాతలి', 'కండి' యను పట్టణములు సింహళ మధ్యదేశమున ముఖ్యమైనవి కొంత దక్షిణమున 'రత్నపుర' మను పట్టణము కలదు. అనూరాధాపురము రాజధాని. రత్నపురమునందు గూడ రాజప్పుడప్పుడు నివసించుచుండెను. దేశము పరు లా క్రమించినచో 'గాలి' నుండి పడమట కొన్ని ద్వీపములు కలవు. ఆ ద్వీపముల వైపు రాజులు పాఱిపోవుదురు మానవర్మ యనూరాధాపురమును తేలికగా పట్టుకొనెను. ఆక్రమించెను. అంతలో నేమైనది? దేశమంతయు ఆక్రమించవలయును. దక్షిణమున గాలివఱకు తనసైన్యములను నడిపి తాను వశము చేసికొనవలయును. దధోపతిష్యుడు పాఱిపోయినాడని తెలిసెను. మానవర్మ యనూరాధా పురములోన ఆగి తాను రాజ్యాభిషేకము చేసికొనినచో దధోపతిష్యుడు సొదెలోనికి కూడ వచ్చెడివాడు కాడు. కాని మానవర్మకు దధోపతిష్యుని మీద కోపము కలదు. తొలుత హరదత్తునితో తనమీద కొండెములు చెప్పి దేశము నెదురు తిరిగించినవా డతడే. వానిని పట్టుకొని వధించవలయును. అందుచేత అతనివెంటబడి తఱిమెను దధోపతిష్యుడు మానవర్మ దండెత్తి వచ్చినాడన్న వార్త లంకయొక్క దక్షిణభాగమున తెలియనీయకుండ అక్కడ పెద్దసైన్యమును పోగుచేసెను. అనూరాధాపురము మీదికి దండెత్తిరా ప్రయత్నములు చేయుచుండెను. అతడు మానవర్మకు దొంగవార్తలు తెలియచేసెను. ఒకప్పుడు పెట్టకలో నున్నాడని, మఱియొక్కప్పుడు త్రికోణములవద్ద నున్నాడని, మఱియొకప్పుడు మాతలిలో నున్నాడని. ఇట్టి వార్తలు మానవర్మకు తెలిసి, తానొక వేయిమంది సైన్యమును మాత్రము తీసికొని యాతనిని వెన్నాడ నారంభించెను దధోపతిష్యుడు కుత్సిత మార్గముల యందు నేర్పరి అతడు మానవర్మకు తన యునికి గూర్చిన యబద్ధపు వార్తలు పంపించినట్లే. మానవర్మ దూరముగా నున్నప్పుడు మానవర్మ మీద అబద్ధపువార్త అనూరాధాపురములో పుట్టించెను అప్పటికే మూడు నాలుగు నెలలయ్యెను. పల్లవరాజ సైన్య మనూరాధాపురములో ఊరకే యుండెను పరదేశ నివాసము వారికి కష్టమనిపించెను.దధోపతిష్యుడు మానవర్మ గుఱించి యొక వార్త పుట్టించెను- మానవర్మ రత్నపురము నందున్నాడు, జబ్బు పడినాడు, క్రమముగా ఆ వ్యాధి ప్రబలుచుండెను.

అనూరాధాపురము సింహళమునకు ఉత్తరమునం దుండగా రత్నపురము దక్షిణమున నున్నది. పల్లవసైన్యమునకు మానవర్మ కొఱకు ప్రతీక్ష సేయుట దుర్భరమయ్యెను. పల్లవసైన్యము వారము, రెండు వారములు, మూడు వారములు మానవర్మకొఱకు ప్రతీక్ష చేసెను. మానవర్మ జాడ కనిపించలేదు. వారిమీద నున్న పల్లవసేనాపతులు కూడ ఎదురుచూచి చూచి విసిగిపోయిరి. మానవర్మ వద్ద నుండి వార్తయే లేదు. అతడు సుఖముగా నున్నచో వార్త యెందుకు పంపించడు? ఆ సైన్యము లన్నియు నిరాశచేసికొని తాము వచ్చిన నావల మీదనే తిరిగి తమ రాజ్యము చేరుకొనిరి. మానవర్మ వెంటనున్న వేయిమందియే తప్ప మానవర్మ వద్ద వేఱే సేన లేదు. అపుడు దథోపతిస్సుడు మఱల అనూరాధాపురము నాక్రమించెను అతడు పెద్ద సైన్యమును ప్రోగుచేసెను. మానవర్మ మీద యుద్ధమునకు సిద్ధమయ్యెన మానవర్మ కీ సంగతులన్నియు నెమ్మదిగా తెలిసెను. తన సైన్యమంతయు తన్ను వదలిపెట్టి పోయెను. తా నీ వేయి మందిలో ఏమి చేయగలడు? దథోపతిస్సుడు పెద్ద సైన్యమును ప్రోగుచేసెను. తా నతని నెదిరించినచో తా నోడిపోవుటయు చనిపోవుటయే తప్ప వేఱే ప్రయోజనము కనిపించలేదు. అతడు మఱల తన సైన్యములో తిరిగి భారతదేశమునకు వచ్చి తాచేసిన ప్రయత్నము విఫలమైనదని రాజులో చెప్పి మఱల రాజున కంగరక్షకుడుగా చేరెను. నరసింహవర్మ మిక్కిలి నొచ్చుకొనెను.

ఇది యిట్లుండగా సింహళములో మానవర్మ తిరిగిపోయినతర్వాత తత్పూర్వము దథోపతిస్సున కనుకూలముగా నుండిన సేనానాయకు లందఱును దథోపతిస్సుని యందు ద్వేషము నొందిరి. రాజు భోగపరాయణు డగుటవలననే గదా మానవర్మ దండెత్తి వచ్చినప్పుడు చెట్టు కొకరుపెట్టుగా పాఱిపోవలసివచ్చెను. సమర్థుడైన రాజు తమకు కావలయును మానవర్మ దేశములో నైదారుమాసములుండెను. ఈ యాఱు మాసములు అటు మానవర్మ సైన్యము, ఇటు దథోపతిస్సుని సైన్యము కొట్టుకొనితినుట యైనది. దేశములోని వ్యవసాయము సన్నగిల్లినది. వర్తకము సన్నగిల్లినది. పేదలు బ్రతుకుటకు వీలులేకపోయినది కోటలు ధ్వంసము లైనవి అందుచేత చాలమంది సేనాపతులు దథోపతిస్సుని పినతండ్రి కొడుకైన కస్సపుని రాజును చేయుద మనుకొనిరి రెండు పక్షములేర్పడెను. చిన్న చిన్న యుద్ధములు జరిగెను. ఆ కస్సపుడు పరాక్రమశాలి. అతడు దథోపతిస్సుని సంహరించి తాను రాజయ్యెను. కస్సపుడు మహాహంకారి. గర్వి. మర్యాద తెలియనివాడు. అతడు తన మంత్రులను సేనాపతులనే పరాభవించుచుండెను. మంత్రులకు రాజదర్శనమే లేదు. రా జెప్పుడును తన వందమంది భార్యలతో అంతఃపురములోననే నివసించుచుండెను. సేనాపతులును మంత్రులును సమాలోచించి యతనిని తొలగించవలయు నని నిశ్చయించుకొనిరి. దథోపతిస్సుని కుమారుడు హతదత్తుడు పదునాఱేండ్ల వయస్సువాడు. అతనిని రాజును జేయుదమని సేనాపతులును మంత్రులును వానికి 'మాతలి' లో పట్టాభిషేకము చేసిరి. ఆ సైన్య మనూరాధాపురము మీదికి దండెత్తి వచ్చెను. కస్సపుడు లెక్కసేయలేదు. కోట తలుపులు మూయించి యుద్ధము

చేయుడని తనకు మిగిలిన సేనాపతులలో చెప్పి తాను పోయి యంతిపురములో నివసించుచుండెను. రాజాయొక్క యీ భోగపరాయణ త్వమునకు వాని పక్షము నందున్న సేనాపతులకు కూడ విసుగు జనించెను. వారొకనాడు కోటతలుపు తీసి హతదత్తుని కోటలోనికి ప్రవేశపెట్టిరి. యుద్ధమేలేదు. అందఱు సేనాపతులును మంత్రులును కలిసి హతదత్తుని రాజాచేసిరి. అంతఃపురములోనున్న చిన్నకస్సపుడు బంధితుడు చేయబడెను. దధోపతిస్సుని కొడుకు రెండవ హతదత్తుడు రాజయ్యెను. అతగు తండ్రివలె కుత్సితుడు. ఒకనాటిరాత్రి చెఱలో కాలుసేతులు బంధింపబడి యున్న కస్సపుని తావే పోయి నఱికెను. ఈ వార్త తెలిసి నంతనే మంత్రులకు సేనాపతులకు అసహ్యము వేసెను. వారాతనిని గూడ తొలగించుటకు నిర్ణయించుకొనిరి. ఈ పరిస్థితి యిటు లుండెను.

మానవర్మ సింహళముమీదికి దండెత్తి వచ్చి యాఱేండ్లయ్యెను. ఈ యాఱేండ్లలో సింహళదేశము నిర్ధనమయ్యెను. సరియైన పాలనము లేకుండెను. రాజధానిలో తప్ప తక్కినచోట్ల రాజెవకడున్నటు లెవ్వరికిని తెలియదు. మలయాద్వీపము నుండి వర్తకము చేయుటకు పూర్వమువలె నావలు వచ్చుటలేదు. ఏయూరి ప్రజలాయూరికే రాజులు. కొందఱు చిన్నసైన్యములను ప్రోగుచేసి తత్ప్రాంతములందు సర్వాధికారులుగా ప్రవర్తించుచుండిరి ఇక్కడ మానవర్మ మనములో తన రాజ్యమును గుఱించి విచారించును సింహళపువార్తలు తెప్పించు కొనును. రాజా తనకు చేసిన సాహాయ్యము తా నుపయోగించుకొన లేకపోయితి నని, దుఃఖించును. మఱల తావే మొగము పెట్టుకొని రాజా నడుగును?

ఈ యాఱేండ్లలో మానవర్మకు ఇద్దఱు పుత్రులు నిద్దఱు కూతుండ్రు, నలుగురు సంతానము కలిగెను ఇంక జీవితమంతయు రాజాన కంగరక్షకుడుగా బ్రదుకవలసినదే! ఇప్పటిక తాను పదియేండ్లు పల్లవరాజా కొలువులో నుండెను

నరసింహవర్మయు తాను వృద్ధుడగుచుండెను ఆయన యొకనాడిట్లను కొనెను- "ఈ నా స్నేహితుడైన మానవర్మకు తన రాజ్యమును సంపాదించుకొన వలయునని యున్నది. ఇతడు మహావీరుడు కీర్తిమంతుడు నోయితెఱచి యడుగలేడు అతని కతని రాజ్య మిప్పించకుండ నేనుండలేను నా మనస్సు నన్ను బాధించుచున్నది. ఇదివఱకు చేసినపని వ్యర్థమైనది. ఇప్పుడు నా కితర రాజాలతో యుద్ధములు లేవు. ఇతని దిగులు తప్ప నా జీవితములో నాకు మఱొక దిగులు లేదు. నాకొడుకు మహేంద్రవర్మ సమర్థుడు పరంజ్యోతి బౌద్ధుడైనను మహాసేవాని. రాజ్యములో నాయధికారముకూడ వృద్ధిపొందెను. పూర్వమువలె ఇప్పు డే దైనను వేమ జేయవలసినచో మహాపరిషత్తును పిలిచి చేయనక్కఱలేదు"

రాజా మఱల సైన్యములను ప్రోగుచేసెను. మఱల ఇఱువదివేల సైన్యమును, మూడు వేల గుఱ్ఱములను, వంద యుద్ధమునకు ఉపకరించు ఏన్గులను సమీకరించెను ఇది యంతయు మానవర్మకు తెలియదు. పరంజ్యోతియు మహారాజాను కలిసి యాలోచించుకొని యీపని చేసిరి. ఒకనాటి ప్రొద్దున రాజా మానవర్మతో చెప్పెను- "మిత్రుడా! నీకు జీవితమంతయు నా కొలువులో గడపవలయునని యున్నది. నీ

ఋణమును తీర్చుకొనుటకు నే నింకొకజన్మ యెత్తవలయును. నీ ఋణ మీ జన్మలోననే తీర్చెదను. రామేశ్వరము వద్ద నీ కొఱకు సైన్యమంతయు సిద్ధముగా నున్నది. ఇఱువది వేల కాల్బలము, మూడువేల గుఱ్ఱములు, వందయేనుగులు. నీ యాజ్ఞయైన మఱునిముసము సింహళముమీదికి దండెత్త సిద్ధముగా నున్నవి." మానవర్మ నివ్వెఱపోయెను.

ఇక్కడ ఇది యిట్లుండగా సింహళములోని రాజా హతదత్తుడు మానవర్మ యెప్పుడో తనమీదికి దండయాత్రవచ్చునని తాను సైన్యమును జాగ్రత్త పఱచికొనియే యుండెను. అతని సేనానాయకునిపేరు పొత్తకుట్టుడు. అతడును పరాక్రమశాలి. హతదత్తునకు రాజ్యపాలనము తెలియదు కాని యుద్ధముచేయుట తెలియును. అందుచేత సేనాను అతనిని వదలిపోలేదు. మంత్రులు మాత్రమే యతనికి విరోధులు.

మహారాజా నరసింహవర్మ యీసారి మానవర్మ వెంట సంఘను పిల్లలను గూడ బయలుదేరదీసెను అందఱును సముద్రము వద్దకు వచ్చిరి. నావలన్నియు బయలుదేరుటకు సిద్ధముగా నుండెను. కాని పల్లవసైన్యము తమ రాజా లేకుండ తాము దండయాత్రకు బయలుదేర మనిరి. రాజాన కేమియు తోచలేదు. రా జొకయె త్తె త్తెను. తన రాజ చిహ్నములు, తన బావుటా, తన యంగరక్షకులు, తన యేనుగు, తన సిబ్బంది అంతయు మానవర్మ కిచ్చెను. మానవర్మకు న వేషము వేసెను. తన భూషణములు, తన కిరీటము, తన ఖడ్గము సర్వమును మానవర్మ ధరించెను. మానవర్మ తానే నరసింహవర్మవలె ఒక యోడలో ప్రవేశించెను. పల్లవరాజు బయలు దేరునపుడు మ్రోగించ బడెడు ఢంకా మ్రోగించబడెను. సైన్యమందఱు తమ రాజు తమ వెంట వచ్చుచున్నాడనుకొనిరి మానవర్మయు తానే పల్లవమహారాజువలె నటించు చుండెను ఓడలన్నియు బయలుదేరెను సర్వయుద్ధపరికరములతో సైన్యము లంకలో దిగెను. ఆ సైన్యము పోవుచుండగా సముద్రము మీద నొక నగరము ప్రయాణించు చున్నట్లుండెను పల్లవ సైన్య మంతయు మానవర్మయే తమ రా జనుకొనుచుండిరి సింహళీయులు మానవర్మ దండెత్తి వచ్చెననుకోలేదు పల్లవరాజే దండెత్తి వచ్చె ననుకొనిరి ఈ సైన్యము సింహళములోన దిగెను దిగిన తరువాత మానవర్మ తన సైన్యమును నాల్గుదినములు విశ్రాంతి తీసికో నిచ్చెను సైన్య మంతయు మానవర్మను తమ రాజే యనుకొనుచుండిరి. పల్లవరాజ చిహ్నము లన్నియు గలవు ఈ రహస్యము రాజు మట్టును గల కొద్ది మందికే తెలియును ఇద్దఱు మహాసేనానులకే తెలియును తక్కిన వారికి రాజదర్శనమే లేదు హతదత్తుడు తన కోటలో నుండి తలుపులు మూయించి యుద్ధమునకు సిద్ధముగా నుండెను

మానవర్మ యుత్తరదేశ మంతయు స్వాధీనము చేసికొని, తానే సేనను నడుపుచు రాజధాని మీదికి పోయెను సింహళ సేనాధిపతి పొత్తకుట్టుడు పెద్ద సైన్యముతో మానవర్మసైన్యము నెదిరించుటకు వచ్చుచుండెను హతదత్తుడు పొత్తకుట్టుని ప్రయత్నమును తెలిసికొని తన సైన్యముతో తానుగూడ వచ్చి సేనాపతిని కలిసికొనెను రెండుసైన్యములకు మహాయుద్ధము జరిగెను మానవర్మ తానే కవచధారియై యేనుగు మీద నుండి తన సైన్యమును నడపెను. హతదత్తుని సైన్యములు చెల్లాచెదరయ్యెను హతదత్తుడును పొత్తకుట్టుడును యుద్ధము నందు పాఱిపోయిరి పాఱిపోవుచున్న హతదత్తుని సింహళప్రజలే సంహరించి యతని శిరస్సును తెచ్చి మానవర్మ కిచ్చిరి

పొత్తకుట్టుడు పాఱిపోయి మేరుకందరమునందు దాగి కొనెను మేరుకందరము సింహళములో ఒక చిన్న ప్రదేశము. మేరుకందరాధిపతికిని

పొత్తకుట్టునకును స్నేహము. పొత్తకుట్టున కాశ్రియ మిచ్చినచో తనకు ప్రాణాపాయ మని మేరుకందరాధిపతి తెలిసికొనెను. కాని స్నేహితునికాదవలేకపోయెను. మానవర్మ దేశమునకు విజమైనరాజు. ఇపుడు తాను పొత్తకుట్టునకు సాహాయ్యము చేసినచో రాజద్రోహియగును. చేయనిచో మిత్రద్రోహి యగును. మానవర్మ మహాపండితుడు మహావీరుడు, రాజకార్య దక్షుడని మేరుకంధరాధిపతి యెఱుగును. అతడు కంచి పలుసార్లుపోయి యచ్చట వర్తకము చేయుచు మానవర్మ ప్రశస్తి వినినవాడు. అతడిప్పుడు రాజద్రోహ మిత్రద్రోహముల రెండింటి మధ్య విఱుకు కొనెను. ఏమి చేయవలయునో తెలియక తాను రొట్టెలు చేసి దానిలో విషము కలిపి తిని చనిపోయెను. తన స్నేహితుడిట్లు చనిపోయినాడని పొత్తకుట్టుడు తెలిసికొనెను అతడు కూడ ఆ విషము కలిపిన రొట్టెలను తిని చనిపోయెను. తరువాత మానవర్మక దేశము సులభసాధ్యమయ్యెను.

మానవర్మ సింహళములోని సైన్యము నంతయు తాను స్వాధీనపరచు కొనెను సర్వదేశమున యందు తన యాజ్ఞ నెలకొల్పెను. పల్లవసైన్యమును తిరిగి పంపివేసెను, వ్యవసాయమును వృద్ధిచేసెను. దొంగతనమును మాన్పెను. ప్రాంతములం దధికారమ చేసినవారిని శిక్షించెను. భారతదేశము మలయాద్వీపములతో, ఇతరద్వీపములతో వర్తకమును వృద్ధిచేసెను. ఆయన సింహళ దేశమునకు చేసిన మహోపకారమును తత్పూర్వరాజు లెవ్వరును చేయలేదు. పల్లవరాజులు దేవాలయములు కట్టించిరి తాను వారి ననుకరించి 'కప్పగామ', 'శఫాణ్ణి,' 'శిర్యల్', 'పథనఖర విహారము', 'శ్రీ సంగము', 'బోధి విహారము' మొదలైన పెద్ద వనములు నిర్మించెను.

మానవర్మ క్షత్రియుడు. కాని బౌద్ధుడు. మనసులో అతనికి నభిమాన వేదమతమునందు. కాని సింహళదేశము నందలిది బౌద్ధమతము. తాను మ వేదమతము నిచ్చట ఏల స్థాపించవలయును? ఈ మతమును పోషింపజే నారంభించినచో దేశ మది వఱకే పలుకష్టముల బడియున్నది. శాంతిలో నశాం చొఱబెట్టుట యెందులకు అని బౌద్ధమతమునే సమాదరించెను. 'తూపరామ' యొద్దనొక మహాభవనము నిర్మించి బౌద్ధబిక్షు కులలో అపాంసుకులని యొక శాఖ కిచ్చెను. రాజ్యములో అతడు శిధిలమైన భవనము లన్నింటిని బాగుచేయించెను. క్రొ మహాసౌధములను నిర్మించెను. రాజభవనము పూర్వము సామాన్యముగా నుండెడిది. దానిని పడగొట్టించి సరిగా వైకుంఠ పెరుమాళ్ల కోవెలవలె నిర్మింపజేసెను.

మానవర్మ తాను క్రొత్తగా నిర్మించిన మహాసౌధమునకు నామకరణము చేసెను. ఆ పేరు కోటముందు ప్రభాతోరణము మీద మంచిరంగులతో అర్ధ యోజనపు దూరము కనుపించు నట్లు పెద్ద యక్షరములతో చెక్కించెను.

ఆ మహాసౌధము పేరు 'స్నేహఫలము'.




శుభం

